# భ్రమలు



డా॥ పి. రామమూర్తి

గంగా ప్రచురణలు, గుంటూరు

సోల్ డిస్ట్రిబ్యూటర్సు.

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

# సమర్పణ

సంపత్తిప్రాధాన్యత పెరిగిపోయి, యుక్తులకు జిత్తులకు గౌరవంలభిస్తూ, నీతి, నియమము, ధర్మము మృగ్యమై, మానవత్వంకోల్పోయి, స్వార్థద్వేషాలతో నిండి, రాక్షసత్వంవైపు వినాశంవైపు పోటీలుపడి, మారణహోమంవైపు పరువులెడుతున్న నేటి సమాజానికి బుద్ధభగవానుని అహింస, నిస్వార్థ సంఘసేవ, శాంతి, ధర్మమే శరణ్యం. సంపత్తికి సంఘమే కర్తగానుండు సమాజం కావాలి. అలాంటి సమాజ నిర్మాణకృషి ప్రతినిధులే బౌద్ధభిక్షువులు. ఇటీవల వియత్నాం ...త్వ అఘాయిత్యాలను సహించలేక ఆత్మబలిదానం ...రా హృదయపరివర్తన తేవాలన్న సంకల్పంతో ఆత్మా...యైన ఆ బౌద్ధభిక్షువులకు—

పి. రామమూర్తి

14-10-63

# అధ్యాయ సూచిక

# భ్రమలు

## 1. సంకల్పం

ఒకకదురు ఆడుతూ మగ్గం వూగుతుంటే, గుడ్డమడతలు క్రింద పేరునట్లు, కాలచక్రం తిరుగుతుంటే అనుభవమనే పొరలలో విజ్ఞాన భాండారం పెరుగుతుంటుంది. అవధులులేకుండా అనుక్షణము పెరుగు తున్న యీ విజ్ఞానం యెప్పటికప్పుడు వినూత్నరూపందాలుస్తూ, అడుగున బడినవాటిలో కొన్నిటిని అపహాస్యంచేస్తూ, మరికొన్నిటికి విశేష ఆదరా లను కల్పిస్తూ, ఆకాశంవైపు పరువులెడుతుంటుంది. అడుగునబడిన అనుభవంమీద నిలిచి నృత్యంసలుపు విజ్ఞానంవైపు చూస్తున్నపుడు నన్నే పరిహసిస్తున్నదో, నేనే పరిహసిస్తున్నానో తెలుసుకోలేక విస్తు పోతూ తొంగిచూస్తున్న అనభిజ్ఞతకు సిగ్గిలుతూ నాలోని అజ్ఞానాన్ని, అల్పత్వాన్ని యిక ప్రదర్శించగూడదని గట్టిగా నిర్ణయించుకున్నాను.

రచన ఆకర్షణీయంగావున్నదని కొందరంటే, వికృతభాష యుక్తంగా వున్నదని మరికొందరంటారు. అందుకే వ్రాసి దూషణల బొంది ఆనందించే పెత్రితత్వానికి స్వస్తిచెప్పాలనుకున్నాను. కాల గర్భంలో కలిసి అరపళ్ళుహూడా అదృశ్యమయ్యే యీ క్షుద్రరచనల కొరకు సమయం వ్యర్థంచేయరాదని ప్రతినబట్టాను. చదువకుండా నిర్లక్ష్యంచేసేవారిమీద, చదివినా అర్థంచేసుకోగల శ్రమతీసుకోకుండా నిర్లక్ష్యంచేసేవారిమీద, అన్నివైపులా అపార్థాలకే ప్రాధాన్యమిచ్చు అవ ధానులమీద కసిదీరినట్లు, కక్షనెగ్గినట్లు, ఆత్మవిజయంపొందినట్లు "రచన లదు స్వస్తి!" అనే నిర్ణయంతో ఆనందపడ్డాను.

ఈ నిర్ణయాన్ని పసిగట్టిన నాలోని సోమరితనం నగ్నరూపంలో వికసించి నృత్యంసలుపుతూ చేతిలోని కలాన్ని జారవిడచింది; తెల్లకాగి తాలను చించివైచింది. నిద్రమత్తులో ప్రాధేయపడింది.

ఆకలితో శుష్కించి అంటుకుపోయిన ప్రేగులకు, ఆకస్మికంగా లభ్యమైన భోజ్యం వికటించినట్లు, ఒక్కమాటుగా లభ్యమైన విశ్రాంతి లోని, నిద్ర కలలతో కలవరంకలిగించింది. దుఃఖపురొదలు, మూలుగులు, వికటనవ్వుల ధ్వనులతో శిరస్సు బరువెక్కిపోతుంటుంది. గుండెలమీద కొండలభారమై, పూపిరిసలుపక వుక్కిరిబిక్కిరై, ఖంగారు కలుగుతుంటుంది. అయినా నెత్తిన సవారీచేస్తున్న సోమరితనం అంత తేలికయిందిగాదు. నేత్రఫలకాలు తెరువనుకూడా బద్ధకమే. చిన్ని ఆవలింతలతో మునగదీసుకుంటే ప్రక్కగా గాజులఝుంకారం, అడుగుల సవ్వడి వినిపిస్తాయి. నేత్రాలు మరింత మూయ ప్రయత్నిస్తే, కమనీయ తను వెదజల్లే సుగంధాలు ఘుమాళిస్తాయి. తిరిగి హృదయం బరువెక్కి వేడిశ్వాస బయల్పడుతుంటుంది. క్షణమాత్ర మనస్తబ్ధతలో, ఒక నవ నాగరికస్త్రీ అస్పష్టంగా గోచరిస్తుంది. మానవప్రవృత్తి యెంత విచిత్రమైంది! అస్పష్టమైన ఆ రూపురేఖల దర్శనభాగ్యంతోనే శరీరంలోని స్నాయువులన్నీ వేడెక్కి తన్నితానం చేస్తున్నవి. అర్థంగాని అనుభూతి నరాలలో నర్తిస్తున్నది. ఆమెను మరింత సన్నిహితం చేసుకోవాలని పిస్తున్నది. నేత్రాలు తెరిస్తే ఆ దృశ్యం అదృశ్యమవుతుందని తెలుసు. అందుకే ఆ ఆనందమయ దృశ్యాన్ని సన్నిహితంచేసుకోటానికి సుషుప్తిత యత్నాలు తెలియనిరీతిలో జరుగుతున్నాయి. "నేత్రాలలో ప్రత్యక్షంగా చూస్తూ పొందే ఆనందంకంటె, కనుమోడ్చి పొందే ఆనందం అద్వితీయమైంది.

గలగలధ్వనులతో, బరబర సొరలు వేసుకుంటూ పూర్వదిశకు పరువులెడుతున్న ప్రవాహంమీద పశ్చిమానికి పయనిస్తున్న బాలభాస్కరుని లేతకిరణాలు జిలిబిలినాట్యం సలుపునట్లు, ఆమె విశాలనేత్రాలనుంచి వెలువడుతున్న చంచలదృక్కులు - తీక్షణ తీరులవలె, సమ్మోహనాస్త్రాలై హృదయకుహరంలోకి చొచ్చుకుపోయి కదిపేస్తున్నాయి. విఫలతతో విసిగి, నిస్పృహతో విశ్రమించిన వేటగానిప్రక్కకు జేరిన హిరణము అతనినే ఆటవస్తువుగాజేసి ఆడుటజూచి, కవ్వింపుగా తలంచి ఆశ్చర్యపోయినట్లు నా మనస్సు పశరందప్పి మసులుకుంటున్నది.

అయాచితంగా లభ్యమైన ఆ మధురస్వప్నం యెక్కడ చెదిరిపోతుందోనన్న భయంతో, కదలికమెదిలికలను కట్టిపెట్టి, శ్వాసశబ్దాన్ని కూడా అదుపుజేసి, వేయివిధాల ఆహ్వానిస్తున్నాను - ఆమెనుగాదు, నిద్రాదేవతను. నా నిద్రకు ఆమెకు యేమిటో ఆ సంబంధం! పున్నమిచంద్రుని బోలిన ఆమెముఖమండలంలోని సుందర సుకుమార లావణ్యారాలుకుతున్న ఆకర్షణ అద్వితీయమైంది. మానవ మస్తిష్కాలను మడతవేసి, పిడికిటధరించి, నలిపి నాశనంచేయగల శక్తి సహజరూపంలో ప్రకటితమవుతున్నది. లేతకెంపురంగులోని గులాబిరేకులబోలిన అధరాలమీద స్వాభావసిద్ధమైన చిరునగవు చిందిస్తుంటుంది. నిలువుగా నిరిపిన బంగెనపల్లి మామిడిపండుఆకారంలోనున్న ఆమెముఖమందు కపోలాలు అతివిశాలమై, సోగగా వుబ్బి సున్నితంగా వుండి నవ్వినపుడు యేర్పడుతున్న సుడులు, మత్తులో ముంచి సుధిని దప్పిస్తున్నవి. కాటుకరంగు కనురెప్పలు, మదభరిత మత్తుతోనిండిన నేత్రాలమీద ఆడుకుంటున్నవి.

మానవునిలోని జిజ్ఞాస విచిత్రమైంది. నీరు పల్లాన్ని, గాలి శూన్యాన్ని, వెలుగు అంధకారాన్ని శోధిస్తుంటుందని విశ్వసనీయంగా చెప్పవచ్చు. కాని జిజ్ఞాస అన్నిటికంటె బలీయంగా చేసే నిరంతర శోధన నిర్దిష్టమైందిగాదు. దాని స్వభావమే పరిశోధన. ఆ పరిశోధనకు పరిపూర్తంటూ లేదు. తోడుతుంటే నీరూరుతున్నట్లు, పరిశోధనలు ఫలిస్తుంటే జిజ్ఞాస యింకా ముందుకు పరువురెత్తుతుంది. పొందుతున్న ఆనందంతో, తృప్తిపడుట మానవస్వభావంకాదు. అందులో అందని భాగాన్ని వెదకుట సామాన్యము. సుషుప్తిలోపొందుతూన్న స్వప్నంలోని ఆ సుందరి సుకుమారహస్తాన్ని పట్టుకోవాలని ఆకస్మికంగా దుడుకుగా చేయివిసిరాను. మంచంపట్టె కొట్టుకున్న దెబ్బతో నిద్ర, అందుకు చేస్తున్న ప్రయత్నాలు, అలాపనగా పొందుతున్న సుఖస్వప్నాలు, యెగిరిపోయినవి. లేచికూర్చుని చేతిమణికట్టును సవరించుకుంటున్నాను. కవాటాలు బంధించి సృష్టించుకున్న అంధకారంలో నేనొక్కడినే నిగిలివున్నాను. చేతినొప్పికంటె ఆ మందహాసినిని చూడాలనే కాంక్ష సతాయిస్తున్నది. ఆ అంధకారంలో యెంత వెతుక్కున్నా యేమీ కనిపించుటలేదు,

నేత్రాలు మూస్తే తరగలు తరగలుగా ప్రారంభమై స్థిరమైన వెలుగు కనిపిస్తున్నది. ఆ వెలుగులో వాంచితార్ధమూ గనిపిస్తున్నది. ఆ దృష్టినే గాబోలు మనోనేత్రమనేది. మనోనేత్రం నిజంగానే విచిత్రమైంది, అతి పవిత్రమైంది. మనోనేత్రంద్వారా పొందే వెలుగు, నిర్మలము శాంతి యుతమై, నిర్దిష్టరూపంలో వున్నతస్థాయిలో. గంభీరఛాయలలో వుంటుంది. దుఃఖాన్నిమరిపించి ఆనందాన్ని కల్పించుటకు, జ్ఞానాభివృద్ధికి గ్రంథ అధ్యయనమువలెనే మనోచింతనలోని వెలుగుకూడా జ్ఞాన భాండారాన్ని పెంచుతుంది.

పసివారు బొమ్మలకొరకు పుస్తకంలోని పేజీలు తిరగేసినట్లు, నేత్రాలుమూసి ఆమెకొరకు ఆలోచనలపొరలను తిరగేస్తుంటే రకరకాలుగా కనిపిస్తున్నది. సునిశితమైన ఆమె మధుర బాణికూడా వినిపిస్తున్నది. ఆమె యెవరోగాదు, సరళ. అనురాగంతోను, విరాగంతోను, దుఃఖంతోను, క్రోధంతోను, వినిపించిన అనేక విషయాలు తిరిగి మనస్సులో దొర్లుతున్నవి. వాటన్నిటిని గుర్తుచేసుకోవటంలో కలిగే ఆనందం గిలిగిలింతలుపెట్తున్నది. ఆమె విషాదాంతంకూడా యెంత విచిత్రమైంది! ఆమె విషాదగాధే వ్రాస్తే యెంతోవుత్సాహంగా కాలం సద్విని యోగమవుతుందనిపించింది. ఆ నిర్ణయంతో వ్రాయగూడదనుకున్న మొదటినిర్ణయం యెగిరిపోయింది. అంతేగాదు, మరో యదార్థసత్యం కూడా బయటపడింది. రచన యితరులకొరకనో, పేరుకొరకనో చేసేది గాదు. వేడిని వెదజల్లుట సూర్యునికి, శీతలాన్ని చిలికించుట శశిధరునికి, పగటి తరువాత రాత్రి, రాత్రి తరువాత పగలు రావటం, మేఘాలనుంచి వర్షాలుగురవటం ప్రకృతిసిద్ధమైనట్లే, రచనకూడా స్వభావసిద్ధమైంది. వ్రాస్తుంటేనే రచయితకు హృదయభారం తగ్గుతూ, వుల్లాసం కలుగుతుంటుంది. ఆత్మతృప్తిలోని ఆనందంకొరకే రచయిత వ్రాస్తుంటాడు దప్ప తదితరులకొరకుగాదన్న పరమసత్యం నే డర్థమయింది.అందువలన యీర్ష్యాద్వేషంతోనో, సంకుచిత బుద్ధిలోనో, వ్రాయనని భీష్మించుకు కూర్చోవలసిన అవుసరం అసలు లేదు. మనస్సులో మసలుతూ, కలలో గిలిగిలింతలు, వేదనకల్పిస్తున్న సరళవిషయం వ్రాస్తే మనస్సు తేలిక పడుతుంది గనుక వ్రాస్తాను.

# 2. నిస్వార్థత్యాగం

ఆ సంవత్సరమేదో గుర్తులేదు. పరీక్షాపత్రాలన్నీ ముందుగానే బట్టబయలయిపోయాయి. యస్. యస్. యల్. సి. ఇంగ్లీషు ప్రశ్న పత్రం రాత్రి పయనిస్తున్న రైలుబళ్ళకు అంటించబడింది. తెల్లవారి పరీక్షలు. కొన్ని ప్రశ్నపత్రాలు రైల్వేస్టేషన్లలోను, హోటల్‌గోడలకు రాత్రికిరాత్రే అంటించబడ్డాయి. పరీక్షాధికారులు రహస్య కట్టుబాట్లన్నీ నిష్ఫలమవటం విద్యార్థులందరికి విచిత్రంగా దోచింది. విద్యాశాఖవారు కలవరపడిపోయారు. ప్రశ్నలు తెలుసుకుని అందరూ బాగావ్రాసినా, చేతిలోపనిగనుక నియమాలను, కఠినత్వాన్ని పెంచి నూటికి తొంబది మందిని తప్పించితే సరిపోతుందని కమిటీలోని అధికులు అభిప్రాయ పడ్డారు. నిర్దోషులనుకూడా శిక్షించడం సంభవిస్తుందిగనుక తిరిగి పరీక్షలు నడుపాలన్నారు కొందరు. పర్యవసానంగా కొద్ది పరీక్షాకేంద్రాలుగా నిర్ణయించి, కొన్నివేలమందికి ఒకోచోట పరీక్షలు జరిపారు.

సోషియల్‌సబ్జక్టు పరీక్ష ఆరోజు. ఆ నిశ్శబ్దవాతావరణంలో ప్రశ్న పత్రాన్ని ప్రక్కనబెట్టి వూపిరిసలుపకుండా గబగబ వ్రాస్తున్నారు కొందరు. బోనులోనిలిచిన అపరాధులవలె కొందరు ప్రశ్నపత్రాన్ని పదే పదే చదివి బుర్రగోక్కుంటూ, క్రోధితదృక్కులతో అటుయిటు జూస్తున్నారు. ఏరాజు రాజ్యానికి యెప్పుడు వచ్చింది, యెలా వచ్చింది, యెవరిని ప్రేమించింది, పదచ్యుతు డెలా అయింది, యెప్పుడయింది, ఆయన సంతానవివరాలు వ్రాయవలసివచ్చినట్లే — ఏ యుద్ధం యెక్కడ జరిగింది, యెప్పుడు జరిగింది, తత్ఫలితాలు వ్రాయవలసినట్లే నేడు క్షణ క్షణము విశ్వాసరాహిత్యతీర్మానాలలోను, ట్రిబ్యునల్ విచారణలలోను, పునర్‌యెన్నికలలోను దిగిపోయే మంత్రులబృందంలో యెవరు యే శాఖను నిర్వహిస్తున్నది, పురోభివృద్ధిపేరిట వారు చేసినవి, చేస్తున్నవి, వారే ప్రకటించుకున్నవాటిదృష్ట్యా అనేకవిషయాలు వ్రాయవలసివుంది. ఆనాటి ప్రభువులకు సమరాలు జాతకాలయితే, యీనాటి మంత్రులకు

యెన్నికలే జాతకాలు. వారిది యుద్ధగండమయితే వీరిది నిత్యగండం. వీరు అభ్యుదయంపేరుతో చేశాననుకున్నవి, చేయాలనుకుంటున్నవి, చేయవలసివున్నవి అని వేరే ప్రకటించుకుంటున్నవి కంఠస్తంచేస్తేనే యీ పరీక్షలలో యోగ్యత కనిపిస్తుంది.

విజయకుమార్ ప్రశ్నపత్రంలోని మొదటిప్రశ్ననే రెండుపర్యాయాలు చదివి దీర్ఘ వేడినిట్టూర్పును విడుస్తూ ప్రశ్నావళిని ప్రక్కనబెట్టి, చుబుకాన్ని పిడికిలిమీదవాల్చి, నిమీలితనేత్రుడై యోచిస్తున్నాడు. మద్యపాననిషేధం యెక్కడ ప్రారంభమైంది, యెవరిద్వారా జరిగింది, తద్వారా దేశానికికలిగిన నైతికాభివృద్ధిని వివరించుము అన్నది ప్రశ్న. ఏమి వ్రాస్తే మార్కులువేస్తారో విజయకుమార్‌కు తెలుసు. అయినా యెన్నికలద్వారా వచ్చిన యీ మంత్రులలో మద్యపానాని కతీతులెవరా యనే అంతులేని ఆలోచనలతో వెతుక్కుంటూ పోతున్నాడు. నిన్నటి వాటిని విమర్శిస్తూ, బిల్లగుద్దుతూ నేడు చేస్తున్నవి రేపటికి యెంత హాస్యాస్పదమవుతాయో అని అంచనాగడుతున్నాడు.

అధ్యాపనే తమజీవనంగాను, ధ్యేయంగాను యెంచి, జీవితాన్నర్పించిన, త్యాగధనులు, వృద్ధులు, అనుభవజ్ఞులు అయిన పరీక్షాధికారులు మెల్లగా అడుగులువేసుకుంటూ అటుయిటు చూస్తూ జాగరూకులై వుంటున్నారు.

విజయకుమార్ వెనుకబల్లనుంచి మడతబెట్టిన కాగితమొకటి గాలికి బయటిప్రక్కకొచ్చి పడింది. ఆ నిశ్శబ్దవాతావరణాన్ని ఆ ధ్వని భంగపర్చింది. అనేకచూపులు అటు మళ్ళాయి. పెద్ద పగడీభారంతో క్రుంగిపోతూ, నిస్సత్తువతో పిల్లిఅడుగులువేస్తున్న పరీక్షాధికారి మిలిటరీ వానివలె సరసర వచ్చి ఆ కాగితాన్ని తనిఖీచేసి యెదురుబల్లమీదున్న సరళను కొరకొరా చూస్తున్నాడు. ఆమె తనను కానట్లు, తన కసలు ఆ కాగితంవిషయమేం తెలియనట్లు అభినయించ ప్రయత్నిస్తున్నది. కాని కలం సాగుటలేదు.

పరీక్షాధికారినేత్రాలనుంచి నిప్పులు వర్షిస్తున్నవి. ఆ యెండుకుపోయిన ప్రాణిలో యెక్కడున్నదో ఆ జోరు, హుంకరిస్తున్నధ్వనితో

జవాన్‌ను పిలుస్తూ సరళను నిలబెట్టాడు. సరళశరీరం వణికిపోతున్నది. సిగ్గుతో కుంచించుకుపోతున్నది. శిరస్సు అధోముఖంచేసి నిలిచింది కాని, రక్తంతో తిమ్మిరెత్తి పడిపోవుటకు సిద్ధమవుతున్నది.

ముందువరుసలోనున్న విజయకుమార్ వెంటనే లేచి పరీక్షాధికారివైపు నిర్భీతిగా చేయిజాపి "మీ చేతిలోపేపరు నాదే, జారిపడిపోయింది. దయతో యిస్తారా?" అన్నాడు. ఆ వృద్ధపరీక్షాధికారి వెలవెలబోతున్నాడు. భయభీతురాలైన సరళ విభ్రాంతిచెందింది. అంత నిర్లక్ష్యంగా నిర్భీతిగా నిలిచి అడుగుతున్న ఆ విద్యార్థిరీతి చూసినపుడు, తన దీర్ఘకాల అనుభవం నిరర్థకమయినట్లు ఆవేశంలో వుక్కిరిబిక్కిరై, కొరకొరలాడుతూ తనచేతిలోని కాగితాన్ని విప్పి సులోచనాలను సరిదిద్ది చదువుకుంటున్నాడు.

అదొకజాబితా—ప్రభుత్వశాఖలు. ఏయే శాఖను యేమంత్రి నిర్వహిస్తున్నది, అభివృద్ధిపథకాలు, వికాసకేంద్రాల విధానము, తద్వారా కలుగుతున్న లక్షలఖర్చు, పొందుతున్న స్వల్పసౌకర్యాలు మొదలగు వివరాలు సన్నటిజిలుగులో వ్రాసివున్నవి. "ఇది వ్రాసిందెవరు?" అని ప్రశ్నించాడు. "నేనే వ్రాసుకున్నా"నని జవాబువచ్చింది. "దగ్గరెందుకు వుంచుకున్నావ్" అని తిరిగి ప్రశ్నించాడు. "అవుసరమైతే కాపీచేయటానికి" అన్న జవాబు ధీమాగా వచ్చింది. అంత అనుభవంగల ఆ పరీక్షాధికారి కది సహింపరానిదైంది. వెంటనే విజయకుమార్ హాలునుంచి బయటకు పంపబడ్డాడు. పరీక్షలకు హాజరుకాకుండా నిషేధింపబడ్డాడు.

సరళకు క్షణంపాటు మనస్సబ్బత కలిగింది. తన దొంగతనం బయటపడి, నలుగురిలో నవ్వులపాలవుతూ, హీనాతిహీనస్థితికి గురియవుతున్నక్షణంలో ఒక అపరిచితయువకుడు రక్షకుడుగా నిలిచి అపరాధాన్ని తన నెత్తినరుద్దుకుని శిక్షకు గురికావటం చూస్తూ శిలాప్రతిమవలె నిలిచిపోయింది. పరీక్షాధికారి పరితప్తహృదయంతో ఆమెవైపు తిరిగి "పొరపడ్డాను, నిన్ను అనవసరంగా శంకించాను. నీవు మరేమీ అనుకోకమాప్పుని వ్రాసుకోవచ్చు" అన్నాడు. ఆమె యేదో కోల్పోయినదానివలె

బాధపడుతూ కూర్చున్నది. పరీక్షాధికారిమాటలను అర్థంచేసుకోగలశక్తి ఆమెలో లేదు. తాను అపరాధిగా నిలిచి, అందరియెదుట అపహాస్యం పాలవుతున్నపుడున్న బాధకంటె యిప్పటి బాధ మరింత కఠినమైందిగా కనిపిస్తున్నది. పరీక్షలో యెంత నిమగ్నంకావాలని ప్రయత్నిస్తున్నా మనస్సు ఆ సంఘటనవైపుకే పోతున్నది. ఆ అపరిచిత విద్యార్థి అసందర్భంగా తన అవమానాలను శిక్షలను యెందుకు నెత్తినరుద్దుకున్నాడో యెంత యోచించినా అర్థమవుటలేదు. నిస్వార్థత్యాగం యీరూపంలో వుంటుందని నేడు అనుభవపూర్వకంగా చూస్తున్నది.

పరీక్షాధికారి పశ్చాత్తాపాన్ని ప్రకటిస్తూ తనను కూర్చోమన్నప్పుడు చుట్టూ కలియజూసింది. తనవైపు పడుతున్న దృక్కులన్నీ ఆదరంతోను ఆనందంతోను నిండివున్నవి. బయటకుపంపబడిన అతనివైపు, కన్నములో దొరికిన దొంగనుచూస్తున్నట్లు చూస్తున్నారు అందరూ. అతనిని చూసి, హేళనగా నవ్వుకుంటున్నారు. తనకది భరింపరాని బాధగా వుంది. అతను తనవైపు చూసినట్లేలేదు. ఆ విద్యార్థి పేరైనా తెలుసుకోవాలని వుత్సాహం వురకలువేస్తున్నది.



# 3. నిర్లక్ష్యంలో ఆకర్షణ

పున:పరీక్షలు జరిగి నెలరోజులు గడిచిపోయినవి. సరళ పరీక్షలలో బాగా వ్రాసిందని, తప్పక ప్యాసవుతుందని తలిదండ్రుల తలంపు. ఆ తలిదండ్రులకు ప్రథమపుత్రికగా జన్మించినందున అధిక గారాబంతో పెరిగింది. తాతగారి భుజస్కంధాలమీదనే యెక్కువకాలం సవారీ చేసింది. మొగసంతానంకొరతను మభ్యపెట్టుకొను సరళకు బాల్యంలో మొగదుస్తులనే ధరింపజేసేవారు. నిక్కరు, హాఫ్‌షర్టు ఆమె సాధారణ డ్రస్. అపుడపుడు పైజామాకూడా ధరిస్తుంటుంది. సుకుమారమైన ఆ నాజూకుశరీరం ధవళవస్త్రులతో మెరుస్తుంటుంది. నిక్కరు, అర్ధచొక్కా ధరించిన ఆమె, పుస్తకాలతో హైస్కూలుఆవరణలో తిరుగుతున్నపుడు, పారిస్‌లోని విద్యార్థినులను గుర్తుకుతెస్తుంది. ఆమెలోని చంచలత్వము, చిలిపితనము అందానికి మెరుగులుదిద్దుతుంటవి. తామరాకుమీదిజలము వలే ఆమెమనస్సు అటుయిటు పరుపులెడుతుంది. ఒకేకార్యంలో ఆమె మనస్సు నిమగ్నంకాలేదు. ఆటల్లోనుంచి మాటల్లోకి, మాటల్లోనుంచి పుస్తకాలవైపు గంతులువేస్తుంటుంది.

తరగతిలో సరళ ఒక్కతేఅయినందున ప్రత్యేక కుర్చీ, టేబులు యేర్పాటుచేయబడింది. అయినా ఆమెకు అందరిలో కలిసికూర్చొనుటే యిష్టము. అందుకని యెప్పటికప్పుడు తన కిష్టమయినబెంచీలో కూర్చుంటుంది. వెనుక రవిప్రసాదున్న బెంచీమీద యెక్కువగా కూర్చుంటుంది. సౌందర్యరాశిగా విలసిస్తున్న సరళ అందరినీ ఆకర్షిస్తుంటుంది. కాని రవిప్రసాద్‌కు ఆమెయెడల భయభీతి కలుగుతుంటుంది. ఆమెఅందాన్ని కనులతో నింపుకోవాలని, చనువుగా పలుకరించి, సన్నిహితంచేసుకోవాలని మనస్సును యెంత కూడదీసుకున్నా వెపరి వెలవెలబోతుంది. ఆమె తనప్రక్కనున్నంతసేపు దృష్టిని పుస్తకంలోనే లగ్నంచేసుకుంటాడు. మనస్సుమాత్రం ఆమెనుగురించే ఆలోచిస్తుంటుంది. ఆమెకాళ్ళు తన కాళ్ళకు తగిలినపుడు స్పర్శలో చల్లదనముంటుంది. కాని, అనుభూతిలో తాపముంటుంది. ఆ తాపంలో గిలిగింతలతోగూడిన ఆవేశంకలుగుతుం

టుంది. దొంగవలె కోరగా నగ్నంగాకనిపించే కాళ్ళను కొరికివేయా లన్నంతగా చూస్తుంటాడు. కనకాంబరకాంతులతో జిలిబిలిమెరుగుల చిందిస్తున్న ఆ సుకుమారమైనపాదాలను చూస్తున్నకొలది అతని హృదయం తడబడలాడుతుంటుంది. ఆమె నగ్నహస్తం తనహస్తానికి తగిలినపుడు అమృతకలశాన్నంటినట్లు హృదయం పొంగిపోతుంటుంది. ఈ ప్రేరణలన్నీ అతనికి ధైర్యాన్నిచ్చుటకుబదులు అధైర్యాన్నే పెంచు తున్నవి. నేరస్తునివలె అతనిలో అతనే కుంచించుకుపోతుంటాడు.

క్లాసులో ఉపాధ్యాయులులేనపుడు అందరిదృక్కులు ఆమెవైపే వుంటవి. ఆమె చిరునగవులో అందరూ తేలిపోతుంటారు. పున్నమి వెన్నెలలో తెలియని హాయినిగ్రోలినట్లు ఆమె ప్రఫుల్లితముఖమండలం చూస్తున్నపుడు పరవశమవుతుంటారు. రవిప్రసాద్ మాత్రం ఖంగారు తోను చీకాకులోను కనిపిస్తుంటాడు. సరళవైపు చూసినట్లుగాని, చూడా లనే తలంపువున్నట్లుగాని కనిపించదు. కఠినమైన కాంక్షలున్నచోటే కప్పిపుచ్చు వుపాయాలుంటవి.

ఆధిఖ్యతద్వారా ఆకట్టజాలనిచోట నిరాదరణ, నిర్లక్ష్యముద్వారా ఆకర్షించుట కొన్నివిషయములందు సాధ్యమవుతుంటుంది. తనతో సంభాషించుటే ఆనందదాయకంగాను అదృష్టంగాను అందరూ ఆదుర్దా ప్రదర్శిస్తుండగా రవిప్రసాద్‌లోని వుదాసీనత ఆమెను ఆందోళనపరు స్తున్నది. అందరిమనస్సులు ఆమెనుగురించి ఆలోచిస్తుంటే ఆమెమనస్సు రవిప్రసాద్‌నుగురించి ఆలోచిస్తున్నది. అంతర్గతంగా యిరువురిమన స్సులు ఒకేవైపుకు పరువులెదుతున్నవి.

కలము కాగితము మిషతో పదేపదే పలుకరిస్తూ రవిప్రసాద్ లోని బెరుకును యెగరగొట్టింది సరళ. ఆమె అడిగినప్రశ్నలకు దృష్టిని పుస్తకాలవైపో, మరోవైపో మరల్చి సన్ననిస్వరంతో జవాబులిస్తుండే వాడు. సిగ్గువచ్చే సమాధానాలలో మృదుత్వముంటుంది. అందుకే రవి ప్రసాద్‌సమాధానాలు మరింత ఆకర్షణీయంగా వుండేవి. ఆమె అత్యధిక సన్నిహితమైపోయింది. ఇపుడు వారిరువురు ఒకేబల్లమీద ఒకేచోట స్థిరపడిపోయారు.

రవిప్రసాద్ గంభీరమైనవాడు. శ్రద్ధాభక్తులు, వినయంగల విద్యార్థి. ఆత్మబలం తక్కువ. అందుకే ఆలోచనలుకూడా తక్కువ. పెన్నిధి అతనిని వెంటాడుతున్నది. అయినా అతనిమనస్సులో విశ్వాసం స్థిరపడుటలేదు. ఊహాకందనిది, తనకు మించినది లభ్యమైనపుడు జంకుయేర్పడుట స్వాభావికం.

తన ప్రభావంలోపడి కొట్టుకుపోతూ తనకు దాసులుగా తయారయినవారివైపుకంటె తనను నిర్లక్ష్యంచేస్తున్నవారివైపుకు స్త్రీమనస్సు మొగ్గుతుంటుంది. రవిప్రసాద్‌మౌనానికి సరళ ముగ్ధురాలై తనను తాను మనసా అర్పించుకున్నది. అతనియెడల జాలిద్వారా అనురాగం అంకురించింది. అవి ప్రేమబీజాలుగావని యెవరనగలరు!

వారిరువురి మిత్రత్వంలో మూడు దీర్ఘసంవత్సరాలు గడిచిపోయినవి. మూడుక్లాసులు దాటి ప్రీయూనివర్సిటీక్లాసులో ప్రవేశించారు. క్రమక్రమంగా సంభవించిన సాంగత్యం పోనుపోను సన్నిహితమై దీర్ఘకాలంమనుట స్వాభావికం. సరళ రవిప్రసాద్‌లఅన్యోన్యత పెనవేసుకుపోయింది. కాని యిపుడు సరళ బాలికగాదు, యుక్తవయస్కురాలు. పైజామా, అర్ధచొక్కా ధరించి పైన సిల్కుపల్లెవాటు వేస్తుంటుంది. పంజాబీగా ప్రదర్శితంకావాలని ఆమె అభిమతంగాదు. విద్యార్థులలో కలిసిపోవాలని అభిలాష. కాని శరీరపు వొంపుసొంపులు నిరోధిస్తున్నవి. ఆ ప్రకృతిసిద్ధప్రభావాన్ని కప్పిపుచ్చుటకే సిల్కుపల్లెవాటు వేస్తుంది. సౌందర్యంలో మూర్తీభవించువారు యెలా ధరించినా, యేమిచేసినా వారిశోభ అద్వితీయమవుతుంటుంది. సరళ వయస్సులోపాటు కపోలాలు వుబికి ముఖమండలాన్ని విశాలంచేసినవి. అరుణకాంతుల వెదజల్లు బాలభాస్కరునివలె ఆమెముఖం తేజోవంతమై వికసిస్తూ అత్యధిక ఆకర్షణీయంగా వుంటుంది. కాటుకరంగు ముంగురులు జూకాలబోలి దర్పసమాన కపోలాలమీద పడి ఆడుకుంటున్నదృశ్యం ఆమెఅందాన్ని యినుమడింపజేస్తున్నవి.

పాఠాలలోని పాత్రలగురించో లోకాభిరామాయణమో, సరళ నిరవధికంగా చెబుతుంటుంది. మౌనం ఆమెకు సహించదు. రవి

ప్రసాద్ దృక్కులు అనుక్షణము ఆమెవైపే వుంటవి. మంత్రించినట్లు మౌనముద్రలో వుండి ఆమెఅందాన్ని చూపులలో నింపుకుంటుంటాడు. తృప్తితీరని అనుభూతిలో తృష్ణ పెనవేస్తుంది. నేత్రానందం తృష్ణను వోదారుస్తుంది.

"మాటాపలుకు లేకుండా అంత వెర్రిగా చూస్తావెందుకు ?" అంటూ సరళ అతనికపోలంమీద మృదువుగా మోదుతుంది. అతను చిరునగవును చిందిస్తూ "మాటలద్వారా వ్యక్తంచేయలేని భావాలున్నపుడు మాటలప్రయోజనమేముంటుంది !" అంటాడు. అతనిభుజంమీద చేయివేసి అసూయంతో "ఆ వ్యక్తంచేయలేని భావాలేమిటో చెప్పు రవి !" అంటుంది. "భాషలేని భావాలను యెలా చెప్పను ?" అంటాడు.

"భావాలు ప్రభావవంతమైనవయితే ప్రేరణలో బాణిని సృష్టించుకుంటవంటారుగదా ?"

"ప్రవాహం అధోముఖ అఘాతంలో దుముకుతున్నపు డుత్పన్నమయ్యేహోరు మంచులో అంతటిని అస్పష్టం ఆవరిస్తుంది. ఆ హోరు అంతర్భాగంలోని పొరలను యెవరు యెన్నగలరు ? అదేరీతిలోని భావ ప్రవాహానికి భాషకూర్పు యెలా సాధ్యం !"

"కనీసం ఆ భావాలతాలూకు సమస్యనైనా చెప్పు రవి !"

"ప్రొద్దుతిరుగుడుపుష్పం ప్రొద్దువైపే తిరుగుతుంటుంది. ఎగిరే పురుగులు వెలుగుచుట్టూ ప్రదక్షిణలుచేస్తూ ఆత్మార్పణచేసుకుంటవి. శిఖరాగ్రంమీద పడిన చినుకులు ప్రవాహాలై పరుపులెత్తుకుంటూ సాగర గర్భంలో లీనమైపోతవి. అందులో సమస్యలేమున్నవి ! అది వాటి స్వభావం."

"నా ప్రశ్నకిది సమాధానంకాదు. నీ మౌనానికి కారణమడిగాను."

"మాటలద్వారా వ్యక్తంచేయజాలనివి నేత్రాలద్వారా వ్యక్తం చేయుట తేలిక."

"ఆ పరిభాషను అర్థంచేసుకోగల సామర్థ్యం అందరికీ వుండదు గదా !"

"సమయంవచ్చినపుడు సామర్థ్యంకలుగుట స్వాభావికం !"

అర్థంగానిదానివలె చీకాకుచెందుతూ సాదరంగా అతని చుబుకాన్ని పుణుకుతూ "మభ్యమాటలలో మనస్సును కలవరపెట్టక, వున్న విషయం చెప్పు రవి."

"నిన్ను చూస్తుంటే కలిగే ఆత్మతృప్తి అర్థంగానిది."

విస్ఫారితముఖంతో "నాలో అలాంటిదేముంది?"

"వజ్రపువిలువ వజ్రానికెలా తెలుస్తుంది?"

"అయితే మౌనంగా కోరచూపులతో నా విలువను లెక్కగడుతున్నావన్నమాట."

"అమూల్యవజ్రానికి విలువలుగడుతూ సమయం వ్యర్థంచేసుకొనుట వెర్రితనమవుతుంది. శాశ్వతంగా పొందేటందుకు వుపాయాలను వెతుక్కొనుట వివేకం."

అల్పానందంలో వెకిలిగా నవ్వునుప్రదర్శిస్తూ, హస్తద్వయంలో అతనిశిరస్సునుబట్టి వూపుతూ "అయితే యేమివుపాయాలను ఆలోచించావో సెలవివ్వండి!" అంది.

"ఆలోచనాఫలితంగా సంశయాలసంపుటి పెరుగుతున్నది."

"చేతిలోదాన్ని అందనిదిగా అలమటించుట అసమర్థతను సూచిస్తుంది."

"నీముందు నిజంగా నేను అసమర్థుణ్ణే, పిచ్చివాడిని. పొందరానిది పొందినపుడు పోతుందనేభయంకూడా నీడవలె వెంటాడుతుంది."

"కొందరు భయంలో ధైర్యాన్ని, దుఃఖంలో సుఖాన్ని, మనసా సృష్టించుకుంటారు. అందుకు భిన్నంగా నీవు విచారవాదివై కూర్చున్నావు."

"ఏమీలేనివానికుండే బాధ ఒకటే, కాని అన్నీవున్నవారికి అన్నివైపులనుంచి బాధలు, భయాలు కనిపిస్తవి...."

"బాధలు, భయాలు కేవలం కలిమిలేములవల్ల కలిగేవికావు. సంపత్తినిచ్చిన దాతే రక్షకనచాన్నికూడా కల్పిస్తాడు. కాని నిరాశావాది దుఃఖాన్ని పోగొట్టుట యెవరికీ సాధ్యంగానిపని. నిరాశావాదిచెంత జేరుట దురదృష్టమే అవుతుంది!" అని వికటంగా అన్నది.

ఎన్నికలలో డిపాజిట్టుకోల్పోయినివానివలె చింతితవదనంతో దీన స్వరంతో "నన్ను క్షమించు సరళా. ఎంత కూడదీసుకున్నా మనస్సు కుదుటపడుటలేదు. భయకంపనలు కల్లోలపరుస్తున్నవి. నిన్ను యేమేమో అడగాలనిపిస్తుంటుంది, అభయంపొందాలనిపిస్తుంటుంది, కాని ధైర్యం చాలుటలేదు. నీ సమక్షంలో మనస్సులోని ఆలోచనలన్నీ చెల్లాచెదరై, కబుర్లుగా రూపొందుతుంటవి. నిన్ను చూస్తున్నకొద్దీ నన్ను నేను మర్చిపోయి నీలో లీనమైపోతుంటాను. నీముందు ఆత్మార్పణచేసుకుంటే శాంతి లభిస్తుందనిపిస్తుంది. జీవితాంతం యెడబాటులేకుంటే యెంత బావుండును! అనుకుంటాను."

ఆశీర్వదిస్తున్న దేవతవలె నిలబడి, అతనిశిరస్సుపై కుడిహస్త ముంచి "ఆశామోహంలో హృదయదౌర్బల్యాన్నిపొంది తడబడ లాడుతూ తత్తరపోతున్న ప్రేమారాధకుడా, మనోఫలసిద్ధిబొంద ఆశీర్వ దిస్తున్నాను." అన్నది.

అబోధబాలకునివలె ఆమెముందు మోకరిల్లి "నేను ధన్యుణ్ణి! నీవుదప్ప నాకీలోకంలో కోరదగిందేమీలేదు...." అంటుండగా మధ్య లోనే అతని శిరస్సునుబట్టి వూపుతూ "పిచ్చితో పిరికివాడివైపోతు న్నావు" అన్నది సరళ.

ప్రీయూనివర్సిటీపరీక్షలకు పంపుటకు జరిపిన సెలక్షన్‌లో తప్పిన రవిప్రసాద్ సిగ్గులో సరళకు కనిపించకుండా తిరుగుతున్నాడు. ఆమె పరీక్షలకుముందు కలుసుకోటానికి యెంతో ప్రయత్నించింది. కాని తప్పుకుతిరిగేవానిని కలియుట దుర్లభం.



# 4. స్వయం ప్రభావాలు

పరీక్షాఫలితాలు ప్రకటించబడినవి. సరళ తప్పినట్లు తెలిసినపుడు ఆమెకు అంత బాధఅనిపించలేదు. తన అపరాధాన్ని నెత్తినవేసుకుని పరీక్షనుంచి వెడలగొట్టబడిన ఆ విద్యార్థినిగురించే అధికంగా ఆలోచిస్తున్నది. ఏ పరీక్షలకొరకు సంవత్సరంపొడుగునా కష్టపడి చదివాడో ఆ పరీక్షలనుంచి వెడలగొట్టబడినపుడుకూడా ఆ విద్యార్థి చలించినట్లులేదు. పూర్తిగా వ్రాసి సంతృప్తిలో పయనమయ్యేవానివలెనే బయటకు నడిచాడు. అందరూ అతనిని అపరాధిగా అవహేళనతో చూస్తున్నపుడు, తననుకాదన్నట్లు చిరునగవుతో బయటకు నడిచాడు. తనవైపు ఒక్కమారుకూడా చూడలేదు. ఎవరి అపరాధాన్ని అకారణంగా కోరి తన నెత్తినరుద్దుకుని బహిష్కరింపబడ్డాడో, ఆలాంటి తను యెవరో తెలుసుకోవాలన్న వాంఛకూడా అతనిలో కనిపించలేదు. అతనిముం దదొక సర్వసామాన్య కార్యక్రమంగా గోచరిస్తున్నది.

ఆ సమస్య ఆమెమనస్సులో వరుసక్రమంగా మెదులుతున్నది. వంటరిగావుండే అలవాటులేదు. కాని యిపుడామెమనస్సుకు చక్కటి ఆలోచనావస్తువు దొరికింది. ఆ విద్యార్థి చేసివెళ్ళిన ఒక్క ఘనకార్యాన్నే వివిధవిధాలుగా ఆలోచిస్తూ ఆనందాన్ని గ్రోలుతున్నది. వంటరిగా గదిలోకూర్చుని గంటలతరబడి గడిపివేస్తుంటుంది.

పరీక్షలకు పోలేకపోయిన రవిప్రసాద్ అభిమానం అడ్డురాగా సరళముందుకు రాలేక తప్పుకుతిరుగుతున్నాడు. సరళకో నూతనసమస్య దొరికినందుకు రవికొరకు వెదకవలసిన అవుసరంలేకపోయింది.

తాను పరీక్షలలో తప్పినట్లు తెలిసినపుడు సరళ ఖంగారుపడలేదు. బాధ అంతకంటె లేదు. తనకొరకు ఒకవ్యక్తి ఒక సంవత్సర శ్రమను వృధాచేసుకొన్నదే తనముందు గొప్పగా కనిపిస్తున్నది. అందుకే తన మనస్సు వ్యాకులపడుతున్నది.

సరళ తప్పినవిషయం వోవిధంగా దుఃఖాన్ని, మరోవిధంగా ఆనందాన్ని కలిగిస్తున్నది రవిప్రసాద్‌కు. తన ప్రియపాత్రురాలు తప్పుట శోచనీయమేకాని తిరిగి తనతోపాటే చదువుతుంది గనుక సంతోషం. ఇపుడు తనలోని లజ్జాభిమానాలు పైదొలగినవి. తన సానుభూతిని తెలియజేయుటకు ధైర్యంతో పయనమయ్యాడు.

"నేను పరీక్షలకుపోలేకపోయినందుకు అంత బాధపడలేదు. కాని నీవు తప్పినట్లు తెలుసుకున్నపుడు కళవళపడిపోయాను. హృదయ స్పందన ఆగినట్లయింది. లోకంలోని పిసినారితనమంతా యీ పేపర్లుదిద్దే వారివద్దనే వుంటుంది—" అని రవి అంటుండగా వుదాసీనతలోనున్న సరళ కల్పించుకుని శుష్కనవ్వును ప్రదర్శిస్తూ "అదేమీ లేదు రవీ! పరీక్షాధికార్ల పిసినారితనంవలన నేను తప్పలేదు. తప్పినందుకు నాకు విచారమూలేదు;" అన్నది. తడబాటును సర్దుకుంటూ. "తప్పినందుకు సిగ్గుపడవలసిన పనిలేదు. సంవత్సరశ్రమ వృధాఅయినందుకు విచారపడుట సహజమే. తప్పినందుకు విచారంలేదనీ మాటఅనగలిగావుగాని, నీముఖంలోని విచారరేఖలను తుడిచివేసుకోలేకపోతున్నావుగదా!" అంటూ కుర్చీలో కూలబడ్డాడు.

తనలో బాధవున్నట్లు యితరులు గ్రహించి సానుభూతిని ప్రకటించినప్పుడు క్షణంలో హృదయం తేలికపడుతుంది. సుఖంలో తృప్తి ప్రకటితమవుతుంది. సరళలోని ఉదాసీనత అదృశ్యమైంది. హీన స్వరంతో "నేడు క్రొత్తగా నేను పడుతున్న విచారమేమీ లేదు. ఈ రెండుమాసాలనుంచి విచారపడుతున్నాను. అది ఒకవిద్యార్థి అకారణంగా పరీక్షలనుంచి బహిష్కరింపబడినందుకు—" అన్నది. రవిప్రసాద్ కృతజ్ఞతాభరితదృక్కులను బరపుతున్నాడు.

"ఒక గొప్పనేరాన్ని అప్రత్యాశితంగా మరొకఅపరిచితుడు తన నెత్తినవేసుకుని శిక్షనుపొంది, తన అపరాధానికే తాను పొందినట్లు నిరాడంబరంగా సునాయాసంగా కఠినాతికఠినశిక్షను అనుభవించుట నీ వెక్కడైనా చూశావా రవీ?" అని ప్రశ్నించింది.

"ఆపదలోవున్నవారిని ఆదుకొనుట మానవస్వభావం. అక్కడ పరిచయాలు ప్రధానంకాదుగదా!" అన్నాడు.

ఆమెకంఠం తీవ్రంచేసి "అయితే ఒక్క అపరిచితునినేరం నెత్తినవేసుకుని వురికంబమెక్కగలవా?" అన్నది.

"తెలియనివారికొరకు వురికంబమెక్కుట వెర్రితనమవుతుంది. దానమో, ధర్మమో చేసగవచ్చు. అవధులులేని త్యాగం వ్యర్థమవుతుంది" అన్నాడు.

ఆమె ప్రశాంతంతోగూడిన నిండుకంఠంతో "త్యాగానికి అవధులుండవు రవి! అవి వినిపిస్తే అర్థమయ్యేవిగావు, సాధనచేస్తే అలవడేవికావు, స్వయంప్రభావితమైనవి. ప్రత్యక్షంగా అలాంటి సన్నివేశం చూసినపుడు విస్మయమొందుతాము, అదే మనమనస్సులో మెదులుతుంది. ఆవైపుకే మనస్సు మొగ్గుతుంటుంది. ఉపదేశమానాలలో రాని అనుభవం ఒక్క యధార్థకార్యంద్వారా వస్తుంది" అన్నది.

అర్థంగాని అయోమయంలో వెలవెలబోతూ "నీవు చెప్పేదేమిటో నాకర్థమవుటలేదు. నేను సెలక్షన్‌లో పోయినందుకు యింత విచారిస్తున్నావని అనుకోలేదు. ఆతరువాత నీవు చెప్పే విషయాలేమిటో అర్థమయ్యేట్లు చెప్పు" అన్నాడు.

శుష్కనవ్వును ప్రదర్శిస్తూ "నేను బాధపడుతున్నది నిన్ను గురించీగాదు నన్నుగురించీగాదు రవీ!...." అని తడబాటుచెందింది. ఆ వ్యధలోకూడా మనస్సు గిలిగింతలలో మునుగుతున్నది. వివరించబోతే మనస్సు తేలికపడును, కాని తననేరం బయటపడిపోతుంది. అందువలన మనస్సులోనే మననంచేస్తున్నది.

రవిని అధోలోకానికి నెట్టినట్లయింది. మలినముద్రితముఖంతో పిచ్చివానివలె ఆమెవైపే చూస్తున్నాడు. మతిచలించినమాటలేమోనని శంకకలిగింది. అతనిమెదడు యెంత బుద్ధులుగొట్టుకున్నా ప్రయోజనంలేకపోతున్నది. అధీరతలో అతనికి తెలియకుండానే నేత్రాలు జలపూరితమైనవి. ఆమె కతని దీనదృశ్యంమీద జాలివేసింది, రిగాబోయి, శిరస్సు

మీద చేయివేసి నిమురుతూ "కళవళపడబోకు రవీ! నా జీవితంలో ఒక మరపురానిఘట్టం జరిగిపోయింది. దాన్ని మరిచి 'ముందుకు అడుగిడలేక పోతున్నాను. నా కిదొక దాగుడుమూతలాటయింది" అన్నది.

అతనినుంచి మాటకుబదులు నేత్రాలనుంచీ రెండు జలబిందువులు దొర్లినవి.

ఆమెమనస్సు కిపుడు తెరయనిపూరట కరిగిందిగాబోలు, మంద హాసంచేస్తూ, అంగుళీయములతో అతని కన్నీటిచారలను తుడుస్తూ "అలా కన్నీరుపెడతావెందుకు రవీ?" అని బుజ్జగింపుధ్వనిలో అడి గింది. ఆ మాటలతో అతనిమనస్సు నవనీతమయిందిగాబోలు అశ్రు స్రవంతి బొటబొటలాడింది.

సరళ ఆత్రుతలో చుబుకాన్నిపుణుకుతూ "ఏమీలేకుండానే యేడ్పుముఖంపెడతావెందుకు? కన్నీరు స్త్రీలనొత్తంటారు, ఆ లక్షణా లేమయినా నీలో వున్నవా?" అని మందలింపుధ్వనితో అంది.

బిడియపడుతున్నవానివలె తత్తరలాడుతూ కన్నీరద్దుకుని నవ్వను ప్రయత్నిస్తూ "ఏమీ లేదు....ఏమీలేదు!" అని నతనతగొట్టాడు.

"నీవు కన్నీరుకార్చిందెందుకు!"

"అది అనుకునిచేసిన పనిగాదు. హృదయం కంపించింది. క్షణంలో భయభీతావహుణ్ణయినాను. అంతా అంధకారంగా తోచింది" అన్నాడు.

పసివానివలె అతనికపోలాన్నిపట్టి మృదువుగా మెలిపేస్తూ "కార ణంలేకుండా కన్నీరుకార్చగల ప్రయోజకుడివని నేడు తెలుసుకున్నాను" అన్నది. అతనిముఖం చిన్నవోయి అధరాలు అదురుతున్నవి. కుంచిం చుకుపోతూ ఆమెపాదాలదగ్గర కూలబడ్డాడు. అమాయకంగా సుధిదప్పి, భయభీతులకుగురియై శరణుజొచ్చినపుడు కఠినాతికఠినమనస్సుకూడా కరిగిపోతుంది. తనకేదో ఆధిక్యతగల స్థానంలభ్యమైనట్లు గర్వంతోను, కరుణతోను మేళవించి ఆమెహృదయం పులకితమైంది. అనుకోనిరీతిగా అతనిని తన బాహువులలోకి తీసుకున్నది. అదృష్టదేవత దొంగచాటుగా ధనసు తీసుకెళ్ళి దేవేంద్రునిగద్దెమీద కూర్చుండబెట్టినట్లున్న దతనికి.

భయకంపితబాలకునివలె ఆమెవక్షంమీద శిరస్సు వాల్చివేశాడు. టాల్కంపవుడరుసుగంధం ఘుమాళిస్తున్నది. అక్కడ పొందే విచిత్రానుభూతిలో పిరికిమత్తు రంగరించుకున్నది. సమయాన్ని సమానభాగాలుగా ఖండించు గడియారంలోని టిక్కుటిక్కులవలె వెలువడుతున్న ఆమెహృదయంలోని స్పందనలు, తనకేదో నీతిని బోధిస్తున్న హెచ్చరికవలె వినిపిస్తున్నవి. కాని, అబ్బ! వున్నకొంది వేడి, ఆతరువాత ఆనందము కలుగుతున్నవి. యౌవనపొంగులు రక్తనాళాలలో బుసలు గొడుతున్నవి. తెలియనిభయంలో శ్వాస స్తంభించిపోతున్నది వోప్రక్క. మరోప్రక్క మనస్సు తేలియాడుతూ మేఘాలమీదికెగిసిపోతున్నది. ఈ స్థానంలోవుండి జీవితాంతం గడపమంటే, ఆకలిదప్పులు, అలసట వుండవుగదా! అనుకుంటున్నాడు. ఆ వాస్తవికఅనుభవంతోనే స్వర్గంలోవుండే ఆనందాన్ని ఆకలిదప్పులులేని అమరత్వాన్ని మధురమయంగా వర్ణించారు మహాకవులు. ఆదరంతోగూడిన ఆ సుకుమారసుందరి కవుగిటిలో పొందే అనిర్వచనీయమైన ఆనందం, అధికారాలతోను ఆధిక్యతలతోను ప్రతిష్టలతోను ప్రతిఫలతోను పొందలేముసరిగదా, స్వర్గధామంలోనైనా లభ్యమవుతుందని యెలా విశ్వసించగలం! ఈలోకంలో పొందలేని, సాధ్యపడని, సంభవంగాని సుఖసంచితాలను స్వర్గమనే వూహాలోకంలోవున్నట్లు చిత్రించి నిస్పృహకు, నిరాశకు నిష్కృతినికలిగించుటలో తమనైపుణ్యాన్నంతటిని క్రోడీకరించారు శాస్త్రకారులు.



# 5. పిట్టలరాజా

విజయకుమార్ విచిత్రమైన స్వభావంకలవాడు. కొన్నిసమయాలందు చంచలస్వభావిగా గోచరిస్తాడు. మరికొన్నిసమయాలందు స్థిరచిత్తుడనిపిస్తుంది. అమాయకుడుగా కనిపించిన మరుక్షణమే అఖండదీక్షాపరుడుగా గనిపిస్తాడు. ధర్మదాతగా గనిపించిన కొద్దిక్షణాలకే పిసినారిగాను, కఠినుడుగాను ప్రకటితమవుతుంటాడు. ఏక్షణం యే రూపం ధరిస్తాడో యెవరూ చెప్పలేరు.

పశ్చిమగోదావరిజిల్లాలో పిట్టలమహారాజాగా ప్రఖ్యాతిజెందిన జమీందారీ ఆఖరివారసుడే విజయకుమార్. పిట్టలరాజాగారు మయూరాలచేత నృత్యంచేయిస్తాడని, కోయిలలతో పాటకచేరీలుచేయిస్తాడని, పావురాలచేత టపాపనిచేయిస్తాడని, చిలుకలతో సంభాషణలు జరుపుతాడని ప్రతీతి. ఆయనపలుకువిన్న పక్షులు రివ్వురివ్వున ఆయనచుట్టూ చేరి వినయంతో అనురాగాలొలికిస్తూ నిరీక్షిస్తవి, గగనంలో తిరిగే పక్షులు సైతం ఆయన్ను గుర్తించగలుగుతవి; చేయిచాచితే రివ్వున అరచేతిలో వాలి "కురకుర" లాడుతూ తమ భక్తిప్రపత్తులను ప్రకటించుకుంటవి. ఆయనకు పక్షులభాష వచ్చని, వాటితో సంభాషిస్తాడని వాడుక. ఎన్నడూ యేపక్షినీ నిర్బంధంలోవుంచియెరుగడు.పరదేశయాత్రికులనేకులు ఆయన వద్దకువచ్చి వినోదాన్నిపొంది ఆశ్చర్యాన్వితులై వెడలుచుండేవారు.

కేవలం పక్షిజాతివసతులకని తన దేవిడీవెనుక గొప్ప వనం త్రాన్ని నిర్మించాడు. అందు పక్షులకు ప్రియమైన ఫలవృక్షాలు నిండి వున్నవి. అది స్వేచ్ఛాఖగవనము. అందు యితరులకు ప్రవేశములేదు. ఖగక్రీడానిమిత్తంగానోలు వనంలో పెద్దకొలను కమలములతో విరాజిస్తున్నది.

ఖగజాతిచికిత్సావిధానంలో ఆయన నిపుణుడైన డాక్టరు. దేవిడీలో

ఒకభాగమంతా మందులసీరువాలతోను, వైద్యగ్రంధాలతోను నిండివుంటుంది. కాని ఆ విధానమంతా ఖగజాతికిచెందినదే.

పక్షులయెడ ఆయనకున్న అనురాగము, చేస్తున్న పరిశోధనలు మొదలగువాటన్నిటికి గలిపి "పిట్టలరాజాకు పిచ్చి" అనే పరిభాషను పారితోషికంగా ప్రచారంచేశారు. ఈ సవనాగరికయుగంలో అధికారాలకు, ఆధిఖ్యతలకు, ఆస్తినలకు అతీతుడై మానవలోకాన్ని మరచి పక్షిలోకంవైపు పరువులెడుతూ వాటినే తమప్రజగా, సంతానంగా భావించి వాటి క్షేమపరిశోధనలోనే మునిగినవానిని పిచ్చివాడనుట పరిపాటేమో!

పక్షులలో సంక్షిప్తమైన ఆలోచనలుకలుగుతుంటవిగాని వాటిని వ్యక్తంచేయగలిగినన్ని శబ్దాలువుండవని, బాధను భయాన్ని ఆకలిని ఆనందాన్ని ఆదరాన్ని సూచించుశబ్దాలుమాత్రమే వాటిభాషయని, తన పరిశోధనల అనుభవంగా ప్రకటించుకుంటూ పిట్టలరాజా తన జీవన యాత్రను ముగించాడు.

ఆ పిట్టలరాజాయే యీ విజయకుమార్‌గా, తిరిగి ఆ కుటుంబంలో జన్మించాడని, అదే రూపురేఖలతో పూడిపడ్డాడని వృద్ధులంతా అంటుంటారు. ఆయనకు 'పక్షిజాతి పరిశోధనాపిచ్చి' అని ఖచ్చితంగా చెప్పగలరు. కాని, విజయకుమార్‌విషయం వేరు. అభిప్రాయాలేమిటో ఆలోచనలేమిటో, యేక్షణం యేమి చేసాడో యెవరికీ తెలియదు. ఆరోజులలో వున్న జమీలరాబడులు నేడు లేవు. ఆస్తి కరిగిపోవుటతోపాటే పనివారలుకూడా అదృశ్యమైనారు. జమీందారీ జ్ఞాపకచిహ్నాలుగా జీర్ణావస్తలోని వస్తుసముదాయం దేవిడీఅంతటా నిలిచివుంది. కుటుంబంలో ఆ దర్పంకూడా క్షీణించింది.

విజయకుమార్ వూహతెలియకముందే తండ్రినిగోల్పోయాడు. ఏకైకపంశాంకురంగా నిలిచిన తాను తల్లిసడిలోనే అభివృద్ధిపొందాడు. హరించుకుపోయిన సంపత్తితోపాటే ఆశ్రితులు, బంధుకోటి కనిపించకుండాపోయారు. రెండుతరాలుగా దేవిడీని అంటిపెట్టుకునివున్న మహమ్మదీయకుటుంబంమాత్రం పోజాలక, యితర దారితెన్నులుతెలి

యక యింకా నిలిచిపోయింది. ఖాసిం మదమాంస పాకశాస్త్రంలో సిద్ధహస్తుడని, పిట్టలరాజాను దినదినము మెప్పించి యెన్నో బిరుదులు పొందిన తనతండ్రికంటె నిపుణుడని అనేకమంది అతిథులచేత ప్రశంసించబడ్డాడు. కాని రానురాను తన పాకనైపుణ్యాన్ని చూపే అవకాశం లేకపోగా తన కుటుంబపోషణకూడా భారంగా తయారై దరిద్రదేవతా ఒడిలో క్రుంగుతున్నాడు.

"అవకాశంగాని అవుసరంగాని లేనపుడు అంటిపెట్టుకుని అవసలుపడేకంటే మరో మంచిచోటుకుపోవటం మంచిదిగదా" అని భార్య ఫాత్మాభి వినిపించినపుడు "మానవజీవితం అవకాశాలతోను అవుసరంతోను ముడిబడివున్నమాట వాస్తవమే. కాని, ఆత్మతృప్తి అక్కడ లేనపుడు అవి యోగ్యంకాజాలవు" అంటాడు ఖాసిం. "ఇక్కడ మీకున్న తృప్తేమిటో చెప్పండి!" అంటుంది ఫాత్మాభి. మందహాసాలొలికిస్తూ "నేను యీ జమీందారీలోనే పుట్టిపెరిగాను. కొరతలేని సుఖానుభూతులను కొల్లలుగా పొందాను. నేడు స్థితి క్షీణించి దరిద్రం ఆవరించింది. కనుకనే యీ స్థితిలో యిచటి ఆత్మీయులను, ఆదరించినవారిని విడిచిపోవుట ధర్మంగాదు" అంటాడు.

శిథిలమైన యెస్టేట్‌లో పెరిగాడు విజయకుమార్. తల్లి మలయమతి కోమలస్వభావిని, లౌకికము తెలియనిది, విశాలహృదయిని. ఎవరేది చెప్పినా విశ్వసిస్తుంటుంది. ఆస్తులు హరించుకుపోయినా ఆమెలోని వుదారత సన్నగిలలేదు. ఎవరిబాధ విన్నా నొచ్చుకుంటుంది. తనలోని యీ సుగుణసంపత్తంతా తనకు, తన యేకైకసంతానానికి కీడునే సమకూర్చినదని తెలుసుకొనుటకు చాలాకాలంపట్టింది.

విజయకుమార్ చదువుమిషతో పుస్తకాన్ని చేతబట్టి పిట్టలవనంలోనే తిరుగుతుంటాడు. ప్రతిపక్షి అతనిని ఆకర్షిస్తుంటుంది. అపరాహ్న సమయాలందు కొలనులోదిగి నీటిపక్షులతో జలక్రీడలు సలుపుతుంటాడు. శిరస్సుమీద రామచిలుకను నిలిపి అన్నివైపులకు యీదుతుంటాడు. ఆఖరిలో అకస్మాత్తుగా మునుగుతాడు. ప్రమత్తతలోని ఆ చిలుక

నీటిమీదపడి తపతపకొట్టుకుంటూ బయటపడుతుంది. డజనుపావు రాల పాదాలకు ఒకేదారాన్ని పొడవుగాకట్టి ఒక్కమాటుగా పైకెగర గొట్టి, అవి ఆకాశంలో క్రిందికీ పైకీ లాక్కుంటూ, అవస్థలతో పయ నంసాగిస్తుంటే ఆ దృశ్యాన్ని తిలకిస్తూ పరవశమవుతుంటాడు.

వనంలో అలిసిసొలసి యింటికిచేరినపుడు "నాయనా, చదువుకో వలసినసమయంలో ఆటలతో సమయం వ్యర్థంచేస్తే జీవితమే వ్యర్థమవు తుంది" అని తల్లి అంటుంది.

"భవిష్యత్తనే భయంతో యెప్పటికప్పుడు జీవితాన్ని కష్ట బద్ధంగా కంటకమయంచేసుకుని ఖైదీవలెనో, సిపాయివలెనో జీవిత మంతా నడుస్తూ జీవితాన్నే మోసంచేసుకోవటంకంటె జీవితంలోని కొంతభాగాన్నైనా స్వేచ్ఛలోని ఆనందానికి వదులుట సద్వినియోగమే అవుతుందిగదా, అమ్మా!" అంటాడు విజయకుమార్.

మలయమతి బిడ్డను వడిలోకిలాక్కుని శిరస్సు నిమురుతూ "ఇంత పేరుబొందిన యీ వంశఖ్యాతి. నీ ఒక్కడిమీదనే నిలిచిపోయింది. ఆస్తి పాస్తులు చెదిరిపోయినా నీ జీవితనిర్వహణకు చాలదని నాకు చింతలేదు. నీవుఆర్జించాలనేఆశ అసలేలేదు. కాని జీవితంలో ఆనందాన్ని అనుభ వించటానికి ఆధిక్యతనుపొందటానికికూడా విజ్ఞానమవసరం పిచ్చి తండ్రీ! నేడు విద్యను నిర్లక్ష్యంచేసి స్వేచ్ఛగా ఆడుకుంటూతిరిగితే రేపు నీకు నీవే పశ్చాత్తప్తుడవై, కఠినఆంక్షలోపెట్టి చదివించనందుకు నన్నుకూడా నిందిస్తావన్నదే నాభయం నాయనా" అంటుంది.

ఆమెకుడిహస్తాన్ని తనముఖంమీదవేసి అదుముకుంటూ "జన్మ జన్మల పుణ్యఫలితంగా నీ బిడ్డనై జన్మించిన నిన్ను యెన్నడూ నిందించ నమ్మా!" అంటాడు.

"తల్లికి పిల్లలను ప్రేమించుటతెలిసినట్లే శాసించుటకూడా తెలిసి నప్పుడే యోగ్యసంతానమవుతుందంటారు. ఆ రెండోది నామనస్సుకు చేతగాదు. అందువలననే నీవు యెంతగా చెడిపోతావోనని నామనస్సు రేయింబవలు వ్యధచెందుతుంటుంది నాయనా!" అన్నది.

"నేను చదువుకోకుండా చెడిపోతున్నానని నీవంత వ్యధచెందుతుంటే, యిక నీవు చెప్పినట్లే చదువుకుంటాను అమ్మా! నీ సంతోషం కొరకు యెంత శ్రమయినా పడతాను" అన్నాడు.

"నాకొరకని నిన్ను శ్రమపెట్టను బాబూ, నీ మేలుకొరకు నీవు చదువాలి. చదువు శ్రమకాదు. చదివేది అర్ధంగానపుడు శ్రమగా తోస్తుంది. చదువుతున్న ప్రతిదీ స్పష్టంగా అర్ధమయినపుడు వుత్సాహంపుదుతుంది. అందులో హాయికూడా వుంటుంది. అభ్యాసంలో శ్రద్ధవున్నపుడు తప్పకుండా అర్ధమవుతుంది" అన్నది మలయమతి.

విజయకుమార్‌కు చదువుమీద శ్రద్ధలేకపోయినా యెవరిభయమూ లేకపోయినా, తల్లిమీదున్న అపారభక్తిని ఆధారంచేసుకుని బడికిపోవుట అలవాటుచేసుకున్నాడు. అయిష్టమైనవి యిష్టమైనవిగాను, ఇష్టమైనవి అయిష్టమైనవిగాను, అలవాటులేనివి, ఆకర్షణీయంగాను రూపొందుట స్వాభావికం.

ఆటపాటలమీదవలెనే చదువుమీదకూడా శ్రద్ధకలిగింది. కాని యేకార్యంమీదా పట్టుదలలేనట్లే చదువుమీదకూడా పట్టుదలలేదు.

యస్. యస్. యల్. సి. తప్పినపుడు తల్లి మలయమతి యెంతో బాధపడింది. తనప్రోత్సాహంతో చదువు ప్రారంభించిన ఖాసిం ప్రథమ పుత్రిక బీబీజాన్ అదేక్లాసులో వుత్తీర్ణురాలైనందుకు ఆనందపడి తనమెడలోని హారాన్ని బహూకరించింది.

బీబీజాన్ సిగ్గిలుతూ "నేను ప్యాసయినందుకు యింత ఆనందమెందుకమ్మా! నా చదువుకు ప్రయోజనంలేదు. కుమారబాబు ప్యాసయితే నేడు పర్వదినంగా పరిగణించేవాళ్ళము." అంటూ మలయమతిపాదాలనంటింది.

మలయమతి ఆమెచుబుకాన్ని పుణుకుతూ "నీ చదువును వ్యర్ధంగా తలంచబోకు బీబీజాన్. అదృష్టం అంతస్థులను, తారతమ్యాలను గమనించదు. విలువ, వినియోగాన్నిబట్టి వుంటుంది. వినియోగం బుద్ధికుశలతనుబట్టి వుంటుంది" అన్నది.

బీబీజాన్ ముఖమంతా కృతజ్ఞతతో పూరించుకుంది. తనతలిదండ్రు లనుకూడా మందలించి యెవరైతే తనను ప్రోత్సహించి, ఖర్చులనన్ని టని తానే భరించి చదివించిందో, యెవరైతే తనక్షేమాన్ని సర్వతో ముఖంగా కోరుతున్నారో ఆ మలయమతి ఏకైకపుత్రుడు తప్ప అపాత్రు రాలైన తాను ప్యాసై, ఆమెముందు నిలుచుట నేరమయినట్లు వివిధ విధాల విచారిస్తున్న బీబీజాన్ మనస్సు ఒక్కమాటుగా తేలికపడింది. కాని తెలియని సంకోచమేదో వెంటాడుతూనేవున్నది. ఆమెమనస్సులో విజయకుమార్ దీనరూపంలో పదేపదే మెదులుతున్నాడు. కుమార్ కూడా ప్యాసయితే యెంతో బావుండునని, తనబదులు కుమారే ప్యాసయినా అమ్మగారిమనస్సు నిజమైన ఆనందంతో నిండిపోయేదని అనిపిస్తున్నది.

పేపర్లలో తననెంబరులేనట్లు తెలుసుకున్నపుడు విజయకుమార్ చీకాకుగా పిట్టలవనంవైపు వెళ్ళిపోయాడు. తప్పినందుకు అధైర్యపడ వద్దని, చింతించవలసినపనిలేదని చెప్పి ధైర్యాన్నిచ్చి ఆనందంతో భవిష్యకార్యోన్ముఖునిచేయాలనే తలంపుతో మలయమతి విజయ కుమార్‌ను కేకలుబెట్టి పిలుస్తున్నది. కాని అతనికి ప్రతిగా బీబీజాన్ ముందుకొచ్చి "బాబుగారిని నేను పిలుచుకొస్తానుండండి అమ్మగారు!" అంటూ పిట్టలవనంలో వెదుకసాగింది.

వనమంతాతిరిగి విసిగివేసారి కొలనుదగ్గర కూలబడిపోయింది. ఖంగారుతో మనస్సంతా కళవళపడిపోయింది. దుష్టఆలోచనలు దొర్లు చున్నవి. హృదయం దడదడకొట్టుకుంటూ వూపిరిసలుపక కొలను చుట్టూ తిరుగుతూ పొదరిండ్లవైపు వెళ్ళింది. చెదరిపోయిన లతలమధ్య నుంచి యేదో ధ్వనివినిపిస్తున్నది. పరిశీలనగా తొంగిచూసి నివ్వెర పోయింది. ఆ పొదరింటిలోపల విజయకుమార్ గురకబెట్టి నిద్ర పోతున్నాడు.

బీబీజాన్ మనస్సు కుదుటపడింది. దగ్గరగావెళ్ళి చూస్తున్నది. ఈ ప్రపంచంలోని దురాశలను, దుఃఖాలను విస్మరించి యీర్ష్యలకు, ద్వేషాలకు, కక్షలకు, కార్పణ్యాలకు అతీతుడై నిద్రలో హాయినిగ్రోలు

తున్న అతని లలాటంమీది స్వేదబిందువులు మెరమెరలాడుతున్నవి. అతని సుఖమయనిద్రను చూస్తూ తనలోని ఆదుర్దాను మర్చిపోయింది. ఆ నిద్రలోని హాయిని అంచనాలువేస్తున్నది. సంఘర్షణలమూటలాంటి జీవితానికి నిద్ర లంగరులాంటిదని, బాధలు ఆవేశాలు ఆదుర్దాలు యెలాంటి వయినా, నిద్ర కొంతసమయానికయినా వాటన్నిటికిఅతీతమై, సుఖమయం చేస్తుందని, అందుకే కంటకమయ మానవజీవితానికి నిద్రను సృష్టికర్త లంకెవేసివుంటాడని, వూహిస్తున్నది. నిద్రలోని అతన్ని చూస్తున్న కొంది తెలియనిఆనందం తనకూ కలుగుతున్నది. మంత్రించబడినదాని వలె ప్రక్కగా కూర్చున్నది. అతని లలాటంమీద మెరుస్తున్న స్వేద బిందువులలో తన ప్రతిమలు అనేకంగా కనిపిస్తున్నవి. నొసటిప్రక్క నున్న ఒకబిందువు దొర్లి మరోబిందువుతోకలిసి పెద్దదై నేత్రఫలకాల మీదికి జారింది. అజ్ఞాతంగా ఆమె తనకొంగుతో మృదువుగా ఆ స్వేద బిందువులను అద్దుతున్నది. క్రూరజంతువేదోవచ్చి తనమీదపడినట్లు ఖంగారుపడి చివ్వునలేచాడు. శిరస్సుకు శిరస్సు ఢీకొన్నది. ఆమెనాసిక నుంచి రుధిరం స్రవిస్తున్నది. విజయకుమార్ ఒక్కమాటుగా దిమ్మ పోయి వెలవెలలాడుతూ శిరస్సును సవరించుకుంటూ నేత్రాలు నులుము కుంటూ ఖంగారుతోఆమె రక్తస్రావాన్ని తుడిచివేయ ప్రయత్నిస్తున్నాడు. కాని వూటవలె వూరివస్తున్నది. వెంటనే విజయకుమార్ పరుగెత్తి కొలనునుంచి దోసెడుజలాన్నితెచ్చి బీబీజాన్ముఖంమీద శిరస్సుమీద చల్లి బాగా తుడిచాడు. కానీ స్రావం ఆగక ఖంగారుతో ఆమెశిరస్సును తనహృదయానికేసి అదిమి నిమురుతూ, "ఇక్కడి కెందుకొచ్చావు బీబీ జాన్ ?" అని ప్రశ్నించాడు.

ఆమె సమాధానానికిబదులుగా వడిలోకి వాలిపోయింది. ఆయన మరింతగాబరాపడుతూ "ఏమి జరిగిందో చెప్పు, బీబీజాన్ !" అని గద్దించాడు.

ఆమె దీర్ఘశ్వాసనువిడుస్తూ "యేమీలేదు, నీవు దుఃఖంతో యెటు పోయావోనని ఖంగారుతో వెదుకుతూవచ్చాను" అన్నది. "ఈ పరీక్ష లలో తప్పినందుకు నేనేమయినా అఘాత్యంచేసికూర్చుంటా ననుకుం

న్నారా? నేనంత వెర్రివాడినిగాదు. జీవితాలకు పరీక్షలు గీటురాళ్ళుకావు" అన్నాడు.

తనముఖంమీద చేయివేసి సవరించుకుంటూ "పరీక్షలలో తప్పినందుకు నీకు దుఃఖమేలేదా చెప్పు?" అని దీనంగా అడిగింది. "నీవు తప్పితే తప్పక బాధపడేవాడిని, నేను యీ పరీక్షలలో తప్పినందువలన నష్టమేమీలేదు." అంటూ ఆమెముఖాన్ని పైకిత్రిప్పి పరిశీలనగా చూడ ప్రయత్నించాడు. రుధిరస్రావం ఆగిపోయింది. కాని ఆమెముఖమంతటా నెత్తురుమరకలు కనిపిస్తున్నవి. అంతేగాదు, తనషర్టునిండా రక్తమయింది. స్రావంఆగిపోయినందుకు ఆనందపడుతూ, ఆమెముఖంమీది మరకలను తుడుస్తున్నాడు.

కొలనుదగ్గరకు తీసుకెళ్ళి ఆమెముఖం కడిగించాడు. కాని తన షర్టుమీదిరక్తాన్ని పోగొట్టవీలుగాక "బీబీజాన్, యింట్లోకివెళ్ళి యెవరికీ తెలియకుండా ఒకషర్టు తీసుకురా!" అన్నాడు.

చిన్నబుచ్చుకుంటూ "అమ్మో! అమ్మగారు చూస్తే!" అన్నది. మందహాసంచేస్తూ "పోనీ, యిలాగే వస్తానులే" అంటూ బయలుదేరాడు. అతనిషర్టుపైనున్న రక్తపుమరకలుచూసి తానే బాధపడుతూ "వద్దువద్దు. మీరిక్కడే కూర్చోండి. నేను యెలాగయినా తీసుకొస్తాను" అని బయలుదేరింది.

పరీక్షలలో తప్పిన విజయకుమార్ రెండోసంవత్సరం ప్రయివేటుగా చదువుటకే నిశ్చయించుకున్నాడు. బీబీజాన్‌ను కాలేజీలో చేర్పించాలని యెంతో ప్రయత్నించాడు; తల్లి మలయమతిద్వారా ప్రోత్సాహపరిచాడు. కాని ఆమె అందుకు సమ్మతించలేదు. కారణాలు తెలుపలేదు. మరుసంవత్సరం చేరేందుకు అభయమిచ్చింది.



32

# 6. దానస్వరూపం

ప్రయివేటుగా చదివి పరీక్షలలో హాజరయిన విజయకుమార్ మొదటిరోజే సరళఅపరాధాన్ని అకారణంగా తనసెత్తినపుకుని బహిష్కరింపబడ్డాడు. కాని ఆ విషయం మలయమతికిగాని బీబీజాన్‌కు గాని తెలియకుండా గడిపివేశాడు. తన పరీక్షాఫలితాలు తనకు తెలుసు. ఇంటిలోనివారు యెదురుచూస్తున్నారు.

రెండవమారుకూడా తప్పినట్లు తెలిసినపుడు మలయమతికంటె బీబీజాన్ హద్దులుతెలియని బాధపడింది. విజయకుమార్‌ప్యాసయితే ఆయనతోపాటు తానూ కాలేజీలో చేరవచ్చునని మలయమతి ఆనంద పడుతుందని ఆలోచనలుచేసింది. కాని విధి వక్రించింది. మలయమతి తనకు పెంపుడుతల్లిలాంటిది. తనకు కావలసినవన్ని తను నోరుతెరిచి అడగకుండా జోస్యంతెలిసినదానివలె యిస్తుంటుంది. డబ్బులిచ్చినా, గుడ్డలిచ్చినా లెక్కచూసియిచ్చేఅలవాటు ఆమెకు లేదు. పెట్టెలో చేయి బెట్టి చేతికొచ్చినదాన్ని ప్రసన్నవదనంతో యిస్తుంది. ఓమాటు ఒక్క రూపాయి కావలసి అడిగినపుడు వందరూపాయలనోటు తనచేతిలో పెట్టింది. ఆశ్చర్యపోతూ "ఇది వందరూపాయలనోటు అమ్మగారు!" అని తనుఅన్నపుడు ఆమె మందహాసంచేస్తూ "నా చేతికి అదే వచ్చింది. నీ అదృష్టం బీబీ" అన్నది. తనకేగాదు ఆమె యెవరికయినా అలానే దానంచేస్తుందని గ్రామంలోని కార్మికగూడెం అగ్నికి ఆహుతిఅయినపుడు తెలుసుకున్నది. గూడెంవారికి ఆమెచేసిన అన్నదానం, వస్త్రదానం చూసినపుడు విస్తుపోయింది. దివాణంలోని పెట్టెలను తెరచి విలువైన వస్త్రాలను వివక్షతారహితంగా పంచింది. చేతికివచ్చిన వెయ్యిరూపా యలవిలువగల జరీచీరనైనా యెదుటిచేతిలోపెట్టి పొందినవారి అద

నికిఆనందపడింది. పెట్టెలలోనివన్నీ పంచి ఆత్మతృప్తినిపొందుతున్నపుడు చూసిన ఆ దృశ్యం నేటికీ బీబీజాన్‌నేత్రాలలో మెదులుతుంటుంది.

అలాంటి దాతృత్వంతోనిండిన ఆ మలయమతికి యెంత చిన్న అప్రసన్నవిషయం జరిగినా బీబీజాన్‌మనస్సు చీకాకుచెందుతుంటుంది. ఆమె యేకైకబిడ్డ కుమార్ రెండోమాటుకూడా తప్పినపుడు, యెంత బాధపడుతుందో, యెలా చూడటమా, అనుకున్నది. కాని అందుకు భిన్నంగా జరిగింది. శుష్కనవ్వును ప్రదర్శిస్తూ "అందుకు చింతించినా ప్రయోజనంలేదు, మందలించినా లాభంలేదు. పుట్టెడునూనెలో మునిగినా, చిట్టెడునూనే అంటుతుంది. పొందజాలని యోగ్యతలకొరకు పోరాడుట వెర్రితనమవుతుంది" అన్నది. ఆమాటలు విని బీబీజాన్ నోరుమెదప లేదు. మనస్సు వెలవెలబోయింది. విజయకుమార్‌యెడల క్రోధమూ జనించింది.

విజయకుమార్ యిపుడు చదువువిషయంలో స్వతంత్రుడయి నాడు. తల్లి ఆ ప్రసక్తి తెచ్చుటలేదు. బీబీజాన్‌ముఖంలో యెప్పుడూ క్రోధమేగనిపిస్తున్నది. చెప్పినపని చేసిపెడుతుంది, ముక్తసరి జవాబు లిస్తుంటుంది. ప్రశ్నించటము, సలహాలివ్వటము మానివేసింది. వర్తిపేని చోట బాధ్యతలు వాటంతటవే కలుగుతవి. అదుపులు, మందలింపులు సడలినపుడు జ్ఞానోదయంకలుగుట స్వాభావికం.

విజయకుమార్‌మనస్సులో వో ప్రక్క శూన్యమేర్పడింది కర్తవ్యంవైపు వెదుక్కుంటున్నది మనస్సు. తల్లివున్నవైపునే తిరుగు తుంటాడు. ఆమె మందలించి చదువుకోమనిచెబితే మనస్సుతేలికపడు తుంది. కాని ఆమె అవిషయమే ప్రస్తావించదు. బీబీజాన్‌వైపు తదేకంగా చూస్తుంటాడు. దృష్టిలోదృష్టికలిస్తే ఆనందంలభిస్తుంది. ఆమె దృష్టి యెప్పుడూ పెడముఖంగానే వుంటున్నది.

కాలుగాలిన పిల్లివలె అటూయిటూ తిరిగి, విసిగి తల్లిప్రక్కగా వెళ్ళి "అమ్మా! యిక నేను బాగాచదివి ప్యాసవుతాను" అన్నాడు. ఆమె పక్కవలుకులు సీసాలోవేస్తూ "మంచిది నాయనా!" అని వూరుకున్నది.

తిరిగి మౌనం ఆవరించింది. ఆ జవాబు చాలలేదుగాబోలు పెరటిపైపు వెళ్ళి చీర ఆరవేస్తున్న బీబీజాన్ ముందు నిలిచి "నే నీ సంవత్సరం స్కూల్లో జేరి చదువాలనుకుంటున్నాను. బాగా చదివి ప్యాసవుతాను" అన్నాడు. కాని బీబీజాన్ విననట్లే తనపనిలో నిమగ్నమైవున్నది. అవమానింపబడినవానివలె చిరాకుచెంది "నే నసలు చదువనే చదువను" అని ఆమె ముఖంపైపు తదేకంగా చూస్తున్నాడు. ఆమెలో మార్పులేదు. బావిప్రక్కనున్న దూలంమీద కూర్చుని గచ్చుమీదవేసిన గుడ్డలకు సబ్బుపులుముతున్నది. అభిమానంతో రుసరుసలాడుతున్న విజయకుమార్ అటూయిటూ తిరుగుతూ ఆమెవైపుచూస్తూ పొడవుగావున్న ఆ దూలం రెండో చివర అనాలోచితంగా తన్నాడు. ఆ దూలంమీదనే ఒకచివర కూర్చుని, గుడ్డలకు సబ్బురుద్దుతున్న బీబీజాన్ తల్లక్రిందులుగా పడిపోయి కెవ్వున కేకపెట్టింది. శిరస్సు బావిగోడకుఢీకొని చిట్లింది. రక్తం గచ్చుమీదపడి సరసరధారలుగా ప్రవహిస్తూ తెల్లగా నురుగులతోనున్న సబ్బునీటిలో కలిసి కెంపురంగును సృష్టించింది.

పరువెత్తుకొచ్చిన మలయమతి దృశ్యాన్నిచూసి బీతిలుతూ నోటమాటరాక కంపిస్తున్నశరీరంతో ప్రక్కగావెళ్ళి ఆమెశిరస్సును చేతులలోకితీసుకుని, రుధిరస్రావాన్ని ఆపుటకు గాయంమీద వ్రేలువేసి నొక్కిపడుతున్నది. కాని ఆగుటలేదు. పరివారమంతా జేరి అపుర్దాను ప్రకటిస్తున్నారు. గోడమీదకుపోయి అంత బీభత్సంగా యెందుకు పడిందా అని వారిలోవారే ప్రశ్నించుకుంటున్నారు. బీబీజాన్‌కు సపర్యలుచేస్తున్నవారందరిచేతులు రక్తరంజితమైనవి. మలయమతిచీరెనుంచికూడా రక్తబిందువులు రాలుతున్నవి. బీబీజాన్ మూలుగుతూ బాధను వ్యక్తం చేస్తున్నది.

దూరంగావుండి యీ దుస్సంఘటనను తిలకిస్తున్న విజయకుమార్‌కు కంఠంలో తడిఆరిపోతున్నది. హృదయం దడదడలాడిపోతున్నది. ఎంత కూడదీసుకున్నా శరీరంకంపిస్తున్నది. తెలియకుండా తానుచేసిన యీ దుష్టకార్యానికి తానేమి సమాధానమివ్వాలాయని వేయి విధాల ఆలోచిస్తున్నాడు. కాని మనస్సుకు నిలకడచిక్కుటలేదు.

"అలా చూస్తూ నిలుచున్నావేమిటి విజయా? పోయి డాక్టరు గారిని పిలుచుకురా!" అని ఆజ్ఞాపించింది. అతనిమనస్సులోని భారం కొంతతగ్గింది. సరసర వెళ్ళిపోయాడు.

డాక్టర్లు రోగాలకు కారణాలుతెలుసుకో ప్రయత్నిస్తారుగాని, తగిలినగాయాలకు కారణాలు విచారించరు. గాయాలకు మందులువేసి కట్టులుకట్టుటే వారికి అలవాటు. డాక్టరు హరినారాయణ టించరార్నికా తడిపినదూదితో రుధిరాన్ని తుడిచి బాండేజికట్టి గ్లూకోస్ త్రాగించమని సలహాయిచ్చి వెళ్ళిపోయాడు.

బీబీజాన్ యిపుడు నేత్రాలుతెరచి చూస్తున్నది. తన వెక్కడ చూసిపోతుందోనని భయకంపితుడై వెనక్కు జరుగుతున్నాడు విజయ.

"అంత అవ్యక్తంగా యెలా పడిపోయావు బీబీ" అని ప్రశ్నించింది మలయమతి.

ఈ ప్రశ్న తనను కొరడాతో కొట్టినట్లున్నది విజయ్‌కు. అంత బాధలోవుండికూడా బీబీజాన్‌నేత్రాలు యెవరికొరకో వెదకివేసా[illegible]తున్నవి.

"పడిపోవటానికికూడా సంకల్పముంటుందా అమ్మగారు? [illegible]లు జారిపడిపోయాను" అన్నది.

"కాలుజారితే యింత దెబ్బతగలవలసినపనిగాదు...." [illegible]ంటూ మలయమతి ఆలోచిస్తున్నది.

ఆపదలోనుంచి బయటపడినవానివలె విజయ్‌మనస్[illegible] తేలిక పడింది. కాని మరోవైపునుంచి తానుచేసిన అనాలోచిత అ[illegible]హాయిత్యానికి పరితాపంకలుగుతున్నది. బీబీజాన్ యదార్థం యెందుకు చెప్పలేదు. తనను యెందుకు విడిచిపెట్టింది, అనే మీమాంస అతనిని బాధిస్తున్న[illegible]

మలయమతి బాధపడుతున్నమనిషిని చూడలేదు. [illegible]రంగాపోయి వుండనూలేదు. ఆ యింటిలో యెవరు జబ్బుపడినా వారిక[illegible] [illegible]లయమతి [illegible]మనస్సే బాధకుగురవుతుంది. దేవిడీహాలులోనే ప[illegible]హేయించి పీపె

జాన్‌కు తానే సేవజేస్తున్నది. శిరస్సుమీద తగిలినగాయం పెద్దదయినం దున మరునాడు పెంపరేచరువుంది.

వారంరోజులు గడిచిపోయినవి. డాక్టరు నిత్యము వచ్చిపోతు తున్నాడు. కాని, జ్వరం తగ్గుముఖంకాలేదు. గాయం నొప్పిజేసి బీబీజాన్ బాధతో మూలుగుతున్నది. "నీవు దగ్గరుండి చూడగూడదూ !" అంటాడు ఖాసిం భార్యతో. "అమ్మగారు యెప్పుడూ పిల్లదగ్గిరేవుంటుంటే నేనెలా అక్కడ కూర్చోగలను చెప్పు" అంటుంది భార్య ఫాత్మాబి.



# 7. చరమస్థాయిలోని దుఃఖము, ఆనందము

సంధ్యాసమయమది. మలయమతి స్నానాదులుముగించుకుని దేవునిగదిలో ప్రవేశించింది. ఊదువత్తుల ధూమ్రం ఘుమాళిస్తున్నది. అరగంటలో పూజముగిస్తుండేది. ప్రస్తుతం పూజాసమయం నాలుగురెట్లు పెరిగిపోయింది. బీబీజాన్‌కు త్వరగా నయంగావాలని భగవంతుని అధికంగా ప్రార్థిస్తున్నదిగాబోలు. అయినా ఆ మహమ్మదీయబాలికవిషయంలో హిందూదేవుడు యేమిచేయుటకయినా అధికారశక్తివున్నదో లేదో యెవరికీ తెలియదు. దేవునిఘంటారావంతో విజయకుమార్‌కు మెలకువవచ్చింది.

ఆ నిశ్శబ్దవాతావరణాన్ని భగ్నంచేస్తున్న ఘంటానినాదం అతనికేదో జ్ఞానసందేశాన్నిచ్చినట్లు సరసర హాలులోకివెళ్ళి బీబీజాన్‌శయ్య ప్రక్కన నిలిచాడు. ఆమె ప్రక్కకుతిరిగి పడుకుని ఆయాసపడుతున్నది. విజయ్ రెండోవైపువెళ్ళి ముఖంలోముఖంపెట్టి చూస్తున్నాడు. ఆమె నేత్రాలు తెరచివున్నవి. లలాటంమీద చేయివేశాడు. ఆ చేతిమీద చేయివేసి నిముడుతూ దీర్ఘశ్వాసను విడచింది.

"అబ్బ! జ్వరం మండిపోతున్నది బీబీజాన్" అన్నాడు. "అసలు జ్వరం వేడిగానేవుండి అశాంతినికల్పిస్తుంది. మీచేయి యెంత చల్లగావుందో చూడండి! చల్లదనంలో నిర్మలమైన శాంతివుంటుంది." అన్నది.

ఆమాటలోని అంతరార్థమేమిటో అర్థంగాక "నాచేయి చల్లగుండొచ్చు కాని నాలో శాంతి, నిర్మలత్వం మచ్చుకుగూడాలేదుగదా!" అన్నాడు.

మ్లానముద్రితమైన ఆమెముఖంలో తేటకిరణాలు పొడసూపి అల్లుకుంటున్నవి. నవ్వును ప్రదర్శింప ప్రయత్నిస్తున్నది. కాని తేలిపోతున్నది. ఆయన అరచేతిని తనకపోలంమీదవేసి అదుముకుంటూ "నీ మనస్సులో అశాంతి యెందుకున్నది? ఇన్నిరోజులనుంచి నేను యింత ఆపదలోవున్నా ఒక్కమాటైనా పలుకరించలేదెందుకని?" అని ప్రశ్నించింది.

ఉత్సాహితుడై "నా మనస్సేకారణంతో బాధపడుతున్నదో ఆ కారణంతోనే నిన్ను పలుకరించనుకూడా సాహసించలేకపోయాను" అన్నాడు.

"ఆ కారణమేమిటో కాస్త నాచెవినివేయి విజయ్!" అన్నది.

"నీవు కాలుజారిపడ్డానని యెందుకు చెప్పావు?"

"జారిపడ్డానుగనుక."

"ఒకరిరక్షణకొరకు అబద్ధమాడవచ్చు. అకారణంగా అబద్ధమాడటమెందుకు?"

"ఒకరిమనస్సును మెప్పించే నిజంకంటె దాన్ని తప్పించే అబద్ధమే ధర్మమైంది విజయ్‌బాబు."

వెంటనే ఆయనకు పరీక్షలనాటివిషయం గుర్తుకొచ్చింది. తనకు తెలియని ఒకవిద్యార్ధినిఅపరాధాన్ని క్షణంలో తనపైత్తిన రుద్దుకున్నాడు. కాని అది తాను పెద్దఆలోచనతో చేసినపనిగాదు. ఆక్షణంలో అంతరంగప్రేరణలోని వుత్సాహంద్వారా ఆ కార్యాన్ని ముగించి కళంకం పులుముకుని బహిష్కృతుడై వచ్చివేశాడు. ఆ విషయాన్ని మధ్యంగానే వుంచి తాను పరీక్షలలో తప్పినట్లుగా తల్లిముందు నిలిచాడు. ఆ విద్యార్ధిని యెవరో; తప్పిందో ప్యాసయిందో, యెక్కడుందో యేమిచేస్తుందో సని మనస్సులో ఆలోచనదొర్లింది. బల్లముందు దీనంగా నిలిచి పరీక్షాధికారి దూషణలనువింటున్న దృశ్యం కనులముందు కనిపించినట్లయింది.

ఆయనవిస్తబ్దతను జూచి, తానేదో పొరపాటుచేసినట్లు చిన్నబోతూ "నావల్ల పొరపాటుజరిగితే క్షమించు విజయ్‌బాబు" అన్నది.

నిద్రనుంచి మేల్కొన్నవానివలె తత్తరపాటుతో ఆమె కుడి హస్తాన్ని చేతులలోకితీసుకుని హృదయంమీదవేసి అదుముకుంటూ "నీవుచేసింది పొరపాటుగాదు. త్యాగము, హృదయపు అంతస్తుకు గీటు రాయివంటిది. బాల్యంనుంచి కలిసిమెలిసివున్నా తెలియని నీ హృదయ సౌకుమార్య నిజస్వరూపాన్ని నేడర్థంచేసుకున్నందుకు ఆనందపడు తున్నాను. నేను చిరాకుతో చేసిన చిలిపిపనిద్వారా నీకింత ఆపత్తి జరుగు తుందని అనుకోలేదు." అంటుండగా ఆమెనేత్రాలు జలభరితమైనవి.

"కన్నీరుపెడతావెందుకు పిచ్చిదానా!" అంటూ ద్వితీయహస్తంలో ఆమె చుబుకాన్నిబట్టి వూపాడు. ఆత్మీయత పెల్లుబికినపుడు యేడ్పు బయల్పడుతుంది. చరమస్థాయికివెళ్ళిన భక్తికి, ప్రేమకు తానం యేక రూపమయినట్లు చరమస్థాయికిచెందిన ఆనందము దుఃఖము ఒకే తానం పొందుతవి. అది మానవస్వభావం. విజయ్ చూపుతున్న సానుభూతి, ఆదరము ఆమెఅంతరాళములో మేఘాలకు శీతలపవనాలుచుట్టినట్లు, మృదువుగా సోకినవిగాబోలు. అధరాలు అదురుతున్నవి. ఆ దృశ్యం విజయ్‌ను చలింపజేసింది. అది అనురాగంలోని ఆప్యాయతగావచ్చు, ఆ దుర్బలశరీరంమీదికి వాలిపోయి ఆమెఅధరాలమీద చుంబించాడు. మధూటిక చిన్నిపుష్పంమీద వాలినపుడు భారాన్ని ఆపజాలక అటూ యిటూ అల్లల్లాడి బ్యాలన్సుచేసుకొనునట్లు బీబీజాన్ నిశ్చలరూపంలో వుండిపోయింది.

బీబీజాన్‌జ్వరం వెనుకాడప్రారంభించింది. మలయమతి మంద లింపులవలన యింకా శయ్యమీదనేవుంటున్నది.కాని బయట బాగా తిరుగ గలనని ఆమెఅభిప్రాయం. మలయమతి వుండని సమయంకొరకు విజయ్ కాపువేస్తున్నాడు. బీబీజాన్‌మనస్సుకూడా అతనికొరకు ఆరాట పడుతుంటుంది. అతనున్నంతసేపు కిలకిలలాడుతూ అతనిమాటలను శ్రద్ధతో ఆలకిస్తుంటుంది.

ఆమె యెంత మందలిస్తున్నా వినకుండా ప్రక్కనగూర్చుని చేతి వ్రేళ్ళనులాగుతూ "నీవు, అమ్మ నాయెడల అంత విముఖతవహించా రెందుకని ?" అన్నాడు.

చిరునగవును చిందిస్తూ "అవి యీ లోకంలో జరుగనివి. మీ భ్రమ మాత్రమే" అన్నది.

"మీరు చేసిన దాయికాట్‌తో బాధచెందుతూ, మనస్సును స్థిరం చేసుకుని శ్రద్ధగా చదువనిశ్చయించి, మీముందు చెప్పినపుడు, ఒక్కరూ సానుభూతిచూపరెందుకు?" అని ప్రశ్నించాడు.

"కోరి పొందేసానుభూతిలో సాంత్వనకలుగదు విజయ్‌బాబూ" అని చిలిపిగా నవ్వింది.

"ఆ వ్యంగ్యఫలితంగానే యింత ప్రమాదమైన దెబ్బతిన్నావు" అన్నాడు.

"ఇవే జీవితానికి మధురత్వానిచ్చే సంఘటనలు" అన్నది.

"ప్రతిదానికి భావార్థాన్నికల్పించి శృంగారాన్ని సృష్టించవచ్చు. కాని యదార్థం అందుకు భిన్నంగావుంటుంది. దుస్సంఘటనలు అనుభవించుటలో హృదయం వుడికిపోతుంది. కాలందొర్లినతరువాతయినా వాటిమచ్చలు మనస్సులో మెదిలినపుడు హృదయం కంపిస్తుంది. శరీరం గగుర్పాటుచెందుతుంది —" అంటుండగా మందహాసంచేస్తూ అతని షర్టుబటనును అటూయిటూ త్రిప్పుతూ ఎంత విచిత్రమైనవాడివి! సుఖాన్ని దూరంగానెట్టి కష్టాన్ని కవుగలించుకునే స్వభావం నీది. కాని నావిషయంలో నీవు అర్భకుడివైనట్లు, పిరికివాడివైనట్లు మాట్లాడుతున్నావు. విషాదంతో వికాసంజనిస్తుంది. దుఃఖంలోని అనుభవం అమూల్యమైంది. దుఃఖము, భయము మానవమస్తిష్కాన్ని వృద్ధిజేస్తాయి. సుఖం మనిషిని దుర్బలునిగాజేసి అసమర్థునిగా రూపొందిస్తుంది. గతించినసుఖాన్ని స్తుతించుకొనుటకంటె దురవస్థలను దుఃఖాలను వివరించుకొనుటలోనే ఆత్మగర్వం అనుభవమవుతుంది. శరీరంమీద గతించినదుఃఖాలతాలూకు మిగిలినచిహ్నాలు యోగ్యతను చాటుతవి. కనుక అవాంఛనీయమైనవి గావు" అన్నది.

బరువైనకంఠంతో "కొన్ని వేళలందు ధైర్యంలో అధైర్యము, అధైర్యంలో ధైర్యము కలుగుట ప్రకృతివైచిత్ర్యము. వివక్షతాజ్ఞానం

యెక్కువగావున్నచోట అధైర్యమే ప్రదర్శితమవుతుంది. స్వవిషయంలో వున్న నిర్లక్ష్యం పరులవిషయంలో వుండగలదని చెప్పలేము. నేను చేసిన అనాలోచిత అల్పవ్యవహారానికి నీవు యిన్నిరోజులుగా బాధపడు తున్నందుకు నేను వ్యాకులపడుటలో వింతయేముంది చెప్పు ?" అన్నాడు.

"ఒక్కరోజులోనే మన సర్వశాస్త్రవేత్తవుకాబోకు. నీవు మహా నిర్లక్ష్యివి, సాహసివి అని నాకు తెలుసు. ధైర్యము, అధైర్యము, పిరికి తనము స్వ, పర అనే ఆలోచనలతో వుండుసదిగాదు. అది హృదయ స్వభావంలోని ఒకఅంశం. అది మనస్సుకు అధీనమైందిగాదు...." అంటుండగా విజయ్‌ముఖం క్రోధచిహ్నాలతో అలుముకున్నది. వేడి శ్వాసను విడుస్తూ చివ్వున లేచి నిలిచాడు.

పురుషముఖకవళికల పరిభాషను చదువగల నైపుణ్యం స్త్రీకెక్కువ వుంటుంది. వెంటనే అతనిహస్తాన్నిబట్టి లాగి కూర్చోబెట్టప్రయత్నిం చింది బీబీజాన్. కాని కఠినత్వంతో ఆమెచేతిని విదిలించుకుని బయటి వైపు నడుస్తున్నాడు. అతనినేత్రాలు రక్తరంజితమై మెరుస్తున్నవి. ఆమె హతాశురాలై ఖిన్నవదనంతో "ఒక్కమాట వినండి విజయ్ బాబు. మీరు కోపంలో వెళితే ఆతరువాత నన్ను యెన్నటికీ చూడలేరు. ఒక్కమాట వినిపొమ్మని ప్రార్థిస్తున్నాను" అన్నది. అతనిమనస్సు ద్వంద్వంలో పడిపోయిందిగాబోలు ఆగిపోయాడు. ఆమెవైపు చూసి నపుడు కరుణ పొర్లింది. వెంటనే దగ్గరగావెళ్ళి "ఏమిటి?" అని గంభీర ధ్వనిలో ప్రశ్నించాడు.

భయభీతురాలై బెదిరినదానివలె అతనివంకచూస్తూ మంచంమీద నుంచి జారి ఆయనపాదాలమీద వాలిపోయింది. మార్కండేయులు ఆపదలో దేవతామూర్తిని కవుగలించుకున్నట్లు ఆయనపాదాలను చుట్టి వేసింది.

"నీ మనస్సును నొప్పించుట నా అభిమతంగాదు. నిన్ను సుఖంగా చూడాలని నేను రేయింబవలు కలలుకంటుంటాను. నామాటలతో నిన్ను

కృంగదీయుట నా దురదృష్టం. పిరికితనము, అధైర్యము నీకు తెలియనివి. కాని నాసందర్భంలో నీమనస్సు కళవళపడుతున్నట్లు నాకు తెలుసు. అలాంటిచోట కారణాలుతెలుసుకొను స్త్రీమనస్సు వేగిరపడుట సహజము. అందుకు చనువుతో సరసంగా అన్నానుదప్ప నిన్ను శంకించిగాదు విజయ్‌బాబు. నా శరీరంలోని ప్రతిఅణువు నీదాస్యాన్ని వాంఛిస్తుంటుంది....” అంటుండగా కంఠంబుసవెక్కి పెగలక నేత్రాల గుండా జలం బొటబొటకారుతున్నది.

విజయకుమార్ ఆమెను లేవనెత్తి కవుగిటిలోబిగిస్తూ కపోలం మీద చుంబించాడు. అధరాలకుతగిలిన అశ్రువులలోని వుప్పదనం అమృతంగా అనుభవమైంది.

పూజాగదికవాటాలు కిర్రుమన్నవి. గాబరాతో ఆమెను పక్కమీద పరుండబెట్టి పలాయనమయ్యాడు విజయ్.

మూడవసారి పరీక్షలకని పాఠశాలలోజేరిన విజయ్ పట్టుదలతో చదువుతున్నాడు. పిట్టలవనంలో వటవృక్షంక్రిందవున్న అరుగుమీద కూర్చుని పాఠాలుచదువుకుంటుంటే పావురాలు చుట్టూజేరి ఆడుకుంటున్నా, చాచిన తనపాదాలమీదికి యెక్కుతున్నా, మయూరాలుచేరి శ్రోతలవలె వుండివుండి పింఛాలను ఝళిపించి నృత్యంసలుపుతున్నా, తనధ్యానాన్ని భగ్నంకానీయకుండా చదువుతున్నాడు విజయ్. తనతల్లిలోని సరళత్వంతోపాటు గంభీరతకూడా తనకు తెలుసు.చదివి పాసయి తల్లికి విశ్వాసాన్నికల్పించి ఆమెలోని వుదాసీనతను నిర్మూలించాలని అతనిపట్టుదల.



# 8. మహిళామండలి

సరళ తిరిగి పాఠశాలలో ప్రవేశించి చదువుతున్నది. రవి ప్రసాద్ తనస్థానాన్ని తాను తిరిగిపొందాడు. ఆ బల్లమీదే సరళప్రక్కనే యథావిధిగా వుంటున్నాడు. క్రొత్తగాజేరిన విద్యార్థులు వీరిరువురి సన్నిహిత్వాన్నిగురించి గుసగుసలుగా చెవుల్లోచెప్పుకోవటం కొన్నాళ్ళవరకు జరిగింది. సరళనుగురించి అందరూ అతితేలిగ్గా భావిస్తారు. నిందిస్తారు కాని, యెదుట కనిపించినపుడు అన్నిటిని విస్మరించి దేవకన్యగా భావించి మైమరచి చూస్తుంటారు. ఆమెనుగురించిన అపవాదులు చిత్ర విచిత్రంగా ప్రచారమైనవి. కాని అవి తలిదండ్రులకు చేరలేదు. స్త్రీని గురించిన అవినీతి యెంత తొందరగా బయటఅల్లుకుపోతుందో అంత ఆలస్యంగా ఆ కుటుంబానికి తెలుస్తుంది.

రవిప్రసాద్ ప్రక్కనుంచి వచ్చు వ్యంగ్యబాణాలను స్వీకరించటలో ప్రారంభంలో కలవరపడి సరళకు దూరంగావుండాలని ప్రయత్నించేవాడు. కాని అతనికి తెలియనిశక్తి అతన్ని ఆవైపుకే నెట్టుకెళుతుంటుంది. ఆమెసమక్షంలో వున్నంతసేపు యీప్రపంచంలో సర్వం మర్చిపోయి ఆత్మానందాన్ని పొందుతుంటాడు. పరిచయంనుంచి స్నేహము, ఆతరువాత ఘనిష్టత. అతిచనువుకలిగినా యెక్కువమంది యెదుట చూస్తూ మాట్లాడించు అలవాటులేదు. ఆమె యెంత నవ్వుతూ యేవిషయాన్ని చెప్పినా ఆతడు అధోముఖంచేసి, సిగ్గుదొంతరలమధ్య జవాబుయిస్తుంటాడు.కాని కోరచూపులతో అందరనిమించి ఆమెఅందాన్ని నేత్రాలలో నింపుకుంటుంటాడు.

ప్రభాతసమయమది. బాలభాస్కరుడు నీలిమబ్బులమీద అరుణ రంగులను పులుముతున్నాడు. పట్టణవీధుల్లో పాలసొసైటీవారిబళ్ళు పరువులెడుతున్నవి. ఫ్యాక్టరీలకూతలు రాగాన్నికలుపుకుంటున్నవి. పోలీసుస్టేషనులో గంటకొడుతున్నారు. రేడియోలో వార్తలుముగించి

నాగస్వరంప్రారంభమైంది. రాత్రులంతా పయనించిన రైళ్ళు రైల్వే జంక్షన్ చేరుకుంటున్నవి. తలవనితలంపుగా మహిళలుకొందరు బజార్లవెంట వూరేగుతున్నారు. ఆగంతుకులు పదిమందిస్త్రీలేఅయినా వుల్లాసంకొరకు వెంటబడిన పసివారిసంఖ్య అధికంగావుంది. కదన రంగానికిబోవు సైనికులవలె చంకకు సంచులనుతగిలించుకుని వీరో చితంగా అడుగులువేస్తున్నారు, "మహిళామండలి — జిందాబాద్, మహిళలహక్కులు — రక్షింపబడాలి. మహిళాదాస్యం — నిర్మూలం కావాలి" అని నినాదాలుచేస్తున్నారు. పాటలుకూడా పాడుతున్నారు. తెల్లవారుసరికి వీరు యెక్కడినుంచి వచ్చారు. యెందునిమిత్తం యీ ఆర్భాటంచేస్తున్నారు, అనే ప్రశ్నలువేసుకుంటూ యెవరికివారే ఆశ్చర్య పోతున్నారు. వారి నినాదాలుకూడా యెవరినీ ఆకర్షించుటలేదు. చూస్తున్న స్త్రీలలో యెవరికీ సానుభూతికలుగుటలేదు.

రాజ్యలక్ష్మి మహిళానాయకురాలు. ఈ వుద్యమంలో 15 సంవత్స రాల అవిరళకృషిసలిపి నాయకత్వం సంపాదించింది. తనభర్త గుర్రు పెట్టి నిద్రపోతాడుగనుక తననిద్రకు శాంతికి భంగంకలుగుతున్నదనే అభియోగంతో భర్తనుంచి విముక్తిపొంది, ఆయనఆస్తిలో సగభాగం తనహక్కుగా పోరాడి పొంది, స్వేచ్ఛామహిళామణిగా ముద్రవేసుకుని యీవుద్యమాన్ని ప్రారంభించింది. భర్తలను త్యజించిన పదిమందియువ తులు తనశిష్యురాండ్రుగా దొరుకుట గొప్ప విజయసూచకంగానే చెప్ప వచ్చు. కాని వీరికి స్త్రీలనుంచి చందాలు యెన్నడూ లభ్యమైనట్లులేదు. వీరి భావప్రచారార్థం 'మహిళాలోకం' అనే పక్షపత్రికను నడుపు తున్నారు. వీరి వుద్యమానికి కావలసినవ్యయమంతా పురుషులనుంచే లభ్యమవుతుంటుంది. తమనుంచే చందాలుసేకరించి సభలుజేసి పురుష జాతినే కసాయిజాతిగా చిత్రవిచిత్రంగా వారు చిత్రిస్తున్నపుడు, వినే వారు తోలుబొమ్మలాటను చూసి మనోరంజనంపొందునట్లు, ఆనందపడు తుంటారు.

ఆరోజుసాయంకాలం హైస్కూల్‌మైదానంలో మహిళామండలి వారి మహాసభ యేర్పాటుచేయబడింది. మాజీఛైర్‌మన్ గారి సహకారం

లభించింది మండలివారికి. చందాడబ్బాలు చేతబట్టి బజార్లలో విరివిగా వసూలుచేశారు. వారు వెళ్ళినవైపు రాకపోకలు బందవుతున్నవి. అందాలుచిందించేవనితలు ఒక్కమారుగా పదిమంది రోడ్డుమీదచేరి, మృదుమధురరూపమందహాసా లొలికిస్తూ వచ్చేపోయేయువకులనడ్డగించి హస్తాలుబట్టి అర్థిస్తుంటే, మంత్రించినట్లు మయకంలోబడి జేబులలో వున్నముత్తాలను అర్పించివెళుతున్నారు. ఎంత విచిత్రం! ఎవరిని దూషిస్తున్నారో, ఎవరిమీద కసిగట్టి కత్తిబట్టి పోరాటంసలుపుతున్నారో ఆ పురుషజాతినుంచే వసూలుజేస్తున్నారు. వారినుంచే ఆదరంపొందు తున్నారు. తమ స్త్రీజాతి తమ కార్యకలాపాలను, పోకడలనుచూసి విస్తు పోతున్నారు, హేయపడుతున్నారు. తమలోని ప్రతిఒక్కరినిగురించి గుసగుసలుగా చెప్పుకుంటున్నారు.

సభ ప్రార్థనాగీతికతో ప్రారంభమైంది. దేవతావస్త్రాలు ధరించి శృంగారించుకున్న మహిళాబృందం వేదికమీద, దేవేంద్రునిసభలోని రంభలవలె, ఆసీనులైయున్నారు. రాజ్యలక్ష్మి, మాజీ ఛైర్‌మన్, తనను నిందించినభర్తను పీటకచ్చతో చావమోదినఫలితంగా 12 సంవత్సరాలు కారాగారమనుభవించివచ్చి, సాంఘిక రాజకీయ కార్యకలాపాలలో నిమగ్నమై శాసనసభాఎన్నికలలో నిలిచి, డిపాజిట్టునుకోల్పోయిన సుమతీ దేవి, వరుసగా కుర్చీలలో కూర్చున్నారు. సుమతీదేవిలాంటి సుగుణ సంపన్నురాలు అనుభవజ్ఞురాలు ఇకమీదట తనమహిళామండలికొరకే పాటుబడనిశ్చయించుకున్నట్లు తెలిపినందుకు రాజ్యలక్ష్మి విజయోత్సాహంలో పొంగిపోతున్నది. సినిమాతారలను చూడవచ్చినట్లు పట్టణం లోని యువకబృందమంతా కదిలివచ్చి ప్రేక్షకస్థానాన్నందుకున్నారు. పాఠశాలమైదానంలో జరుగుతున్నందున విద్యార్థులంతా ప్రేక్షకమైదానంలో నిలిచిపోయారు.

వేదికమీదనున్న మండలిలోని పారిజాతం దూరంనుంచే సరళను గుర్తించిందిగాబోలు, వెనుకవైపునుంచి బయటకునడిచి, ప్రక్కప్రక్కగా వచ్చి సరళను కవుగలించుకున్నది. సరళ ఆనందంతో పులకితమవుతూ

ప్రశ్నలవర్షం ప్రారంభించింది. "ఆ విషయాలన్నీ తరువాత మాటాడుకుందాము, రా" అంటూ చేయిబట్టి లాక్కెళ్ళింది. ప్రక్కనున్న రవిప్రసాద్ వెలవెలబోతూ చూస్తున్నాడు. సరళ మండలివారిలోకలిసి వేదికమీద కూర్చున్నది. మరో నూతనవస్తువునుపొందినట్లు మండలివారంతా గుసగుసలతో ఆనందాన్ని పంచుకుంటున్నారు.

రాజ్యలక్ష్మి తన 15 సంవత్సరాల వక్తృత్వానుభవాన్ని గొప్పగా సాధించింది. మనస్సులోని అభిప్రాయాలమీద అనర్గళంగా మాటాడగలదు. జీవితంలోని రెండుజాములను దాటవేసి మూడోపడిలో పయనిస్తున్నది. కంఠధ్వనిలోని తీయదనంకూడా నశించింది. జనాకర్షణకు కావలసినవన్నీ అదృశ్యమైనవి. అందుకే అవుసరమైనట్రూపును తయారుచేసింది. పురుషుడు యెంతటివాడయినా అందమయినస్త్రీముందు పరాజయంపొందుతాడు. ఆ పరమసత్యాన్ని అర్ధంచేసుకున్నదిగనుకనే రాజ్యలక్ష్మి మార్గంలేనివైపు అడుగులువేస్తూ ఆశ్రయాన్నిపొందుతున్నది.

కులమతాలు, కలిమిలేములు మానవనిర్మితాలని, వీటిసంబంధవర్గపోరాటాలు నిమిత్తమాత్రమైనవని, స్త్రీపురుషజాతులు రెండే శాశ్వతమైనవి ప్రకృతిసిద్ధమైనవియని, యుగయుగాలుగా పురుషజాతి స్త్రీజాతిని అన్నివైపులనుంచి ఏడిపిస్తూ అబలలనుజేసి శాశ్వతబానిసలుగా చేసుకున్నారని, స్త్రీమనస్సును బానిసభావాలతో నింపివేసి, నెత్తినజేరి, చేస్తున్న అఘాయిత్యాలు అనంతమైనవని, అధోగతికిజేరి బానిసత్వానికిఅలవడిన స్త్రీజాతివుద్ధరణ సామరస్యపోరాటంద్వారా నెరవేరజాలదని, స్త్రీజాతి తెంపుజేసి తెగబడి పోరాటానిదిగిగిననాడే వ్యక్తిత్వంపొంది సమానసమర్ధులుకాగలరని — మొదలగువిషయాలతో అనర్గళంగా వుపన్యసిస్తున్నది రాజ్యలక్ష్మి. చెప్తున్నకొందీ వుద్రేకం పెరిగిపోతున్నది. ఈ పదిహేనుసంవత్సరాలనుంచి ఆమె యిస్తున్న వుపన్యాసం అదేగాబోలు. కాని. దురదృష్టవశాత్తు ప్రేక్షకులంతా పురుషులే. అయినా ఆ పురుషులలోని యేఒక్కరిని ఆమెఉపన్యాసం రెచ్చగొట్టలేకపోతున్నది. డ్రామాలోని ఒకపాత్ర పోర్షన్ విన్నట్లు వింటున్నారు.

విశ్వనాథం వుపన్యాసంమధ్యలో లేచి "మీవుద్దేశ్యం పురుషు లనబడేవారు యీలోకంలో వుండగూడదనా?" అని ప్రశ్నించాడు. రాజ్యలక్ష్మి మందహాసంచేస్తూ, గొప్ప వుదారస్వభావివలె "అంత స్వార్థం మా స్త్రీజాతిలో లేదు. పురుషజాతిని తరతరాలుగా చేస్తూ వచ్చిన అధికారాన్ని వదులుకోమంటున్నాము. పెత్తనాన్నిమానుకుని సమానముతో సామరస్యంగా బ్రతుకమంటున్నాము" అన్నది.

వ్యంగ్యంతోగూడిన క్రోధాన్నిప్రకటిస్తూ "మీవలె స్వేచ్ఛాజీవి తాన్నిపొంది, పురుషులను ద్వేషిస్తూ, అధికారాలను పెత్తనాలను హస్త గతంచేసుకుని చెలాయించుటకు స్త్రీలోకం యిష్టపడుతుందో లేదో కాస్త మీరు విచారించారా?" అని ప్రశ్నించాడు.

ఆమెకు చిరాకుకలిగింది. క్రోధాన్ని తీక్షణంచేసి "అనుభవంలేని అప్రస్తుతవిషయాలను చర్చకుతేకండి. మహిళాలోక వికాసానికి పది హేనుసంవత్సరాలనుంచి విరామంలేని కృషిసలుపుతున్నాను. స్త్రీజాతి లోని యేఒక్కరూ నా అభిప్రాయాలను విమర్శించలేరు. పురుషులనుంచి కూడా నా కనేకవిధాల సహకారంలభిస్తున్నది—"అంటుండగా ప్రేక్షకు లలో అలజడిబైలుదేరింది.

ఒక్కరోజులో మండలివారికి మూడువేలచిల్లర వసూలయినట్లు తేలింది. వసూలయినమొత్తం పెద్దదే. కాని తనను సభలో ఒక సామాన్యయువకుడు యెదురుప్రశ్నలువేసినందుకు బాధపడుతున్నది. ఆమె యెవరితోనూ యేమీమాటాడుటలేదు. ముఖం మలినరేఖలతోనిండి దీర్ఘఆలోచనలోవున్నట్లు తోస్తున్నది.

పారిజాతం సభసమాప్తంకాకముందే సరళతో బయలుదేరి పార్కుకువెళ్ళింది. ఆమె సరళకు మాతామహులతరఫు దూరబంధువు. యెన్నెన్నో విషయాలు మాట్లాడుకున్నారు. పారిజాతం తమమండలిని గురించి వేనోళ్ళపొగడి ప్రభావాన్ని సరళమనస్సులో నాటింది. సరళ మాట కాదనలేక అతిథిగా ఆమెననుసరించింది పారిజాతం.

బహిరంగసభలో బాగా ప్రశ్నించినందుకు విశ్వనాథాన్ని అనేక

మంది స్తుతించారు. ఇంకా యేమేమి అడిగితే బాగుండేదో తమసదభి ప్రాయాలనుకూడా వివరించారు. విశ్వనాధాని కిది మరింత వుత్సాహాన్ని గల్గించింది. తాను యింకా దృఢంగా యెదుర్కొనందు కిపుడు చింత గలుగుతున్నది. వారి మనోల్లాసంలో పాల్గొజాలకనో వ్యంగ్యభావం తోనో అంతవరకు మౌనంగావున్న రఘునాద్ తనమౌనాన్ని భగ్నం చేస్తూ "విఘ్నం యోగ్యకారణంకాజాలదు. అతిసులువైనపని. నిర్మాణం యోగ్యమైంది, దుర్లభమైంది. సభలో నాలుగుమాటలు అడిగినంత మాత్రాన యదార్ధఘనత లభించదు" అని చిన్ననవ్వును ప్రదర్శిస్తూ అన్నాడు.

విశ్వనాధం క్రోధాన్నభినయిస్తూ "దుష్టగ్రహాలు వేదికలమీద నిలిచి అపభ్రంశాలువల్లిస్తుంటే, వినయవిధేయతలతో శిరస్సువంచి విని ఆనందించుట ఆత్మగౌరవలక్షణమా రఘునాధ్‌గారూ?" అన్నాడు.

"దేవతావిగ్రహాన్నిచూసి బొమ్మగానో, బూచిగానో భ్రమలో కలవరపడుట అల్పత్వమవుతుంది. సంఘసంస్కర్తలను సంఘోద్ధారకు లను అర్ధంచేసుకోగల బుద్ధికుశలత అందరిలోను అవతరించదు" అన్నాడు.

పట్టజాలని ఆవేశంతో "నీలాంటి విచిత్రవ్యక్తులు కొందరైనా వుండబట్టే అలాంటి వితండవాదాలతో వుద్యమాలుసాగుతున్నవి" అన్నాడు.

రఘునాధ్ తిరిగి నవ్వుముఖంతో "నారీలోకానికి పురుషులతో సమానప్రతిపత్తి ప్రతివిషయంలోను కావాలంటూ పోరాటంసలుపు తున్నది. స్త్రీహక్కులపోరాటంలో కంకణబద్ధురాలై తనస్వార్ధాలను త్యజించిన ఆదర్శమహిళ. ఆమెశక్తితో విరాట్‌రూప వుద్యమంసాగు తున్నది—" అంటుండగా వుద్రేకంపట్టజాలక హస్తాన్నిఆడిస్తూ అభిన యిస్తూ "ఆహాహా! వర్గపోరాటభాష్యకర్తా! నీకు మా అభివంద నములు—నేత్రాలు పెద్దవిచేసి మిరిమిరిచూస్తూ, స్త్రీని పురుషులనుంచి వేరుగావిడదీసి వూహలుచేస్తూ ఆ అర్ధభాగానికి హక్కులుగావాలని వెర్రి

మొత్రిగా యెవరైనాఅంటే, అర్థరహితమైన, ఆమాటలుకూడా మీవోటి వారికి ప్యాషనుగాను ఆదర్శంగాను కనిపించుట ఆశ్చర్యం? స్త్రీ స్వయం ప్రకాశంలేని శశిలాంటిది. స్త్రీద్వారాపురుషుడు, పురుషునిద్వారా స్త్రీ విధిగా వుద్ధరింపబడాలి. ఆ యిరువురిది ప్రకృతిసిద్ధమైన అవినాభావ సంబంధం. ఇందులో యెవరు గొప్ప యెవ్వరూ యెన్నటికీ పరిష్కరింపజాలని సమస్య. స్త్రీపురుషసంబంధం అవిచ్ఛిన్నమైంది. ఆ ద్వంద్వ ఏకత్వంలోనే మానవపూర్ణత్వమున్నది. భూమిమీద చిక్కగా అల్లుకుపోయిన తీగె కణుపుకణుపుకు వేరులువేసి వికసిస్తున్నపుడు ఆ తీగెలో యెక్కడ ఖండనజరిగినా జీవంపోదు. యథావిధిగా యెక్కడి కక్కడ కణుపు కణుపు స్వతంత్రించి జీవిస్తుంది.అదేరీతి స్త్రీహక్కులు, స్వేచ్ఛ, ఆధిక్యతలు, అధికారాలు యెక్కడికక్కడే స్థావరంకలిగివుంటవి. ఇంధనము అగ్ని వేరుచేయజాలనివి. ఆ రెంటిలో యేది గొప్ప అన్నసమస్యను లేవనెత్తుట యెంత హాస్యాస్పదమో అదేరీతి స్త్రీపురుషుల వేరుచేసి యేమేమో విప్లవాత్మకశబ్దాలతో వుత్తేజపర్చుట అజ్ఞానాన్ని రుజువుచేస్తుంది. అల్లికలోని దారాలు క్రిందకుపోయినవి పైకి, తిరిగి క్రిందికిపోతేనే ఆకారంచేకూరుతుంది. స్త్రీలు పూజలుపొందిన మరుక్షణమే వూడిగాలుచేయుట వారి ప్రకృతిసిద్ధధర్మం —" అని విశ్వనాథం యింకేమేమో చెప్పుతుండగా అనునయంతో అతనిహస్తాలనుబట్టి "విచక్షణలేని పట్టుదల, పంతము అప్రస్తుతమైన ఆలోచనలను లేవదీసి అవాంఛనీయమైనవాటికి ప్రాధాన్యతనిస్తుంది. కొన్నిటిని మనస్సుకింపుగా వినివూరుకోవటంలోనే ఆనందముంటుంది. ఆశయాలు లక్ష్యాలు అంటూ రటనలో పాఖండులుగా తయారైనవారు ఆఖరుకు తమకు తెలియకుండా చేయరానిది చేసికూర్చుంటారు" అంటూ రఘునాధ్ వెడలిపోయాడు.

తను చేసింది ప్రశంసనీయకార్యమని విశ్వనాథం తనలోతానే తిరిగి నిర్ణయించుకున్నాడు. అయినా మనస్సుకు వూరటకలుగుటలేదు. అందుకని మండలివారిచెంతకుచేరి కూర్చున్న సరళ యేమంటుందో తెలుసుకోవాలనే కుతూహలంతో తెల్లవారుతూనే సరళయింటివైపు నడిచాడు. పరధ్యానలో శిరస్సు అధోముఖంచేసి నడిచిపోతున్నాడు. ఎదు

రుగావచ్చిన ఒక అపరిచితవనిత హస్తద్వయాన్ని జోడించి "నమస్తే మహాశయా!" అన్నది. తేరిపారచూచి వెలవెలబోతున్నాడు. ఎంత ప్రయత్నించినా ఆ వనిత యెవరో గుర్తుకువచ్చుటలేదు. ఆమె చిరపరిచితురాలివలె అతిచనువుతో "నన్ను గుర్తించలేదుకదూ? నేను మండలిలోని పారిజాతాన్ని. మీరు చాలా దుడుకైనవారు. అయినా మీదుడుకుతనం యెదుటివారిని ఆకర్షిస్తుంది. అద్దంలో ముఖాన్ని చూసుకున్నట్లు మీవుద్రేకంలో నిష్కల్మషతను చూడవచ్చు. మా రాజ్యలక్ష్మిగారి సమాధానాలతో మీరు మరింత వుగ్రరూపంధరించినపుడు మిమ్మే చూడాలనిపించింది. క్రోధంలో మీ అందం యినుమడిస్తుంది" అంటూ సిగ్గును అభినయించింది.

మంత్రించినట్లు నిచిచిపోయాడు. ఆమెమాటలు వింటూ తదేకంగా చూస్తున్నపుడు ఆతనిమనస్సు క్షణమొకరీతిగా మారిపోతున్నది. సంసిగ్ధాలతో వెలవెలవోతున్నది. ఆమెమాటలలో ఆత్మీయతతోగూడిన మాధుర్యం ఆనందానుభూతినిస్తున్నది. అంత చనువుగా సన్నిహితంగా ధారాళంగా యెన్నడూ యే అపరిచిత స్త్రీ తనతో మాటాడియెరుగదు. మనస్సు పనిచేయుటలేదు. తాపము శీతలము శరీరములో ద్వంద్వాత్మ సంఘర్షణ సలుపుతున్నవి. ఆయనలోని అసలు ఆలోచనలు యేమయిపోయినవో ఆయనకే తెలియదు.

పారిజాతం మాయావివలె చిన్న చిలిపినవ్వును ప్రదర్శిస్తూ "రండి, నాధంగారు, మా మహిళామండలివారిని పరిచయంచేస్తాను" అంటూ రెండడుగులు ముందుకు నడిచింది. కాని ఆయనలో కదలిక లేదు.

ఆమె తిరిగి పెద్దగా నవ్వుతూ "సంకోచిస్తారెందుకు! మా రాజ్యలక్ష్మిగారు యేమీ కోప్పడరులెండి! మమ్ము ప్రతిఘటించేవారియెడల మరింత యిష్టము. నేను ప్రక్కనుండగా మీరు జంకవలసినపనిలేదు. పదండి" అంటూ ఆయనహస్తాన్నిబట్టి మృదువుగా లాగింది.

ఆ స్పర్శతో నరాలుపొంగి జివ్వుమన్నవి. మనస్సులో వైఖ్య

పరువులెత్తినట్లుంది. అమాయకునివలె వెంట అడుగులువేసుకుంటూ నడిచాడు.

వారిరువురిప్రవేశంతో మండలి రవంతసేపు సచేతనమైంది. లోపల మన స్తబ్దతలోనున్న రాజ్యలక్ష్మికి ఈవార్త తెలిసి, ఆదుర్దాను అణుచుకుని, పెడచెవినిపెట్టినట్లు నటిస్తూ గోడమీది క్యాలెండరువంక చూస్తున్నది. దానిసను తోడితెచ్చినట్లు, విశ్వనాథాన్ని ఆమెముందుకు తీసుకొచ్చి "నమస్కరించు" అని రహస్యంగా సూచించింది. నూతన నటకునివలె చేతులుజోడించి "నమస్కారమండి" అన్నాడు. కాని రాజ్యలక్ష్మి క్యాలెండరుమీద తనధ్యానాన్ని భగ్నంచేయలేదు.

పారిజాతం తిరిగిఆయనచెవిలో యేమో చిన్నగాఅన్నది.కాని ఫలితం లేకగాబోలు, ఆతనిచుబుకాన్నిబట్టి వూపుతూ అనునయంతో"చెప్పు,నాథం" అన్నది. పారిజాతం దృష్టిలో దృష్టిబరపినంతనే యేమిజరిగిందో చురుకుదనాన్నిపొందినట్లు వుత్సాహితుడై "రాజ్యలక్ష్మిగారు, నన్ను క్షమించండి, పొరపాటుగా మాట్లాడాను" అన్నాడు.

రాజ్యలక్ష్మి తపస్సు అపుడే విరమించినదానివలె అతణ్ణిచూసి ఆశ్చర్యంగా "మీ రెప్పుడొచ్చారు? కూర్చోండి" అంటూ ప్రక్కనున్న బల్లనుచూపింది. ఆతడు బిడియంతో కుంచించుకుపోతూ "ఫరవాలేదు లెండి" అన్నాడు.

పారిజాతంద్వారా విశ్వనాథం సరళలుకూడా మహిళామండలికి సన్నిహితులయ్యారు. అపుడపుడు వారికార్యక్రమాలలోకూడా పాల్గొం టున్నారు.

రవిప్రసాద్‌కు మహిళామండలి కార్యక్రమాలంటే మంట. "నీతి, ధర్మము తప్పినవారికూడలికే మండలి" అని అతని నిర్వచన. "వారి స్వవిషయాలు మనకనవసరం. వారి ప్రబోధం వాంఛనీయమేగదా!" అంటుంది నిర్మల.

క్రోధాన్ని దిగమింగుకుంటూ "వారి జీవితప్రతిబింబమే వారి ప్రబోధం" అంటాడు రవిప్రసాద్.

సరళ : స్త్రీ సమానహక్కులుకోరుటలో తప్పేమిటి చెప్పు ?

రవి : భోజ్యపదార్థాలను ముందుంచుకుని ఆకలిపేరుతో అరచుట అవ్యక్తత.

సరళ : ధనాగారంముందుకూర్చుని లక్షలులెఖ్ఖించు బ్యాంకుక్యాషియర్ బీదత్వంతో అలమటించక చేయగలిగిందేముంది ?

రవి : లక్షలధనాన్ని ఆర్జించి పెట్టెలోదాచికూడా బీదరికంతో అలమటించుట మానవప్రవృత్తులలోని ఒకఅంశమే.

సరళ : డొంకతిరుగుళ్ళతో మగువలను మభ్యపెట్టుట మగవారికి అలవాటయిన విద్య. నాకు సూటిజవాబు చెప్పు.

రవి : నీకు లేనిహక్కులేమిటో చెప్పు ?

సరళ : నావిషయంగాదు కావలసింది. స్త్రీసమాజవిషయం.

రవి : మెసలుట తెలుసుకున్న ప్రతి స్త్రీకి అవుసరమైనంతవరకు స్వాతంత్ర్యావకాశం లభ్యమవుతూనేవుంటుంది. అన్నీవున్నా దండోరావేసి ఆర్భాటపెట్టుట ఒకఫ్యాషనుగా తయారైంది.

సరళ : మహిళామండలివారంటే నీకంత మంట యెందుకు రవీ ?

రవి : నీ వక్కడికి పోతుంటే నా మనస్సెందుకో వ్యాకులపడుతుంటుంది.

సరళ : నీలో సమానహక్కులు కోరతాననిభయమా ?

రవి : అబ్బ ! అంతమాటనకుసరళా ! సమానహక్కులుగాదు, సర్వహక్కులు నీకు అర్పించి, నీ కనుసన్నలలో మెలగుటలో నా కానందంలభిస్తుంది. ఆ పాడుమండలివారిని హక్కులవిభజన చేసి, గీతలుగీసుకొమ్మను. కాని మనయిరువురిమధ్య అలాంటి విభజన యెన్నటికీ జరుగదు. నాకు హక్కులెందుకు ? నన్ను నీకర్పించుకొని ఆనందసాగరతరంగాలమీద తేలియాడుతూ యుగ మొకక్షణంగా గడిపివేస్తాను.

సరళ : నేడెందుకో నూతనస్వప్నాలను వినిపిస్తున్నావు. కాని పురుషుడు కొన్నివేళలందు అనాదినుంచి పాడే పాతపాటగా యీబాణిని అనేకరచనలలో చదివాను.

రవి : ఇది పాతబాణియో క్రొత్తబాణియో నాకు తెలియదు. నా హృదయాంతరాళంనుంచి వస్తున్న ఆత్మబాణి అనిమాత్రం తెలుసు. ఇక్కడ నటనలకు మర్మాలకు స్థానముండదని వుండజాలదని చెప్పగలను.

సరళ : అయితే సర్వహక్కులు నావేగదా! నిన్ను శాసించుఅధికారం కూడా నాదేగదా!

రవి : అవునని సహస్రమారులు చెబుతాను. హృదయరక్తంతో వ్రాసి యివ్వగలను.

సరళ : నాకు సర్వహక్కులు వున్నవిగనుక నా నిర్ణయాన్ని చెబుతున్నాను విను. పారిజాతంతోపాటు నేనూ మహిళామండలిలో జేరతాను. నిన్ను యెదురుజెప్పవద్దని శాసిస్తున్నాను.

రవిప్రసాద్ మారుమాట పలుకజాలక ఆమెను తదేకంగా చూస్తున్నాడు. నేత్రాలు సజలమై బొటబొటలాడుతున్నవి. అధరాలు అదురుతున్నవి. వణుకుతున్న హస్తాలతో ఆమెచేయినిపట్టి మొఖానికి అద్దుకుంటూ దుఃఖం పొర్లుతున్నకంఠంతో "ఈ అన్యాయంమాత్రం వద్దు సరళా—" అంటుండగా ఆమె బిగబట్టినకంఠంతో "నీ మాటలకు విలువలేదని నీవే రుజువుచేస్తున్నావు. ఇంతకుముందు నీవన్నమాటలు మర్చిపోబోకు" అన్నది.

అతను మనస్సును చిక్కబట్టుకున్నాడుగాబోలు దీర్ఘశ్వాసను విడుస్తూ ఆమెచేతిని వదిలి "సరే నీయిష్టం" అన్నాడు.

ఆమె కిలకిలనవ్వుతూ అతనిశిరస్సును బాహువులలో బంధించి "అంత భయము ఖంగారు యెందుకు!" అన్నది.



# 9. సానుభూతి

మలయమతి వరండాలోని పురాతన యీజీచైర్‌లో కూర్చుని ఏనుగుల వీరాస్వామిగారి కాసీమజ్లీ కథలు తిరగవేస్తున్నది. వ్రేలాడుతున్న పంజరంలోని రామచిలుక "కీర్‌కీర్" మని తన పాతపాటను పాడుతున్నది. వరండాబయట పందిరిమీద చిక్కగా అల్లుకుపోయిన మాలతీలత యెండతీవ్రతకు వడిలిపోయి పత్రములను వంచివేసుకున్నది. నీటితొట్టివద్దజేరిన పూరపిచ్చుకలు జలక్రీడలు సలుపుతూ 'కిచకిచ' నినాదంచేస్తున్నవి. దినకరుడు తన ప్రచండస్వరూపాన్ని ప్రదర్శిస్తున్నాడు. దిగంతం తాపంతో 'భిక్‌భిక్' మంటున్నది.

పచ్చీస్‌ఆటసంచితో వచ్చిన బీబీజాన్ పడకకుర్చీప్రక్కగా చాప పరుచుకుకూర్చుని, సంచివిప్పుతూ "విజయ్‌బాబుగారు చాలా మారిపోయారు అమ్మగారు! ఆటపాటలుమర్చిపోయి చదువులో మునిగిపోయారు. ఈ దఫా ప్రథమతరగతిలో ప్యాసవుతారు" అని, మలయమతివైపు చూస్తున్నది. ఆకస్మికంగా యీ ప్రస్తావనతెచ్చిన బీబీజాన్ అభిప్రాయాన్ని అర్థంచేసుకున్న ఆమె, మందహాసంతో "ప్యాసయితే మంచిదేగా!" అన్నది.

ఆ సమాధానం సంతృప్తినికలిగించలేదు గాబోలు. ముఖాన్ని బుంగాకృతిచేసుకున్నది బీబీజాన్. కాని మలయమతి చేతిలోని పుస్తకాన్ని మడిచిపెట్టి ఆటకుపక్రమించింది. ఆదరము, సాంత్వన అలకను అభివృద్ధిచేస్తాయి. నిర్లక్ష్యము నిరాదరము అలకను అణచివేస్తాయి. బీబీజాన్‌మనస్సును కుదుటపర్చుకుని "విజయబాబు అంత శ్రద్ధగా చదువుతున్నందుకు సంతోషాన్నైనా ప్రకటించరెందుకు?" అన్నది. "నేను ఆనందపడుటలేదని నీ కెలాతెలుసు?" అన్నది మలయమతి. "వారు రెండోమారుకూడా తప్పినపుడు వహించిన గంభీరతే నేడూ

మీలో సాదృశ్యమపుతుండగా అన్యధా యెలా అనుకోమంటావు" అన్నది,

"నా గారాబమే వాడు చెడిపోవుటకు కారణమని తెలుసుకున్నాను గనుక పశ్చాత్తాపంతో మౌనంవహించాను.అందువల్ల వచ్చేనష్టంమాత్రం యేముంది !" అన్నది మలయమతి.

"మీరు నిరసిస్తున్నారనేబాధలోనే రేయింబవలు చదువుతున్నారు బాబుగారు. తనదృక్పథం మార్చుకున్నందుకైనా మీరు సానుభూతిని చూపితే వారిమనస్సు తేలికపడుతుందిగదా !" అన్నది బీబీజాన్.

"ఆరూపంగానైనా వాడు దారికొచ్చి చదువుచున్నందుకు తల్లినై తృప్తిపడకుండావుంటానా పిచ్చిదానా !" అన్నది.

మానవుడు యెంత ముందుకుపోవాలని పరువులెడుతుంటాడో అంత వెనక్కునెడుతుంటాయి ప్రకృతిశక్తులు. వ్యూహాజగత్తులో నిర్మించే వంతెనలు వాస్తవికజగత్తులో కూలిపోతుంటాయి.

పరీక్షాఫలితాలు ప్రకటింపబడినవి. మూడవమాటుకూడా తప్పినట్లు [illegible]సినపుడు విజయ్‌కుమార్ యెవరికీ ముఖంచూపజాలకగాబోలు గది [illegible]ళ్ళి శయ్యమీదపడి అటూయిటూ దొర్లుతున్నాడు. శిరస్సును [illegible]సారులు రుద్దుకున్నాడు. శివమెక్కినవానివలె లేచి పుస్తకాలను [illegible]నుంచి తీసి ఒక్కటొక్కటిగా కిటికీగుండా బయటకు బలం[illegible]తున్నాడు.

[illegible]ప్రవేశించిన బీబీజాన్ ఆశ్చర్యాన్వితురాలై "అదేమిటి [illegible]కాలేమి చేసినవి ?" అంటూ ఆతురతలో వెళ్ళి [illegible]న్ని గట్టిగా పట్టుకున్నది. నిరోధంతో ఆయనలోని [illegible] ఆమెహస్తస్పర్శ లాగివేసినట్లు వల్ల

కందివుంది. శ్వాస బుసలుగొడుతున్నది. కరుణతోను, ప్రేమతోను బీబీ జాన్‌హృదయం చలించింది.

"మానవజీవితానికి పరీక్షలే పరమావధిగాదని మీరే ఒకమాటు అన్నారు. నేడు వాటిలోని విఫలతకు యింత చిరాకుచెందుటెందుకు బాబూ! పరీక్షాధికారులు మహా పిసినిగొట్టులు" అంటూ అతనిశిరస్సును తనభుజస్కంధంమీదకు వాల్చుకున్నది.

ఆమెభుజంమీద వెచ్చటి బాష్పబిందువులు ఒక్కటొక్కటిగా రాలుతున్నవి. అవే ప్రత్యుత్తరమేమో! వెంటనే అతనిశిరస్సునుబట్టి తనముఖంవైపుకుదీసుకుని, ముఖాముఖి చూస్తున్నది. మేఘావృతమైన చంద్రబింబమువలె అతనిముఖంలో తొలగిపోజాలని దుఃఖముద్రలు గని పిస్తున్నవి. ఆమెమనస్సు కరుణతోను ప్రేమతోను పొంగిపొరలింది. అతని అశ్రుసిక్త కపోలంమీద వేసి తనసుఖమండలాన్ని అటూయిటూ రుద్ది, దీర్ఘశ్వాసను విడచింది. ఉపశమనం లభించిందిగాబోలు ముఖ ద్వయం సొమ్మసిలినట్లున్నది.

వైఫల్యంలోనే ధైర్యంవహించాలని, దుఃఖించుటలో దుర్బలత్వ[illegible] పెరిగి అసఫలతవైపుకే నడపుట పరిపాటని, ఫలితంకంటె కృషి ప్రధా[illegible] మని, మానవకృషి యెంత ధృఢమైనదయినా మాధవసంకల్పంతే పరాజయంతప్పదని, అలాంటి పరాజయాన్ని విజయంగా [illegible] ముందుకునడచుటలో విజ్ఞతవుంది" అని మలయమతి ధై[illegible] నపుడు బీబీజాన్ వెలవెలబోయింది.

"విజయ్‌బాబు మూడోమారుకూడా తప్పినపు[illegible] క్రుద్ధులవుతారనుకున్నాను. బాధతో హేయపడతా[illegible] యీ తృతీయపరాజయాన్ని జయంగా స్వీకరి[illegible] తునా[illegible]గు "

# 10. విద్యార్థినాయకుడు

బీబీజాన్ సానుభూతితోను సహకారంతోను విజయకుమార్ మనస్సు స్థిమితపడింది. తన ఆన్సరుపేపర్లను రీకరక్షన్స్‌చేయించుటకు యూనివర్సిటీవారిని కోరాడు. పునఃపరిశీలనవలన ప్రయోజనంలేకపోయింది. అంతటితో అతనిఆవేశం ఆగలేదు. పరీక్షాధికారులువేసే మార్కులు వారి మూడ్సునుబట్టి వేయుటలో అలపడిపోయారని, గృహకల్లోలంలోవుండి దిద్దేవారు తమ ఆవేశమంతటిని మార్కులువిరగ్గోయుటలోనే చూపిస్తారని, అలాంటిదానిఫలితంగా తనకు రావలసిన మార్కులు వేయలేదని, మొదలగుకారణాలతో యూనివర్సిటీవారిమీద దావావేయుట, క్రిందికోర్టులు నిర్లక్ష్యంతో కొట్టివేయుట, హైకోర్టులో పెద్దప్లీడరును పెట్టినఫలితంగా ఆన్సరుపేపర్లను కోర్టు ప్రత్యేకపరిశీలనకు కప్పగించటం జరిగింది. న్యాయము ధర్మముపేరుతో కోర్టుకున్న అధికారాలు విస్తృతమైనవి.

సంపూర్ణవిచారణానంతరం, విజయకుమార్ ప్యాసయినట్లు ప్రకటించవలసినదిగా యూనివర్సిటీవారిని కోర్టు ఆదేశించింది. కోర్టువారి యీ జోక్యంవలన న్యాయము ధర్మము శుద్ధిపొందుటకంటె, అభివృద్ధినొందుటకంటె, విద్యారంగంలో దీక్షకల్గుటకంటె అశ్రద్ధ, అవహేళన నిర్లక్ష్యము ప్రబలిస్తవని, యీకోర్టు తీర్పువలన అంతర్గత పరిపాలనావిధానమే తారుమారై, ఆత్మగౌరవంకోల్పోయి అవకతవకలబొంతగా రూపొందుతుందని, విద్యాభివృద్ధికాముకులెవ్వరూ యిలాంటి తీర్పును సహించరాదని తననిరసనను ప్రదర్శిస్తూ యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్ తనపదవికి రాజీనామాను సమర్పించాడు.

విద్యార్థిలోకాని కిదొక హర్షాతిశయాన్ని కలిగించింది. విజయకుమార్‌ను విద్యార్థిబృందం విందులు, వినోదాలతో ముంచెత్తింది.

పరీక్షాధికార్ల నిరంకుశత్వం, యూనివర్సిటీవారి నిరంకుశత్వం యీసంఘటనతో తునాతునకలైనట్లు, విద్యార్థులగౌరవాన్ని పునీతంచేసినట్లు కొనియాడారు.

విజయకుమార్‌కు గొప్ప ఆధిక్యతలభించింది. వీరవిజేతను పూజించినట్లు అతనిని ఆదరిస్తున్నారు. బీబీజాన్ పరమానందభరితురాలైంది. ఆమెనేత్రాలకిపుడు విజయకుమార్ నూతనశోభతో సమర్థయోధుడుగా గనిపిస్తున్నాడు. తన మనస్సులోని ఆనందతరంగాలను అతనిసమక్షంలో వివరించాలని, మనసార కీర్తించాలని ఉబలాటపడుచున్నది. ఇపుడు యింటిపట్టున యెక్కువసమయం ఉండుటలేదు. వున్న కొద్దిసమయంలోనే ఒక్కరొక్కరుగా అనేకమంది నూతనవిద్యార్థులు చేరి తీసుకెళుతున్నారు. తనకు ఏంటరిగా సంభాషించగల సమయమే లభ్యమవుటలేదు. సందర్భపడినపుడు తెలియని నూతనసిగ్గుదొంతరలు ముంచుకొస్తుంటవి. వినిపించాలని తెలుసుకోవాలని అనుకుంటున్న మాటలు మనస్సులోనే పెరిగి అణగారిపోతున్నవి.

మలయమతి కీ విజయం రుచించలేదు. ప్యాసవుట సంతోషమే కాని, జరిగినవిధానం ఆమెకెందుకో వికటంగావుంది. స్పష్టరూపంలో చెప్పజాలనికారణాలకొరకు వెదుక్కుంటున్నది.

"దేశమంతా విజయ్‌బాబును ఆదరిస్తున్నది. పత్రికలవారు పెద్ద పెద్ద అక్షరాలతో శ్లాఘిస్తున్నారు. విద్యార్థులంతా ఆతన్ని తమపెన్నిధియైనట్లు గౌరవిస్తున్నారు. మీకు సంతృప్తిలేదనటం బాగుంటుందా అమ్మగారూ ?" అన్నది బీబీజాన్.

"పదిమంది స్తుతించిన ప్రతిదానికి పవిత్రతఅంటివుంటుందనుటకు వీలులేదు. పవిత్రమైనదానిని నిరాదరించినంతమాత్రాన అందలి పవిత్రత పోజాలదు. ఏ స్త్రీఅయినా తను వరించిన పురుషుని భర్తగా ప్రేమతో పొందజాలక కోర్టుద్వారా తాళికట్టించుకుని భర్తగాపొందుట శుభమూ గాదు శోభస్కరమూగాదు వాంఛనీయమూగాదు. వినయవిధేయతలతో గురుభక్తితో చదివి వుత్తీర్ణులై ఆశీర్వదింపబడవలసినచోట, విరోధిగా

వితండిగా కోర్టుముందు నిలిచి అధ్యాపకులను నిందించి పొందేది విజయమని యెలా అనగలము బీబీజాన్" అంటుంది.

మ్లానముఖంతో "అంత కష్టపడి చదివి బాగా వ్రాసినా మార్కులు వేయజాలని ఆ పిసినిగొట్టులు తప్పించినపుడు వారిని నిరోధించుట తప్పెలా అవుతుంది అమ్మగారూ ?" అన్నది బీబీజాన్.

ఆమెశిరస్సు పైకెత్తి బాగా చూస్తూ "మీలోని యిలాంటి విమర్శే వక్రబుద్ధికి నిదర్శనం" అన్నది.



# 11. మధుర యోగం

పరీక్షాఫలితాలలో బందరుహైస్కూలు అగ్రస్థానంవహించింది. నూటికి95గురు ప్యాసయినందుకు ప్రధానోపాధ్యాయుడు,అనుయాయులకు ఆనందంతో విందుజేశాడు. కాని ఆ హైస్కూల్లోనే చదివిన సరళ, రవి ప్రసాద్, విశ్వనాథ్‌లు వరుసగా తప్పుట విచిత్రమైనవిషయం. సరళ మత్తులో రవి, పారిజాతంపరిచయంతో విశ్వనాథం తప్పినట్లు అంతటా అలజడివుంది. యువతిప్రక్కనున్నయువకుడు విఫలమొందుట తథ్యమే గాని యువకునిప్రక్కనుండికూడా యువతి విజయమొందగలదు. కాని సరళ తప్పితూప్పున్నది.

విశ్వనాథంకృషితో విద్యార్థిసమితితరఫున సత్కరించుటకై విజయకుమార్ బందరుకు ఆహ్వానింపబడ్డాడు. పరీక్షలలో తప్పినవారి లోనే సమర్థతున్నట్లు యోగ్యతున్నట్లు విజయకుమార్‌ద్వారా కొందరి మనస్సులో గూడుకట్టింది. తప్పినవారికి ఆ ఆలోచనలు మరింత వోదార్పునుకలిగిస్తున్నవి. మహిళామండలిద్వారా సంఘసంస్కర్తలుగా సభలలో చొరవ, అభ్యాసముపొందిన సరళ, విశ్వనాథంలకు సత్కారకార్య సన్నాహాలలో ప్రధానపాత్రలభించింది. స్వాగతబోర్డులు పట్టణమంతటా కట్టబడినవి. సభావేదిక విశాలమైందిగా నిర్మించబడింది. సరళదర్శకత్వంలో వేదిక అలంకరించబడింది. "విద్యార్థివీరుడు విజయకుమార్ —జిందాబాద్" అని సువర్ణఅక్షరాలతో లిఖింపబడినబోర్డులు వేదికనలువైపులా అమర్చబడినవి. విద్యార్థులు పట్టణమంతటా కోలాహలం చేస్తున్నారు.

లోకం యెంత విచిత్రమైంది. ఒకనాడు విద్యాబోధకుల్ని నిర్లక్ష్యంచేయుటగాని, నిరసించుటగాని, మహాపరాధంగా పాపంగా తలంచిన యీ భూమిలోనే యెంత అవహేళనజరుగుతోంది. మూడుమారులు వరుసగా పరీక్షలలో తప్పినవ్యక్తి కోర్టుద్వారా పరీక్షాధికారులను అవినీతిపరు

లుగా నిర్ధారించి, తను ప్యాసయినందుకు, అతనిని లోకం ఘనతగా ఆదరిస్తున్నది. విజేతగాను యోగ్యునిగాను స్వీకరిస్తున్నది. వినయ సౌజన్యాలకు ధర్మము, నీతినియమాలకంటె యుక్తికి. తాంత్రికానికి ఆదరంపెరిగింది.

పరీక్షలలో తప్పినవారందరికి విజయకుమార్‌వలె కోర్టుపరిష్కారం ఆశాజ్యోతిగా గనిపించుట స్వాభావికం. ఆహ్వానకార్యదర్శి హడావుడులలోనున్న సరళమనస్సు అంతర్గతంగా విజయకుమార్‌ను గురించి వూహారూపాన్ని చిత్రించుకుంటూ నచ్చక తిరిగి చెరుపుకుంటూ యేమేమోచేస్తున్నది. "నీలో నీవే నవ్వుకుంటావేమిటి సరళా ?" అంటాడు ప్రక్కనున్న రవిప్రసాద్.

సంకోచాన్ని సరిదిద్దుకుంటూ "రవీ ! నీవు యెప్పుడయినా విజయకుమార్‌ను చూశావా !" అని ప్రశ్నించింది.

"లేదు" అని సమాధానమిచ్చాడు.

"ఆ విషయమే ఆలోచిస్తున్నాను" అన్నది.

మేళతాళవాయిద్యనినాదాలమధ్య విజయకుమార్ వేదికమీదికి ప్రవేశించాడు. తెల్లటి నురుగులాంటిదుస్తులు ఆతనికి అతికివున్నవి. గగనవిజేత గగారిన్‌నుతిలకించినట్లు విద్యార్థిబృందం ఆదుర్దాతో దర్శనార్థం నెట్టుకుంటున్నారు.

విద్యార్థినులతరఫుగా పుష్పమాలవేసి ప్రార్థనాగీతికపాడవలసిన సరళ అతన్నిచూసినక్షణంనుంచి మతినికోల్పోయి వెలవెలబోతున్నది. ఆ విజయవీరునిముఖమండలం చూసినదే తడవుగా తనకు సన్నిహితాను బంధమేదో వున్నట్లు హృదయాంతరాళం చలించింది.ఆమె అంతర్దృష్టి, ఆ ఘనిష్టతను వెదుక్కుంటున్నది. సూర్యకిరణముసోకినంతనే మంచుతెరలు తొలగిపోయినట్లు ఆమెమనస్సులోని సందిగ్ధాలు అతనిముఖం చూచినకొంది విడిపోయినవి. ఇపుడు స్పష్టరూపంలో ఒక్కటొక్కటిగా అన్నీ సినిమారీలువలె గుర్తుకొస్తున్నవి. ఆనాడు పరీక్షలలోపట్టుబడిన అపరాధిగా అందరిముందునిలిచి అవమానఘోషణలు పొందుతున్న తనను రక్షించుటకని నిరిచి నేరాన్ని నెత్తినవేసుకుని తృణీకారాలను పొందుతూ బహిష్కరింబడి వెళ్ళిపోయిన ఆ విచిత్రమైన ఆపద్బాంధ

వుడే యీ విజయకుమార్. క్షణంలో మనస్సు ఆనందపరవశమైంది. కృతజ్ఞతతో రక్తనాళాలు ఝుళిపించినవి. తోచినరీతిలో మనస్సు తత్తర పాటు చెందుతున్నది.

పూలమాలను హస్తాలకందించుటకుబదులు ఆనందోద్రిక్తవూపులో విజయకుమార్‌కంఠంలో వేసింది. హారానికిబదులు తనహస్తాలనే ఆయనకంఠానికిచుట్టి మాలగా తానే వుండిపోతే యెంతబావుండును, అని వోఅంతర్వాణి వినిపించింది. పవనతెమ్మెరలకు పుష్పకుంజాలనుంచి సుడులుగాలేచు సుగంధపరిమళాలవలె ఆమెహృదయంలో గజిబిజిగా వుత్పన్నమవుతున్న ఆలోచనలకు అంతులేదు.

అంతర్గత ఆలోచనలలో కార్యక్రమాన్ని విస్మరించిన సరళకు ప్రక్కనున్న విశ్వనాథం ప్రార్థనాగీతికనుపాడమని గుర్తుజేశాడు. ఒక అభ్యుదయగీతికను పాడాలని నూతనవిధానంలో రాగాన్నికల్పించి రెండురోజులనుంచి శ్రమతో సాధనచేసినపాటను పాడాలని ప్రయత్నించి విఫలమయింది. గొంతు పెగలుటలేదు. శ్వేదం గ్రమ్ముతున్నది. ప్రక్కనున్న వత్తుడులతో పాతగీతికనే పాడివేసింది. ఆపాటలో వణుకు యేర్పడింది. కాని కంఠంలోని శ్రావ్యత ఆవణుకును మెరుగులుగా కల్పించుకున్నది.

విజయకుమార్ ప్రథమంగా సరళనుచూసినపుడు తడబడ్డాడు. ముఖం పరిచయమైంది. సన్నిహితమైంది. కాని తెరమరుగులో అస్పష్టత ఆవరించినట్లయింది. ప్రేక్షకులనుంచి మిన్నుముట్టే నినాదాలు వస్తున్నా, వేదికమీదనున్న నాయకులు తనకు యెన్నివిషయాలు వివరిస్తున్నా, అతను మనస్సందు లగ్నమవుటలేదు.ధ్యానమంతా సరళయందే లగ్నమైంది. క్రీగంట ఆమెనేచూస్తున్నాడు.

సభలో విద్యార్థినాయకు లనేకురు వుపన్యసించారు. పరీక్షాధికారుల నిరంకుశత్వాన్ని నిర్మూలించాలని, పక్షపాతవైఖరులను అడుగంటించాలని, పిసినారితనానికి స్వస్తిజెప్పించాలని బాహాటంగా కఠినస్వరాలతో నొక్కివక్కాణించారు. విద్యార్థులకు ప్రతిబంధకాలుగా నిలిచిన యీ పరీక్షవిధానాన్నే యెత్తివేస్తే బావుంటుందని విశ్వనాథం వ్యక్తపరి

చాడు. చదువులకే వుద్వాసనమిస్తే బాలురకు పూర్తిస్వేచ్ఛ లభిస్తుంది గదా, అని వృద్ధులవైపునుంచి వ్యంగ్యంగా వినిపించింది.

హర్షధ్వానాలమధ్య లేచిన విజయకుమార్ వుత్తేజితుడై యేమేమో వుపన్యసించాడు. అతనికోరచూపులు పదేపదే సరళవైపుకే నడిచినవి, తెలియని అనుబంధమేదో ఆమె ముఖమండలంలో ద్యోతక మవుతున్నది. అటువైపు చూస్తున్నకొంది మనస్సులోని ఆలోచనలు మరోవైపుదార్లి తడబడిపోయాడు. విశ్వనాథం వందనసమర్పణలో సభ ముగిసింది.

సభానంతరంగాని విందులోగాని సరళ కనిపించలేదు. విజయ కుమార్‌నేత్రాలు ఆమెకొరకే వెదుకుతున్నవి. ఎవరు యేమివినిపిస్తున్నా, ప్రశ్నిస్తున్నా పరధ్యాసలోని అతనికి అంతుపట్టుటలేదు. అంతా విసగడగా తోస్తున్నది. అయినా ఘనతగానిలిచినవానిచుట్టు చేరిన ప్రజ అంతతొందరగా విడిచిపెట్టదు, ఏకాంతాన్నివాంఛిస్తున్న అతను శిరోభార నెపంతో విముక్తిపొందాడు. కాని యేకాంతం హృదయాన్ని మరింత క్షోభింపజేస్తున్నది. అలవాటయిన పాతవ్యధ యేకాంతాన్నికోరుతుంది. నూతనావేశితవ్యధ అన్యఅనుభూతులను వినగోరుతుంది. చీకటికొట్లో నుంచి బయటపడి తవుళ్ళాడువానివలె కాస్తలోవిసిగిన విజయకుమార్ అన్యుల ఆగమనంకొరకు వెదుకసాగాడు. మనస్సును కట్టుదిట్టంచేసు కునే ప్రయత్నాలతో కూడదీసుకుంటూ బయటకునడిచాడు.

ఆతిథ్యాలందుకున్న విజయ్‌కుమార్ అందరిమధ్యనుంచి వీడ్కో లందుకని ఆరాత్రిబండికే పయనమయ్యాడు. ప్లాట్‌ఫారమంతా విద్యా ర్థులతో కిటకిటలాడింది. బందరుస్టేషనునుంచి బండి బయలుదేరింది. కనుచూపులందినవరకు విజయకుమార్ ఆవైపుకేచూస్తూ చెయ్యి వూపు తూనేవున్నాడు.

గొప్పసత్కారాన్ని పొందేపోతున్నాడు. అనుకున్నదానికంటె ఘనంగా జరిగింది. కాని వచ్చునపుడున్న వుత్సాహము వుల్లాసము ఆనందము యిపుడు లేవు. అమూల్యమైనదేదో పోగొట్టుకుపోతున్నవాని వలె నున్నాడు, నిస్పృహలో భీతి గలుగుతున్నది. అటుయిటు సంద డితో పయనించనైనా యెవరూలేరు. ఒకటోతరగతిపెట్టెలో తానొక్కడే.

మానవస్వభావం యెంత విచిత్రమైంది? యదార్థరూపంలో పొందింది లేదు, పోగొట్టుకున్నది లేదు. కాని సర్వముపొంది పోగొట్టుకున్నట్లే మనస్సు శూన్యంలో దుఃఖకోణాలను శోధిస్తున్నది. ఏ అజ్ఞాతశక్తిని అనంతశక్తిని అవధులులేనిశక్తిని ఆద్యంతాలులేనిశక్తిని భగవంతుడంటున్నామో ఆ శక్తిలోని అంశాలతాలూకే యీమనస్సు. అందుకే యీమనస్సుకుకూడా హద్దులూ అవధులూ కనిపించవు. దీనిలో యెలా స్టిక్‌శక్తి యిమిడివుంది. మోయలేనిభారాలను, భరించలేనిదుఃఖాలను యెప్పటికప్పుడు యిముడ్చుకుని అలవర్చుకుని ముందుకు తయారవుతుంటుంది. మనస్సుయొక్క వేగాన్ని బలాన్ని యెవరూ అంచనా వేయజాలరు.

బెర్తుమీదకూర్చున్న విజయకుమార్ దీనవదనంతో బయటి దృశ్యాలను చూస్తున్నాడు. తనముందునుంచి గుట్టలు మెట్టలు వృక్షజాలాలు వెనక్కు పరువులెడుతున్నవి. చూస్తున్నకొంది కదిలిపోతున్నవి తనరైలా లేక వృక్షజాలములా, అన్నది సంశయంగా తోచనట్లున్నది. భ్రమకు అవకాశాలుయెక్కువ, అన్నవిషయంమీదనే ఆలోచిస్తుండగా, చిలకలపూడిస్టేషన్‌లో బండి ఆగింది. తలుపుతెరుస్తున్న ధ్వని వినిపించింది. పరధ్యానలో మిళితమైన విజయకుమార్ మామూలు ధోరణిలో అటు చూస్తున్నాడు. గాజుల గలగలధ్వనులతో యెక్కుతున్నారు. పరిచయసూచకంగాగాబోలు మొగిలిపరిమళాలు ఘుమఘుమ వ్యాపిస్తున్నవి. బరబరలాడుతున్న జరీచీరె ధరించిన ఒక నవనాగరిక వనిత లోపలప్రవేశించింది. రెండోవైపు ముఖంబెట్టి తాపీగా నిలిచిపోయింది. తానే కవాటాలు మూసింది. సామాన్లులేవు. చేతిసంచి కూడా లేదు. బెరుకు భయాలు అంతకంటే లేనట్లున్నది. లేతయిగురుటాకువన్నెలో పలుచగా మృదువుగా కందినట్లున్న ఆమెఅరచేతులు ముద్దుచాలికిస్తున్నవి. ధరించినచీరె శరీరవన్నెకు మెరుగులు దిద్దుతున్నదిగాని, కట్టినవిధం తీర్చిదిద్దినట్లులేదు. తనను చూడక యెవరూ లేనట్లు భావించి తలుపులుబంధించిందిగాబోలునని విజయ్‌హృదయం దడదడలాడుతున్నది. నవవధువువలె శిరస్సు అధోముఖంచేసి నిలిచిన

ఆమెముఖంచూడకనే. శరీరకుదిరికలతో అంచనాలువేస్తూ తెలియని భయంతో వణికిపోతున్నాడు.

అందమైన వికసితపుష్పం అందరిని ఆకర్షిస్తుంది. అంతటితో ఆగక తనపరిమళాలతో మైమరపిస్తుంది. ఆ యాకర్షణను పరిమళాలను నిరోధించగలశక్తి ప్రకృతిప్రభావితమైన మానవులలో యే ఒక్కరికీ వుండదు.

కనిపిస్తున్నహస్తాలను పాదాలను మరీమరీచూస్తున్నాడు. అరుణ కాంతులీను ఆమెపాదాలుకూడా అత్యధిక ఆకర్షణీయంగా నీడలు తేలి కనిపిస్తున్నవి. అతిసున్నితంగా వున్నందున ఆమెనుంచి వస్తున్న అంబర్అత్తరు సువాసన ఘాటుగా తగులుతూ మత్తులో ముంచు తున్నవి.

రైలుయింజను చిన్నదైనందున లాగుటకుముందు ఆకస్మికంగా కుదించింది. ప్రమత్తతలోనిరిచిన ఆ వనిత క్షణంలో కూరిపోయింది. శిరస్సు విజయకుమార్ పాదాలదగ్గరగా పడింది. ఝల్లుమని చేతిగాజులు మ్రోగినవి. చిట్లినగాజులు రెండు ముక్కలుముక్కలుగా రాలినవి. తగిలినదెబ్బకంటె పరాభవభీతితో ఖంగారుపడిపోతున్నది.

అంతులేని ఆదుర్దాలో విచక్షణాజ్ఞానం నశిస్తుంది. భీబత్సంగాపడి పోయిన ఆ వనితను లేవనెత్తాలనేఆదుర్దాతో చివ్వునలేచాడు. పైనున్నబల్ల శిరస్సుకు బలంగాతగిలినందువల్ల ఆమెవైపుకు తూలిపోయాడు. అతని బూటుకాలు ఆమె చేతిమీదపడి గాజులు 'ఫట్‌ఫట్' మని పగిలినవి, బంగారుగాజులు అణిగిపోయినవి.

ఆమె భరించలేని బాధతో "అబ్బ!" అంటూ తనరెండోచేతిలో బూటుకాలును చుట్టవేసి తనవైపుకు లాక్కున్నది. శిరస్సుకుతగిలిన దెబ్బలో దిమ్మపోయిన ఆయన తనరెండోఅపరాధాన్ని చూసి తడబడ తుండగా తనపాదాన్ని ఆమె తనవైపుకులాగినపుడు పట్టుదప్పి క్షణంలో ఆమెమీదకు చేరగిలబడిపోయాడు. ఆమెముఖంమీద చెరగుపడివున్నది. పొరపాటులో బెదిరినవాడు మరో పెద్దపొరపాటుకు గురికావటం పరి పాటి. ఖంగారుతో లేవబోయి కాలుపూనిక తప్పినందున ఆమెవక్షం మీద పడిపోయాడు. ఆమె యెన్నో శాపనార్థాలుపెడుతూ కసిదీర వీపు

మీద మోదవలసింది, కాని ఆమెలో కదిలికమెదిలికలు కనిపించలేదు. విజయకుమార్ గుండె దడదడ రైలుయింజనువలె కొట్టుకుంటున్నది. అన్యాక్రాంతంగా, ధనాగారంలో జొరబడినవానివలె భయవిహ్వాలు డైనాడు. గొంతుక పిడసగడుతున్నది. ఘుమఘుమలాడుతున్న ఆ సుగంధద్రవ్యాల సువాసనలు తనను పరిహసిస్తున్నట్లున్నవి. ఆమె లేవాలనేప్రయత్నం విరమించుకున్నట్లున్నది. రైలుబండిమాత్రం పోతూనేవున్నది. ఆమె స్పృహతప్పిపోయిందేమోనన్న ఆలోచన మరింత భీతినిగలిగిస్తున్నది. అంత భయభీతులలోకూడా ఆమెస్పర్శలో కలుగుతున్న తాపం మత్తులో ముంచివేస్తున్నది. ఆనందంలో శరీరం పులకరిస్తున్నది. ఒక హస్తాన్ని క్రిందమోపుజేసి నెమ్మదిగా లేచి నిలి చాడు. కాని ఆమెలో చలనమే కనిపించలేదు. చీరె అస్తవ్యస్తంగా చెదిరివున్నది. నగ్నంగాగనిపిస్తున్న వుదరం అత్యధిక ఆకర్షణీయంగా శోభిస్తున్నది. లేతఅరటియాకు పొదిగినట్లున్న ఆ ఉదరంమీది నునుపులు మెరుపులు విస్మయాన్నికలిగిస్తున్నవి.

తన బూటుక్రిందపడిన చేతిగాజులు పగిలి, గుచ్చుకుని పడిన గాయాలద్వారా రుధిరంస్రవిస్తున్నది. ఆ రుధిరస్రవంతుల జూచినపుడు విజయకుమార్ నేత్రాలు చెదిరినట్లయింది, ధైర్యాన్నిపూరించుకుని ప్రక్కగా మోకాళ్ళమీద కూర్చుని చేతిరుమాలుతో చేతికి కట్టుకట్టాడు. ఆమెచేతినున్న రక్తపుమరకలను అంగుళీయములతో తుడిచివేస్తున్నాడు. ఆ కోమలమైనహస్తం కరెంటుప్లగ్‌వలె తనశక్తిని గుంజివేస్తున్నట్లు నిస్సారంఆవరిస్తున్నది. ఆ చేతిని విడువనుకూడా సాధ్యమవుటలేదు. ఆమె ద్వితీయహస్తం అతనిబూటులను స్పృజిస్తున్నది. ఆమెముఖం యింకా కొంగులోపలే యున్నది. ఇపుడతని మనస్సులోని భయానికి ఆశ్చర్యంకూడా మిశితమైంది. వెర్రివానివలె ఆమె రెండోచేతిని చూసి చూసి తనచేతిలోకి తీసుకున్నాడు. ఆమెనుంచి వెలువడిన దీర్ఘశీతల శ్వాసను గమనించినపుడు మనస్సులోని ఆలోచనల తారుమారులతో వుక్కిరిబిక్కిరవుతున్నాడు. శాపనార్థాలకు ఛీత్కారాలకు గురిగావలసి వస్తుందని, తానెన్ని క్షమాపణలుచెప్పుకున్నా సరిపోతుందో కాదోనన్న భయం యిపుడు లేదు. ఇంత సుకుమారసుందరయువతి పంటరిగా

యెక్కడికెళుతున్నదో, యెందునిమిత్తమో, అని తానెంత ఆలోచించినా సమాధానందొరుకుటలేదు. భయము బాధకు బదులుగా యిపుడు జాలితో తనహృదయం నిండిపోయింది.

ముసుగులోనున్న ఆమెముఖంవైపు జూస్తూ "మీరు....లేచి కూర్చోండి...." అన్నాడు. కాని జవాబులేదు. స్పృహలోలేదేమోనని తిరిగి సంశయంకలిగింది. ధైర్యాన్నికూడదీసుకుని ఆమెశిరస్సుక్రింద చేయివేసి లేవనెత్తాడు. కూర్చున్న ఆ యువతి వెంటనే ఆయనపాద పద్మాలనున్న బూట్లమీద శిరస్సునువాల్చింది.

విస్మయుడైన విజయకుమార్ "ఇదేమిటి, మీరు నన్ను న్యూనత పరుస్తారెందుకు ?" అంటూ, ఆమె శిరస్సునుబట్టి పైకిలేపాడు.

ఆ యువతి మరెవరోగాదు తన సన్నిహితస్త్రీ. విజయకుమార్ ఆశ్చర్యానికి అంతులేదు. మారుమాటలేకుండా వెలవెలబోతున్నాడు. అశ్రుముద్రితమైన ఆమెముఖంమీది కారుతెర విడిలిపోతున్నది. ఆయన దృష్టిలో దృష్టిబరిపి చూస్తున్నకొంది కృతజ్ఞత వుబికి వెల్లువలవుతున్నది. నేత్రాలు జలంతోనిండి తొణికిసలాడుతున్నవి. ఆమెముఖమండల దృశ్యంలో తాను యెన్నడూ అనుభవించని వూహించని అనుభూతులు గలుగుతున్నవి. అందు పొందుతున్న తన్మయత్వంలో కారుణ్యం పొ.. సూపుచున్నది. జన్మజన్మల అనుబంధ మేదోవున్నట్లు తోస్తున్న.. అనాలోచితంగా ఆమె కపోలాలమీది కన్నీటిపొరలను తుడుస్తూ 'మె పేరేమిటి, మర్చిపోయాను" అని ప్రశ్నించాడు. సమాధానం చెప్పాలని యెంత ప్రయత్నించినా బరువులోనున్న కంఠం పెగలలేదు. అ..రాయి అదిరినవి. నేత్రాలనుంచి ఆత్మీయత ప్రదర్శితమవుతున్నది.

చనువును సన్నిహితాన్ని పూరించుకుని "మీరు బాగ పరిచయ మైనవారుగా తోస్తున్నారు. సభాసమయంలో మిమ్ము చూసి.. ప్పటినుంచి నామనస్సంతా మీ పూర్వపరిచయాన్నిగురించే ఆలోచిస్తున్న.. మీ పరి చయంతో ఆనందానుభూతి అనుభవమవుతున్నది...." అంటుండగా ఆమె చిర్నవ్వున వంగి పాదాలమీద వాలిపోయింది.

ఆయన మరింత ఆశ్చర్యపోతూ తిరిగి లేవనె..డు. బరువైన కంఠంలో "ఆనాడు పరీక్షలలో నా అపరాధాన్నే మన్నించవేమి..

బహిష్కృతులైనారు...." అని నతనతగొడుతున్నది. హృదయస్పందనలు ఆగిపోవునంతగా విభ్రాంతుడైనాడు. ఇపుడు అతనిచూపులు మరింత తీవ్రతపొందినవి. కాని రెండోవైపు తిప్పుకున్న ఆమెముఖం స్పష్టంగా గోచరించుటలేదు. మనస్సును కూడదీసుకుని "ఓ, మీరా? తిరిగి మీ పరిచయాన్నిబొందినందుకు చాలా సంతోషం" అని ఆదరపూర్వకంగా అంటుండగా ఆమె ముఖంపైకెత్తి, దీనత్వంలో ప్రేమను మిళితంచేసి "నన్ను యిపుడైనా క్షమించండి" అన్నది.

నిష్కల్మషమైన నవ్వును ప్రదర్శిస్తూ "క్షమించటానికి మీరు చేసిందేమున్నది?" అన్నాడు.

"అపరాధం నాదిగదా!" అన్నది.

"స్త్రీ అవహేళనపాలవుతున్నపుడు పురుషుడు వోర్చజాలడుగదా!" అన్నాడు.

"అవమానాలు అందరిని ఒకేవిధంగా బాధిస్తవి. ఒకరు మూర్ఖంతోచేసిన అపరాధాన్ని మరొకరు నెత్తినవేసుకుని శిక్షబొందుట యుక్తంగాదు" అన్నది.

"ఏవైపుకు హృదయంలోని కరుణ పొర్లుతుందో ఆవైపుకే మనస్సుపొర్లుటలో తర్కవితర్కాలకు తావుండదు. అది ప్రకృతిసిద్ధమైంది. సంకుచితస్వార్థాలవలెనే సహజీవనంలో త్యాగంకూడా మానవప్రవృత్తులలోనిదే" అన్నాడు.

"ఆదర్శాలని, త్యాగాలని యెన్నయినా మాటలలో ప్రబోధించవచ్చు కాని, అనుభవంలో సూదులమీద దొర్లుటలాంటిది. మీరు చేసింది సామాన్యమైందిగాదు. సంపత్తిని త్యజించవచ్చు, అధికారాలను విసర్జించవచ్చు కాని, ఒక అపరిచితురాలికొరకు అమర్యాదను అగౌరవాన్నిపొంది గొప్ప అపరాధిగా క్షుద్రుడుగా అందరిముందు నిలుచుట సామాన్యవిషయంగాదు. మీలోని గొప్ప ఉదారశక్తిప్రేరణతో అనాలోచితంగా అలా చేసివుంటారనుకుంటాను...." అంటూ ఆయన్ను తేరిపారచూస్తున్నది.

చిరునగవును చిలికిస్తూ "ఎలా అనుకున్నా యిబ్బందిలేదు. కొన్నికార్యాలు హృదయాంతరాళ స్వయంసిద్ధ ప్రేరణద్వారా జరుగు

తుంటవి. ఆ ప్రేరణవెనుక సహనాన్నిచెదర్చే బాధవుంటుంది. ఆ బాధ పవిత్రమైందికావచ్చు, కాకపోవచ్చు. నేను ఆరోజు చేసినకార్యానికి స్వనష్టం యెంత సంభవించినా యీనాటికీ సంతృప్తివుంది. లక్షలమంది స్తుతించినా కలుగని ఆనందం ఆత్మతృప్తిలోవుంటుంది" అన్నాడు.

చిన్నబోయినముఖంతో "గడ్డకట్టిపోతున్న చలిలో నీటిలో మునిగినవానికంటె వడ్డునుంచి చూస్తున్నవానికే చలిబాధ యెక్కువ. కష్టజీవికి వడగాల్పులమధ్య కష్టించుట, త్యాగికి సర్వాన్ని పరులకొనర్చుట వారికి సామాన్యంకావచ్చు కాని సాక్షీభూతులైన సున్నితహృదయాలను వూపివేస్తుంది. ఆనాడు అకారణంగా యే అవమానాలను నెత్తిన వేసుకుని గొప్పనష్టానికి గురియైనారో, ఆ అవమానాలకు మూలకారకురాలనైన నేను యెంత పరితాపపడినా ఆ ఋణాన్ని తీర్చుకోవటం కాదుగదా !" అన్నది.

ఆనాటి అపరాధానికి యీనాడు పశ్చాత్తాపపడవలసిన అవుసరం లేదు. నీవేగాదు, ఆనాడు ఆరూపంగా యే విద్యార్ధినికి అలాంటి అవమానం జరిగినా నేను తప్పక నా నెత్తినవేసుకునివుండేవాడిని. అందువలన మీరు చింతించవలసినపని లేదు" అన్నాడు.

ఆమెలోని అభిమానం దెబ్బతినిపోయిందిగాబోలు, ముఖం వెలవెలబాడుతున్నది. మనస్సును యెంత చిక్కబట్టుకున్నా జారిపోతున్నది. మాట, పలుకు లేకుండా అధోముఖంచేసి-వున్నచోటనే చిన్నగా కూలబడిపోయింది.

అలభ్యమైంది, అందరానిది అమూల్యమైందిగాను అందమైందిగాను తోచుట, ఆ వూహలలోనే విహరించుట, అవే సమీపమై సన్నిహితమైనపుడు అవి సామాన్యతనుపొంది, వాటిపై అశ్రద్ధ ఆవహించుటకూడా మానవస్వభావంలోని విచిత్రత.

అర్థంగాని ఆత్రతతో "మీరలా క్రింద కూర్చుంటారేమిటి ? బెత్తమీద కూర్చోండి ! అసలువిషయం మర్చిపోయాను. మీ రెక్కడికెళుతున్నారు ?" అని ప్రశ్నించాడు.

నిద్ర మేల్కొలిపినట్లయింది. తనలోతనకే ప్రశ్న లుదయిస్తున్నవి. మనస్సు మరింత చిన్నబోయి నిస్సారత అల్లుకుంటున్నది.

ఎవరికి క్షమాపణచెప్పుకుని యెవరిఅభిమానాన్ని చూరగొనాలనుకున్నదో, ఎవరిద్వారా యేకాంతంగా ప్రియమైన ఆదరమైన సంభాషణలు వినాలనుకున్నదో, తనమనస్సులో అపారంగా పెరిగిపోయిన కృతజ్ఞతను యేకాంతంగా వినిపించాలనుకున్నదో, ఆ మహనీయుని, విద్యార్థినాయకుని ఏకాంతంగా కలుసుకోగల వుపాయాల నెన్నెన్నోవిధాల ఆలోచించి అందరితోనూ వుంటూనే బందరుప్లాట్‌ఫారంమీద సమూహంవెనుకనున్న తాను వెనుకనుంచి యెవరికీ తెలియకుండా అదృశ్యమై రిక్షాలో ముందుస్టేషను చేరింది. టిక్కెట్టుకొనే వ్యవధీలేదు, గుర్తూలేదు. బండి బయలుదేరనున్నక్షణంలో అదృష్టవశాత్తు యెక్కవలసినపెట్టెనే గుర్తించి యెక్కగలిగింది. అంతవరకు బుద్ధికుశలత వుపకరించింది. కాని ఏ మహనీయునికొరకు యింత ఆందోళనచెందిందో వూహాలోకంలో విహరించిందో ఆ మహనీయునిసమక్షంలోఅశ్రద్ధ, అనాదరము పొందినట్లు మనస్సు వ్యాకులపడుతున్నది. భ్రమించినట్లు పొరపాటుపడినట్లు చిన్నబోతున్నది. మనస్సు మరోవైపుతిరిగి ఆలోచిస్తున్నది. తానిలా వచ్చినందుకే పరితాపాన్నిపొందుటలో హృదయం ఒక కోణం నుంచి కూడుకుంటున్నది. క్షణంముందు ఆవరించిన స్తబ్దత సన్నగిలిపోతున్నది. కాని అది పొందిన తృప్తితోనో ఆనందంతోనో కాదు. మనస్సులోని మొదటివూహాంకురాలు సన్నగిలిపోతున్నవి.

మనస్సును కూడదీసుకుని నిలబడి బయటవైపుచూస్తున్నది. స్టేషనుకొరకేమో!

సాఫీని మెలికచేసుకుని విడదీయప్రయత్నించుట మానవస్వభావం. చివ్వునలేచి తనను లక్ష్యంచేయకుండా బయటవైపు చూస్తున్న ఆమెనే చూస్తున్నాడు విజయకుమార్. ఆమెముఖం కనిపించకపోయినా ఆమెలోని క్రుద్ధత స్పష్టంగానే అర్థమవుతున్నది. మనస్సు వినతివైపుకు దారితీస్తున్నది. కాని విముఖతద్వారాకలిగిన ఆమెలోని గంభీరత జంకును గలిగిస్తున్నది.

మరోస్టేషను వచ్చింది, బండి ఆగిపోయింది. టికెట్టుకలక్టరు తలుపుతెరచుకుని లోపల ప్రవేశించాడు. విజయకుమార్ ఒక్కటిక్కెట్టు యిచ్చినందున దానిమీద తనసంతకాన్ని సున్నాగాచదుతూ ఆమెవైపు

చూశాడు. అలకమందిరంలోచేరిన మహారాణివలె ఆయునతి బయటి వైపు ముఖంబెట్టివుండుట అర్థంగానిసమస్యగావుంది అతనికి. అయిదు నిమిషాల వ్యవధిలోనే అటూయిటూ ఆ యిరువురివైపు అనేకసూపులు చూశాడు. ఆమె ఆయనకేమీ కాదనే అతనినిర్ణయం కాదోలు. "మీ టిక్కెట్టు చూపండమ్మా ?" అని ప్రశ్నించాడు.

ఆమెమనస్సు యెంత కలవరపడుతున్నదో వివరించుట కష్టం. నిలిచివున్న బండిలోనుంచి యెవ్వరూ దూకరు. బండి వేగంగాపోతుంటే తప్పక బయటికి దూకివుండేది. శిరస్సును చక్కకేసి బాదుకోవాలని పిస్తున్నది.

"ఏమండి మిమ్మల్నే అడుగుతున్నది ?" అని తిరిగి ప్రశ్నించాడు. వివశురాలై ఆమె యిటువైపు తిరిగింది. కారుమేఘావృతమైన చంద్రబింబమువలెనున్నది ఆమె ముఖము. నేత్రాలు తిరిగిపోతున్నవి. ఏదో చెప్ప నుద్యుక్తురాలవుతున్నది.

ఆమెవద్ద టిక్కట్టులేదని, బాధపడుతున్నదని తెలుసుకున్నాడు విజయకుమార్. వెంటనే పర్సుతీసి పదిరూపాయలనోటు ఆయనచేతిలో వుంచుతూ "టిక్కట్టు విజయవాడకు వ్రాయండి. ఆమె నన్ను పంపించుటకని వచ్చింది. నా బలవంతంతో ఆగిపోయింది కాని టిక్కట్టు కొనగల టయం లేకపోయింది" అన్నాడు.

అయోమయంలోపడిపోయిన టిక్కెట్టుకలక్టరు తెప్పరిలుకుని నవ్వను ప్రయత్నిస్తూ "మీవారేనని నేను మొదట్లోనే అనుకున్నాను. కాని ఒక్కటిక్కెట్టేయిచ్చి ఆమెగారివిషయం మాట్లాడనందున మరెవరోనని వూహించాను" అంటూ ప్యాస్ వ్రాసియిచ్చి తలుపు తెరచుకుని ఫుట్‌పాత్‌గుండా రెండోపెట్టెకు వెళ్ళిపోయాడు.

ఆయనతెరచిన తలుపును విజయకుమార్ బిగించి, ఆమెకు సన్నిహితంగా వచ్చి "అన్యధాభావించక క్షమించండి" అని ఆమె ముఖం వైపు తీక్షణంగా చూస్తున్నాడు. ఆమె మాట, పలుకు లేకుండా ప్రతిమ వలె అలానే వుండిపోయింది.

"మీకు బాగా కోపమొచ్చినట్లున్నది" అన్నాడు.

ఆమెలో మార్పులేదు.

హస్తద్వయాన్ని జోడించి "క్షమకోరినవారిమీద కోపం వుంచుకొనుట ధర్మంగాదు" అన్నాడు.

కఠినమైనస్వరంతో "మీరు యేమిచేసినా మీకు శోభిస్తుంది. అదే యితరులుచేస్తే వికటంగా మీకనిపిస్తుంది" అంటూ తీక్షణదృక్కులను బరపుతున్నది.

"అబ్బ! అంత కఠినత్వం వహించకండి. నాద్వారా మీమనస్సు యెంతగానో నొచ్చుకున్నట్లున్నది. స్త్రీ దుఃఖాన్నిగాని, బాధనుగాని, క్రోధాన్నిగాని పురుషుడు భరించలేడు. మరీమరీ ప్రార్థిస్తున్నాను, మన్నించండి" అన్నాడు.

"స్త్రీలు అసమర్థులు అప్రయోజకులు అయినట్లు అడుగుఅడుగున గుర్తుబెట్టుకు సంచరించుట మీకు సర్దా అనుకుంటాను. ఆపద్బాంధవులుగా ఖ్యాతిబొందాలని మీకాంక్ష అనుకుంటాను" అని మెరమెర చూస్తున్నది.

దెబ్బతిన్న నొప్పికంటె. పొందినఅవమానంతో క్రుంగిపోయినట్లు వెలవెలబోతున్నాడు విజయకుమార్. మారుమాట లేకుండా అలానే నిలిచిపోయాడు.

కొన్నివేళలందు స్త్రీలోని సూక్ష్మగ్రాహ్యం అతి చురుకుగా పనిచేస్తుంది.

"ఎవరి గొప్పతనం యెలాంటిదయినా ప్రతివిషయానికి సమస్యలను ధర్మాలను జోడించుట విజ్ఞతకాజాలదు. కుశలప్రశ్నలకు కృతజ్ఞతాభివందనాలకుకూడా తర్క వితర్కాలుచేయుట సజ్జనత్వమూకాదు" అన్నది.

అత నలానే బొమ్మవలె నిలిచివున్నాడు. మొఖంమీది మలిన ముద్రలు మరింతగా పేరుకుంటున్నవి. నయనాలలో పరితాపంతోగూడిన వ్యధ వ్యక్తమవుతున్నది. ఆయనముఖంలోని దృశ్యం ఆమెను చలింపజేసింది. అనురాగంతో ఆర్ద్రమైంది.

తనకొరకుత్రాయించిన టిక్కట్టును ఆయనచేతిలోనుంచి తీసుకుంటూ దృష్టిలోదృష్టిని బరపింది. దీనత్వంలోని ఆకర్షణలో ఆమెను ఆమె మర్చిపోయి ఆతనిహస్తాన్నిబట్టి నలుపుతూ అనురాగాలొలికిస్తూ

"అంత ఖిన్నులవుతా రెందుకు? సాహసులమనుకునేవారిలోనే పిరికి తనం యేమూలనో దాగివుంటుంది. ధర్మదీక్షాపరులమనుకునేవారిలోనే కీర్తికాంక్ష అనే స్వార్థం తొంగిచూస్తుంటుంది. పొగడ్తలను, ధన్య వాదాలను, క్షమాపణలను స్వీకరించను బాహ్యంగా నిరోధించేవారిలోనే వాటితాలూకు అపేక్ష అధికంగావుంటుంది" అన్నది.

ఆ మాటలతో ఆతడు మరింత చిన్నబుచ్చుకుని వెలవెలబోతు న్నాడు. ఆమె ఆవేశం అణిగిపోయిందిగాబోలు. ఆతని బెత్తువైపు లాగుతూ "చేలపోతా రెందుకు? కూర్చోండి" అని వోదార్పుధ్వనిలో పలికింది.

విజయకుమార్ మనస్సు రవంత కుదుటపడింది. "మీరుకూడా కూర్చోండి" అని ఆమెను ప్రక్కగా కూర్చుండబెట్టాడు. "మీయెడల నాకున్నఅభిమానం అపారమైంది. నాయెడల మీకూ అభిమానమున్నది. మీమనస్సుకు గుచ్చుకునేటట్లు నేను మాట్లాడాను. నామనస్సు వ్యాకుల పడేట్లు మీరు మాట్లాడారు. ప్రీతినివాంఛిస్తూ అనాలోచితమైనమాటలతో అప్రీతినిపొందుట యెంత విచిత్రం!" అంటూ నూతనపరిశోధకునివలె ముఖాకృతిని చేశాడు.

"ఆపద్రక్షకులుగా కంకణంకట్టుకున్నవారికి ఆపత్తిలో మునిగివ దుఃఖితులు, మోసమే వృత్తిగాపెట్టుకున్నవారికి మోసపోయేవారు, అనాధ ఆశ్రయులకు యెక్కడజూచినా అనాధలే లభ్యమవుట, మంత్రు లకు ఫౌండేషన్‌స్టోన్‌లు వరుసగా వెలిసినట్లు దొరుకుతుంటవి. ఆ సదు పాయాలన్నీ దేవుడే చేస్తుంటాడనుకుంటాను. ఈ ఆపత్తులను సృష్టించక పోతే ఆపత్‌బాంధవులఘనత స్తుతించేవారుండరనేమో!" అంటుండగా మధ్యలోనే విజయకుమార్ వినతిదృక్కులతో చేతులుజోడించి "నన్ను మెచ్చగొట్టాలని ప్రయత్నించకండి. నామనస్సు స్థిమితపడింది. మీరు యేమిచేసినా యేమిఅన్నా అవి నన్ను ఆకర్షిస్తాయనిమాత్రం గ్రహించ ప్రార్థన" అన్నాడు.

ఆ జోడించిన రెండుహస్తాలనుబట్టి వత్తుతూ తనభుజస్కంధం మీదికి లాక్కుని, ముద్దులొలికిస్తూ "అబ్బ! మంచివ్యక్తులలో ఒక చిన్న

లోపముంటుంది. మీలోకూడా అలాంటి లోపమెందుకున్నదో !" అన్నది.

"ఏమిటది ?" అన్నాడు.

"మీయడలగల అభిమానం నా మనస్సులో వుక్కిరిబిక్కిరవు తున్నపుడు మీకు వినిపించి వుపశాంతినొందుట స్వాభావికం. నేను విని పించదలచినవన్ని విని గ్రహించినట్లుతెలియజేస్తే మహానందం కలుగు తుంది. అలాకాక అలక్ష్యము, వంచనచేసేవిధానము మీలోవుంది. అది వున్నట్లు తెలియనిరీతిలో దాగివున్నది" అన్నది.

"మానవునికి దుర్ఘటనలద్వారానే వున్నతమైనవిజ్ఞానం లభిస్తుంది. అనుభవం అవగతమవుతుంది. మీద్వారాపొందిన అనుభవంలో యిక యెన్నటికీ అలాచేయనని వాగ్దానంచేస్తున్నాను" అన్నాడు.

ఆతని అరచేతులను పరశీలనచేస్తూ తనకపోలాలమీదవేసి అదుముకుంటూ "అయితే యిక నేను యేమిచెప్పినా వినుటేగాక అంగీక రిస్తారన్నమాట" అన్నది.

"తప్పకుండా. మీ ప్రతిమాటను ఆనందంతో స్వీకరిస్తాను !" అన్నాడు.

"మాటతప్పగూడదు విజయకుమార్‌గారు. నామాటలను అక్ష రాలా పాటిస్తానని మాటయిచ్చుట వరమిచ్చుటలాంటిదే ! ఆ వరంద్వారా మీమీద అధికారం సంప్రాప్తమవుతున్నది. తెలిసికూడా అంతటి అధి కారాన్ని యివ్వగలరా ?" అన్నది.

"స్త్రీకోర్కెలను మన్నించుట పురుషునికి స్వతస్సిద్ధమైన స్వభావం. నీకోర్కెను కాదనగలశక్తి నాలోలేదు" అన్నాడు.

అమాటలతో ఆమెహృదయంలోని సంకోచాలుపోయి ప్రఫుల్లిత మైంది. కంఠంలోతీయదనం సృజిస్తున్నది. ఆతడు మరింత సన్నిహితం చేసుకుని "మీరు చాలా విచిత్రమైనవారు. మీ మనస్తత్వం యేక్షణం యెటు మర్లుతుందోననిపిస్తుంది. ఇంతకుముందు మీ మాటలతో యెంత అసంతృప్తిపొందానో వ్యాకులపడ్డానో యిపుడు అంత తృప్తితోతన్మయు రాలనవుతున్నాను. ఆ పరీక్షలరోజు అలావుంచి యింతకుముందు టిక్కట్టుకలక్టరు వచ్చినపుడు యెంత క్షోభతోవూగిపోయానో చెప్ప

లేను. పరీక్షలలోవలెనే నన్ను క్షణంలో విముక్తిరాలనుచేశారు. మీరు కథలను బాగా అల్లగలరుసుమా! మీమాటలనుబట్టి అత నేమివూహించి వుంటాడో చెప్పండి?" అన్నది.

ఆయన వోరగాచూస్తూ "నీవు నాతోరావటానికి నేను యిష్టపడ లేదని, బండినుంచి దిగిపోవుటకు నీవు యిష్టపడలేదని యీ వాదవివాదా లతో మనం పయనిస్తున్నామని అత డర్థంచేసుకునివుంటాడు" అని సమాధానమిచ్చాడు.

ఉప్పొంగుతున్న ఆదుర్దాతో "....మన యిరువురికిగల సంబంధం యేమిటనుకుంటాడు?" అని ప్రశ్నించింది.

ఆయన సామాన్యధోరణిలోనే "నూతనదంపతులమనుకుని వుంటాడు" అని సమాధానమిచ్చాడు.

ఆ మాటలు ఆమెహృదయతంతువులమీద జిలిబిలిగా మీటినట్ల యింది. శరీరమంతా ఆనందతరంగాలతో నర్తిస్తున్నది. ఉబికివస్తున్న ఆనందాన్ని దాచిపెట్టుకొన యెంతప్రయత్నించినా విఫలమందుతున్నది. "ఒకకన్యకు యిలాంటి అపవాదుకను ఆపాదించుట యెంతదోషమో, రవంతైనా ఆలోచించారా?" అని ప్రశ్నించింది.

"అపవాదుకంటె ఆపత్‌రక్షణ ప్రధానమైంది" అన్నాడు.

ఆమె కొంటెగా నవ్వునుప్రదర్శిస్తూ "అది ఆపత్తీగాదు యిది రక్షణాగాదు విజయకుమార్! ఒక వంచననుంచి తప్పించను మరో వంచనను నెత్తినరుద్దారు" అన్నది.

"నీమనస్సులో నీవు యేమనుకున్నా పరవాలేదు. అతనిమన స్సులో నిన్ను దోషరహితురాలను గావించాను. అంతవరకే నాకర్తవ్యం" అన్నాడు.

"అతనిమనస్సులోని దోషభావాన్ని తుడిచివేయవచ్చు, కాని ఆతరువాత కల్పించినభావానికి మీబాధ్యతెంతో గుర్తించండి!" అన్నది.

"విషయాలను తర్కించేఅలవాటు నాకు తక్కువ. ఎప్పటి కప్పుడు ఆ సందర్భాన్నిబట్టి మనస్సుమొగ్గినవైపుకు పోతుంటాను" అన్నాడు.

"ఆ ఫలితాలతో మీకు ప్రమేయమేలేదా?"

"ఆనాటిపరీక్షలలో నేను పొందినఫలితం నీకు తెలుసు. అందుకు నేనెన్నడూ చింతించలేదు. ఫలితం యెలాంటిది ప్రాప్తించినా మనస్ఫూ స్వీకరిస్తాను."

అనురాగాలొలుకుతున్న వెర్రిచూపులతో "అయితే పదినిమిషాల ముందు ప్రాప్తించినఫలితాన్నికూడా మనస్ఫూర్తిగా స్వీకరిస్తున్నారా ?" అన్నది.

"భుజిస్తున్నవానిని ఆకలివేస్తున్నదా, అని ప్రశ్నించుట యెంత వెర్రిప్రశ్న ? అయినా యిందు ఆలోచించగల, స్వీకరించగల విషయ మేమున్నది ? టిక్కట్టు కొన్నాము, అది వృధాకాకుండా పయనంసాగుతున్నది !" అన్నాడు.

ఆమె అసంతృప్తితో దిగజారిపోయింది. ఏకోణంమీద కేంద్రీకరించి సమాధానం ఆశించిందో అందుకు దూరమైనసమాధానం లభ్యమవుతున్నది. ఆయనఅభిప్రాయం తెలుసుకోవాలని పడే ఆదుర్దా వ్యర్ధమవుతున్నందున విసగడతో మవునంవహించి, బయటిదృశ్యాలవైపు చూస్తున్నది.

అయిదునిమిషాల అనంతరం నిశ్శబ్దాన్ని భగ్నంచేస్తూ "మీటింగు సమయంలో వినికూడా మీపేరు మర్చిపోయాను. పేరేమిటన్నారు ?" అని ప్రశ్నించాడు.

ఆమె తననుగాదన్నట్లు బయటివైపే చూస్తున్నది. తానుకూడా బయటివైపుచూస్తూ కోరచూపులను ఆమెవైపుబరపుతూ "చిరాకులు, అలకలు, కన్నీరు ఆడవారి ప్రత్యేకసొత్తులు" అన్నాడు.

మార్పులేదు.

"మీరెక్కడి కెళుతున్నారు ? టిక్కట్టయినా కొనకుండా బండి యెందుకెక్కారు ?" అని ప్రశ్నించాడు.

ఆమె చిరచిరలాడుతున్న చిరాకుతో "నాపేరు సరళ. యేట్లోకి పోతున్నాను. టిక్కట్టుకొనేదాతలు మీరున్నారుగదా యని కొనలేదు. చాలా ? యింకేమయినా వివరాలుకావాలా ?" అని గద్దించి అడిగింది.

అనునయంగా "అబ్బ ! పేరును గుర్తుజేశారు సంతోషం. మీపేరు సరళ, కాని మీరు సరళంకాదుసుమా ? యేట్లోకి యిది దారి

కాదు. మీరు దాతగా అంగీకరిస్తే ధన్యుణ్ణి" అని ఆమెవైపు చూస్తున్నాడు.

ఆమె మరింత వుత్తేజితకంఠంతో "ఏట్లోకితీసుకెళ్ళు దాతలు, మార్గదర్శకులు మీరుండగా దారితెలుసుకోవలసిన అవుసరమేముంది!...." యింకేమో అనబోతుండగా ఆమెఅధరాలమీద హస్తంవేసి అదిమి "మీకోపంలోని ఆకర్షణ అద్వితీయమైంది. మీకు యేటిదారి చూపవలసివస్తే, కవుగిటిలోబిగించి అందులో మునిగిపోతే యెంత బావుండునని పిస్తున్నది." బుసబుసపొంగినపాలు పాత్రనుంచిజారి అగ్నిలో దుమికి ఆర్పగానే ఆ పొంగు చల్లబడిపోయినట్లు ఆమాటలతో ఆమెమనస్సు చల్లబడిపోయింది. తన నోటిమీదనుంచి ఆయనహస్తాన్ని తన హస్తాల లోకి దీసుకుని, నిర్వైరపాటులో ఆతనిముఖాన్ని పరికిస్తున్నది.

ఆమెఅధరాలమీద ముసుగుముసుగుగావున్న నవ్వురేఖలను గమనించి "యెప్పటికప్పుడు మనపరిచయాలు విచిత్రరూపంలో జరుగుతున్నవి.పరీక్షలలోవలెనే మీటింగులోను అంతకుమించి విచిత్రరూపంలో యిక్కడ యీవిధంగా ఒకరి నొకరం కలుసుకున్నాము. ఇకముందెలా కలుసుకుంటామో! విరుద్ధభావాలతోను విముఖత్వపు వాతావరణంతోనో సంభవించిన పరిచయసన్నివేశాలు అతిమధురత్వాన్ని కల్పిస్తవని, లోతుబపారిన ప్రేమతోను, ఆహ్లాదంతోగూడిన ఆనందములోను, మధురమయసుముఖతలతోను పరిచయ ప్రారంభమైన సన్నివేశాలు వికృతఫలితాల నిస్తవని అనుభవజ్ఞులంటారు. కాని వాటిరెంటికీ భిన్నమైన పరిచయం మనది. ఒకక్షణం మీమాటల్లో అమృతమొలుకుతుంటుంది, మరుక్షణం మాటలు ముళ్ళవలె గుచ్చుకుంటవి...." మధ్యలోనే ఆమె కల్పించుకుని "మీరు నన్నుగురించి అనుకున్నమాటలే నేనూ మిమ్ముగురించి అనుకుంటున్నాను. మీమాటలను మీరే విస్మరిస్తుంటారేమో! స్త్రీలను గౌరవించేవారుగాను పూజించేవారుగాను కనిపిస్తారు. నేను యేమికోరినా ఆనందంతో ఆదరిస్తానని మాటమాత్రం అన్నారు. ఆ మరుక్షణమే మర్చిపోయి వికటంగా సంభాషిస్తున్నారు" అన్నది.

గల్లగల్లనవ్వుతూ "మీరు భలేవారు. మిమ్మల్ని న్యూనతపర్చాలని యెలా అనుకోగలను! నూతనపరిచయాలలో పొల్లులుపోవుట సంభవిస్తుంది. అవి కేవలం అపార్థాలుమాత్రమే. మీకు బాధకలిగించే మాటలేవయినా అంటే నన్ను క్షమించండి" అన్నాడు.

"క్షమించుట అంత తేలికయినపని గాదు" అన్నది.

"చేతులుజోడించి వినతితో ప్రార్థించుకుంటున్నాను" అన్నాడు.

ఆమె గంభీరతను సడలనీయకుండా వీలులేదని శిరస్సును వూపింది.

పాదాలుఅంటి క్షమచెప్పనుగాబోలు ఆమె మోకాళ్ళమీద చేతులు మోపి వంగ ప్రయత్నిస్తుండగా అతనిశిరస్సును తన వడిలోకిలాక్కొని, శిరస్సు నిమురుతూ "నీతో నిస్సంకోచంగా ముచ్చటగా యేకాంతంగా మాటాడాలని యెంతో ప్రయత్నంతో యీ అవకాశాన్నిపొందాను విజయ్‌కుమార్" అన్నది.

ఆమెవుదరంవైపునున్న ముఖాన్ని పైకి త్రిప్పి కొండలమధ్యగా చూస్తున్నట్లు ఆమెముఖాన్ని తనివిదీర చూస్తూ "నీవు నాకొరకనే యిలా ప్రయాణమై వచ్చావా?" అని ప్రశ్నించాడు.

తృప్తితోగూడిన కంఠంతో "విద్యార్థినాయకుడు విజయకుమార్ సన్మానయేర్పాట్లలో పెద్దపాత్ర నాది. ఎంతో వుత్సాహంగా హడావుడులు పెట్టాను. తీరా ఆ విద్యార్థినాయకుల్లు మీరేనని నాకుతెలిసినక్షణంనుంచి నామనస్సంతా ఆలోచనలతో వుక్కిరిబిక్కిరి అయిపోయింది. ప్రేమదీర మీతో మాట్లాడనిదే, క్షమాపణ చెప్పుకోందే, నామనస్సు స్థిమితపడే రీతిలో లేదు. మీరు రైలుఎక్కువరకు నాకా అవకాశం కలుగలేదు. వెంటనే వుపాయాన్ని వూహించుకుని జనంమూకనుంచి బయటపడి రిక్షాలో ప్రక్కస్టేషనుకు చేరాను. బండి కదలనున్నదికనుక అలానే యెక్కాను...." అంటూ పసిపాపనుచూస్తున్నట్లు తనవడిలోని అతనిని చూస్తున్నది. ఆ మాటలతో అతను ఆశ్చర్యాన్వితుడైనాడు. అతని ఒక కపోలం ఆమెవుదరస్పర్శను పొందుతున్నది. దుస్తులసుగంధం మత్తులో ముంచుతున్నది. తనశిరస్సుక్రింద మృదువుగావున్న ఆమె కాళ్ళు వత్తుకుని నొప్పి తగులుతుందేమోనని సంకోచపడుతున్నాడు.

కాని లభ్యమైన సుఖప్రదఅవకాశాన్ని జారవిడుచుకోజాలక అలానే వుండిపోయాడు.

"నేను చాలా పొరపడ్డాను సరళా ! ఎక్కడికో పయనిస్తున్నట్లు వూహించాను. నన్ను క్షమించు" అంటూ ఆమెచుబుకాన్ని స్పృశించాడు. ఆమెవాంఛిస్తున్న ఆదరాభిమానాలు లభ్యమైనట్లు హృదయం తృప్తితో కంపించింది. కంఠం బరువెక్కి పెగలలేదు. కన్నీటిబిందువులు రెండు ఆతనిలలాటంమీద రాలినవి.

ఆమెశిరస్సును తనవైపు లాక్కుంటూ "ఇదేమిటి సరళా ? కన్నీరుకారుస్తా వెందుకు ?" అన్నాడు.

వణుకుతున్న కంఠంతో "గాబరాపడవోకు విజయకుమార్ ! ఇవి ఆనందభాష్పాలు. నాజీవితంలో యింతటి ఆనందాన్ని యెన్నడూ పొందియెరుగనేమో !" అన్నది.

"కొన్నివేళలందు మనస్సు అవాంఛితమైనవైపు నడిచి ఆ తరువాత పశ్చాత్తప్తుని చేస్తుంది" అన్నాడు.

"దుఃఖంతరువాతపొందే సుఖంలోని అనుభూతి ప్రత్యేకమైంది, మరపురానిది, వాంఛనీయమైంది. తీవ్రమైనయెండలోని నీడవిలువ అమూల్యమైంది" అంటూ ఆయనదృష్టిలో దృష్టబరపుతోంది. నయనాలు యింకా తొణికిసలాడుతున్నవి. మిసమిసలాడుతున్న నవయవ్వనంలోని మెరమెరలు ముఖమండలంలోశోభిస్తూ మనస్సును కలవరపరుస్తున్నది. ఆవేశితుడై హస్తద్వయాన్ని మెడమీదగాచుట్టి తనవైపుకు లాక్కుంటూ, దీర్ఘశ్వాసను విడచి "సరళా....." అన్నాడు. తన మోకాళ్ళమీదవున్న ఆయన్ను వుదరంవైపులాగి వత్తుతూ మీదకు వరిగిపోయింది. వక్షోజాలమధ్య ఆతనిముఖం వత్తుకుపోతున్నది. ఆ వక్షోజాలనుంచి తనముఖం పొందుతున్నవేడి విచిత్రమైన గిలిగింతలతో శరీరమంతటికి పరువులెడుతున్నది. నరాలు తన్నితానంచేస్తున్నవి.

బండి బెజవాడస్టేషనుచేరింది. ఇరువురు తిరిగి చదువుటకు

స్థిరంగా నిర్ణయించుకున్నారు. వెంటవెంటనే ఉత్తరాలువ్రాసుకోవటానికి ఒడంబడికలు చేసుకున్నారు. భవిష్యకార్యక్రమాలు, కలుసుకోవటాలు ఉత్తరప్రత్యుత్తరాలద్వారా తెలుపుకొనుటకు వారిద్దరులు సమ్మతించుకున్నారు.

సరళ తిరిగ ఒంటరిగా బందరుబండిలో పయనంసాగిస్తున్నది. రెండుగంటలకలియకతరువాత విజయ్‌తో పొందిన యెడబాటు ఆమెకు భరించరానిబాధను కలిగిస్తున్నది. ప్రకృతిలోని యీ విచిత్రమాయ యెన్నటికీ యెవరికీ అర్థంకాదేమో!



# 12. న్యాయస్థానంపేరిట అన్యాయం

జలరాశినుంచి బయటపడిన మత్స్యబాధవలె సరళ యింటికిజేరి తపనలో నలిగిపోతున్నది. ఎవరు పలుకరించినా విసగడగావుంటుంది. మాట్లాడాలనిపించదు. పుస్తకాలమీద మనస్సు లగ్నంకాదు. ఒకచోట కూర్చుంటే వూపిరి సలుపదు. కాలుగాలినపిల్లివలె అటూయిటూ తిరుగుతుంటుంది. మనస్సులో విజయకుమార్ విషయాలు వరుసగా మెదులుతున్నవి.

అపరాహ్నసమయ మది. సాగరతరంగాలనుతాకి వస్తున్న పవనాలు చల్లగా హాయినిగల్గిస్తున్నవి. దొడ్లో వరుసగావున్న సరివిచెట్లు మూల ప్రక్కనున్న పొన్నాయిచెట్లు కోసుకుపోతున్నగాలికి చిత్రవిచిత్ర ధ్వనులను సృష్టిస్తున్నవి. గగనవీధుల్లోని దూదిపింజలలాంటి మబ్బులు వరుసగా సాగరగర్భంవైపుకు మందగమనంతో పయనిస్తున్నవి. చేపల వేటకు సముద్రంలో దూరదూరాలకు తెప్పలమీదవెళ్ళిన పల్లీలు కాకులవలె చిన్నచిన్నగా కనిపిస్తున్నారు.

సన్మానసన్నాహాలలో అలసటజెందిన రవిప్రసాద్ దీర్ఘనిద్రలో బడలిక దీర్చుకుని, తాపీగాతయారై సరళకొరకు పయనమయ్యాడు. కోర్టుద్వారా ప్యాసై యింత ఘనతబొందిన విజయకుమార్‌వలె తానూ కోర్టులో దావావేసి ప్యాసయితే యెంతబావుండును, అని ఆలోచనగలిగింది. విజయకుమార్ బాగా వ్రాశాడుగనుక కోర్టులో సత్ఫలితాన్ని పొందాడని, తానలా వ్రాయలేదుగనుక నిష్ప్రయోజనమవుతుందని మరో ఆలోచన గలిగింది. సరళ తప్పినపుడు తాను ప్యాసుగావలసిన అవసరంమాత్రం యేమున్నదని. ప్యాసయినా తప్పినా యిరువురు కలసివుండుట అభిలషణీయమని, ఇది బలీయమైన పూర్వజన్మ సంబంధమని, ప్యాసయినా తప్పినా యిరువురికి ఒకటేజరుగుట గొప్ప గమనార్హనీయమని మరోప్రవృత్తి తృప్తిని చేకూరుస్తున్నది.

తామిద్దరు తప్పుట తప్పనిసరిగా భగవదేచ్ఛకు సంబంధించినదని, మొదలగు విషయాలతో సమాధానపర్చుకుని సంతృప్తినిపొందుతూ సరళ యింటికి చేరుకున్నాడు.

అటుయిటు మేల్లాలో తిరుగుతున్న సరళ రవిప్రసాద్‌ను ఆహ్వానించి ఆసీనునిజేసి యెదుటనిలిచి సంకోచాలను సరిదిద్దుకోప్రయత్నిస్తున్నది. ఆమెతో యేమేమో మాటాడాలని ఆలోచనలతోవచ్చిన రవిప్రసాద్ ఆమెముఖకవళికలను చదువగలస్థితిలో లేదు.

"ప్రార్ధనలో క్రొత్తగీతికనుపాడాలని రెండురోజులు తయారయి ఆఖరకు ఆ పాతపాటనే పాడావెందుకు సరళా!" అని ప్రశ్నించాడు.

"అంతటి మహాజనంలో క్రొత్తపాటను పాడగలధైర్యం లేకపోయింది" అన్నది.

"పాట పాతదయినా, బాణి చాలా నూతనస్థాయిలోవున్నది. నీవు పాటప్రారంభించగానే గోలంతా నిశ్శబ్దమైపోయింది. నీవదివరకెన్నడూ అంత బాగా పాడలేదనిపించింది. సభగనుక సరిపోయింది. డ్రామాలో అలాంటిపాట విన్నపుడు వన్సమోర్ అనివుండేవాడిని" అన్నాడు.

"మెరమెప్పులమాట లనబోకు. భయంతో గుండె దడదడలాడి కంఠంలో వణుకు కలిగింది. అందువలన పాట సాఫీగా సాగలేదు. ఏమీ బాగాలేదని అందరూ అనుకునివుంటారు" అన్నది.

"నీముందు మెరమెప్పుమాట లెందుకు మాట్లాడతాను. నీకంఠం శ్రావ్యమైందిగనుక ఆ వణుకు మెరుగులుదిద్దింది. నిజంగా నీపాట అద్భుతంగావుంది సరళా!" అన్నాడు.

ఆమె మారుమాటాడలేదు.

"విజయకుమార్‌వుపన్యాసంకంటె మన విశ్వనాధం మాట్లాడిందే చాలా బాగుంది. మంచిధోరణిలో వుత్తేజితపరుస్తూ ప్రేక్షకులలో వూపుతెస్తూ గంభీరంగా వుపన్యసించాడు" అన్నాడు.

"అది అభ్యాసంద్వారా అలవడేది. అది హృదయఅంతస్తును సూచించజాలదు" అన్నది.

ఆమాట రవిప్రసాద్ కర్థంగాలేదు. ఆమెఅంతరార్థం అసలే తెలియద్దు. తటపటాయిస్తూ "విశ్వనాథం యిదివరకెన్నడూ సభలో మాట్లాడిన అలవాటు లేదుగదా!" అన్నాడు.

"విశ్వనాథం మనస్థిమితంలేనివాడు. ఒకనాడు మహిళామండలిని నిరోధిస్తూ ప్రశ్నలమీదప్రశ్నలు వేశాడు. తరువాత పారిజాతంపరిచయంతో చల్లబడిపోయాడు. వారి అడుగుజాడలలోనడుస్తూ వుపన్యాస ధోరణిని అలవర్చుకుంటున్నాడు" అన్నది.

మహిళామండలినిగురించి ప్రజలలో హీనమైనఅభిప్రాయాలున్నవని, అందుకే నిన్ను అటుపోవద్దని యెన్నోమాటలు చెప్పాను...." అంటుండగా కల్పించుకుని "పదిమంది హీనంగా అనుకున్నంతమాత్రాన వారు హీనులనుకొనుట వెర్రితనమవుతుంది. వారిపోరాటం అర్థహీనం గాదు. వారిలో ప్రతిఒక్కరు సుఖసౌఖ్యాలను వ్యక్తిగతంగా త్యజించి సేవాకంకణబద్ధులైనవారు" అన్నది.

తవుడుకుంటున్నవానివలె "అయితే విశ్వనాథం వారి కార్యకలాపాలలో ప్రాగ్రాముటకూడా సేవేగదా!" అన్నాడు.

"అలా యెప్పటికీ కాదు. స్వతసిద్ధంగా ఆయన వారికి విరుద్ధమైనస్వభావం గలవాడు. అందుకు నిదర్శన మొదటిరోజు ఆతడు అడిగిన ప్రశ్నలే. ఆతరువాత పారిజాతంమైకంలోపడి మారిపోయాడు. అలాంటి అతనిని విజయకుమార్‌తోపోల్చుట ధర్మంగాదు. అభ్యాసం లేనందువలన ధారాళంగా వుపన్యసించలేకపోవచ్చు. కాని గొప్పవిజ్ఞుడు, ప్రజ్ఞావంతుడు, నీతినియమము, కార్యదీక్షగలవాడు" అన్నది.

అసంతృప్తిసూచక చిహ్నాలను ప్రదర్శిస్తూ "అంత గొప్పగొప్ప మాటల నుపయోగించుటకు తగిన ఆధారాలు గతంలోవి తెలియాలిగదా! అతను సాధించింది నిజానికి అంత హర్షింపదగిందిగాదు.గురుతుల్యులైన వారిని ప్రతికక్షిగానిలిపి నిందించుట విజ్ఞతకాదు. మామూలుగా ప్యాసుకాలేక కోర్టుద్వారా ప్యాసవుట వాస్తవానికి ఘనమైందిగాదు" అన్నాడు.

"అయితే ఆ విజయకుమార్‌కు యింత ఘనసన్మానం యెందుకు చేశాము?" అన్నది.

"అది నేటి విచిత్రరీతి. కుయుక్తులకు, కుతంత్రాలకు, జిత్తులకు, యెత్తులకు ప్రాధాన్యమిస్తున్నరోజులు గనుక. వివక్షతారహితంగా యెదుర్కొనుట, విజయంబొందుటే శ్లాఘనీయముగా యెంచుతున్నరోజులు గనుక ధర్మంతోను నీతితోను పనిలేదు" అన్నాడు.

"ఆత్మవంచన అన్నిటికంటే హీనమైంది. తన కయిష్టమైన దానిలో పాల్గోవటం, ఆ తరువాత విమర్శించటం అతిమూర్ఖమైంది" అని రౌద్రరూపంలో మాట్లాడింది.

వెలవెలబోతూ వెర్రివానివలె తన తప్పిదమేమిటో తెలియక నతనతగాడుతూ "....ఏమిటి సరళా! నీ అభిప్రాయమేమిటో నాకు తెలియుటలేదు...." అన్నాడు.

"అయిదునిమిషా లనంతరం "బాగా మాట్లాడినంతమాత్రాన విశ్వనాథం గొప్పవాడుగాదు! సభలో ధారాళంగా వుపన్యసించలేకపోయి నంతమాత్రాన విజయకుమార్ సామాన్యుడు కాజాలడు" అంటూ అతని వైపు తీక్ష్ణదృక్కులను బరపుతున్నది.

ఇంతలో సరళతల్లి యేదోపనిమీద అటువైపు వచ్చి వారిసంభాషణలోని కొన్నిమాటలు విని, మందలింపుగా "మీలో కష్టపడి చదివి ప్యాసవుదామనేఆదుర్దాగాని తలంపుగాని లేదు. చదవలేనివాళ్ళకు, మార్కులురానివాళ్ళకు వక్రబుద్ధిలో చురుకుదనముంటుంది, ఇదివరకు మార్కులకొరకు వేటాడేవారు. నేడు మీకు నూతనమార్గమొకటి దైవప్రసాదమువలె లభించింది. ఇక మీకు చదువులూ అక్కర్లేదు, ప్లీడర్లూ అక్కరలేదు. ఆ కోర్టుద్వారా ప్యాసయిననాయకునే పట్టుకోండి. కోర్టుద్వారా ప్యాసుకావటానికే ప్రయత్నించండి. అదే మీకు శరణ్యం" అని విసుగుగా అన్నది.

రవిప్రసాద్ ఖిన్నుడై క్రిందివైపు చూస్తున్నాడు. సరళమనస్సుకు కష్టంతోచింది గాబోలు "అదేమీటమ్మా. నీవు అనాలోచితమైన మాటలు మాట్లాడతావు! చదవకుండా దొడ్డిదోవన ప్యాసుకావాలని యిక్కడెవరికీ లేదు. పరీక్షాధికారుల దయాదాక్షిణ్యాలమీద ప్యాసుకావాలని అంతకంటే లేదు. కష్టపడిచదివి వ్రాసినదానికి ధర్మంతో నిష్పక్షపాతంతో విలువకట్టమని కోరుతున్నాము. అది తప్పా?" అన్నది.

తల్లి మరింత విసగడతో "అవునుమరి, నేటివరకు తరతరాల నుంచి విద్యనుబోధించినవారు పరీక్షలు నెగ్గించినవారు ఆదర్శంతోనే చేశారు. ఈ ప్రపంచానికి ప్రసాదింపబడిన విజ్ఞానభాండారమంతా అన్యాయంతోనే జరిగింది. నేడు కోర్టుద్వారాప్యాసయిన ఆ అబ్బాయి ద్వారాను, మీద్వారాను, కోర్టులద్వారాను ధర్మపరీక్షలు జరుగబోతున్నవి. చదవకుండా పరీక్షలలో వ్రాయకుండానే ప్యాసుచేసేపరీక్షలు యిక మీద్వారా యేర్పాటుకావాలి" అన్నది.

"పరీక్షలలో వ్రాయనివాళ్ళను కోర్టులయినా యెలా ప్యాసుచేయ గలుగుతవి అత్తయ్యా? విజయకుమార్ బాగా వ్రాశాడుగనుక తప్పి నపుడు ధైర్యంతో కోర్టుకువెళ్ళి ప్యాసుకాగలిగాడు. అదికూడా అందరికీ సుసాధ్యంకాదు" అన్నాడు.

సరళ చిరచిరలాడుతూ "నీకీ విషయాలు అర్థంగావులే అమ్మా! అనవసరంగా నీకెందుకు పో. ఒక పరీక్షాధికారి సతీమణిమీదపోట్లాడి ఆకోపంతో దిద్దినంతసేపు మార్కులు సగానికిసగం విరగ్గోశాడని నిన్న విజయకుమార్ తనవుపన్యాసంలో చెప్పాడు. భార్యమీదికోపం పాప పుణ్యాలుతెలియని విద్యార్థిమీదచూపుట ఘోరఅన్యాయం కాదా?" అని క్రోధావేశాలతో అన్నది.

"ఆయన భార్యమీద పోరాడటము, ఆ కోపాన్ని యేపేపర్లమీదో చూపటము యీ నాయకుడు చూచివచ్చాడు! నమ్మే వెర్రివెంగళాయ లుంటే సరి!" అని యీసడింపుగా తల్లి అన్నది.

"దేశంలోని వార్తలన్నిటిని ప్రకటించేవారు చూసి ప్రకటిస్తున్నారా యేమిటి? నీకర్థంగానివిషయాలలో తలదూర్చుటెందుకు గాని, నీ పనేదో నీవుచూసుకో అమ్మా!" అని గద్దింపుతో అన్నది.

"అవును మీ ధర్మపోరాటరహస్యాలు నాకెలా అర్థమవుతవి?" అంటూ తల్లి వెళ్ళిపోయింది.

రవికి తిరిగి స్కూల్లో చదువాలనిలేదు. ప్రయివేటుగాచదివి పరీక్షలకు హాజరుగావచ్చుని ఆలోచన. కాని సరళ స్కూలులోనేచదువ నిశ్చయించినపుడు తననిర్ణయానికి స్వస్తిజెప్పాడు.

ఇపుడు స్కూలులోచేరి _ ప్లాతబల్లమీదనే తమహక్కును

పునఃస్థిరీకరించుకున్నారు. కాని యిరువురిలోను ఇదివరకున్న స్థిమితం లేదు.

విజయకుమార్ మాటలు ఆమెవీనులలో అనుక్షణము వినిపిస్తుంటవి. ఆతని ఆదేశానుసారమే తిరిగి స్కూలులో జేరింది. కాని ఆతను చెప్పినట్లు శ్రద్ధగాచదువుట ఆమెకు చేతగానివిషయమయింది. మనస్సులో ఆవరిస్తున్న ఆలోచనలు చదువును చెదిర్చివేస్తున్నవి. దాగుడు మూతలాటలో పయనిస్తున్నది.

రవిప్రసాద్ చదువును లక్ష్యంగాబెట్టుకుని స్కూల్లో చేరలేదు. సరళ చేరనిశ్చయించినపుడు తాను మారుఆలోచనలేకుండా చేరిపోయాడు. చదువులు పరీక్షలకంటె తనమనస్సు సరళవైపులగ్నమైయుంది. కాని ఆమెద్వారా నేడు నూతనరూపంలోని అనాదరం లభ్యమవుతున్నది. ఆమె పిలుపుద్వారానో సంప్రదింపులద్వారానో ఆశారేఖ లుదయించి ఆ మరుక్షణమే నిరాశతోగూడిన విసగడతో అదృశ్యమవుతున్నది. ఆమెలోని యీ మార్పుకుకలిగిన చంచలత్వానికి యెంత ఆలోచించినా అర్ధమవుటలేదు. ఒకప్పుడు ఆమెఅనురాగమత్తులోను, మాటల మాధుర్యంలోను లీనమై చదువలేకపోయాడు. నేడు అర్ధంగాని అల్లీబిల్లీ ఆరాటవ్యధలో చదువలేకపోతున్నాడు.

బాగాచదివి ప్యాసుకమ్మని విజయకుమార్ గట్టిగాచెప్పాడు సరళకు. ప్యాసయి ఆతనిమెప్పులుబడయాలని ఆమెతలంపు. అయినా వూహాలోకవిహారం అధికమైనందున చదువు సాధ్యమవుటలేదు.

తనమనస్సులోని ఆలోచనలస్వరూపంతెలియని రవిప్రసాద్ యెన్నోమారులు ధూత్కరింపబడ్డాడు. తాను యెంత యీసడించినా నిర్లక్ష్యంతో నిరాదరించినా చిన్ని చిరునవ్వుచాటున అన్నిటిని దాచుకుని తననంటి వెంటపడుతున్న రవిప్రసాద్ యెడల జాలి నొందుతుంటుంది. మనస్సంతా చీకాకుతో బరువెక్కినపుడు అతనికొరకు తెన్నులు చూస్తుంది. ఆదరంతో అనేకప్రశ్నలువేసి ప్రయత్నపూర్వకమైన నవ్వును ప్రదర్శిస్తుంది. అతనిమనస్సులోని వుదాసీనతంతా వెడలిపోతుంది. సుడిగాలికి పైకెగసినవి తిరిగి నెమ్మదిగా క్రిందవాలినట్లు పాతఆశలతో మిళితమైన ఆనందరేఖలు తిరిగి కూడుకుంటవి.

---

# 13. ప్రేమపాశం

మహిళామండలివారి కార్యక్రమం యెప్పటికప్పుడు విశ్వనాధానికి తెలుస్తుంటుంది. విశ్వనాధంచదువుకు తండ్రి స్వస్తిజెప్పించాడు. తన యెరువులడిపోలోకిజేర్చి సమర్థవ్యాపారినిచేయాలని తండ్రివాంఛ. కాని స్వార్థాలలోమునిగి జీవితాన్ని అప్రయోజకత్వంలోముంచి బాధపడేకంటే మహిళామండలివారి ధ్యేయానికి తన జీవితాన్నంకితంచేసి సార్థకంజేసుకోవాలని ఆతనివాదం.

"వెర్రిమొర్రిఆలోచనలను పెంచుకోక వ్యాపారంలోజేరి వ్యక్తిత్వాన్ని సంపాదించుకో !" అన్నాడు.

"వ్యక్తిత్వం సంపాదనద్వారావస్తే, అది సంకుచితమైంది. విజ్ఞానంద్వారా మానసికవికాసం బొంది నిస్వార్థసేవద్వారాపొందే వ్యక్తిత్వం గణనీయమైంది" అన్నాడు విశ్వనాధం.

"దేశమంతా పరిహసించే ఆ మహిళామండలిలోజేరి జీవితాన్ని వ్యర్థంజేసుకోవటం పిచ్చితనమవుతుంది" అన్నాడు తండ్రి.

"ప్రారంభదశలో కాంగ్రెసుసంస్థనుకూడా దేశం పరిహసించింది. కాని దేశవ్యాప్తమై గొప్పశక్తిని పొందినపుడు ఆదరించింది. ఏ కార్యాన్నైనా ఆత్మబలంతో సాధనజరిపినపుడు దానికి పవిత్రత వచ్చుట ఆదరం లభించుట అనివార్యమైన విషయం" అన్నాడు.

"చదివించినఫలితంగా నీవు నేర్చింది వితండవాదందప్ప మరేం గనిపించుటలేదు. ఆ మహిళామండలి పతితుల కూటమని, వారిలోని ఒక్కొక్కరిలో ఘోరమైన అవినీతి వుందని అందరూ ఆడిపోసుకుంటుంటే వారివెంట పోవాలనుటకు నీకు సిగ్గయినాలేదూ ?" అన్నాడు తండ్రి.

"వారివ్యక్తిగత జీవితరహస్యాలు, అవినీతులు మన కప్రస్తుతము. వారు యే ఆశయాలతోను, ఆదర్శాలతోను వుద్యమం సాగిస్తు

న్నారో వాటినిమాత్రమే ప్రజలు గుర్తించాలి, విమర్శించాలి" అన్నాడు.

క్రోధితుడై "దుష్టత్వంతో నాలోని యేకసంతానప్రీతిని దుర్వినియోగం చేయబోకు. అందుకే బిడ్డలను ప్రీతికిబదులు భయంతో పెంచాలంటారు. ప్రీతిలోని చనువును సద్వినియోగపఱ్ఱకొనుట వివేకం. ఇకమీదట ఆ మహిళామండలిపేరు నా ముందెత్తబోకు. ఆశయాలు ఆదర్శాలపేరుతో నోరు చించుకున్నంతమాత్రాన వారు పవిత్రులు కాజాలరు. వారివెనుకనున్న జీవితఫలితాలే ముందుకూడా సాధించగలుగుతారు. అనుభవంలోని అడుగులే ముందుకుపడుతుంటవి. వాటిమీద ఆదర్శమని, నిస్వార్థసేవ అని వేసినపరదాలు యెక్కువసేపు రక్షణనివ్వజాలవు. ఏదిఏమయినా నీవు స్త్రీవి గాదన్నది గుర్తించు. స్త్రీల హక్కులని పరువులెడుతున్న అవివేకస్త్రీలవెంట పురుషులు పోవుట హాస్యాస్పదం" అన్నాడు తండ్రి.

ధైర్యాన్ని కూడదీసుకుని "కార్మికులవుద్ధరణ కార్మికులద్వారానే కాగలుగుతుందంటారు. కాని కార్మికోద్ధరణకు కంకణంకట్టిన పూంజీపతులు మధ్యతరగతి నాయకులద్వారానే విముక్తికలుగుతున్న అనుభవం మనముందున్నది. రైతు విమోచనకు పోరాటంసలుపుతున్న నాయకులు వాస్తవంలో రైతులుకారు. ఎవరివుద్ధరణ వారిద్వారానే అనేకంటే ఎవరివుద్ధరణనైనా నిష్కల్మషంతో నిశ్చయంతో కంకణబద్ధులై పోరాటం సలిపే యెవరిద్వారానైనా కాగలుగుతుందని నేటిఅనుభవం చెబుతున్నది. కనుక స్త్రీలహక్కులకొరకు స్త్రీలే పోరాడాలని లేదు. అలాంటి ధర్మపోరాటంలో యెవరైనా పాల్గొనొచ్చు" అన్నాడు.

ఆవేశితుడై "ఛీ మూర్ఖుడా, ముందు నోరుముయ్. నీవు చదివింది యిలాంటి వికృతవాదాలు. కనుకనే తప్పావు. ఇలాంటివక్రబుద్ధిగలవాళ్ళు చదివి ప్యాసుగావటం చేతగాక పరీక్షాధికార్లను విమర్శిస్తుంటారు. నాఅనుభవంలో నాకుతెలుసు. వ్యాపారసరళి తెలియక సాగించలేని వాళ్ళంతా ఎగవేతలకు యెత్తులువేస్తుంటారు. దగాతనాలకు ప్రయత్నిస్తుంటారు. వ్యాపారసరళి తెలిసినవాడు చిన్నలాభాలతో ప్రారంభమైనిలదొక్కుకోగలుగుతాడు. అందనిబారలువేసి అడుగంటుట వెర్రితనం" అంటూ కఠినమైనమందలింపులు చేశాడు.

విశ్వనాథం చల్లగా తండ్రియెదుటనుంచి జారుకున్నాడు. కాని మనస్సులోని దృఢసంకల్పం చెదరలేదు. ఇంతవరకు మిత్రులముందు యీ సంబంధమైన తన అభిప్రాయాలను బయల్పరచలేదు. ఇపుడు వశందప్పి అందరిముందు ఆ విషయాలనే చెప్పేస్తున్నాడు.

"మానవులలో ప్రతిఒక్కరికి యెక్కడో ఒకబలహీనత వుంటుంది. స్వాభావికంగా ఆవైపుకే పరువులెడుతూకూడా పరదాలో కప్పిపుచ్చను ప్రయత్నిస్తారు. అది తనబలహీనతగా అర్థంచేసుకుని, ఆ వలయంనుంచి తప్పుకోలేనపుడు నగ్నంగా లొంగి పయనించుట గొప్ప తనమవుతుంది. మహిళామండలిని అందరికిమిన్నగా దూషించిన నీవు నేడు శిరస్సునధరించ సంసిద్ధుడవుటలోని రహస్యం అందరికీ తెలుసు! ఆ పారిజాతంకొరకు వారివెంటబడేబదులు ఆ పారిజాతాన్ని వారినుంచి వేరుజేసి ఆమెతోనే వూరేగరాదూ?" అని మిత్రులంతా కలిసికట్టుగా వ్యంగ్యంగా అన్నపుడు, విశ్వనాథంమనస్సు వెలవెల బోయింది.

గురిదప్పిన వందదెబ్బలకంటే గురిగాతగిలిన ఒక్కదెబ్బ తల క్రిందులుచేస్తుంది. విశ్వనాథంమనసిపుడు సమాధానాలు వెదకగల స్థితిలో లేదు. హృదయంలో అంతర్యుద్ధం చెలరేగింది. సరసర వూరు బయటకువెళ్ళి వెర్రివానివలె పచ్చికబయళ్ళమీదపడి అటుయిటు దొర్లాడు. బోర్లపడి శిరస్సును హస్తాలతో అదిమిపట్టుకుని ఆకాశంవంక చూశాడు. మసకమేఘాలు దినకరుని కప్పివేయచూస్తున్నవి. పచ్చని పృథ్వి వైపు చూశాడు. మధూటికలు రాగాలాపనలుచేస్తూ గడ్డిపువ్వులమీద వాలుతున్నవి. ఈతచెట్టుమీదనున్న రెండువుడుతలు చెల్లాటలాడుకుంటు న్నవి. తనప్రక్కగాపోతున్న యెర్రచీమలబారు యెక్కడినుంచో, యెక్కడికో! యేకాగ్రంగా వడివడిగా సాగిపోతున్నది. నాయకత్వం వహించినచీమ ఆదుర్దాతో వెనక్కు ముందుకు పరువులెడుతూ ముక్కుకు ముక్కు పొడిచి తనసంకేతాన్ని తెలుపుతూ దర్శకనిర్వహణ చేస్తున్నది. అతనిదృష్టిపడిన ప్రతిదృశ్యంమీద మనస్సు లోతైన ఆలోచనలవైపు వెళుతున్నది. అర్థంగాని ప్రకృతిరహస్యం విభ్రాంతిని గల్పిస్తున్నది. అంత లోతైన ఆలోచనలుకూడా చంచలములై కంపనలను కలిగిస్తు

న్నవి. విరుద్ధప్రవృత్తులు రేగి ఢీకొంటున్నవి. మనస్సు ఆత్మవిమర్శను సహించలేక తప్పుకుపోను వెదుకుతున్నది. దడిసినదానిని దండించుటకు అన్నివైపులనుంచి పరువులుంటవి. మోహంవైపు మునకలువేస్తున్న అతనిప్రవృత్తిమీద వివేకవిజ్ఞానములతాలూకు ప్రవృత్తులు దాడిచేస్తున్నవి. నిజంగా పారిజాతంపిచ్చే నన్నావైపుకు లాగుతున్నదేమో! ననే ప్రశ్న పదేపదే మనస్సులో అనాలోచితంగావస్తున్నందున ఆ మహిళా మండలినే మర్చిపోను ప్రయత్నిస్తున్నాడు. గాలికిలేస్తున్న ధూళిని ఆపాలని అదిమితే మరింతలేచునట్లు మరవాలన్నవైపే మనస్సు మరీమరీ పరువులెదుతున్నది.

తాను సేవాతత్పరతతోనే మహిళామండలిలో జేరాడో లేక పారిజాత ప్రేమపాశామోహంతోనే జేరాడో నిగ్గదీసి అడిగితే చెప్పలేడు గాని, మహిళామండలిలో జేరిపోయాడు. జేరినా కళవళపడుతున్న అతన్ని వుత్సాహంతోను దీక్షతో దించగలిగింది పారిజాతం. ఆమెకనుసన్నలలో మెలగుట కలవడిపోతూ యితరులు చూసినపుడు బిడియపడుతూ దాగుడుమూతలాటలో పయనిస్తున్న విశ్వనాధాన్నిజూసి దర్పాన్ని చిందించే చిరునవ్వును ప్రదర్శిస్తుంటుంది రాజ్యలక్ష్మి. మహిళలను యేవగించుకుంటూ పదేపదేప్రకటించుకునేవారే మహిళలకులొంగి దాసులవుట, సత్యసంధులుగాను ధర్మమూర్తులుగాను నీతిబోధ లుపన్యసించేవారే ఘోర అవినీతిపరులుగాను రుజువవుతుంటుంది.



# 14. మీమాంస

బీబీజాన్ ప్యాసయినపుడు మలయమతితోపాటు విజయకుమార్ కూడా ఆమెను కాలేజీలోజేర్చాలని యెంతో ప్రయత్నించాడు. కాని తను తప్పినందువలన తననువిడచి ఆమెజేరి చదువుటకు యెంతమాత్రము యిచ్చగించలేదు. విజయకుమార్ ప్యాసయినపుడు ఆయనతోపాటు కాలేజీలోజేర నుత్సుకతనుకూడా కనపర్చింది. కాని నేడు ఆమెప్రస్తావన లేకుండానే విజయకుమార్ కాలేజీలో జేరిపోయాడు.

కాలేజీలోజేరినక్షణంనుంచి విజయకుమార్‌కు తీరుబడి, యింటి దగ్గరుండే అవకాశము తరిగింది. ఏకగ్రీవనాయకత్వం లభించింది. ఆతని కాలేజీప్రవేశంతో విద్యార్థులలోని అయిదుపక్షాలు యేకగ్రీవంగా ఆతనినాయకత్వాన్ని అంగీకరించాయి. అందరినీ ఆకర్షించగలిగిన ఆతని నేతృత్వంలో విద్యార్థులఐక్యత కుదిరింది. మిత్రులసంఖ్య పెరిగింది. అందువల్లనే యింటివద్దవుండే అవకాశం సన్నగిలింది. ఇపుడు తల్లి తోను, బీబీజాన్‌తోను అధికసంభాషణ చేయుటలేదు.

బీబీజాన్‌నుకూడా కాలేజీలో చేర్పించాలని మలయమతి విశ్వప్రయత్నముచేసింది కాని ఆమె అందు కిచ్చగించలేదు. విజయకుమార్‌ముందు ఆ ప్రస్తావనరాకుండా తప్పించజూచింది. మలయమతి ప్రోత్సహిస్తున్న కొంది బీబీజాన్ వినమ్రతనుపెంచి పసిపాపవలె ఆమెను అంటిపెట్టి నడుస్తూ అసలువిషయాన్ని మరిపిస్తుండేది.

విషయం యెంత ఆసక్తితోగూడిందైనా వాంఛిస్తున్నచోటనుంచి ప్రోత్సాహంలభించనపుడు ఆసక్తి అణిగిపోయి ఆ స్థానే ఆత్మక్షోభ కలుగుతుంటుంది. అదేరీతి బీబీజాన్‌కు జరిగింది. విజయకుమార్ ప్యాసు కానందువల్లనే తాను ఆనాడు కాలేజీలో చేర నిరోధించింది.ఆతన్నిమించి చదువుట అగౌరవించినట్లని ఆమెభావన. ఆతనితోకలిసి చదువాలని

అభిలాష. కాని ప్యాసయిన ఆతను నేడు కాలేజీలోచేరాడు, తనవిషయం మాటవరుసకయినా అననందుకు కలుగుచున్న ఆత్మవ్యధ సామాన్యమైంది కాదు. చదువువిషయమే మనస్సా విరమించుకున్నది. కలిసిచదువాలన్న వాంఛ యెన్నోరోజులుగా గూడుగట్టుకున్నదైనా అభిమానం దెబ్బతిని మనస్సు మరల్చుకున్నది. అందుకనే మలయమతి యెంత వుత్సాహ పరిచినా తన చమత్కృతితో ఆమెను మరుపులోపెట్టి రోజులు నెట్టి వేసింది.

కొన్నిజీవితాలు సోమరితనంతో అలవాటవుతవి. కొన్నిజీవితాలు తెరిపిలేని కార్యరంగాల కలవడుతవి. అలా అలవడినవారు యేదో ఒక రూపంలో తీరుబడిలేనన్నికార్యాలు సృష్టించుకున్నపుడే మనశ్శాంతి కలుగుతుంది. వుత్సాహము, వుద్వేగము వుత్పన్నమవుతవి. ఈ కోవకు చెందినవాడే విజయకుమార్. ఆనాడు పక్షిజాతిపరిశోధనలు నలువైపులా తీరుబడిలేనంత వుండేవి. అంతకంటె వత్తిడులతో పరువులెత్తించే విద్యార్థివుద్యమం లభించింది. ఈ నూతనకార్యక్రమంజోరులో పాతకార్య క్రమమయిన పక్షిజాతివుద్ధరణ మరుగునపడిపోయింది.

"కాలేజీప్రవేశం విజయ్‌జీవితాన్ని పూర్తిగా మార్చివేసింది బీబీ!" అన్నది మలయమతి.

"కాలేజీప్రవేశం గాదు, మూడోమారుకూడా తప్పినపుడు బాబుకు కలిగినపట్టుదల జీవితాన్ని మార్చివేసిందమ్మా. అంతపట్టుదల వున్నపుడే అభివృద్ధి కలుగుతుంది" అన్నది బీబీజాన్.

"పట్టుదల,ఆద్వారా లభించే ఆధిఖ్యత అధ్యాపకులను అవహేళన పరచుట, స్వగృహాన్ని హోటలుగాసృష్టించుకొనుటగా వుంటుందా పిచ్చిదానా?" అన్నది.

"కోర్టుద్వారా ప్యాసయినందుకు విద్యార్థిలోకమంతా వోప్రక్క బాబుగారిని ఘనతగా ఆదరిస్తుంటె మీరింకా ఆ వెనుకటిధోరణిలోనే వుంటే యెలా అమ్మా!" అన్నది.

"న్యాయంపేరుమీద నిలిచిన కోర్టులు తమ అసలుధ్యేయాన్ని విస్మరించి యుక్తులమీద, జిత్తులమీద, నటనలమీద నడుస్తున్నవి.

సంఘంలో ధర్మము, నియమనీతులకు, త్యాగాలకు విలువ మృగ్యమైంది. సంపత్తికే విలువ ప్రధానమైంది. అందుకే యుక్తులు జిత్తులమీద నిలిచిన కోర్టులవిలువ పెరిగింది. అధర్మము అవినీతులతోగూడిన విజయంకంటె, సంపత్తికంటె ధర్మయుక్తమైనత్యాగము, పరాజయము వుత్కృష్టమైనవి బీబీ" అన్నది మలయమతి.

"మీరన్నవన్నీ పరమసత్యాలు గావచ్చు. బాబుగారుమాత్రం అధర్మాన్ని ఆశ్రయించరమ్మా!" అన్నది.

శుష్కనవ్వును ప్రదర్శిస్తూ "నామాటలు నీకర్థంగావు. తన సంతానవిజయానికి ఆనందించనితల్లి వుండదు. కాని యీవంశం యెన్నడూ అవినీతివైపు మొగ్గలేదు. నీతికొరకు, ధర్మంకొరకు యెంతో నష్టపడి లోకులచేత పిచ్చివాళ్ళనిపించుకుని ఆనందపడ్డారు. అది నాకూ గర్వకారణం. కాని నేడు విజయ్ ఆశ్రయించిన కోర్టువిజయం అందుకు భిన్నమైంది. అవినీతి మత్తుమందులాంటిది. కనుక అడుగిడినాక యెంత దూరం తీసుకువెళుతుందో యేమిచేస్తుందో యెవరికీ తెలియదు, అదే నా మానసికచింత" అన్నది.

"పేపర్లుదిద్దుటలో పరీక్షాధికార్లదే లోపమని కోర్టు నిర్ణయించినపుడు బాబుతప్పేమీ వుండదు. అందుకు మీరు అనవసరంగా చింతించవలసినపనీ లేదు" అన్నది.

"త్యాగంలో ఆత్మానందము వికాసము జనిస్తుంది. కృత్రిమ జయంలో గర్వం పొడసూపి సర్వనాశనానికి హేతువుగా నిలుస్తుంది. ఇంటిని హోటలుగా మార్చుకున్నాడు. నిన్ను తనతోపాటు కాలేజీలో జేర్పించుటకుబదులు పలుకరించుటకే బాధపడేవానిలా ప్రవర్తిస్తున్నాడు. ఇవి సుగుణలక్షణాలుగా నేనెలాభావించను చెప్పు?" అన్నపుడు బీబీ జాన్ మొఖం జేవురించింది. తనమనస్సులోని బాధనుకూడా ఆమె గ్రహించివుంటుందేమోనని సిగ్గిలుతున్నది. అమాయకంగాకనిపించే ఆమెలోని సూక్ష్మగ్రాహ్యత కాశ్చర్యపోతున్నది. ఆత్మబాధతో చెప్పుకోనుగాని కాలేజీలో జేరనుగాని యిచ్చగించక యెవరిని మధ్యపెట్టి ఆ సమస్యను దాటవేసూవచ్చాననుకున్నదో ఆమె సాధారణరూపంలో ఆ విషయాలనే

వినిపిస్తున్నపుడు మనస్సులోని ఆవేదన మ్రాన్పడినట్లయింది. వలుకు తున్న అశ్రువులను ఆపజాలక అధోముఖంజేసింది.

మలయమతి గొప్ప వున్నతకుటుంబంలోజన్మించి సభ్యసంస్కారాలమధ్య పెరిగింది. దానధర్మస్వభావము, త్యాగసహనతలు వంశాను గతంగా వంటబట్టినవి. మెట్టినయిల్లు అంతకుమించి దాతృత్వంలో కరుడుగట్టినదైనందున ఆమెలోని స్వతస్సిద్ధస్వభావాలు విశాలరూప మొందినవి. ఆమెద్వారా దానాలుపొందినవారిలోను ఆదరాలు లభించిన వారిలోను అనేకులు ఆమెను పిచ్చిదేమో అని శంకించినవారుకూడా లేకపోలేదు. దానంలో లెక్కలు తూకాలు సంకుచితనిదర్శనలని ఆమె భావన. ఇతరులబాధలు విన్నపుడు హృదయం ద్రవించి కన్నీరుకారు స్తుంది. ఎవరిబాధలనూ సమక్షంలోచూసి సహించలేదు. ఆమె ఆతిధ్యం గాని, ఆదరంగాని పొందినవారు జీవితంలో యెన్నటికీ మరువలేరు. అది ఆమెలోని విశిష్టత అంటుంటారు.

అంత వున్నతస్థాయిలో అలవడిన ఆమెదృష్టిలో లాభనష్టాలు గణనీయంగాదు. ధర్మము కర్తవ్యపాలన వాంఛనీయము. విజయకుమార్ ప్యాసయినందుకు ఆనందపడుటకు బదులుగా ఆ ఫలితంకొరకు అవలంబించినమార్గం హేయమయిందని బాధపడుతున్నది. ఆ వికృతమార్గమే వీరోచితమైందిగాను, తద్వారాపొందిన తుచ్ఛఫలితాన్ని ఘనమైందిగాను గర్విస్తూ పెద్దపెట్టున అట్టహాసంతో ప్రచారంచేసుకుంటున్న విద్యార్థి లోకాన్నిచూసి, దిగజారిపోయిన సమాజఅధ్వాన్నతకు అంకణాలు వేస్తున్నది.

విజయకుమార్ కాలేజీలో చేరినప్పటినుంచి మిత్రులతో తీరుబడి లేనివాడుగా తిరుగుతూన్నందుకు చింతలేదు. కాని గంభీరతను చాటు జేసుకుని పెరుగుతున్న అతనిలోనిగర్వాన్ని గ్రహించి దుష్టత్వపునాందిగా యెంచి బాధపడుతున్నది. తమఆశ్రయంలోవుంటూ తమప్రోత్సాహంతో చదివిన బీబీజాన్ ఆమెహృదయాన్ని చూరగొన్నది. నమ్రతతోను, సేవాభావాలతోను, భక్తివిశ్వాసాలతోను నిండిన బీబీజాన్ నడవడి,- చదువుయందుగలశ్రద్ధ ఆమెను ముగ్ధునిజేసినవి. తనబిడ్డగా కలిసి

పోయింది. కనుకనే యెంతైనా చదివించి అభివృద్ధికితేవాలని వాంఛ. విజయకుమార్ తప్పి బీబీజాన్ ప్యాసయినపుడు ఆమెను కాలేజీలో చేర్చను యెంత ప్రయత్నించినా నిరోధించింది.

"విజయ్‌బాబునువిడచి కాలేజీలోచేరటం నావల్లకాని పని, నన్ను క్షమించు అమ్మా" అని బీబీ అన్నపుడు ఆమెహృదయం కరుణతో తొణికిసలాడింది. తనపుత్రుని గౌరవించువిధాన మది. తనకు నచ్చిన యింత వున్నతసాంప్రదాయం అలవడినందుకు మనస్సా అభినందించు కున్నది. ఆ రూపంగా తనమనస్సు నాకర్షించిన బీబీజాన్‌ను చదివించా లని ఆమె ధృడసంకల్పం. కాని యేదోరూపంగా ప్యాసయి కాలేజీలో జేరిన విజయకుమార్ బీబీజాన్‌విషయం విస్మరించుట ఆమె కాశ్చ ర్యాన్ని, అసహ్యాన్ని కల్పించింది. తానెంత ప్రోత్సహించినా విజయ కుమార్ వుపేక్షించుతోనే బీబీజాన్ చదువు విరమించుకున్న రహస్యం ఆమెఅంతరాత్మకు విదితమే.

అంతసన్నిహితంతో చనువుతో బీబీజాన్‌పట్ల మెలిగిన విజయ కుమార్ నేడు ముక్తసరిగా వ్యవహర్తగా తప్పుకుతిరుగుటను మలయమతి సహించలేకపోతున్నది. తనతోజరుగు సంభాషణకూడా అరుదుగాను అవుసరంవున్నంతవరకు మాత్రమే అయినందున ఆమెమనస్సు తెలి యని బాధతో వ్యధచెందుతున్నది.

అభిమానంవున్నచోట అవాంఛనీయమైన అన్యాయం జరిగినపుడు సానుభూతి పెరుగుతుంది. మలయమతిమనస్సు దయాభిమానాలు పొంగి కరుణరసప్రవాహమై బీబీజాన్‌మీదకు ప్రవహిస్తున్నది. అత్యధికప్రీతితో చూస్తున్నది.

విజయబాబుద్వారా తనకు యెంత అసంతృప్తికలుగుతున్నదో అంతకుమించిన ప్రేమాభిమానాలు అజ్ఞాతరూపంగా పెరిగి పెనవేసు కుంటూ ధృడత్వాన్ని పొందుతున్నవి. కాలేజీనుంచి ఆయన వచ్చుసమ యానికి యెదురుచూస్తుంటుంది. ఆయనచేతిలోని పుస్తకాలను తాను తీసు కుని టేబుల్‌మీదపెట్టి రాగోరి యెదుర రెండడుగులువేస్తుంది. ముఖ

మండలం చూసినపుడు మనస్సులోని ఆలోచన మనస్సులోనేవుండి పోతుంది. ప్రక్కగానిలిచి దీనంగా చూస్తుంటుంది.

ఆతనికిసేవచేసి తృప్తిపొందాలని గాబోలు, ఒకప్పుడు చెంబు నీళ్ళతోను, టవలుతోను, మరొకపుడు ఆ పూటకుకావలసిన పుస్తకాల తోను, స్నానాలకు నీళ్ళుతోడినపుడు సబ్బుతోను హాజరవుతుంటుంది. ఏదో ఒకసందర్భంలో చిన్ననవ్వును ప్రదర్శించినపుడు, దీర్ఘ ముసురు తరువాత సూర్యకిరణప్రసారంలో జీవరాసులు ప్రఫుల్లితమైనట్లు అనంద పడుతుంటుంది.

విజయకుమార్ ప్రసన్నంగావున్నట్లు గుర్తించినపుడు బీబీజాన్ దగ్గరగాజేరి మోకాళ్ళమీదకూర్చుంటూ ప్రేమలొలికిస్తూ ఆతనిటెక్స్టు బుక్ తిరుగవేస్తూ "నిన్న యేపాఠంజెప్పారు బాబుగారు ?" అంటుంది. ఆతడు వ్రాతనోట్సును తిరుగవేస్తూ "వూఁ" అంటాడు. "బాబుగారూ, నోట్సేమయినా వ్రాసిపెట్టమంటారా ?" అని పెద్దఆశగా అడుగుతుంది. ఆమెదస్తూరి యెంతో అందంగావుంటుందని ఆ రోజుల్లో తననోట్సంతా వ్రాయించుకునేవాడు. శిరస్సు పైకెత్తి "నీవు నోట్సువ్రాయగలవా ? పనికిరావటానికేనా ?" అన్నాడు. ఆతనిముఖంలో యేమి వ్యక్త మయిందోగాని ఖిన్నురాలయి వెర్రిదానివలె ఆవైపే చూస్తున్నది. ఆమె హృదయకుహరంలో యెక్కడ దెబ్బతగిలిందోగాని నేత్రాలు జలభరిత మైనవి. వెంటనే శిరస్సు మరల్చుకుని నెమ్మదిగా బయటవైపు నడిచింది. పిట్టలవనంలోనిలిచి బాగా యేడ్చింది, కన్నీరు కార్చింది. యెక్కిళ్ళు కూడా వచ్చినవి. ఇపుడు హృదయం తేలికపడింది. కాని అంతదుఃఖం యెందుకుకలిగిందో ఆమెకు స్పష్టంగా తెలియదు. ఈ దుఃఖమంతా క్షణంక్రితం సన్నివేశంతాలూకుమాత్రమే కాదు.

మలయమతి ఆదరాన్ని అధిగమింపజేసినా వున్నఆశ్రయం అదృశ్యమైనట్లు అనాధగా తనమీద తనకే జాలివేస్తున్నది. విజయ కుమార్ తనను కాలేజీలోజేర్పించనందుకుగాని, తనచదువు సమాప్తమై

పోయినందుకుగాని అంత బాధలేదు. ఎవరి మధురమాటలను వాంఛిస్తు న్నదో అవి కరువై క్షోభతో కుమిలిపోతున్నది. మనస్సులోని వెలితిని బయటపడనీయకుండా మలయమతిముందు సంచరించ ప్రయత్నిస్తు న్నది. వంటరిగా సమయందొరికినపుడు విజయకుమార్ పాదాలంటి ప్రార్థించి తన అపరాధాలేమయినావుంటే క్షమకోరాలని యెన్నెన్నో విధాల ఆలోచిస్తుంటుంది. కాని తీరా అలాంటి సదవకాశంకలిగినపుడు శరీరంకంపించి హృదయం బరువెక్కి మనస్సులోనివిషయాలు మనస్సు లోనే వుండిపోతవి. ఆతనిసమక్షంలో హృదయం మూగవోయి మసక వెన్నెలబోలి ఆనందాన్ననుభవిస్తుంటుంది.



# 15. భగ్నయాత్ర

విజయవాడస్టేషనునుంచి సరళ విజయకుమార్‌లు వెడలిపోవు నపుడు సరళను తిరిగి చదువమని సలహాచెప్పాడు. సలహా అనేకంటె చనువుతో ఆజ్ఞగా వినిపించాడనుట మంచిది. ఆ యాజ్ఞను శిరసావహిస్తూ ప్రతిగా తనకు వుత్తరాలువ్రాస్తుండమని కోరింది. సమ్మతించాడు. అతను యెంత హడావుడలలోవున్నా యెంతమందిమిత్రులమధ్య తిరుగుతున్నా మనస్సులో అనుక్షణమూ మెలగుతున్నది సరళ. ఆమెవేసిన ముద్రలు చెరగనివి. క్లాసులోకూర్చున్నా రైలుపెట్టెలో కూర్చున్నట్లే ఆ దృశ్యాలు వరుసగా మనస్సులో మెదులుతుంటవి. ఆమెకు వుత్తరాలు వ్రాయాలని తిరిగి కలుసుకోవాలని అభిలాష అధికంగానేవుంది. కాని ఆమెఅడ్రసు తెలియదు. ఏస్కూల్లో చేరివుంటుందో ఆ విషయం అంతకంటె తెలియదు. బందరువెళ్ళి కలుసుకోవాలనికూడా వుద్దేశ్యంవుంది. తనను అక్కడి ప్రతిఒక్కరు గుర్తించగలరు. ఎన్నోరకాల దురూహలు ప్రబలవచ్చు. అందువలన మనస్సులో ఆలోచనలు పెరుగుతున్నవిదప్ప విముక్తిమార్గం స్ఫురించుటలేదు.

సరళ ఎవరిప్రేరణతో తిరిగి పాఠశాలలో ప్రవేశించిందో అతను వుత్తరాలువ్రాస్తానని యిచ్చిన వాగ్దానాన్ని విస్మరించినందుకు కలిగిన విసగడతో అనేకమారులు చదువును చాలించాలనికూడా యోచన చేసింది. విజయకుమార్‌అడ్రసు తనకు పేపర్లద్వారా తెలిసిందేగనుక తానే వుత్తరం వ్రాసింది.

"విద్యార్థిలోకానికి వెలుగుగా రూపొందిన వీరవిజయా,
శతకోటి నమస్కారాలు,

లోకంముందు మీ విజయగర్వం కనిపిస్తుంది. నాముందు కనిపిస్తున్న మీ మతిమరుపుదృశ్యం ఆ ఖ్యాతిని కప్పివేస్తున్నది.

మీ నామస్మరణలో అందరికీ వుత్సాహంగలుగుతుంటే నాకు వ్యధ గలుగుతున్నది. జీవితంలో జరిగినవాటిని, అభయరూపంగా అన్నవాటిని విస్మరించేవారికి ప్రశాంతత, జీవితంలో జరిగిన వాటి ముద్రలను చెరగనీయకుండా స్తూలంచేసి అద్దుకుంటూ తుడువజాలక అన్నమాటలను మరువజాలక స్మరించుకునేవారికి మిగిలేది వ్యధేమోననిపిస్తున్నది. జీవితంలో కొన్ని కోరిచేసుకోవటంద్వారా సంఘటిల్లుతుంటవి. కొన్ని దైవీకంగా సంఘటిల్లుతుంటవి. మన యిరువురిమధ్య సంఘటిల్లినదంతా అలాంటి దైవీకమయింది. కనుకనే తుడిచివేసుకోను సాధ్యంగాకుండా శాశ్వతముద్రలను వేసుకున్నవి. భవిష్యత్తునుగురించికూడా భయంగానేవుంది. మీ పరిచయం జీవితంలో శాశ్వత అశాంతికే సంభవించిందేమోననిపిస్తున్నది. నామనస్సు, హృదయము నావశంతప్పి మిమ్మ్మ వాంఛిస్తున్నపుడు శక్తిహీనురాలనయిన నన్నేమి చేయమంటారు చెప్పండి!

మీ వుత్తరంకొరకు యెదురుచూసి, చూసి విసిగిపోయి మనస్సులోనిబాధలను వున్నవి వున్నట్లు వ్రాసినందుకు మరేమీ అనుకోక క్షమించండి. సెలవు.

సరళ."

విజయకుమార్ వుత్తరాన్ని పుస్తకంలో తెరిచిపెట్టి ఒకసూరు గాదు అనేకమారులు చదువుకున్నాడు. ఆ వుత్తరంలో వ్యక్తీకరించిన వ్యధయొక్క లోతులు అర్ధమయినకొలంది మనస్సు ఆనందడోలికలలో వూగిపోతున్నది. ఒకరు నష్టపోతేనే మరొకరు లాభాన్నిపొందుట, ఒకరి హృదయంలోనివ్యధ మరొకహృదయానికి ఆనందాన్నిచ్చుట ప్రకృతివైచిత్ర్యం.

కఠినమైనపాఠాన్ని కంఠస్తంచేయువానివలె ఆ వుత్తరాన్ని రెండురోజులవరకు చదువుతూ జవాబువ్రాయ ప్రయత్నిస్తూనేవున్నాడు. ఆతనిచేతిలో ఆ వుత్తరం స్వేదముద్రలతోనలిగి ప్రాచీనరికార్డుగా

తయారయింది. జవాబువ్రాయు ప్రయత్నంలో వ్రాసి, స్థాయి నచ్చక చించివేసినవాటి సంఖ్య అపరిమితం.

విజయకుమార్ తనమనస్సులోకూడా అంతకుమించిన ఆలోచనలే జరుగుచున్నట్లు, తన హృదయపీఠంమీద అజ్ఞాతరూపంగా ఆమెప్రతిమ స్వయంప్రతిష్ఠితమైనట్లు, ఆ స్థానం ఆమెకు శాశ్వతమైపోయినట్లు, ఆ ప్రతిమను చెరుపుటకుగాని, నిర్మూలనంచేయుటకుగాని తనకు హక్కు లేనట్లు, శక్తి అంతకుమించిలేనట్లు మొదలగువివరాలతో వుత్తరం వ్రాశాడు.

లేఖలద్వారా రెండునెలలు గడిచిపోయినవి. ప్రేమానురాగాల ఘనిష్ఠత అధికంగా అల్లుకుపోయింది. తోడినకొంది బావిలోని వూట పెరిగినట్లు లేఖలద్వారా పరస్పరంగా తమ హృదయకుహారాలలోని ప్రేమరసాలు వెల్లువలై ప్రవహించుట,పరస్పరంగా జీర్ణించుట జరిగింది. ఉభయులను పెనవేసి పెరిగిన ప్రేమలత పెద్దదై ధృఢత్వంపొందింది.

ఇపుడు వుత్తరాలద్వారా తృప్తి కలుగుటలేదు. ఒకర్ని ఒకరు కలుసుకొనుకాంక్ష ప్రబలిపోయింది. ఉపాయాలకొరకు యిరువురిమనస్సులు వెదుక్కొంటున్నవి. ఫలితంగా యిరువురు విజయవాడలో కలియుటకును, ఓరుగల్లుయాత్ర చేయుటకును నిర్ణయం జరిగింది.

నవరాత్రిపండుగ రోజులవి. పారిజాతాన్ని కలియుటకనే మిషతో యింటినుంచి బయటబడిన సరళ నాలుగ్గంటలబండిలో సంధ్యాసమయానికే విజయవాడస్టేషను చేరింది. వచ్చి వెయిటింగ్‌రూమ్‌లో కూర్చోమని వుత్తరంలోని ఆతనిఆజ్ఞ. ఎవరి ప్రేమవ్యధలో హృదయం కరిగిమరిగి ఆవిరులెత్తుతున్నదో వారి నిరీక్షణ నాలుగుగోడలమధ్య స్థిమితంగా కూర్చుని చేయగలిగిందిగాదు. నిర్మలమైన తటాకమువలెగాక తరంగాలతో తపతపలాడుతూ బయటకు పరువులెత్తను భీషణహోరులు సలుపు సాగరాన్ని బోలివుండు ప్రేమపొంగులహృదయం ఒకచోట కూర్చోనివ్వదు. ప్లాట్‌ఫారంమీదనే అటుయిటు తిరుగుతున్నది. ఆమె అల్లిబిల్లిగా యెలా తిరుగుతున్నదో మనస్సులోని ఆలోచనలుకూడా అలానే తిరుగుతున్నవి.

విజయకుమార్‌వచ్చు బండికి యింకా రెండుగంటల టైముంది.

అయినా ఆ బండి యెటువచ్చి యెక్కడఆగుతుందో అక్కడనిలిచి ఆతన్నిగురించి ఆలోచిస్తుంటే ఆనందంకలుగుతున్నది. ఏపెట్టెలో వుంటాడో యెలా తెలుసుకోవాలి, యే విషయాలతో సంభాషణకుపక్ర మించాలి, అనే సమస్యతో మనస్సు వుక్కిరిబిక్కిరవుతున్నది. ప్రేమలేఖ ప్రారంభించి ఒకలైను వ్రాసి తిరిగిచూసుకుని ఆ అక్షరాలు కుదిరికగాలేవని, శబ్దాలు పొందికగా లేవని, వాక్యాలలో సొంపులేదని కొట్టివేసి తిరిగి ప్రారంభించునట్లు ఆమె మనస్సులోని నిర్ణయాలు క్షణ మొకరీతిగా సంస్కరింపబడుతున్నవి.

"నీవు యిక్కడున్నావేమి సరళా?" అని యెవరో వెనుకగా వీపుమీద చేయివేసి ప్రశ్నించారు. శరీరం కంపించినట్లయి వెనుదిరిగింది. మ్రాన్పడిపోయింది. అతడు రవిప్రసాద్. ఉదయమే ఆతను విజయవాడ వచ్చాట్ట, యిపుడు బందరు వెళుతున్నాట్ట. "ఎందుకొచ్చావు, యెట్లొచ్చావు" అంటూ ప్రశ్నలవర్షం కురిపిస్తున్నాడు. సలసలకాగుతున్న నూనెలో నీటిబిందువులను వదులుతుంటే 'ఫట్‌ఫట్' మని బుసబుసలు రేగినట్లు ఆతనిప్రశ్నలలో ఆమెశిరస్సు గిరగిర తిరిగిపోతున్నది. మాట పెగులుటకు అయిదునిమిషాల అంతరాయం కలిగింది.

ఏలూరుదగ్గరున్న ఒకబంధువుయింటి కెళుతున్నట్లు చిన్నకల్పన కల్పించింది. అంత పోదలచినపుడు యిలా వంటరిగావచ్చేబదులు వుదయమేచెప్పుంటే తనతోటే తీసుకొచ్చేవాడినని, యిపుడయినా వంటరిగాపోవుట అంత క్షేమంగాదని తానుకూడా వెంట ఏలూరువస్తానని ప్రకటించినపుడు బోనులోబడిన యెలుకవలె ఆందోళనపడిపోతున్నది.

రవిప్రసాద్‌ను మభ్యపెట్టి తప్పించుకొనుటకుచేసిన విశ్వప్రయత్నాలు విఫలమయినవి. ఓప్రక్క క్రోధము మరోప్రక్క భీతి పెనవేసి ఆమెను నమిలివేస్తున్నవి. తన అసలుకార్యం రవిప్రసాద్‌ముందు బయటపడిపోతుందేమోనన్నది మరింత భయంకరసమస్య. బందరు వెళ్ళేబండి రెడీలోవుంది కాని రవిప్రసాద్ ఆ ప్రమేయంలో లేడు.

"బండి తయారుగావుంది నీవువెళ్ళు రవీ, నాకేం ఫరవాలేదు" అన్నది.

"బళ్ళు పోతూవుంటవి, తిరిగి వస్తూవుంటవి. వాటినిగురించి విచారమెందుకు! నీవన్నట్లు పోనీ ఏలూరుప్రయాణం మానుకుని జగ్గయ్యపేట బంధువులయింటికే పోయిరావాలని నిశ్చయించుకుంటే— అది బస్సుప్రయాణం, మరీ కష్టమయింది. నిన్ను వంటరిగావిడిచిపోను నేను మూర్ఖుణిగాదు" అని ధృడసంకల్పంతో అన్నాడు.

అప్పటికీ అతనిని పంపను ఆమె వినతితో ప్రార్థిస్తున్నపుడు, రహస్యం తెలుసుకున్నవానివలె చిరునగవును చిలికిస్తూ "తలవని తలంపుగా నేనుకూడావస్తే డబ్బుచాలదని చింతిస్తున్నావేమో: ఆ భయ మక్కరలేదు. నాదగ్గర రెండువందలపై చిలుకు డబ్బుంది" అని అభయ మిచ్చాడు.

ఆమెముందిదొక అగ్నిపరీక్షగా నిలిచింది. మనస్సు బండపారి పోయింది. దుష్టదేవత నెత్తిమీదయెక్కి సవారీచేస్తున్నపుడు తప్పు కొనుట మానవసాధ్యం గాదు.

నిరాశలో మునిగినట్టూ నిట్టూర్పులిడుస్తూ "ఈరాత్రి ప్రయాణం యెటూ మంచిదిగాదు. నేనూ బందరువస్తాను. మరోటిక్కెట్టు తీసుకురా రవీ!" అన్నది.

తనకునచ్చిన కార్యమే జరుగబోతున్నట్లు "నాదగ్గరున్నటిక్కెట్టు నీవు తీసుకో, నేను మధ్యలో టి. సి. చేత టిక్కెట్టు వ్రాయిస్తానులే. అయితే బండియెక్కు" అన్నాడు.

ఆతడు టిక్కెట్టుతేను పోతే తాను చాటయి తప్పుకోవచ్చునన్న హీనమయినమార్గంకొరకు పాల్పడినా ప్రయోజనంలేకపోయింది. రవి అమాయకంగా ఆమెచెప్పిన ప్రతిది విశ్వసిస్తున్నాడు. తనప్రేమను, ఆదరాన్ని వ్యక్తంచేస్తున్నాడు. అవి యిపుడు ఆమెకు ప్రతిబంధకాలు. కొన్నివేళలందు వుదారంతో లభ్యమయ్యే వుపకారాలుకూడా అపకారా లుగా పరిణమిస్తుంటవి.

ఆమె కింనాస్తిగా రైలుపెట్టెలోకెళ్ళి కూర్చున్నది. ఆమెగుండెల్లో యెన్నిరైళ్ళు పరువులెడుతున్నవో యెవరికి తెలుసు! విజయకుమార్ వ్రాసినట్లు బండిదిగగానే వెళ్ళి వెయిటింగ్‌రూమ్‌లో కదలకుండా కూర్చుంటే యెంతబావుండేది! అని యిపుడు పశ్చాత్తాపపడుతున్నది.

మానవస్వభావంలో అసఫలత తటస్థమైనతరువాతనే తన పొరపాట్లు తనకు తెలుస్తుంటవి.

బందరుబండి వెళ్ళిపోయినగంటకు విజయకుమార్ వస్తున్నబండి వచ్చి చేరింది. విజయకుమార్ బెడ్డింగ్ వగైరా కూలీకప్పగించి లేడీస్ వెయిటింగ్‌రూమ్‌చేరి అంతటా వెదికాడు. కనిపించలేదు. తనబెడ్డింగ్ వగైరాను లేడీస్‌వెయిటింగ్‌రూమ్‌లోనే ఒకమూల పెట్టించి నిరీక్షణలో వున్నాడు. టాయిలెట్‌కావటానికి రూమ్‌లోకెళ్ళివుంటుందని అతని వూహ.

అరగంటఅయిపోయినా ఆచూకీ లేదు. ఆతనిలోని వుత్సాహం క్షణమొక రీతిగా దిగజారిపోతున్నది. ఏమిఆలోచన తట్టిందో, యెంక్వయిరీ ఆఫీసుకెళ్ళి బందరునుంచివచ్చేబళ్ళు, పోయేబళ్ళ టైములు తెలుసుకున్నాడు. ప్లాట్‌ఫారంమీద మహామహా పరిశీలనగా వెదుకుతున్నాడు. దూరంలోగనిపించిన ప్రతితరగతివైపు సరసర కొంతదూరం వెళ్ళి పెదవి విరుస్తున్నాడు.

ఆ రాత్రేగాదు, మరునాటిరాత్రివరకు ప్రతిబండిని చెక్‌జేస్తూ వెదుకుతూనేవున్నాడు. ఇంటివద్ద వాతావరణం సందర్భపడక యీ బండికీ రాలేకపోవచ్చునని తృప్తితో యెప్పటికప్పుడు ఆశలు కల్పించుకుంటూ నిరీక్షిస్తున్నాడు. మానవుడు ఆశలతోనిండిన ఒక మూటలాంటివాడు. పూర్తినిరాశతో మనలేడు. ఆశలే జీవంగనుక ఆశలతో జీవంపోసుకుని పయనిస్తుంటాడు.

మూడోరోజు విజయ్‌లో గొప్ప మార్పువచ్చింది. తీవ్రంపెరిగింది. అవమానంపొందినవానివలె ఆవేశపూరితుడై, అనుకున్నప్రయాణం చేయవలసిందేనని నిర్ణయించుకున్నాడు. టిక్కెట్టుతీసి ఓరుగల్లు పయనం సాగించాడు.

చరిత్రాధ్యయనంలో కాకతీయసామ్రాజ్యచరిత్రఖ్యాతి ఆతన్ని ముగ్ధునిజేస్తుంది. అది వివాదరహితమైన అచ్చ తెలుగుజాతి ప్రాభవమని ఆతను గర్వంతో వర్ణిస్తుంటాడు. ఆ సంబంధసాహిత్యం లభ్యమైనంత వరకు చదివాడు. ఆ సామ్రాజ్యశిథిలాలను సమూలంగా వివరించి చెప్పాలనుకున్నాడు సరళకు. కాని యీ విఫలతతో పోవాలని నిర్ణయించు

కున్నాక పోయితీరాలనేపట్టుదలతో పయనించాడుగాని మనస్సులో నిర్మించుకున్న వూహాలన్నీ యెగిరిపోయినవి.

"సరళ రాకపోతే మునిగిపోయిందేమిటి! నేను ఒంటరిగా యింకా బాగా చూస్తాను" అని అనుకుంటూ వేడినిట్టూర్పులను విడుస్తూ శిధిలమైపోయిన సామ్రాజ్యచిహ్నాలలో తిరుగుతున్నాడు. ఎవరిని క్రోధంతో, రాకపోతేయేం? అని తిరస్కారంగా అంటున్నాడో ఆమె వచ్చివుంటే యే విషయంలో యెంత చక్కగా వివరించగలిగేవాడో వూహజేస్తున్నాడు. అజ్ఞాతంగా ఆతనిమనస్సు ఆమెవైపుకే నడుస్తున్నది. మనస్సుకు హత్తుకుపోయే ఆ శిల్పనైపుణ్యంమీద విచారించగల స్థిమితంలేదు మనస్సుకి.



# 16. మోడల్

పంతంతోవెళ్ళిన విజయకుమార్ తిరుగుపయనమయ్యాడు. బీబీ జాన్ పోలికలున్న ఒక తరుణవయస్కురాలు ఆవత్తిడిలో పెద్ద ప్రయాసపడి పెట్టెలో యెక్కింది. విజయ్‌మనస్సు ఆనందోద్రిక్తమైంది. ఆ వత్తిడిలో తానులేచి ఆమెకు స్థలమివ్వాలని వాపోతున్నాడు. బీబీజాన్‌కాదుగదా, అనుకున్నాడు. అయినా అంతరాత్మ అనురాగంతో ఆర్ద్రమైంది. ఈమే బీబీజాన్‌అయితే యెంతబావుండును, అని మనస్సు గొణిగింది. ఆకస్మికంగా ఆమెయెడల యింత అనురాగం యెందుకుత్పన్నమైందో, ఆతనికి తెలియదు. ఆ ప్రశ్నవేస్తే యేమి చెప్పగలడో!

ఆ తరుణవయస్కురాలు వత్తిడిలో తనదాపుకేజేరి పైచక్కనుపట్టుకొని నిలిచివుంది.ఆమెచేతిమీదగా క్రిందకువాలినచెరగు గాలికి రెపరెపలాడి తనముఖంముందు ఆడుతున్నది. ఆతను వెంటనే తప్పుకుని లేచి "మీరు కూర్చోండి!" అని గౌరవించాడు.

"అక్కరలేదులెండి, నేను రెండుస్టేషన్లతరువాత దిగిపోతాను. మీరు దూరంపోతూ బాధపడవలసివస్తుంది" అని అభిమానశోభితవదనంతో అన్నది.

"ఫరవాలేదు, మీరు కూర్చోండి. మీరు దిగిపోయాక నేనే కూర్చుంటాను. ముందు కూర్చోండి" అని వత్తిడిచేసి ఆమెను కూర్చుండబెట్టాడు. ఆమె బీబీజానేఅయినట్లు, తానింకా యెంతగా గౌరవిస్తే బావుండునా అని ఆలోచిస్తున్నాడు. ఆమెముందే నిలిచివున్నాడు. మోకాళ్ళకు మోకాళ్ల తగులుతున్నవి.

బండి కదిలిపోతున్నవిషయంకూడా విజయ్ గమనించలేదు. బీబీజాన్‌నుగురించి దీర్ఘమైన ఆలోచనలలో మునిగిపోయాడు. ఆమెకు పొరపాటుగా గొప్ప అపకారంచేసినవానివలె పశ్చాత్తాపపడుతున్నాడు.

మనస్సులోని ఆమె ప్రక్క సరళకూడా కనిపిస్తున్నది. ఒకరితరువాత ఒకర్నిగా యిద్దరిని పదేపదే అవలోకిస్తూ విమర్శించుకుంటున్నాడు. తారతమ్యాలను పోలుస్తున్నాడు. బీబీజాన్ మూర్తీభవించిన అందగత్తె. పోతబోసినప్రతిమవలె వుంది. ప్రక్కన గనిపిస్తున్న సరళ సౌందర్యంలో సుకుమారలావణ్యాలు శోభిస్తున్నవి. మూగరత్నముముందు సానబట్టి కాంతిపుంజాలను వెదజల్లుతున్న రత్నాన్ని వుంచినట్లున్నది. ఒకరు గంభీరస్వభావులయితే మరొకరు మధురవాణిలో కిలకిలలాడుతుంటుం టారు. ఒకరు సహనంతో తనమనోవేగాలను తనలోనే యిముడ్చుకో గలిగితే మరొకరు ఆవేశఆదుర్దాలతో వుక్కిరిబిక్కిరవుతారు. ఆలోచన లలో పరువులెడుతున్నమనస్సు సరళవైపుకు మొగ్గుతున్నది. సుకోమల కుసుమంలాంటి ఆమె, స్నిగ్ధప్రకాశంతో ఆకర్షిస్తున్నది.

"ఏమండీ ! మాస్టేషను వస్తున్నది. నేను దిగిపోతాను. మీరు కూర్చోండి" అని ముందునుంచి వినిపించింది. మనస్సులోని ఆలోచనలు చెదిరిపోయినవి. తనస్థానాన్ని తాను తిరిగి ఆక్రమించాడు. బండివేగం తగ్గిపోతున్నది. ఆ అపరిచితురాలు తనముందు నిలిచింది. ఆమెను చూస్తున్నకొంది మనస్సు మరోవైపుకు తిరుగుతున్నది. సరళయెడల క్రోధం జనిస్తున్నది. తనహృదయఫలకంమీద బీబీజాన్ ప్రతిమను చిత్రించుకొనుటకు నిలిచిన మోడల్‌వలె గోచరిస్తున్నది, ముందునిలిచిన యువతి. రూపురేఖలతోనేగాకుండా గుణగణాలలోకూడా బీబీజాన్‌వలె సుగుణసంపన్నురాలుగా వ్యక్తమవుతున్నది. ఈమే బీబీజాన్‌అయితే యెంతబావుండును. ఆమెనే ప్రోత్సహించి తీసుకొచ్చియుంటే యెంత బావుండేది. తనమనస్సు కిలాంటి నిరాశ నెన్నడూ కలిగించియుండేది గాదు, అని తలపోస్తున్నాడు.

బండి ఆగింది. ఆమెదిగి వెళ్ళిపోయింది. ఆతనిమనస్సులోకలిగిన వెలితి దీనత్వాన్ని ప్రేరణచేస్తున్నది. అమె యెవరో యెక్కడినుంచి వచ్చిందో? రూపురేఖలలో సన్నిహితురాలైపోయింది. తనచెంతకే చేరింది,తాను ఆ తెలియనిభ్రమలోని అభిమానంతో ఆదరించి సౌకర్యాన్ని కల్పించాడు. తిరిగి విశ్వాసముద్రవేసి వెళ్ళిపోయింది. తానక్కడేవుండి ఆమెనుగురించే ఆలోచించుట యెంత శోచనీయం ! తానూ

మరికొంతసేపటికి బండి దిగిపోయాడు. ఎక్కినవారు, యెక్కబోయే వారు అందరు దిగిపోయేవారే. ఎక్కడ యెవరు యెక్కుతారో, తన ప్రక్కన యెవరు కూర్చుంటారో, తిరిగి వెడలిపోతారో తన కేమాత్రము తెలియని యీప్రయాణాన్నిగురించి ఆలోచన చెలరేగింది. జీవితంకూడా యిలాంటి ఒక యాత్రలాంటిదేగదా, అనుకుంటున్నాడు.

విజయవాడస్టేషనులో మనస్సు మరోమాటు చలించింది. విముఖతతో మనోదౌర్బల్యాన్నిపారదోలే ప్రయత్నం యెంతచేసినా విఫలుడై శూన్యహృదయునివలె వెయిటింగ్‌రూము, ప్లాట్‌ఫారం అంతటా వెదుకుతున్నాడు. మానవహృదయంలో ఆశ అమరత్వాన్ని పొందింది. తనకు బానిసలుగాచేసుకుని చిత్రవిచిత్రనాటకాలను ఆడిస్తూ వోడిస్తుంటుంది. విజయాలుగాచూపి పరాజయాలను నెత్తినరుద్ది వికటాట్టహాసం చేస్తుంటుంది.

మరోమాటు సరళను కఠినంగా గర్హిస్తూ హృదయాన్ని దృఢం చేసుకుని బండిలో యింటికిపయనమయ్యాడు. ఇపుడు వూహాలోకం లోని యే మలుపులోను సరళ ఆకర్షించుటలేదు. అన్నివైపులనుంచి విముఖత గనిపిస్తున్నది. బీబీజాన్‌యెడల ప్రేమ, ఆదరము, అభిమానము, విశ్వాసము కలుగుతున్నవి. ఇంతకుముందు ఆమెకుచేసిన నిరాదరానికి మనస్సు నొచ్చుకుంటున్నది. తనవెంట పిల్లిఅడుగులు వేసుకుంటూ యెంత అనుసరించినా, సేవావాంఛితురాలై ముందుకొచ్చినా తనుచూపిన విముఖత్వం తన నిపుడు పరిహసిస్తున్నది.

బగ్గీచప్పుడువిని గాబోలు బీబీజాన్ ముందుగానే యెదురొచ్చి ఆతనిచేతిలోని సంచి నందుకున్నది. నూతనంగా చూస్తున్నట్లు కన్నులార్పకుండా ఆమెను చూస్తున్నాడు. చిన్నచిన్నపనులనుసైతం అందుకోవాలనివెళ్ళి నిరాదరింపబడి వెనుదిరిగిరావటంలో అలవడిన ఆమెకు తేలికగా సంచి లభ్యమవుటేగాక, అతనిదృక్కులలోని స్నిగ్ధప్రేమను అర్థంజేసుకుని ముగ్ధురాలయినపుడు సిగ్గుతెరలు క్రమ్మివేసినవి. ఆతను ఆగిపోయినట్లే తాసూ వెనుదిరిగివెళ్ళలేక తొట్రుపాటుతో ఆగిపోయింది. రైలుబండిలోకలిసిన ఆ అపరిచితురాలిపోలికలను బీబీజాన్‌తో సరిజూస్తున్నాడు. ఆమెకంటె యీమె నాజూగ్గా అందంగానే వుంది, కాని

యీమెలో అలుముకున్నవిచారరేఖలు తనహృదయంలో జాలిని గొలుపుతున్నవి.

"అలా చిక్కిపోయావేమిటి. బీబీ!" అన్నాడు.

ఈ మూడురోజులలోపల ప్రత్యేకంగా ఆమె చిక్కిపోయిందేమీ లేదని ఆమెకు తెలుసు. తిరస్కరించినవారిమనస్సు మారినపుడు తిరస్కరింపబడినవారిమీద దయాభిమానాల స్రవింపజేయుటలో అర్థంగాని యీప్రశ్నతోనే సరిగ్గా అన్నిచోట్ల ప్రారంభమవుతుంది. ఆ ప్రశ్న భావాన్ని అలానే అర్థంచేసుకున్నదో లేదో గాని తటపటాయిస్తూ నిలిచింది.

"నల్లబడిపోయావుకూడా!" అన్న సామాన్యశబ్దాన్నికూడా అన్నాడు. ఈదఫా సిగ్గుదొంతరలమధ్య ముఖాన్ని పైకెత్తి దృష్టిలో దృష్టి బరపింది. జలభరితమైన నేత్రాలను చూస్తాడనిగాబోలు అధోముఖంచేసి సరసర యింటిలోకి వెళ్ళిపోయింది.

పావులబల్లముందు గూర్చున్న మలయమతియెదుట సంచి వుంచుతూ "అమ్మా, బాబుగారు వచ్చారు" అంటూ వంటశాలవైపు వెళ్ళిపోయి కాఫీ తయారుచేయుటలోను, నీళ్ళు కాయుటలోను మునిగిపోయింది.

ఎన్నోరోజులకు మనోవాంఛిత మధురభాషణలు విన్నది. హృదయంపొంగి పులకితమై తన్నితానంచేస్తున్నది. ఆరోజుల్లో లభ్యమైన అనాదరణకు కారణాలుతెలియనట్లే నేటి ఆదరణకూ కారణం తెలియదు. ప్రస్తుతం ఆ కారణాలగూర్చి యోచించగలసావకాశం మనస్సుకు లేదు. క్రుద్ధుడైనదైవం నేడు ప్రసన్నుడైనాడనుకుంటున్నది. నీలిమేఘాలస్పర్శలబొంది కేళీసరససల్లాపాలతో హాయినివెదజల్లు శీతలపవనాలకు మయూరం ఫించం ఝుళిపించి నృత్యంసలుపుటలోనే ఆనందంపొందినట్లు బీబీజాన్ పరవశమైపోయింది.

తల్లినిపరామర్శించి తన గదికిచేరిన విజయకుమార్‌కు బడలిక ముంచుకొస్తున్నది. షర్టువిప్పి యీజీఛైర్‌లో వాలిపోయి బీబీజాన్‌ను గురించే ఆలోచిస్తున్నాడు. ఎవరిద్వారానో పరాభవింపబడినవానివలె, యీ మూడురోజులప్రయాసకు తనలోతానే నొచ్చుకుంటున్నాడు.

"కాఫీ తీసుకోండి" అని కోమలస్వరంతో అంటూ ప్రక్కనున్న స్టూలుమీద కప్పు సాసరు వుంచి వెనుదిరిగి వెళ్ళిపోతున్నది బీబీజాన్.

నేత్రాలుతెరచి చూసి "బీబీ.... నేను త్రాగనేమోనన్న భయంతో నైనా వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోతున్నావు, ఇది మర్యాదేనా ?" అన్నాడు.

"ఆరిపోతవి, త్వరగా త్రాగండి. అమ్మకుకూడా కాఫీ యివ్వాలి. స్నానానికి నీళ్ళు తయారైనవి" అని గడగడవల్లించి తిరిగిపో నుద్యుక్తురాలైంది.

"నాకు కాఫీ అక్కర్లేదు" అని దృఢమైనశబ్దాలతో అన్నాడు విజయ్.

ఆ మాటలతో ఆమె చల్లబడి వెనుదిరిగివచ్చి ఆతనికుర్చీ ప్రక్కగా నిలిచి భయకంపితకంఠంతో "యెందుకు త్రాగరూ ?" అని ప్రశ్నించింది.

"ఎందుకు త్రాగాలి ?"

"ప్రయాణబడలికలో నున్నారు. కాఫీత్రాగితే బడలికపోతుంది."

"బడలికవున్నాసరే త్రాగాలని లేదు."

"నేను బ్రతిమాలుకుంటున్నాను త్రాగండి."

"ఉహుం...."

"వినమ్రతతో వేడుకుంటున్నాను, త్రాగు బాబు !"

"చాలినంత వినమ్రత కనిపించుటలేదు."

"మీరు యేమిచేయమన్నా చేస్తాను. క్షమించి కాఫీ త్రాగండి."

వెంటనే టీపాయిమీదున్న కప్పు సాసరు చేతిలోకితీసుకుని "అయితే ముందు దీనిమీద కూర్చో" అన్నాడు.

"ఎందుకు ?"

"ప్రశ్న లనవసరం. నేను కాఫీత్రాగాలంటే చెప్పినట్లు చెయ్యి, అంతే" అన్నాడు.

ఆమె వినమ్రతతో కూర్చున్నది. విజయ్ కప్పులోని కాఫీ సగం సాసరులోపోసి ఆమె కివ్వబోయాడు.

"నాకక్కరలేదు. మీరు త్రాగండిబాబు !" అన్నది.

"నీకక్కరలేకపోతే నాకూ అక్కరలేదు" అంటూనే తనకప్పును క్రిందపెట్టి ఆచేత్తోనే ఆమెజడనుబట్టి ముఖాన్ని తనవైపుకు త్రిప్పుతూ సాసరు అధరాలదగ్గర ఆనించాడు.

"నాఆజ్ఞ, చెబుతున్నా త్రాగు" అన్నాడు.

సక్రమతతో త్రాగివేసి "మరి మీరుత్రాగండి బాబుగారు" అన్నది.

ఆతను నవ్వుముఖంతో కాఫీత్రాగుతూ "నాఆజ్ఞ, అనగానే మహా యిష్టంగాత్రాగావు. యేవిషయంలోనైనా అలానే పాటిస్తావా?" అని ప్రశ్నించాడు.

"ఈ సంశయం మీకు రావలసిందిగాదు బాబు. దైవాజ్ఞనుంచి తప్పుకొను ప్రార్థనలు సలుపవచ్చు, వేడుకోవచ్చు; యెదురువరాలను పొందవచ్చు కాని మీ ఆజ్ఞనుంచి తప్పుకొనుటకు నేను యెన్నడూ ప్రయత్నించను. మీఆజ్ఞ శిరసావహించుటలో ప్రాణంపోయేదయినా, మనస్సు హృదయమేగాకుండా శరీరంలోని ప్రతిఅణువు తృప్తినిపొందుతుంది. మీ ఆజ్ఞాపాలనలో మృతిచెంది నరకానికిపోయినా దాన్ని స్వర్గంగా భావిస్తాను" అంటూ ఆయనపాదాలమీద చేతులువేసింది కాని బూటుతగిలి చకితురాలై, వెంటనేలేచి ఆతనిపాదాలముందు కూర్చుని తనమోకాలు మీద పాదాన్నుంచి బూటును విప్పదీస్తున్నది. విజయ్ తృప్తిగా అర్థనిమీలితనేత్రాలతో చూస్తున్నాడు. రెండుపాదాల బూట్లను వూడబెరికి మేజోళ్ళు లాగివేసింది. వెచ్చగావున్న ఆ పాదాలను వత్తుతూ తన ముఖమండలాని కదుముకున్నది.

దయారసము, ప్రేమరసము మిళితమై మత్తుతత్వాన్నిపొంది విద్యుల్లతవలె ఆతనిశరీరమంతటా ప్రవహించింది. మృదుత్వంతోగూడిన సన్నని గొంతుతో "బీబీ...." అని ఆగిపోయాడు.

ఉత్సుకభరితకంఠంతో "ఏమిటి బాబూ !" అన్నది.

తడబడుతూ "నాప్రశ్నకు జవాబుచెప్పనేలేదు" అన్నాడు.

"ఏమి ప్రశ్న ?"

"చిక్కిపోయావెందుకు ?"

"మీ బెంగతో, అని చెబితే విశ్వసిస్తారా ?"

కుర్చీలో వాలివున్నవాడు లేచి ఆమెశిరస్సును హృదయానికేసి అదుముకుని అటూయిటూవూపుతూ "నీవు యెన్నడూ అబద్ధముచెప్పవని తెలుసు" అన్నాడు.

గొప్ప వూరటతో "నాతప్పులులేకుండానే నన్ను కొట్టినా, చంపినా దుఃఖపడను, ఆనందపడతాను. కాని నా అపరాధమెలాంటి దయినా నాతో మాట్లాడకుండా విముఖభావంతోవుండే శిక్షనుమాత్రం యివ్వకండి. నేను అలాంటిశిక్షను భరించలేను బాబు" అన్నది.

"ఇది నీ ప్రథమకోర్కెగా మన్నిస్తున్నాను. ఇంకా మనస్సులో యేమేమివున్నవో వరుసగాచెప్పు. ఈరోజు నీవు కోరే కోర్కెలనన్ని టిని మంజూరుచేస్తాను" అన్నాడు.

"మీరు నాకు విముఖులుకాకుండా ఎల్లపుడు సుముఖులుగా వుండుటే నా యేకైక కోర్కె. అంతకునించి నాకు వూహలే లేవు. అవుసరమూ లేదు" అన్నది.

వెకిలిగా నవ్వుతూ "నీవు యింత పిచ్చిదానివనుకోలేదు. మానవ హృదయంలోని కోర్కెలకు అంతంలేదని, తోడుతుంటే బావిలోవూరే నీటివంటివని, ఆ కోర్కెలు అంతమయితే జీవితమే అంతమవుతుందని, వో మహావేదాంతిలా నిర్వచించాడు. మనస్సులోనికోర్కెలు నెరవేరుతుంటే తెలియనివి, మిక్కుటంగా వుత్పన్నమవు తుంటవి. కనుక నీవు ఒక్కకోర్కెతోనే సంతృప్తిచెందితే ప్రయో జనంలేదు, ఉన్నకోర్కెలన్నిటిని చెప్పు మన్నిస్తాను" అన్నాడు.

"అన్నిహృదయాలు కోర్కెలతో కొట్టుకోవు. ఒక గొప్ప లక్ష్య సాధనలోనుండేవారికి చిల్లరకోర్కె లుండవు. నేను మీదయ, దానాన్ని అర్థిస్తున్నాను. అది నాయేకైక వాంఛ" అన్నది.

"ఆ వాంఛను ఆమోదించానుగనుక అది తీరిపోయినట్లే. తరువాత కోర్కెలను తెలుపమని కోరుతున్నాను" అన్నాడు.

ఆయనపాదాలను స్పృశిస్తూ "అవును మీరన్నట్లు నాకోర్కె తీరినరీతిలో అనుభవమయి విశ్వాసంతో హృదయంకుదుటపడినపుడు మరోకోర్కె వుత్పన్నమవుతుందేమో చెప్పలేను" అన్నది.

"నీకు నామీద అంత అవిశ్వాసమెందుకు చెప్పు?" అన్నాడు.

"క్షమించండి. మీమీద విశ్వాసంపోయినక్షణం ఆత్మహత్యచేసుకోవటం మంచిది. అమ్మగారన్నట్టు దురదృష్టం వెంటబడినపుడు దేవుడుకూడా కృద్ధుడుకాక తప్పదు. అక్కడ విశ్వాస అవిస్వాస సమస్యలు కాదు. అంత యెందుకు, యీమధ్య నాయెడల అంతవిముఖతతో ప్రవర్తించిందెందుకో చెప్పండి!" అని ప్రశ్నించింది.

విజయ్‌మనస్సు కంపించింది. అస్పష్టతగా "అలాంటిదేమీ లేదే. బయటికార్యాలలోమునిగి వ్యవధిలేక అలా ప్రవర్తించివుంటాను. అది మనస్సులోవుంచుకుని బాధపడకు బీబీ" అన్నాడు.

"బీబీ, ఓ బీబీ!" అన్న మలయమతికేక వినిపించింది.

తత్తరపాటుతో తన మోకాళ్ళమీదనున్న అతనిపాదాలమీద ముఖాన్నివేసి అటుయిటు పులుముకుని భక్తివిశ్వాసాలనుప్రకటిస్తూ వెంటనేలేచి వెళ్ళిపోయింది.

వారంరోజులు గడిచిపోయినవి. బీబీజాన్‌యెడల వెనుకటివలె కలిసిమెలిసినడచుటలోని విజయ్‌మార్పును మలయమతిగ్రహించి ఆనందపడింది. కారణమేమయివుంటుందా అని యెన్నోవిధాల ఆలోచించింది. కారణమేమయినాగానీ మంచిపనే జరిగింది, అని మానసికతృప్తిని పొందింది.

బీబీజాన్ ముస్లింఅయినా పసితనంనుంచి తనవద్ద పెరిగింది. తన స్వభావాలన్నీ పోతబోసినట్లు ఆమెకు వంటబట్టినవి.తన విజయ్‌ప్రక్కనే పసితనంనుంచి మెలిగింది. వారిరువురేకలిసి ఆటలుఆడుకుంటూ గడిపారు. విజయ్‌చేతిలో యెన్నిదెబ్బలుతిన్నా యేడుస్తూకూడా అతను అడిగినవి అందిస్తూనేవుండేది. తనవద్ద యెన్నడూ ఫిర్యాదుచేయనందుకు తనలోతానే ఆశ్చర్యపోయేది. విజయ్ పట్టుకొమ్మని, ఒకపిట్టను బీబీకిచ్చి పంజరాన్ని సరిజేస్తుండగా, ఆ పక్షిగోళ్ళగుచ్చుకుని చేయి మారుస్తుండగా కిచకిచలాడి యెగిరిపోయింది. ఆ పిట్టను పోగొట్టినందుకు విజయ్‌చేతితో తిన్నదెబ్బలు సామాన్యమైనవిగావు. ఏడుస్తూనే తిరిగి విజయ్‌తెమ్మన్న తీగె యెత్తుకెళ్ళి యిచ్చి అతనిఆజ్ఞానుసారం పంజరంపట్టుకుని నిలిచి

కన్నీరుకారుస్తూనేవున్నప్పటి చిన్ననాటిదృశ్యం మలయమతికి యిప్పటికీ గుర్తే. విజయ్ తనమీద యెంత అత్యాచారంచేసినా కిమ్మనకుండా అనుభవించుటలో బీబీ అలవడిపోయిందనుకునేది. వారిరువురిమధ్య తీర్పుచెప్పవలసిన అవుసరం యింతవరకు యెన్నడూ తనకు కలుగలేదు. వారి కలయిక అవిచ్ఛిన్నమైందిగా మనస్సులో అనేకమారులు అనుకున్నది. ఆ జంటను విడదీయుట గొప్ప నేరమవుతుందనికూడా మనస్సులో అనుకున్నది. బీబీ పెద్దదయినకొంది తనయడల చూపుతున్న భక్తివిశ్వాసాలకు ముగ్ధురాలవుతున్నది. జన్మతో యెవరైనా అభ్యాసంలోను, అలవాటులోను హృదయసౌకుమార్యంకలిగి సభ్యసంస్కారాలలో వున్నతస్థాయి పొందినపుడు యెక్కడా యే దోషమూవుండదని మలయమతి విశ్వాసం. అందుకనే ఆ జంటను మనస్సులో ఆశీర్వదించింది.

తనమనస్సులో గూడుకట్టుకున్న అభిప్రాయాలకు భిన్నంగా జరుగుతున్న విజయ్ప్రవర్తనజూచినపుడు, మలయమతిమనస్సు తీరని బాధకు గురియైంది. నేడు మామూలుగాచూస్తున్న దృశ్యాలతో తిరిగి మనస్సు కుదుటపడింది.

"బీబీ! తిరిగి విజయ్ యధాస్థితికివచ్చినట్లున్నాడు. ఇపుడు నీతో బాగా పలుకుతున్నాడుగదూ ?" అని ప్రశ్నించింది.

బీబీ సిగ్గుదొంతరులమధ్య మందహాసం ప్రదర్శిస్తూ వూరకున్నది.

"నిన్ను కాలేజీలోచేర్చను వాడెందుకు ప్రయత్నించలేదో రేపు గట్టిగా అడిగి కోప్పడతానుండు" అన్నది మలయమతి.

శిక్షబొందబోవుచున్న అపరాధివలె కలుగుతున్న గాభరాను అణచుకుంటూ ప్రసన్నాన్నిప్రకటించను ప్రయత్నిస్తూ, ఆమెయెదుట వెళ్ళి కూర్చుని "మీ పాదానికి పసుపుఅంటుకున్న దెక్కడిదమ్మా ?" అంటూ ఆ పసుపుమరకను తుడిచివేయను ఆ పాదాన్ని చేతుల్లోకి యెత్తుకుని తుడుస్తున్నది.

"ఆ గడపనున్నపసుపు అంటివుంటుంది" అన్నది.

అనునయంతో "నే నిపుడు కాలేజీలోచేరి చదువకపోతే కలిగే నష్టమేమిటమ్మా?" అన్నది బీబీ.

"నాదృష్టిలో అది గొప్పనష్టమే. అందుకు వాడే బాధ్యుడుగనుక యేమిసమాధానం చెబుతాడో చూస్తాను" అన్నది.

"వద్దమ్మా, వారి నలా అడగబోకు. విజయబాబుమనస్సుకు బాధ గలుగుతుంది. నేను బ్రతిమాలుకుంటున్నాను. అడగనని మాటయివ్వమ్మా" అని ప్రేమాదరాలను కుమ్మరిస్తూ అడిగింది బీబీజాన్.

"నీ వొక వెర్రిదానివి. వాడి నడుగుతానంటే నీకు భయమెందుకు? ఇందులో నీ తోడు దొంగతనమేముందిగనుక. ఇపుడు దొరికినచ్చాడు గనుక అడిగి నాలుగుచివాట్లువేయుట నావిధి" అన్నది.

"నాకు యిష్టంలేక నేనే మానుకున్నాననుకోండి. వారినిమాత్రం అడుగవద్దు. వారిమనస్సు బాధపడుతుందేమోనని భయం. పోనీ, వారి బదులు నన్ను క్షమించి వారి నా ప్రశ్నలు వేయకండి, మీపాదాలు పట్టుకుంటాను" అంటూ ఆమెపాదాలమీద శిరస్సుంచింది.

మలయమతిమనస్సు అనురాగార్ద్రమై తొణికిసలాడింది. విజయ్ మీద ఆమెకున్న భక్తిశ్రద్ధల పవిత్రతను అర్థంచేసుకుని ముగ్ధురాలవుతున్నది. మనస్సులోనే ఆశీర్వదించి, ఆమెశిరస్సుమీద చేయివేసి నిమురుతున్నది.

గడియారం చూసి అరగంటముందునుంచే వాకిటిదగ్గర జేరి నిరీక్షణచేస్తుంటుంది బీబీ. "అక్కడ నుంచున్నావెందుకు బీబీ?" అని మలయమతిప్రశ్నిస్తే, తవుళ్ళాడుకుంటున్నట్లు "ఏమీలేదమ్మా" అంటూ బయటవాకిలిముందున్న పూలకుండీను కుళ్లగిస్తూ పనిని కల్పించుకుంటుంది.

కాలేజీనుంచివచ్చిన విజయ్ వాకిట్లో యెదురునిలిచి చేతులుచాచిన ఆమెమీదకు దూరంనుంచే విసిరి "అరెరె, ముఖానికితగిలినవి లాగుంది" అని పరిహాసం చేస్తాడు.

బీబీ అది తనఅదృష్టంగా భావించి "పరవాలేదు" అంటుంది. ఆమెజడబట్టుకుని తనవైపుకు లాగుతూ "ఫలహారమేమి తయారు చేశావు?" అని ప్రశ్నించాడు.

"మీకునచ్చేదే చేశాను" అంటూ ముందుకునడిచింది. హాలులో యెదురుగానిలిచి చూస్తున్న మలయమతినిచూసి, ఆ దృశ్యం ఆమెచూసి నట్లు వూహించి చిన్నబోతూ శిరస్సు పెడవైపుబెట్టి గబగబ గదిలోకి వెళ్ళిపోయాడు. బీబీకూడా తోడుదొంగవలె వెంట జారుకున్నది. మలయ మతి యేమీచూడనట్లే మరోవైపుతిరిగి వెళ్ళిపోయింది.

కప్పునిండా ఫలహారంపెట్టి స్పూన్‌వేసి తెచ్చిన బీబీ అతనిచేతి కివ్వ ప్రయత్నించింది. ఆలోచనామనస్కుడై "నా కక్కరలేదు" అన్నాడు.

"ఇంతకుముందే ఫలహారమడిగి మళ్ళీ వద్దంటా రెందుకు బాబు?" అంటూ చేతిదగ్గరగా పెట్టింది.

"అక్కరలేదు" అని ఆమెముఖంలో ముఖంబెట్టి చూస్తూ, విహ్వాలకంఠంతో "నేను జడబట్టుకులాగటం అమ్మ చూసిందిగదూ?" అని ప్రశ్నించాడు.

"అది గొప్ప నేరమేమీకాదుగా?" అన్నది.

"చూసిందా, అని అడుగుతున్నాను. ముందు ఆ విషయంచెప్పు. తప్పొప్పులసంగతి తరువాత" అన్నాడు.

"అమ్మ చూసేవుంటుంది. కాని ఆమె సాక్షాత్ దేవత. మీరేమీ భయపడకండి" అన్నది.

అతనిలోని భీతితాలూకుముద్రలు పోలేదు. బీబీ యింకా ధైర్యా న్నిస్తూ ప్రక్కగానిలిచి స్పూన్‌తో ఫలహారంముక్క అతనినోటికందించి నపుడు తగిలిన తీయదనంలో అంతా మర్చి తినివేశాడు. "ఏమిటి బాగా చేశావు" అన్నాడు.

"చెక్కుతీసిన యాపిల్‌పళ్ళముక్కలు, మీగడ, పంచదార కలిపాను, అంతే" అన్నది.

"ఇవి నీకు మరీ యిష్టమని నాకు తెలుసు. నీవుకూడా కాస్తతిను" అంటూ ఆ స్పూన్‌తోనే ఆమెనోటికందించాడు. ఆమె విస్మితురాలై భుజించింది.

---

# 17. పశ్చాత్తాపం

అన్యోన్యతలతో కలిసిపోయేరోజులు చాలా త్వరగావెళ్ళిపోతవి. విజయ్ అసఫలయాత్రచేసి వచ్చి రెండువారాలు గడిచిపోయినవి. తన యీ చిన్నయాత్రానుభవంకూడా వినను చాలావుత్సాహపడేవాళ్లు ప్రక్కనున్న విద్యార్థులు. కాలేజీక్యాంటీన్‌లోవుండగా "నీకో వుత్తర మొచ్చింది. విజయ్!" అంటూ ఒకమిత్రుడు వాల్‌బోర్డులోనుంచి తెచ్చిన వుత్తరాన్ని విజయ్‌చేతిలో వుంచాడు.

ఆ అడ్రసువ్రాసిన అక్షరాలు చూడగానే యెక్కడినుంచివచ్చిందో అర్థమయింది. ఈ వుత్తరంద్వారా మరోబురిడీకి యత్నంగాబోలు. ఆ వుత్తరాన్ని అందరిముందు నిర్లక్ష్యంగా చించకుండా జేబులోనే పెట్టుకున్నాడు.

ఆ ప్రయాణంలోని బాధలన్నీ వరుసగా గుర్తుకొచ్చినవి. ఆ వుత్తరంలో యేమున్నదో చదువాలనేకాంక్షకూడా పీడిస్తున్నది. బయటకు వెళ్ళి కవరుచించి పుస్తకంపెట్టుకుని చదువుతున్నాడు. అతనిముఖం విచిత్రరూపంలో మారుతున్నది.

ఆ వుత్తరంలో తను విజయవాడవచ్చి యేరూపంగా సంకటమయ స్థితిలోపడి తిరిగి వెళ్ళినది, తను యెన్నివిధాల ప్రయత్నించినా ఆకస్మికంగా కలిసిన రవిప్రసాద్‌ను విడిపించుకోలేకపోయిన సంగతులను, ఆ అమాయకుని తప్పించుకోలేక ఖైదీవలె వెనుదిరిగివెళ్ళిన వివరాలను, అందుగురించి తనఆత్మ యెలా కుమిలిపోతున్నదో మొదలగువివరాలను పూర్తిగా వ్రాసింది. సమక్షంలో క్షమాపణవేడుకోవాలని మనస్సు వాపోతున్నట్లు, అందుకుగాను శనివారంరాత్రికి విజయవాడస్టేషను తను చేరనున్నట్లు, కనుక అక్కడికివచ్చి తప్పక దర్శనమీయవలసిందిగా వినయంతో వ్రాసింది.

ఆ వుత్తరమంతా చదివాక దీర్ఘనిట్టూర్పువిడిచాడు. ఆ వుత్తరం లోని విషయాలన్నీ వరుసగా మనస్సులో పరువులెడుతున్నవి. ఆమె వ్యక్తంచేసినబాధను మననంచేస్తున్నకొంది మనస్సు సడలి జాలికలుగు తున్నది. రవిప్రసాద్‌ను తను బాగా యెరుగడు. ఆనాటి సభాసమయా లలో ఆపేరు విన్నగుర్తున్నది. ఆతనెవరయినాగానీ, ఆతడొక భూతంగా ఆ సమయంలో ఆమె నావేశించి 'యెందుకొచ్చావు, యెలావచ్చావు' అనే ప్రశ్నలతో బాధపెట్టివుంటాడని, అతనినిగురించి క్రోధం కలిగింది. అతనిమీద క్రోధావేశాలు పెరిగినకొంది ఆమెమీద జాలి మరీమరీ అధిక మయి, తనకు ఆ సమయంలోకల్గిన అభిప్రాయాలన్నీ పొరపాట్లని పశ్చా త్తాపానికి గురియవుతున్నాడు. మధురమైన ఆమెమూర్తి ముందు నిలిచి నట్లయింది. ఆ వుత్తరాన్ని మరోమాటు చదువుకుని తనఅపోహలకు యెంతో నొచ్చుకుంటున్నాడు. ఆనాటి ఆ రైలుబండిలోనిసంఘటనలు గిరగిర వందలమారులు సినిమారీలువలె గనిపిస్తున్నవి.

ఆర్భాటాలు, ప్రయత్నాలు లేకుండా, గొప్పవూహాలు చేయగూడ దని అనుకుంటూనే ఆలోచనచేస్తూ శనివారం సంధ్యాసమయపుబండికి పయనమయ్యాడు. బండివేగానికిమించి మనోవేగం సాగిపోతున్నది. ఆమె బండిదిగి యెక్కడవుండేదిగాని, తనను ఫలానాచోట వుండమని గాని వివరంగా వ్రాయలేదు. ఆ విషయం తానూ తెలియజేయలేదు. తానసలు జవాబువ్రాయనూ లేదు, ఆమె కోరనూలేదు. తనమీద ఆమె కంతటి విశ్వాసం యెలావున్నదో ఆలోచిస్తూ మరింత ప్రభావితుడై పోతున్నాడు.

ఆరుగంటలకే విజయవాడ చేరిపోయాడు. ఇంకా దినకరుడు పశ్చిమాద్రివాకునుండి తన అంతిమదృక్కులను లోకంమీదకు విసరు తూనే వున్నాడు. స్టేషనులో యింకా లైట్లు వెలగలేదు. ప్లాట్‌ఫారంమీద అటూయిటూతిరుగుతూ బందరునుంచి రాత్రివచ్చే బళ్ళవిషయం ఆలో చిస్తూ వెయిటింగ్‌రూమ్‌వైపు వెళ్ళాడు. ఆతడు వాకిటముందు ఆగే లోపలే అందరకు మతిభ్రమకలిగించేట్లు శృంగారించుకుని అందాలు

చిందించే ఒక నవయువతి ముందుకొస్తున్నది. ఆమెనడుస్తుంటే ఆ జరీ చీరెగరగరలు, పరిమళఘుమఘుమలు ప్రక్కలకు పరిచయంచేస్తున్నవి. అందరిదృష్టి అటువైపే ముప్పేరలుగా పరువులెడుతున్నది. ఆ జరీ చీరెతో పొదగబడిన పుత్తడిబొమ్మవలె ఆమె అద్వితీయమై శోభిస్తున్నది. అందాలుచిందించే ఒక పాశ్చాత్యనారీమణి నూతనంగా చీరె ధరించినట్లున్నది.

లక్ష్మిఆలయంలోని గర్భగుడినుంచి స్వయంగా ఆ దేవతే ప్రత్యక్షమై ముందుకువస్తున్నట్లున్న ఆమెనుచూసి పోల్చుకోజాలక నివ్వెరపాటుతో చూస్తున్నాడు విజయ్. సరళను తాను రెండుమారులే చూశాడు. ఈ అలంకృతశోభను పోల్చలేక విభ్రాంతితో నిలిచిపోయాడు.

"ఆలోచిస్తారేమిటి,-గుర్తించలేకపోతున్నారా? వెళదాం పదండి!" అంటూ బయటకు దారితీసింది. విజయ్ మాట్లాడగలస్థితిలో లేడు. సీతాస్వయంవరంలోపాల్గొని శివధనస్సును యెత్తలేక హాస్యాలపాలయి విభ్రాంతిలో మునిగినట్లు, ఆమె తనకుఅందని అతీతమైందిగా ఆలోచిస్తూ అమాయకునివలె అనుసరిస్తున్నాడు.

అలాంకార్ థియేటరులో ఆసీనులయ్యారు. ఆడుతున్నబొమ్మ యేమిటో వారికి తెలియదు. తెలుసుకోవాలని, చూడాలని లేనూలేరు. ఎంత విచిత్రం! తాను స్వతంత్రించి పలుకరించలేకపోతున్నాడు. ఆమేదో గొప్పదైనట్లు, తాను సర్వసామాన్యుడయినట్లు జంకిపోతున్నాడు. అనాలోచితంగా హాలులోచేరి కూర్చున్నారుగాని ఆ జనసమ్మర్దం ముందు మనస్సు పాలుపోక యేకాంతాన్ని వాంఛిస్తున్నది. అరగంట అనంతరం విసగడతో సరళలేచి "రా విజయ్" అంటూ బయటకు నడిచింది. విజయ్ ఆమె ననుసరించాడు. ఇరువురు, జీవితంలోని నూతనాధ్యాయంలో ప్రవేశించుటగనుక తపుళ్ళాడుకోవటమవుతున్నది. పార్కు చివరలో మెర్క్యురీలైటు దాపులోనున్న బెంచిమీద ఆసీను

లయ్యారు. ఆ వెలుగులో ఆమెఅందం మరింత అధిగమించి జ్యోతివలె ద్యోతకమవుతున్నది.

"ఒక్కమాటకూడా మాట్లాడవేమిటి విజయా ?" అని మధుర బాణిలో ప్రశ్నించింది.

ఆ ప్రశ్నతో ఆయనమనస్సు మనస్సులో చేరింది. అస్పష్టరీతిలో "హుఁ...." అని పెగలక తోచక వూరుకున్నాడు.

"నామీద కోపమా ?" అని ప్రశ్నించింది.

మనస్సిపుడు మరింత స్వాధీనానికొచ్చి ధైర్యము, చనువు కలిగినవి. "కోపమెందుకు ?" అన్నాడు.



# 18. స్త్రీ విలువ

ఆమె ఆతనిహస్తాలను దీసుకుని మృదువుగా నలుపుతూ "విజయ బాబూ! మునుపు ప్రయాణంపెట్టి మీకు కలిగించినశ్రమకు హృదయ పూర్వకమైన క్షమాభిక్ష వేడుకుంటున్నాను. నేను ఆరోజు ఆకస్మికంగా కలిసిన, రవినుంచి తప్పించుకొను సర్వప్రయత్నాలుచేసి విఫలురాల నయ్యాను. బంధువులలోనివాడు, యింటిసమీపంలోని వాడు. క్లాసు విద్యార్థి అయినందున భయపడి తప్పించుకోలేక మీకు నిరాశ కల్పించాను. ఎంతో బాధపడివుంటారనుకున్నాను. అప్పటినుంచి యీక్షణం వరకు ఆ విషయంలో నేనుపడుతున్న పశ్చాత్తాపం అనంతమైంది. నీవు క్షమిస్తేగాని మనశ్శాంతికలుగదు" అన్నది.

"నీవు కోరి కల్పించినబాధగాదు గనుక, నీవూ నాకంటే అవస్తలుపడక తప్పిందిగాదు గనుక అందు నీ అపరాధములేదు" అన్నాడు.

"అలాకాదు, క్షమించానను విజయ్, నామనస్సు తృప్తిచెందు తుంది" అన్నది.

"నీ తృప్తికొరకు ఒకమాటుగాదు లక్షమారులు క్షమించానని అన గలను. కాని ఆమాట నిన్ననటానికి నాకే సిగ్గుగావుంటున్నది సరళా!" అన్నాడు.

"ఎందుకని?" అన్నది.

"స్త్రీకి విజ్ఞానవికాసాలకంటె సుగుణసంపత్తి యెంతముఖ్యమో అందచందాలు అంత రాణించునవి. ఆ రెండూవున్న నీలాంటి స్త్రీమూల్యం అమూల్యమైంది. అవి భగవదనుగ్రహ వరాలు సరళా! అలాంటి నిన్ను పొందుటకూడా జన్మజన్మల పుణ్యఫలితకారణమే అవు తుంది" అన్నాడు.

"ఎప్పటికప్పుడు కర్మిష్టిరూపకార్యరంగందప్ప మిమ్ము మరేమీ ఆకర్షించవనుకున్నాను. స్త్రీఅందం మిమ్ము ఆకర్షించగలుగుతుందా విజయ్ !" అన్నది.

"పేరుప్రతిష్టలు పొందుట, పోగొట్టుకొనుట ఆటలలాంటివి. వాటిమీద నాకు నిర్దిష్టమైనమోజు లేదు. అర్థంచేసుకున్నపుడు అదంతా భ్రమ అనిపిస్తుంది. కాని సుగుణసంపన్న. అందాలరాశియయిన వనితను పొందుట యీలోకంలోని అన్నిటికంటె ఘనమైందిగా భావిస్తాను" అన్నాడు.

ఆమెహృదయం తన్మయత్వంతో పరవశమై అతనిహస్తాన్ని నలుపుతూ తనచేతిక్రిందగా లంకెవేసుకుని, అతనిముఖంలో ముఖం బెట్టి చూస్తూ "ఈ లోకంలో సంపత్తి సర్వశ్రేష్టమైందిగా పరిగణింప బడుతున్నది. ఆద్వారాపొందే కీర్తి అమరమైందిగా యెంచబడుతున్న సంగతిని విస్మరిస్తే ఆ తరువాత పశ్చాత్తాపమే ప్రాప్తమవుతుంది" అన్నది.

ఆతను వెకిలినవ్వును ప్రదర్శిస్తూ "లోకందృష్టిలో కావచ్చు. ఒకప్పుడు నీతినియమాలకు, దానధర్మాలకు విలువవుండేది. నేడు యదార్థరూపంలో సంపత్తికి, ఆద్వారాపొందే కీర్తికి విలువున్నది. కాని నా దృష్టి కవి ఆకర్షణీయమైనవి కావు. సంపత్తికి, కీర్తికి మారుపేరు అశాంతి. నా స్వార్థానికి వాటిని కాంక్షించను. దేవతాస్వరూపిణియైన స్త్రీని కోరతాను" అన్నాడు.

"దేవలోకంలోవుండే దేవతాస్త్రీని కోరితే యీలోకంలో ప్రయోజనమేమిటి ? అంతేగాక అందమైనస్త్రీ అన్నిటికంటె ఘోరఆపత్తులను తెచ్చిపెడుతుందంటారు. రామాయణ, మహాభారతయుద్ధాలుకూడా స్త్రీల కొరకు రేగినవేనంటారు. కాస్త ఆలోచించి మరీ యెంచుకోండి" అన్నది.

"సీత, ద్రౌపది, క్లియోపాత్రలలాంటి వాళ్ళద్వారా మారణ హోమా లుత్పన్నమయినమాట వాస్తవమే. కాని వరదబాధతో నదులను దూకుట వివేకంకాదు" అన్నాడు.

ఆమె మృదువుగా నవ్వుతూ "అయితే యీ విషయాలలో మీరు తర్జనభర్జనచేసి సిద్ధాంతీకరించుకున్నవి కొన్ని వున్నవన్నమాట. ఆవిధంగా మీరు వూహజేసిన దేవతాస్త్రీనిబోలిన రూపరాసి, గుణవతి యింతవర కెక్కడయినా కనిపించిందా విజయ్‌బాబు ?" అన్నది.

తెలిసినవిషయాలనే ప్రశ్నలద్వారా ఒకరిద్వారా మరొకరు చెప్పించుకోవటం, యెప్పటికప్పుడు వినూత్నవిషయాలవలె వినటం ప్రేమికులకు అలవాటయిన జబ్బు. ఆద్వారా ఆత్మానందాన్ని గ్రోలుతుంటారు. ప్రేమికునిహృదయంలో తను యెంత స్థిరపడిపోయింది, యెంత లోతు వేరులు ప్రాకిపోయింది, క్షణక్షణము తడివిచూసుకుని, సంతృప్తితో కలవరింతలుచెందుట స్వాభావికం. తెలిసినవిషయాలనే తెలుసుకొనుటలోను, విన్నవిషయాలనే వినుటలోను ప్రేమికులమధ్య విసగట వుండదు.

"నేనుచూసి నిర్ణయించుకున్న దేవకన్యను నీకు చూడాలని వుందా ?" అని ప్రశ్నించాడు విజయ్.

"మీ కభ్యంతరంలేకపోతే చూపించండి" అన్నది.

మందహాసాలొలికిస్తూ "ఒక్కమాటుగాచూపుట అంత క్షేమం గాదేమో ! ఈ ఒక్కవిషయంలో నేను మహాస్వార్థిని కనుక వివరంచెప్పగలను...." అంటుండగానే సరళ కల్పించుకుని, "నేడు మీ నోటిగుండా నూతనవిషయాలను వింటున్నాను. కర్మిష్టిగా కార్యరంగం పరుగులుదప్ప దేనిని జీవితాంతం కాంక్షించరని, దేనినిగురించి మీరు దీర్ఘంగా ఆలోచించరని, అవుసరమైనపుడే దేనినయినా తృణప్రాయంగా విసర్జించగలరని అనుకున్నాను. కాని మాటలు మరోధోరణిలో మాటాడుతున్నారు" అన్నది.

"ప్రతిఒకరు యెక్కడో ఒకచోట పట్టుబడిపోతారు. నేను సర్వాన్ని నిర్లక్ష్యంచేయగలను కాని నా మనోఫలకంమీద ముద్రించుకుపోయిన ఆమెవిషయంలో నేను పరాజితుణ్ణి" అన్నాడు.

"అంతటిఅదృష్టవంతురా లెవరో చెప్పు విజయ్" అని ప్రశ్నించింది.

"వర్ణించి చెప్పగలశక్తి లేదు. తామ్రసంయోగహీనమైన శుద్ధ కనకచ్ఛాయలో మిరమిరలాడు జ్యోతిర్మయిప్రకాశము నన్ను మేకాగ్రం చేసి తనలో లీనంచేసుకుంటుంది. మహాతేజస్సుగా గోచరించే ఆ వెలుగులు స్పష్టంగా పరిశీలించగలశక్తిగాని, వర్ణించగల సమర్ధతగాని నాకు లేదు. అసంఖ్యాకదీపశిఖల కలయికలతో ఆవిర్భవించిన విరాట్ వెలుగు రూపురేఖలను వర్ణించగలసామర్ధ్యం లేదు. ఆ కాంతిపుంజాలమధ్యనున్న ముఖమండలం, పద్మాకారాన్ని బోలి తీర్చిదిద్దినట్లుంటుందని చెప్పగలను. ఆమె గుణగణాలంటావా, దాగుడుమూతలలాంటివి. హృదయం అతికోమలమైంది. సినిమాద్వారా ఒకకథను తెలిసికోవటంకంటె చదివి తెలిసికోవటం యెంతకష్టమో, నాలుగుగోడలమధ్య బందీయై చదువుట ద్వారా విజ్ఞానాన్నిసంపాదించుట అంత కష్టమైంది. ఆ సుకుమారసుందరికి యీ చదువుద్వారాకలిగే కష్టంకూడా భరించరానిదని యెవరైనా అనగలరు, ఆ విషయం ఆమెకూ తెలుసు. అందుకే పరీక్షలలో తేలికైన కాపీకొట్టుటకు సాహసిస్తుంది. టిక్కెట్టులేకుండా రైలుఎక్కగల సాహసి. ఎదుటివారిని వెర్రివానినిచేయగల సత్తాత్మిక....!" అని యింకేమో వర్ణించబోతుండగా, మధ్యలోనే ఆమె తనచేతిని అతనినోటిమీదవేసి అదుముతూ, మృదువైనకంఠంతో "ఇక చాలించు మహాశయా, నే నెవరిని వెర్రివారినిచేశాను ? చమత్కృతిలో యెదుటనున్న నన్ను మీరే యిపుడు వెర్రిదాన్నిగా చిత్రిస్తున్నారు" అన్నది.

ఆమెచుబుకాన్ని బట్టి పుణుకుతూ "అంత వులికిపోతావెందుకు ? నీవుఅడిగింది నామనస్సులోని దేవత విషయం. నేను చెబుతున్నదికూడా ఆ విషయమే. నీదిగాభావించి నీవు గాబరాపడతావెందుకు ?" అన్నాడు.

ఆమె సిగ్గుదొంతరలలో అనురాగాలొలికిస్తూ "ఎదుటివారిని చిన్నబుచ్చే గొప్ప విధానాన్నే అనుసరించావు. కాని ఇది అత్యాచారమవుతుంది విజయ్ !" అన్నది.

లోకంలో పాపాలుచేయుటలో యెవరూ వెనుకంజవేయుటలేదు. అవుసరమైనదానికంటెఅధికపాపాలు నిర్భీతితోచేస్తున్నారు. తరువాత చేసే పూజలద్వారా పుణ్యాన్నిపొంది పాపాన్ని రద్దుజేసుకోవచ్చునన్న విశ్వాసంవుంది గనుక యిబ్బందిలేదు. అదేరీతి అత్యాచారానికి కంపించ

వలసిన పనిలేదు. సరిజేసుకొను క్షమాపణలు వుండనేవున్నవిగదా!" అన్నాడు.

"కోరుట తేలికగావచ్చు. లభించవద్దూ?" అన్నది.

"కఠినత్వం అంత సులభమైందిగాదు" అంటూ ఆమెకపోలాలు మృదువుగా పట్టి వూపాడు.

ఆమెచేతినిబట్టి తనవైపుకు లాక్కున్నాడు. ఆమెశిరస్సు వచ్చి తనతొడలమీద వాలిపోయింది. సుగంధఘుమఘుమలు మరింతజోరుగా వెదలుతున్నవి. పూర్ణిమనాటిజాబిలి తనవడిలోకి చేరినట్లున్నది. శరీర మంతటా విద్యుల్లత ప్రవహిస్తున్నది. హృదయం జోరుగా కంపిస్తు న్నది. గొంతుక యెందుకో శుష్కతపొంది మాట పెగలదేమోననిపిస్తు న్నది. ఖజానాదోచుకున్నవానివలె తెలియనిభయ మావేశించింది. అటు యిటు నలువైపులా బిత్తరగా చూస్తున్నాడు.

ఆమె ఆతునిషర్టుబటనునుబట్టి అటూయిటూత్రిప్పుతూ "ఏమి టలా గాభరాపడుతున్నారు! స్వయంగా సాహసులమని భ్రమించేవారిలో పిరికితనం కానరానంత దాగివుంటుంది. అవునంటారా, కాదంటారా?" అన్నది.

ప్రత్యక్షసత్యాన్ని కాదని తనెలా అనగలడు! ఒక అబలముందు తానెంత తేలిగ్గా పరాజితుడైనాడు! పురుషుడు యెంతటివీరుడైనా, ఘను డైనా ఒకనాడు స్త్రీముందు పరాజితుడుకాకతప్పదు. స్త్రీముందు పరాజయం పొందని పురుషునిలో పూర్ణత్వం రాజాలదు. స్త్రీద్వారా పొందిన పరా జయంలోనే పురుషునికి జ్ఞానోదయం కలుగుతుంది.

"నీముందుండే పిరికితనంలోనే ఆనందమున్నట్లు తోస్తున్నది సరళా!" అన్నాడు.

ఆతనిచేతిని తనవుదరంమీదవుంచి వ్రేళ్ళు లాగుతూ "భగవం తుడు స్త్రీకి ఆకర్షణాశక్తినిచ్చినట్లే పురుషునికి యుక్తిని ప్రధానం చేశాడు. తనపరాజయాన్ని పరాజయంగా ప్రకటించక దానికేవో యుక్తితోగూడిన శబ్దాలను జోడించి తెలివితో తప్పుకోజూస్తారు" అన్నది.

ఆతని హృదయకంపనలు తగ్గినవి. ధైర్యంచేకూరుతూ ఆనందం

అనుభవమవుతున్నది. "నీవడిలోపొందే పరాజయంతో కలిగే ఆనందానుభూతులు ఆ స్వర్గంలో లభిస్తవనుట వట్టిభ్రమ సరళా!" అంటూ ఆవేశితుడైనట్లు ఆమెశిరస్సును పైకియెత్తి సునిశితమై కెంపురంగులో ప్రతిబింబిస్తున్న ఆమె అధరాలమీద చుంబనముద్రలను వేశాడు.

దీర్ఘనిట్టూర్పులతో అయిదునిమిషాలు గడిచినవి. ఆమె నిర్మలమైనప్రశాంతతో ఆతనిముఖంలోకే చూస్తున్నది. విజయ్ చంచలునివలె, స్థిమితములేనివానివలె అటుయిటు ప్రక్కలను పరికిస్తున్నాడు.

"మాట్లాడవేమిటి విజయకుమార్ ?" అని ప్రశ్నించింది.

"ఎవరయినా యిటువస్తారేమోనని భయంగావుంది!" అన్నాడు.

"భయంతో చెప్పాలనుకున్నవి చెప్పకుండా తిరిగివెళితే ఆ తరువాత అందునుగురించి కొంతబాధ కలుగుతుంది. కనుక మొన్న నేను కనిపించినపుడు యేమనుకున్నావో చెప్పు ? అటుయిటుచూడకుండా భయాన్ని పారద్రోలు. స్థిమితం గలుగుతుంది" అన్నది.

"ఎవరయినా యిటువస్తే యెలా చెప్పు ?" అన్నాడు.

"వచ్చినవారు చూసి వెనుదిరిగివెళ్ళిపోతారు. మనంచేస్తున్నది నేరం కానపుడు భయమెందుకు ?" అన్నది.

"నేరంకాదని తెలుసు. అయినా భీతి గలుగుతున్నది" అన్నాడు.

"భయము, భీతి దొంగతనాన్ని అంటిపుంటవంటారు. చేయరాని నేరాన్ని అంటివుంటవంటారు. కాని నిన్ను అంటివుండుట శోచనీయం" అన్నది.



# 19. ప్రేమ ప్రేరణ

ఆమెకులేనిభయం తనకెందుకు? తాను మోసగించుటలేదు. ఆమె అంతకంటె మోసగించుటలేదు. పరస్పరప్రేమ కలిగింది. చేయరానిదికాదు. అయినా తనకు భీతియెందుకు? ఎవరైనాచూస్తే? అని మనస్సు మరోమాటు చర్వితచర్వణంగా గొణిగింది. ఆమె చెప్పినట్లే చూసినవారు వెనుదిరిగి వెళ్ళిపోతారు. నిజమే! అయినా మనస్సు కంపిస్తున్నది. మనస్సును యెంతకూడదీసుకున్నా చెదిరిపోతున్నది.

కంఠం శుష్కించినందున శబ్దం స్థూలంగావస్తున్నది. "సరళా!" అన్నాడు.

ఆమె చిలిపిగా నవ్వుతూ "ఏమిటో సెలవివ్వండి" అన్నది.

ఆయనవడిలోనున్న తనశిరస్సును సరిజేసుకొను రెండోవైపు నున్న ఆతనితొడను తనశిరస్సు క్రిందకు బాగా లాక్కుంటుండగా ఆమె కాలిజోడు జారి క్రిందపడిపోయింది.

ఆ జోడు తనకాలితో పైకి అందుకుని ఆమెపాదానికి తొడగాలని ప్రయత్నిస్తున్నాడు. ఆమె నొచ్చుకుంటూ "అబ్బ! అదేమిటి విజయ్, ఆ చెప్పును మీచేత్తో తాకటమెందుకు, క్రిందపడవేయండి" అన్నది.

విజయ్ ఆమెపాదానికి తొడగాలనే ప్రయత్నంలోనేవున్నాడు. ఆమె తనపాదాన్ని అందనీయకుండాచేసి, చేత్తో అందుకో ప్రయత్నిస్తూ స్త్రీ కాలిజోడును పురుషుడు అంటుకోగూడదు విజయ్" అన్నది.

ఆమె అంటూ నిరోధిస్తున్నకొంది రెచ్చిపోయి "తప్పని యెవరు నిర్ధారించారో వారికి తప్పుగావచ్చు. నాకు కాదుగా!" అంటూ ఆజోడు లోపలివైపు అరచేతితో తుడుస్తూ బయటివైపు అంటుకున్న మట్టిని తీసి వేస్తున్నాడు.

"చేయరానిది చేయుటలో యింత పట్టుదల, ఆనందము యేమిటో!" అన్నది.

"అది మానవబుద్ధిలోని స్వతఃసిద్ధ ప్రేరణ" అన్నాడు.

"యేమయినా కానీండి. ఆ చెప్పును నాచేతికివ్వండి" అంటూ పట్టుకోబోయింది. కాని, అందలేదు.

ఆతనిచుబుకాన్ని బట్టి పుణుకుతూ "నేనే నీ దగ్గరుండగా నా శిరస్సు నీవడిలోవుండగా, అంతకంటె మూల్యమైనదైనట్లు ఆ చెప్పుమీద అంత ప్రేమచూపటమెందుకు చెప్పు ?" అని లాలింపుగా అడిగింది.

"ప్రతిదానికి 'ప్రేమ' అనే శబ్దాన్ని వాడటం అంతగా శోభించదు సరళా! ఇది నీజోడుగనుక నీకాలికి తగిలిద్దామన్న వాంఛ, అంతే." అంటూ ఆ ప్రయత్నంలోనే ఆమెనడుమువద్ద హస్తద్వయంవేసి తన వైపుకు జరుపుకోజూస్తుండగా గిలిగింతలుకలిగి లేచి కూర్చున్నది. పంతంపట్టినవానివలె క్రిందకు వ్రేలాడుతున్న ఆమె రెండుపాదాలను ఒక్కమాటుగా పట్టుకొని తనకవుగిటిలోకి తీసుకున్నాడు. ఆమె బల్లమీదకువాలి పాదాలను విదిలించుకోవాలని ప్రయత్నిస్తూ "అబ్బ ! అదేమిటిబాబూ ?" అని రొప్పుతున్నధ్వనిలో అన్నది. ఆ రెండోపాదం జోడుకూడా జారిపోయింది.

"అరె ! రెండోజోడుకూడా క్రిందపడిందా ?" అంటూ ఆ పాదాలను తనవక్షస్సుమీద అదిమివుంచుకుని క్రిందకువంగి ఆ జోడునుతీసి పాదానికి తొడిగాడు. ప్రక్కనున్న రెండోజోడునుకూడా తీసి ధరింపజేశాడు. ఆమె వివశురాలై తననుకాదన్నట్లు చూస్తూ వూరుకున్నది.

గొప్ప తలంపును సాధించుకున్నవానివలె ఆమెముఖంవైపు చూశాడు. కాని ఆమె రోడ్డువైపుచూస్తున్నట్లు నటించింది. తిరిగి ఆ పాదాలవైపేచూస్తూ తాను తొడిగిన పాదరక్షలమ వూడబెరికి బెంచీమీద వుంచి, వీరోచితంగా సంపాదించుకున్న సంపత్తివలె రెండుపాదాలను కవుగిటిలో బంధించివేశాడు. క్షణమాగి వాటిని అటుయిటువత్తుతూ, వాటిమీదనే ధ్యాననిమగ్నుడైనాడు. ఆ తరువాత పాదాలను తన తొడలమీదుంచుకుని కాలివేళ్ళను ఒక్కటొక్కటిగాపట్టి మృదువుగా లాగుతున్నాడు.

"విజయకుమార్ ! నీవు పిచ్చివాడివి కాలేదుగదా ?" అన్నది.

ఆతడు చిన్నగా నవ్వుతూ "ఆ పిచ్చిలోవున్న తన్మయత్వం నీకేమితెలుసు ?" అన్నాడు.

ఉన్మాదితుడు వున్మాదితునికి అసలే అర్థంగాడు. తాను స్వయంగా ఆతనివడిలోవుండగా తనపాదరక్షలు ఆతన్నాకర్షించుట, తనశిరస్సే వడిలోవుండగా పాదాలు ఆకర్షించుట, ఆ పాదాలను వడిలోకి దీసుకుని ఆనందపడుట ఆమె కర్థంగానిసమస్యగా ముందు నిలిచింది.

ప్రేమోన్మాదితుల కిది అలవాటయిన జాడ్యము. ప్రేమమత్తు హద్దుల నధిగమించినపుడు యీరూపంగాచిలిపికార్యాలుచేసి వుపశమనాన్ని పొందుట పరిపాటి. శిరస్సునువిడచి పాదాలనుపొందగోరుట, హృదయంలోని ప్రేమపొంగులు అవుసరమైనస్థితికొచ్చుటకు గాబోలు; లేక ఆలయంలోని మూలవిరాట్‌ను దర్శించబోతూ ద్వారంముందున్న వీరభద్రునికి మ్రొక్కుటలాంటిదిగాబోలు. పరిభాష యేమయినాకావచ్చు. జరిగిన యదార్థదృశ్యాలను చిత్రించుట దోషంకాదుగదా !

ఆమె చేయిచాచి ఆతనిభుజస్కంధాన్నిపట్టి "విజయ్‌బాబూ ?" అని వూపింది.

"వూఁ, ఏమిటి ?" అని సమాధానంగా అన్నాడు.

తనపాదాలను ఆతనిబంధాలనుంచి విడిపించుకుని సన్నిహితంగా కూర్చుని "ఏమీ మాట్లాడవెందుకు ?" అన్నది.

ఆమెచేతిని తీసుకుని అరచేతిలో చుంబించబోయి దంతాలతో గంటువేశాడు.

"అబ్బ ! యేమిటీ పనులు ? గంటు పడలేదుగదా ?" అన్నది.

"నీ శరీరంలోని ప్రతిభాగము, అణువు ఆకర్షిస్తున్నది. ఏమిచేస్తే మనస్సులోనివేగం తగ్గుతుందో తెలియుటలేదు" అన్నాడు.

ఆమె చిలిపిగా నవ్వుతూ "అయితే ఆ పాదరక్షలలో యేముంది ?" అన్నది.

"బాధ వింటేనో, చూస్తేనోగాని అర్థంగాదు. స్వానుభవంలో పొందినపుడే దాని యదార్థస్వరూపము, లోతులు అర్థమవుతవి. అర్థంగాని ఆరాటంలో పరువులెడుతున్న ఆత్మ, తృప్తికొరకు వెదుకుటలో విచక్షణాజ్ఞానాన్ని కోల్పోతుంది. ఆత్మహత్యకు దూకేవాడు నీటిపరిశుభ్రతను

పాటించుట హాస్యాస్పదము. కాలువిరిగి కుంటుతూ నడిచేవానిని చూసి పరిహసించుట వివేకంకాజాలదు" అని గంభీరకంఠంతో అన్నాడు.

తనబాహువులను ఆతనికంఠానికివేసి చుడుతూ అనునయంతో "కోపం వచ్చిందా? నా దగ్గరకొస్తూ కోపాన్నికూడా వెంట యెందుకు తెచ్చావు? కోపంలోవున్నపుడు నిన్ను జూస్తుంటే భయంకలుగుతుం టుంది విజయ్!" అంటూ అతనిశిరస్సుమీద చేయివేసి నిమురు తున్నది.

అజ్ఞాతంగా పొరపాటుచేసినవానివలె తనలో తానే మెచ్చు కుంటూ, జాలిగొలుపుతున్న దృక్కులతో "లేదు సరళా! నీముందు క్రోధాన్ని యెలా చూపగలను? నిజం చెబుతున్నాను, నీముందు సర్వశక్తులు మృగ్యమై కూర్చుంటున్నవి. మాంత్రికశక్తిలాంటిదేదో నీలోవున్నదేమో ననిపిస్తున్నది. నీవొక అమూల్యరత్నమైనట్లు, ఆ రత్నం అభేద్యమైనకంచుకోటలో వున్నట్లు, ఆ రత్నంలాంటి నిన్ను పొందుటకు ఆ కంచుకోటనుభేదించుటకు ఉపాయాల పరిశోధనలో నున్నట్లున్నది నాస్థితి"—దీనంగా అన్నాడు.

శిరస్సును తనమీదకువాల్చుకుని "మరి, ఆ కంచుకోటను బ్రద్దలు గొట్టుటకు ఫిరంగులను సమకూర్చారా?" అన్నది.

"దావానలంమధ్య చిక్కుకుని అయోమయంలో గంతులువేసే వానినిజూసి నృత్యం బావున్నదని యెవరయినాఅంటె, మరణోన్ముఖాన వున్న ఆ జీవికి యెలావుంటుందో కాస్త యోచించు" అన్నాడు.

సప్తసాగరాల అవల ఒకచెట్టు, దానిక్రింద ఒకపుట్ట, ఆ పుట్టలో ఒకపంజరము, ఆ పంజరములో ఒకచిలుక, ఆ చిలుకలో రాక్షసుని ఆయువు దాచివున్నదన్నట్లు, ఒక్క అమూల్యరత్నం అభేద్యమైన కంచుకోటలో బంధింపబడియున్నట్లు, ఆ కంచుకోటను బ్రద్దలుచేయ జూస్తున్నట్లు మీరే అంటిరిగదా! ఫిరంగులులేకుండా అంత కోట నెలా ఛేదించగలరు చెప్పండి। అందుకని ఫిరంగులవిషయం అడిగాను" అన్నది.

"ఈ కోట ఫిరంగులతోను, ఆయుధాలతోను, భుజబలంతోను ఛేదించేదిగాదు...." అంటూ ఆలోచనానిమగ్నతను ప్రదర్శించాడు.

"అయితే మంత్రతంత్రాల బలప్రయోగమే శరణ్యమంటారా ?" అని నవ్వును ప్రదర్శించింది.

అతను బాధతోను, భయంతోను విహ్వాలుడవుతూకూడా అదుపు జేసుకుని "నా మనస్సులోనివిషయాలను వ్యక్తంచేయలేకపోతున్నాను. అందుకు ప్రతిగా నీవు వ్యంగ్యభాషలాడుతున్నావు" అన్నాడు.

బల్లమీద కూర్చునివున్న విజయ్‌కు యెదురుగానిలిచి, ఆతనిశిరస్సును తనవుదరంమీద వేసి అదుముకుని కపోలాన్ని పుణుకుతూ "ఆనందంగా, హాయిగామాటాడటానికి బదులు నీ వనవసరమైన ఆలోచనలు చేస్తున్నావు. తమ్ముడు రాజ్యకాంక్షతో చేయరానికుట్రలన్నీ చేస్తున్నట్లు అన్నకు తెలిసినపుడు, ఆదరంతో తమ్ముని పిలిచి, 'నాయనా ! నీకు రాజ్యం పరిపాలించాలనికాంక్ష వుంటే నీవే పరిపాలించు. ఇందుకు కుట్ర అనవసరం' అని అన్నపుడు, తమ్ముడు గొప్ప వీరప్రదర్శన జేస్తూ దానధర్మరూపంగా ప్రాప్తించే సింహాసనం తన కనవసరమని, యుద్ధంలో విజయంబొంది వీరత్వంతో గద్దె నధిష్టించుట తన ఆశయమన్నాట్ట. కోరుతున్నది యెదుట లభ్యమవుతున్నపుడు కాలదన్ని కదనరంగాని కరిగితే పొందేది విజయమో పరాజయమో యెవరు చెప్పగలరు ! నీ ఆలోచనలన్నీ ఆరూపంగానే గనిపిస్తున్నవి" అన్నది.

ఆ మాటలతో ఆతను మరింత రెచ్చిపోతాడనుకుంది. కాని హీనస్వరంలో ప్రాధేయపడుతున్నట్లు "తనకు అనుకోనిఅదృష్టం లభించినపుడు, ఆ అదృష్టాన్నిగూర్చి ఆలోచిస్తూ క్షణంపాటు వెలవెలబోవుట స్వాభావికం" అన్నాడు.

"అలా లభ్యమైనసంపత్తిమీద అవిశ్వాసం కలుగుతుందంటారా ?"

"కలుగదు, కాని స్వీకరించగల ధైర్యంకొరకు మనస్సును కూడదీసుకోవాలి."

"అంతటి అమూల్యమైందీ, తెలియనిది యేమి లభ్యమైంది మీకు ?" అన్నది.

"ఇపుడు నీవు అంతటి అమూల్యమైనదానివిగానే గనిపిస్తున్నావు" అన్నాడు.

ఆమె లోపల ఆనందవుద్వేగాన్ని అణచుకుంటూ "నాలో అంతటి అమూల్యతేముంది ? మీభ్రమకాదుగదా ?" అన్నది.

"నాకు నేనే భ్రమలో మునిగిపోతున్నాను. నేడు నీవు సామాన్య సరళవుగా గనిపించుటలేదు. నీ ఆనందసౌష్టవశోభలోనిజ్వాలలు నా దృష్టిని చెదరుచున్నవి. నీవు అందరానిదానివిగా దోస్తున్నావు. అది కేవలం నాలోనిభీతిగా నాకూదెలుసు. నిన్ను పొందినతరువాత, నా అదృష్టాన్నిగూర్చి ఆలోచిస్తుంటే కలిగే గర్వాతిశయంలో భీతిరేఖ గనపడుతున్నది. అవి నాలోని దుర్బలరేఖయని నాకు దెలుసు" అన్నాడు.

"కర్మిష్టిగా కార్యరంగంలో పరువులెత్తుటే తెలిసినవాడు పొరపాటుగా ఆలోచనలోపడితే పిచ్చివాడైపోక తప్పదు. కనుక అనవసర ఆలోచనలవైపువెళ్ళకు విజయ్. నేను మామూలుసరళనే—నీ సరళనే" అంటూ తనకౌగిటిలోని అతనిశిరస్సునుబట్టి వూపింది.

వికసించేపుష్పంలో సుగంధాన్ని సృష్టించినట్లే మనుష్యజాతిలో వలపునునింపాడు సృష్టికర్త. ఆ వలపులోనిభావాలు, మాటలు సనాతనమైనవే అయినా యుగయుగాలకు వినూత్నరూపంలో శోభిస్తుంటవి. పుష్పం, కీకారణ్యంమధ్య వికసించినా, వుద్యానవనంలో వికసించినా, భవనంముందున్న కుండులో వికసించినా శోభించుటలోను, సుగంధాలను విరజిమ్ముటలోను, ఆత్మగర్వాన్ని ప్రదర్శించుటలోను ఒకేవిధంగా వున్నట్లు మత్తుతో ప్రభవించే వున్మత్తప్రేమ ప్రతిఒక్కరిలోను ఒకప్పుడు తొంగిచూస్తుంది. మనస్సులోని ఆ ప్రేమ విరాట్రూపమొందినర్తించినపుడు కలిగేభావాలు, మాటలు, అనుభూతులు వరదపొంగులతో నిండిన తటాకములోనినీరు గిరగిరతిరుగుతూ పరువులెత్త ప్రయత్నించినట్లు ఒకేరీతిలో వుంటవి.

ఆ పాక్కలో ఆ బల్లమీదే రాత్రి మూడుగంటలవరకు ఆ సంభా

షణలతోనే గడిచిపోయింది వారికి. తిరిగి స్టేషనుకుపోయి తిరుగు ప్రయాణం సాగించాలని, వుత్తరాలద్వారా కార్యక్రమాన్ని నిర్ణయించు కోవాలని తీర్మానించుకున్నాడు. అలా యేకగ్రీవంగా తీర్మానించుకున్నాక కూడా గంటలు గడిచిపోతున్నవి. ఒకర్ని మరొకరు విడిచిపోలేక పోతున్నారు. ఒకరికొరకు మరొకరు సృష్టింపబడినట్లు వారిదువురికొరకే యీ లోకనిర్మాణం జరిగినట్లు పరస్పరంగా చెప్పుకున్నారు. సరళను విడిచివెళ్ళలేనన్నాడు విజయ్. ఎలాగా వోపికపట్టి చదువు ముగించ మని కోరింది. ఆ పాడుచదువు తనకవుసరమే లేదన్నాడు. ఆమెదప్ప తనకీ లోకంలో మరేమీ అవుసరంలేదన్నాడు. "పరులముందు పరిహా సాలపాలుగాకుండా వివేకంతోవర్తించాలి విజయ్" అని అతన్ను పూరడింపచేయ ప్రయత్నించింది. ఎదుటివారిని వోదార్చుటం యెంత తేలికో స్వవిషయంలో నిగ్రహంపొందుట అంత కష్టం.

ఆమెమాటలతో హృదయాన్ని బిగబట్టి విజయ్ బయలుదేరుటకు సిద్ధమయినపుడు సరళ ముఖాన్ని కారుమేఘాకృతిచేసి కన్నీరు యేక ధారగా వలికిస్తున్నది. ఆతన్నువిడిచి ఆ పాడుబందరు పోజాలనన్నది. ఆతనికివేరై జీవించుటకంటె మరణించుటలోనే ఆత్మతృప్తికలుగుతుం దన్నది. లోకంపేరుతో ఆత్మక్షోభనుకలిగించుకొనుట అవివేకమని, పిరికితనము జీవితానికి విషములాంటిదని పలికింది. తనను యీక్షణం నుంచే యెడబాయనని వెంట జంటగానుండు వరమీయమని ప్రార్థిం చింది. నీతిపేరుతో అవినీతిని, ధర్మంపేరుతో అధర్మాన్ని చలామణి చేసే యీ సంఘానికివెరవద్దని ప్రోత్సహించింది. కన్న తలిదండ్రుల అనుమతి పొందగలిగినా లేకపోయినా వారిముందు నివేదించుట ప్రథమ కర్తవ్యంగా ఆతను విన్నవించినపుడు ఆమె వికటనవ్వును ప్రదర్శిస్తూ "కొన్నివిషయాలలో మీరెంత వీరులు, ఘనులో మరికొన్నివిషయాలలో అంత అనాయకులనుకుంటాను. లోకమంతా యెదురైనా మారని దృఢ నిర్ణయం మనస్సులోకలిగినపుడు వారిఆశీర్వాద మడుగవచ్చుగాని అను మతినడిగి, అవిచ్ఛిన్నమయిన నిర్ణయాన్ని సమస్యగాచేసి కూర్చొనుట అవివేకమవుతుంది. చిన్నవెలితిలో పెద్దఅఘాతం సంభవించుట సామాన్యవిషయం. వారిఅభిప్రాయాలకు కట్టుబడివున్నట్లు నటించుట

ఘోరఅన్యాయం కాగలదు. చేయదలచినకార్యాన్ని కప్పిపుచ్చి యితరుల ముందు మెరుగులుదిద్ద ప్రయత్నించినపుడు దానిపవిత్రత పోతుంది. చేసేకార్యంలో దోషమున్నా హృదయప్రేరితమైన పవిత్రకాంక్షతో చేసినపుడు దానిదోషంపోయి పవిత్రత వచ్చితీరుతుంది" అని ఘాటుగా దీక్షతో వినిపించినపుడు "ఇంత దీర్ఘంగా ఆలోచించగలశక్తి నాకు లేదు సరళా. నీవులేకుండ జీవించుట అసంభవమని నాకుదెలుసు. ఇదంతా కావాలనిచేసుకున్న పరిచయంగాదు. మరొకరి ప్రేరణలతోనో, సహకారాలతోనో అంకురమైనప్రేమ గాదు. అంతా అజ్ఞాతప్రభావం, దైవీకనిమంత్రణం. నీవన్నట్లు మనసంయోగం పవిత్రమైంది. కాని నీముందు నా హృదయం పనిచేయలేదని తేలిపోయింది. కనుక నన్ను నీ కర్పించుకుంటున్నాను. తరువాత బాధ్యతలన్నీ నిర్వహించవలసింది నీవు" అన్నాడు.

ఆతనిచుబుకాన్నిబట్టి వూపుతూ "ఆహా. యెంతఅమాయకులు పాపం! తెలివితేటలతో బాధ్యతలనుంచి విముక్తిపొందేమార్గాన్వేషణ మాత్రం చమత్కృతిగానే చేయగలిగారు. భారాన్ని యెదుటివారిమీదవేసి తప్పుకొనుట అంత క్షేమంగాదు. కళ్ళెంవదిలి స్వేచ్ఛయిచ్చినపుడు గుర్రం యెటుబోతుందో యెవరికి తెలుసు?" అన్నది.

"నిష్కల్మషంగా విశ్వసించే వారెన్నడూ నష్టపడరు. అజ్ఞాతశక్తిప్రేరణలో జరిగేనష్టాలను, జాగ్రత్తలు తెలివితేటలు అడ్డుకోజాలవు, బాధ్యతలనుంచి పారిపోయేవాడు అసమర్థుడై అన్నివైపులనుంచి బాధపడతాడు. తనబాధ్యతలను సమర్థులైనవారినెత్తిన మోపుటకు అవకాశాలున్నపుడు వెనుకంజవేయుట అవివేకమవుతుంది" అన్నాడు.

"నామీద అంత విశ్వాసముందా విజయ్‌బాబూ! ఆతరువాత పశ్చాత్తాపపడవలసివస్తుందేమో బాగా ఆలోచించండి" అన్నది.

"వెలుగున్నచోట గాలి, గాలివున్నచోట వెలుతురు వుండునట్లే, ప్రేమున్నచోట విశ్వాసము, విశ్వాసమున్నచోట ప్రేమ తథ్యమైనవి. విశ్వసించలేనివాడు జీవితంలో యెన్నడూ ఆనందాన్ని చవిజూడలేడు" అన్నాడు.

ఎడబాటు కాలేక యిరువురూ బరువుహృదయాలతో వేరు

వేరుబళ్ళలో ప్రయాణమయ్యారు. అంతకు పదిగంటలముందు వారిరువురు కలిసిన ఘడియలు యెంత మధురమైనవో యీ యెడబాటుఘడియలు అంత విషాదభరితమైనవి. మనస్సులు ఒకక్షణం దుఃఖభారంతోను, మరోక్షణం శూన్యంతోను వికలంచెందిపోతున్నవి.

బండిలో ఆసీనుడైయున్న విజయ్ చేతిరుమాలుకొరకు జేబులన్నీ తపుడుకున్నాడు. యెక్కడపోయిందో కనిపించలేదు. నయనాలనుంచి వలకబోతున్న అశ్రువులను యెవరికీ కనిపించకుండా అద్దుకోవాలని అతనియత్నం. అంగుళీయంతో వత్తుకున్నాడు. కన్నీరు కపోలాల మీదిగాదొర్లి షర్టుమీద పడింది. ఇంకా అంతఃపటలంనుంచి పరువులెడు తున్నవి. వివశుడై షర్టుతో అశ్రుధారను అద్దుకుంటున్నాడు. ప్రక్కల నున్నవారు వింతగా చూస్తున్నారు. వారిని గమనించినపుడు అభిమానం సిగ్గును వెదజల్లింది. ధృడత్వంకొరకు హృదయాన్ని కూడగట్టుకుంటు న్నాడు. కపోలాలిమీదిమరకలను తుడిచివేసుకుంటున్నాడు.

ఆ షర్టునుంచివస్తున్న అంబర్ సెంట్ సువాసనలు తెలియని మత్తును గల్పించినవి. తనవడిలో యింకా ఆ సుకుమారసుందరిశిరస్సు వున్నట్లే, పుష్పసమాన ముఖమండలం కనిపిస్తున్నట్లే వున్నది. ఆమె నయనాలలోని కోరచూపులు, చిలిపినవ్వుకవళికలు స్పష్టంగా గోచ రిస్తున్నవి. ఆమె గొగ్గులగొగ్గులశిరోజాలు చెదిరి కపోలాలమీదికివాలి ఆమెశోభకు మెరుగులు దిద్దుతున్నవి. సునిశితమైన ఆ కపోలాలు నీడలు దేలి చమకులతో ప్రతిబింబిస్తున్నవి. పులకితుడై తన్మయత్వంలో ఆమె శిరస్సునుబట్టి వూపాలని, తన్నితానంచేస్తున్నవరాలతో హస్తాలు చాచాడు. అక్కడామెశిరస్సూ లేదు, ఆమేలేదు. పొరపాటుగా మాయలో పడిపోయినట్లు మనస్సు నొచ్చుకున్నది.

కాని మరుక్షణమే హృదయంలోని ఒకకోణంనుంచి సాంత్వన లందుతున్నవి. తనచేతులనుంచి, వడినుంచి వస్తున్న పరి మళాలు సరళస్పర్శ తాలూకు మధురఅనుభూతులస్మృతులు మనస్సుకు హాయిని గల్పిస్తున్నవి. ఆమెపలికిన ప్రతిమాట కర్ణరంధ్రాలలో ప్రతి ధ్వనిస్తున్నది. తాను జెప్పిన ప్రతిసమాధానము గుర్తువచ్చి హృదయం నొచ్చుకుంటున్నది. ఆమెప్రతిమాటను ఆజ్ఞగా శిరసావహించవలసిందని

మనస్సులోని వో ప్రవృత్తి గొణుగుతున్నది. స్మృతిచిహ్నంగా ఆమె నడిగి యేమయినాపొంది తెచ్చుకోవలసిందని మరో ప్రవృత్తి పశ్చాత్తాపాన్ని ప్రదర్శించింది. నాకంటె యింకా మధురఅనుభూతులనివ్వగలిగింది మరేముంది? అని ఆమెద్వారా ప్రాప్తించినసుగంధాలు సుస్పష్టంగా పలికినవి. అవును, పొందిన యీ సుగంధచిహ్నాలు అమూల్యమైనవని, మనస్సు మళ్ళీ గొణిగింది. ఆ హస్తాలనంటిన సుగంధాలను మరీమరీ ఆఘ్రాణిస్తుంటే, ఇంటికివెళ్ళి స్నానంచేశాక ఆ అమూల్యనిధులు అదృశ్యమవుతవేమోనని భయం కలిగింది. ఇవి శాశ్వతంగావుంటే యెంతబావుండును అనిపించింది. ఆ సుగంధాలమూల్యం మరీ పెరిగిపోయింది. మరీమరీ ఆఘ్రాణించసాగాడు. ఆ అనుభవంలోని తన్మయత్వం మాధుర్యాలలో ముంచివేస్తున్నది. ఆ సుగంధాలను శాశ్వతంగా దోచుకోగల అవకాశాలకొరకు బుద్ధి వెదుకుతున్నది. ఈ ధరించిన దుస్తులనున్నసుగంధాన్ని పోనీకుండా పెట్టెలో పదిలపరచాలని నిర్ణయం కూడా జరిగిపోయింది. ఆలోచనలు చెలరేగుతున్నకొంది పొందుతున్న సుగంధాలవిలువ పెరిగిపోతున్నది. ఆ సుగంధాలలో ఆమె దాగివున్నట్లు మనసులో దాగుడుమూతలాట సాగుతున్నది.

ఇంటకిచేరినక్షణంలోనే తెన్నులుకాస్తూ నిరీక్షణలోనున్న బీబీజాన్ ఆతనిముఖంలోని మలినరేఖలను చూడగలిగింది. కాని అవి యేతాలూకువో ఆమెకు తెలియలేదు. ఎక్కువగాపలుకరించను సాహసం చాలక, స్నానానికి యేర్పాట్లుచేయుటలో నిమగ్నమైంది.

ఆమె యెంత వినతిచేసినా, ప్రార్థించినా, బడలికగావున్నందున స్నానం చేయలేనన్నాడు. అంతకుమించి ప్రశ్నించగలసాహసం లేక పోయింది. ఆతనిగంభీరముఖంయెదుట తెలియనిభయంలో భీతావహురాలవుతుంటుంది బీబీ. మారుమాటలేకుండా దూరంగావచ్చి నిలిచి ఆతని వంక కోరగా చూస్తున్నది.

శయ్యమీదపవళించిన విజయ్ శాలువాలోదూరి నిద్రకుపక్రమించాడు. "స్నానంచేసి పవళించండి. బడలికపోయి హాయిగా నిద్రపడుతుంది" అన్నది. మందస్వరంతో. ఆమాట ఆతనికి వినిపించివుండవచ్చు కాని జవాబులేదు. మూడురోజులముందు తనకున్న చనువు అతి

సన్నిహితమైంది. దాన్ని పురస్కరించుకుని వెళ్ళి లేపాలని మనస్సును కూడదీసుకో ప్రయత్నించింది. కాని తడవతడవకు విఫలమే శరణ్యమై, శయ్యయెదుటే క్రింద కూలబడి చూస్తున్నది. ముసుకులోంచి తనను చూసి జాలిచెందైనా లేచివచ్చి, తనను నొప్పింపజేసినందుకు పశ్చాత్తాపాన్ని తెలుపుతూ వినతిచేస్తాడని, స్నానానికి వస్తాడని, పిచ్చివూహాలు చేస్తూనేవున్నది. ఆతను నిదురరాకనో, పడకకుదరకనో అటుయిటు దొర్లుతున్నాడు. అరగంటతరవాత ఆతను గాఢనిద్రలో మునిగిపోయినట్లు అర్థంజేసుకోగలిగినా బీబీజాన్ అక్కడినుంచివెడలిపోలేక అక్కడే వుండి, ఆతనిలోని యీ నూత్నమార్పుకు కారణాలను వెదుకలేక దుఃఖిస్తున్నది.

ఉదయం 9 గంటలకు నిద్రించిన విజయ్ సంధ్యాసమయం 4గంట లయినా యింకా లేవలేదు. నిరీక్షణలోనున్న బీబీకూడా ఆ గదిలోనే వున్నది. అటూయిటూతిరుగుతూ గదిలోనుంచి బయటకు వెళ్ళలేక పోతున్నది. జీవికి అన్నిటికంటె సుఖప్రదమైంది నిద్ర. ఆతను అంత గాఢనిద్రద్వారాపొందుతున్న సుఖాన్ని వూహిస్తూ, బడలిక పోతుందని, మేల్కొవటంతోనే నవ్వుతూ పలుకరిస్తాడని వూహిస్తూ ఆనందాన్ని సృష్టించుకుంటూ అటూయిటూ గదిలో పచార్లుచేస్తున్నది.

విజయ్ కప్పుకున్నశాలువా తొలగిపోయింది. బీబీ ప్రక్కగా నిలిచి ఆ ముఖంలోనే దృష్టిని బరుపుతున్నది. తానేదో దోచుకుంటున్నట్లు భీతిగలుగుతున్నది. తన నేరాన్నెవరైనా చూస్తున్నారా అన్నట్లు అటుయిటుచూసి ఆవైపుకే దృష్టినిబరపుతున్నది. నిద్రావస్థలోని ఆతని ముఖమండలం కాంతిపుంజాల కూడలివలె గనిపిస్తున్నది. అంతేగాక ఆ ముఖంలోని ఆ వెలుగురేఖలు అదృశ్యమై మరుక్షణం విషాదరేఖలు అలుముకున్నట్లుకూడా గోచరిస్తున్నవి. ఏ సుఖస్వప్నాలలో పయనిస్తున్నాడో, స్పష్టమైననవ్వును ప్రదర్శించాడు.

నిద్రలోని ఆతనినవ్వునుచూసి ఆమె ఆశ్చర్యాన్వితురాలైంది. శయ్యప్రక్కకు వెళ్ళి వాలిపోయి ముఖంలో పరిశీలనచేస్తున్నది. ఆకస్మికంగా మందస్మితవదనంతో " .... నిష్కల్మషంగా .... విశ్వసించే....వారెన్నడూ నష్టపడరు....అజ్ఞాతప్రేరణలోజరిగే నష్టా

లను, జాగ్రత్తలు—తెలివితేటలు అడ్డుకోజాలవు....” అని గుటకలు మ్రింగుతున్నాడు.

ఒక డిటెక్టివునవలలోని పరిశోధకురాలివలె మరింత సన్నిహితురాలై మెలకువతో సావధానచిత్తంతో పరికిస్తున్నది. తిరిగి అతనినోటినుంచి గరగరలధ్వనితో “వెలుగులోనే వాయువు మిళితమైయున్నట్లు ప్రేమలో విశ్వాసంకూడా మిళితమైవుంటుంది. అది కాస్త లోణికినపుడు విషాదహోరులు ఢీకొంటవి” అని తిరిగి వినిపించింది.

అవి దేవుని నిర్వచనాలయినట్లు హృదయానికి హత్తుకుపోయినవి. ఆ శబ్దాలను తిరిగితిరిగి వర్ణించి చూసుకుంటుంటే పవిత్రమైనవై నూతనశక్తిని పూరిస్తున్నవి. ఆమె వూహావిహారంలో పయనిస్తుండగా, తిరిగి విజయ్‌నుంచి మరేవోమాటలు అస్పష్టంగా వినిపిస్తున్నవి.“భక్తుడు దేవుని పాదపద్మాలమీద శిరస్సునుంచి వేడుకున్నట్లే ప్రేమారాధకుడు కూడా తన ప్రేమికురాలిపాదాలు వెదుకుటలో అపరాధమేముంది ?” అన్నమాటలు విని ఆమె ఆశ్చర్యపోయింది. మెలకువతోనే తనను చూడనట్లేనటిస్తూ అలా అంటున్నాడేమోనని అనిపించి, ఆయనముఖం వైపు మరింతదీక్షగా చూడసాగింది.

“స్త్రీపాదాలుగూడా మూల్యమైనవి. పాదాలలోని సౌకుమార్యంతోగూడిన శృంగారం ఆకర్షించేసొత్తు. పాదాలను ముద్దిడుకోవటం ప్రేమలోతులను విశదపరుస్తుంది” అని తిరిగి వినిపించినమాటలతో ఆమె మ్రాన్పడిపోయింది. ఇవి ఆమెబుర్ర యెంత బ్రద్దలుగొట్టుకున్నా అర్థంగానిమాటలయినవి. గాఢనిద్రలోని కలవరింతలని స్పష్టమైపోయింది. కలవరింతలో యింత అసందర్భమైనమాట లెందుకొస్తున్నవా యని ఆమె ఆందోళన. మనస్సులోని దృఢవాంఛలే స్వప్నాలుగా సిద్ధిస్తవంటారు. ఆ రీతిలో అనేకవిధాల ఆలోచించి వివశురాలై భూతప్రేత ఆవేశ ప్రేరణలేమోనని క్షణంసేపు భయభీతురాలైంది. నిద్రలేపాలని ఆందోళనపడింది. కాని, ధైర్యం చాలలేదు. మంచంమీద చేతులుబెట్టి వాలి అతనిముఖంలో ముఖంబెట్టి క్షణంసేపు చూసింది. చెదిరిన అతని వెంట్రుకలను సరిదిద్దుతున్నది. ఉండిఉండి సెంటుసువాసనలు గొడుతున్నవి. ఆయనలో సువాసనల మోజున్నట్లు యిదివరకెన్నడూ లేదు.

ఆమెమనస్సు కిదొక పెద్దసమస్యగా తోచింది. అత్తరుసాయిబ్బులు పెద్ద బాబుగారివద్దకొచ్చి ఒక్కబాటిల్ సెంటు తీసుకొమ్మని యెంతవేడుకున్నా "నాకు అత్తరుపిచ్చి లేదు. పక్షులపిచ్చిమాత్రమే వుంది" అని మందహాసంచేస్తూ దానంగా ఒకరూపాయి చేతిలోవుంచి పొమ్మన్నపుడు, వారు బలవంతంగా పన్నీరుచల్లి వెళ్ళిపోయేవారు. అలాంటిదృశ్యాలు తన చిన్నతనంలో యెన్నోమారులు చూసింది. ఆ రూపంగా రైలులో యెవరయినా సెంటుపూసి వుంటారని, వూహజేసి ఆనందపడుతూ యధాస్థానానికివెళ్ళి కూర్చున్నది.

హాలులోనుంచి మలయమతికేక పెద్దగా వినిపించుటతో గాబరాపడుతూ "ఇక్కడే వున్నానమ్మా" అని పెద్దగా సమాధానమిచ్చింది. ఆ సమాధానధ్వనిలో విజయ్‌నిద్ర చెదిరి నేత్రాలుతెరచి ప్రక్కకు చూశాడు.

"నీవు అప్పటినుంచి యిక్కడే కూర్చున్నావా ?" అని ప్రశ్నించాడు. ఆమె దీనంగాచూస్తూ, అవునన్నట్లు శిరస్సును ఆడించింది.

139

# 20. పురుషచంచలత్వం

చేతిగడియారం చూసుకున్నాడు. ఆరుగంటలయింది. తికమక పడినవానివలె ఆమెవైపుచూస్తూ "నేను యెంతసేపు నిద్రపోయాను?" అని ప్రశ్నించాడు.

"ఉదయం 9 గంటలకు నిద్రపోయారు. ఇపుడు సంధ్యాసమయం 6 గంటలయింది" అన్నది.

"అయితే వరుసగా 9 గంటలు నిద్రపోయానా?" అన్నాడు.

"అవును" అన్నది.

"నీవు అప్పటినుంచి యిక్కడే యిలానేవున్నావా?" అన్నాడు.

"అవును" అన్నది.

"నీవు యిక్కడకూర్చుని అనవసరశ్రమ తీసుకోటమెందుకు, వెళ్ళు" అని జవాబుకు యెదురుచూడకుండానే రెండోవైపుతిరిగి పడుకున్నాడు.

"స్నానము, భోజనము ముగించి పడుకో విజయ్‌బాబూ?" అన్నది.

"అనవసరంగా నన్ను డిస్టర్బు చేయవోకు" అని అకస్మాత్తుగా అనేశాడు. కాని తనమనస్సులో తనకే బాధవేసింది. మరోమాటతో ఆమెమనస్సు నొచ్చుకోకుండాచేస్తే బావుండుననిపించింది గాని, మరు క్షణమే మరుగునపడిపోయింది. నిద్రలోగనిన కలలను నెమరువేసుకుంటున్నాడు. స్వప్నం స్థూలరూపంలో గుర్తుకురాక బాధగలుగుతున్నది, కాని ఆ విషయంలోనే ఆలోచిస్తుంటే ఆనందం కలుగుతున్నది.

విజయవాడనుంచి తిరిగివచ్చి నాలుగురోజులు గడిచిపోయినవి. పరీక్షలయందు లేని శ్రద్ధ ప్రేమపత్రాలలో పెరిగిపోయింది. ఒక

లెటర్‌పాడ్ మొత్తం చెడగొట్టినమీదట తయారుచేసిన వుత్తరంకూడా నచ్చక పోస్టుచేయలేదు. తనప్రేమను కుదించికుదించి ఒక్కొక్క వాక్యంలో వెల్లువలయ్యేభావాలను నింపాలనే ఆశతో కావ్యాలను తిరుగ వేయ ప్రయత్నిస్తున్నాడు. ఎన్నికలద్వారా మంత్రులయిన నిరక్షరాస్యులైన నాయకులు అక్షరాభ్యాసం ప్రారంభించినట్లు విజయ్ ప్రేమలేఖలువ్రాయు టకు కావ్యాలలోని వియోగసన్నివేశాలను వెతుక్కుంటున్నాడు.

ఇపుడు బీబీజాన్‌ముందు బెరుకుపడిపోతున్నాడు. ఆమెముందు తాను నేరస్తుడయినట్లు మనస్సు కలవరపడుతుంటుంది. అందుకనే నిర్ల క్ష్యంగాగాని, నిరాదరంగాగాని ప్రవర్తించలేకపోతున్నాడు. కాని ఆమెను తప్పించుకుతిరగాలని మనస్సు కాంక్షిస్తున్నది.

బీబీజాన్‌కు మరోవిచిత్రమైన అధ్యాయం ప్రారంభమైంది. విజయ్‌తో కలిసిమెలిసి సరససల్లాపాలతోగడిపిన రోజులున్నవి. తరు వాత విజయ్ రెండుమారులు తప్పినపుడు అవమానితుడైనట్లు బాధపడి ఆవేశితుడై కఠోరదీక్షతో చదివినరోజులున్నవి. ఆ రోజుల్లోకూడా తాను యెంతో ఆదరంపొందుతుండేది. తరువాత కోర్టుద్వారా ప్యాసయ్యాక వచ్చిన ఆధిక్యతతో దొరికిన కార్యభారాలహోరులో, మిత్రకోటిసంద డిలో తాను బొత్తిగా నిరాదరింపబడింది. అదృష్టవశాత్తు ఓరుగల్లు యాత్ర చేసివచ్చిన క్షణంనుంచి తనకు అత్యధికఆదరం లభించింది. అవి నేడు మధురస్మృతులుగామాత్రమే గోచరిస్తున్నవి. ఆనాడు విద్యార్థిలోక నూతనకార్యభారాలతో తనకు అనాదరం లభ్యమైనట్లు తెలుసు. కాని నేడు పొందుతున్న అనాదరానికి కారణం యెంత యోచించినా తెలియుటలేదు. నేటి ఆయనప్రవర్తనే ఆమెకు విచిత్రంగా తోస్తున్నది. క్షణ మొకరీతిగా గనిపిస్తున్నాడు. ప్రీతిగపిలిచి పలుక కుండానే వెళ్ళిపోతుంటాడు. తానువెళ్ళి చేతిలోనిపుస్తకాలు తీసుకోను యెదుటనిలిచినా చూడనట్లు ప్రక్కగా వెళ్ళిపోతుంటాడు. ఆతని యీనాటి విచిత్రప్రవర్తనలకు తనలోతానే యెన్నోప్రశ్నలువేసుకుని, అనాద రమూ, ఆదరమూగాని యీ త్రిశంకుస్వర్గవిధానంలో మరిగిపోతున్నది.

"బీబీ, విజయ్‌కు మరో నూతనజబ్బు ఆవేశించిందిలాగుంది ? నీతో యిపుడు పలుకుటలేదుగదూ ?" అన్నది మలయమతి.

"ఎందుకు పలుకరు? ఏమీలేదమ్మా" అన్నది.

"కోర్టుద్వారా ప్యాసవుట, యీ పిచ్చిపిల్లలకు ఘనతగా గనిపించింది. అంతా వాడిని వీరవిజయునిలా కీర్తిస్తూ, అధిఖ్యత నిచ్చారు. ఆ ఖ్యాతిగర్వంతో స్వగృహాన్ని హోటలుగా పరిగణించాడు. తిరిగి తనను తాను గుర్తించుకోగలిగినశక్తివచ్చినట్లు యీమధ్య ధోరణి మారిందనుకున్నాను. నేడు మరో నూతనపోకడలలో పోతున్నాడు. ఇది అర్థంగానిఅంతస్థుగా తోస్తున్నది. మనస్సుకుతోచిన ఆలోచన వెంట పరువులెట్టుస్వభావం వాడిది. ప్రక్కవారికి వినిపించుటగాని, వారి మాట ఎనుటగాని వాడి కలవాటులేదు. వంశానుక్రమణికలోని నిస్వార్ధత వాడి నంటివున్నది. తనకు నచ్చినవైపే నడచుటకూడా వారసత్వంగా పొందినదే. స్వార్ధము, అవినీతి యీవంశంలో యిదివరకెన్నడూ లేవు. ఆ వారసత్వం వాడి కబ్బినందుకు సంతోషించాను. కార్యరంగంలో కర్మిష్టిగానడచు అలవాటుకూడా అబ్బింది. కాని వీటన్నిటిని తుడిచివేయగల గర్వాంకురాన్నిచూసి బాధపడుతున్నాను. వాడి తాత తండ్రులంతా సరళస్వభావులు, అల్పసంతోషులు. వీడు గంభీరస్వభావి. అందుకే వాడి విషయాలు యెవరికీ అంతుబట్టవు" అన్నది.

"మీయెడల విజయ్‌బాబుకు భయము, భక్తి వున్నవమ్మా. మీరడిగితే, యే విషయాన్ని దాయరు. మీమాట వింటారు" అన్నది.

"వాడిహృదయంలో అలాంటివేవయినా మిగిలివుంటే వాటిని కాపాడుకోవటంకూడా నా ధర్మం. ఆదుర్దాపడి, ఆర్భాటాలుచేసినందువలన అందరూ మంచిమార్గానికి రారు. స్వయంకృతాపరాధాలతో చేతగాని సమస్యలను సృష్టించుకుని బాధలతో అనుభవంపొంది పశ్చాత్తప్త హృదయంతో దగ్గరకుచేరతారు కొందరు" అన్నది.

"సహవాసదోషాన్ని వూహిస్తున్నారేమో. వారంరోజులనుంచి యెక్కువగా పట్టణంలోనే వుంటున్నారుగదమ్మా" అన్నది.

"అవును, అందుకే నేను విచారపడుతున్నది. వాడు ఆ విద్యార్థులతోనే తిరుగుతూ తీరనిపనులలో, మునిగి మనకు దూరదూరంగా

వున్నా అంతభయం కల్గలేదు. కాని నేడు యిక్కడేవుంటూ ఆలోచనలలో మునిగి మనకు దూరంగావుంటున్నందువలన, వాడిఆలోచనల గూర్చి కూడా భయంగావుంది. ఇంత చిన్నవయస్సులో సంభవించే యేకాంతచింతనలు క్షేమాన్నిచ్చేవిగావు" అన్నది.

ఆకస్మికంగా విజయ్‌రావటంజూచి బీబీ అలానే చూస్తూవుండి పోయింది. విజయ్ వారినిగమనించనట్లే గదిలో ప్రవేశించాడు. బీబీజాన్ తనమనస్సులోనిమాటలను ధైర్యంగా అడిగి తెలుసుకోవాలని నిర్ణయించుకుంటూ, మలయమతిసమక్షంలో గదియందు ప్రవేశించలేక ఆమె ప్రక్కగావెళ్ళి కూర్చున్నది. పావులాట ప్రారంభింపజేసి "వారి కేమిగావాలో చూసివస్తానమ్మా" అంటూ నెమ్మదిగాలేచి వెళ్ళిపోయింది.

ప్రేమలో నూతనప్రవేశికుడు యెడబాటులో చంచలత్వంలో తేలియాడుతుంటాడు. ఒకక్షణం మధురస్మృతుల ఆనందంలో దొర్లిపోతాడు. మరుక్షణం యెడబాటుబాధతో కృంగి విహ్వాలుడయిపోతుంటాడు. గిలిగింతలతో గలగలలాడిన మరుక్షణం ప్రాణ్పడినట్లయిపోతుంటాడు. ఎదుటవున్న ప్రతిదాన్ని బిగబట్టి వూపుతూ అటూయిటూ త్రిప్పుతూ, పొంగిపోతూ మరుక్షణం విరక్తితో వాటిని ఆవలకునెట్టి కోల్పోయినవానివలె బిర్రబిగదీసుకుంటాడు.

ఆతనిగదిలో ప్రవేశించగానే ప్రేమికురాలిమాటలేవో మధురమాలికగా గుర్తుకొచ్చినవో, ఆనందపరవశంలో గోడనున్న గొల్లభామక్యాలెండరు చివరబట్టి క్రిందకూ పైకీ వూపుతూ కూనిరాగంతీస్తుండగా బీబీ పిల్లిఅడుగులతో ప్రవేశించింది. పట్టరానివుత్సాహంలోనున్న విజయ్ ఆలోచనారహితుడై ఆమెభుజస్కంధాలనుబట్టి వూపుతూ, కవుగిటిలో బంధించి, శక్తివంతంగా బిగించి, పైకియెత్తి, క్రిందకుదించి వదిలిపెట్టాడు.

ఆతనిస్మృతి చెదిరి వుత్సాహం చప్పబడిపోయింది. మనస్సు వెలవెలబోయింది. ఆమెను చూడలేకపోతున్నాడు, కాని తననేరం బయటపడిపోతుందన్నట్లు కప్పిపుచ్చుకునే ప్రయత్నంలో "కూర్చో, బీబీజాన్! అమ్మ యేంజేస్తున్నది?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్ననుగురించి ఆలోచనేలేదు. అది అర్ధరహితమైంది. కాని, ఆమెశరీరం పులకితమైపోతున్నది. తెలియని భీతికూడా వెంటాడు తున్నది. ఆతని యీచర్య యోచనకు అందనిదిగా నున్నది. కదిలిక మెదిలికలులేకుండా ఆయనవైపే చూస్తున్నది. కోరగా ఆమెనుచూస్తున్న కొంది విజయ్‌మనస్సు కంపిస్తున్నది.

ఆమెను చేయిబట్టి లాగి కుర్చీలో కూర్చుండబెట్టి పెద్దగా పరామర్శలు చేస్తున్నాడు. వాటిలోని నూతనత్వం ఆమెకు అర్ధంగాని బెరుకును గలిపిస్తున్నవి. ఆకారణంతోనే ఆమె మౌనంతోకూర్చుని తన మనస్సును తానే తడుముకుంటున్నది.

స్త్రీమనస్సు చంచలమైందిగా వర్ణించుట వాడుకైపోయింది. కాని అది యదార్ధానికి అతిదూరమని అనుభవం చెబుతుంటుంది. స్త్రీమనస్సు చంచలమైతే సంఘం తారుమారైపోగలదని మన సత్వం అర్ధంచేసుకునే ప్రతిఒక్కరు చెప్పగలరు. స్త్రీవిషయంలో పురుషునిమనస్సే చంచలమైంది, అతిచంచలమైంది.

సరళ విజయవాడనుండి యింటికిచేరినప్పటినుంచి మానసిక స్థిరత్వాన్ని పొందింది. బాహ్యగంభీరత యేర్పడింది. ప్రేమలేఖకొరకు నిత్యము యెదురుచూస్తున్నది. విజయ్‌హస్తస్పర్శలతో పవిత్రతపొందిన పాదరక్షలను యిపుడుధరించుటలేదు. "ఎండలో కాళ్ళుకాల్తాయి, చెప్పులు తొడుక్కోళ్ళు సరళా" అంటూ తల్లి మరింత బలవంతపెట్టినపుడు గత్యంతరంలేక వాటిమేకులు పాదాలకు గుచ్చుకుంటున్నవని, వంక జెప్పి తప్పించుకుంటున్నది. తొడిగితే అవి అరిగిపోతవని భయం. వాటిని శాశ్వతంగా భద్రపరచి వాటిమీదున్న ఆతని అమూల్య స్పర్శలనుచూసి ఆనందిస్తుండాలని ఆమెవాంఛ.

క్లాసులోగూర్చుని పాఠాలువింటున్నపుడు ఆమె అందరికంటె గా కనులార్పకుండా వింటున్నట్లు గవిపిస్తున్నది. కాని ఆమెవీను నిపించేవి పాఠాలుగాదు, విజయ్ మధురవాక్కులు. ఆతనువెలి క్యాలలో మరువరానివిగా మనస్సులో నిలిచినవి, బహుకొద్దే

అయినా అవే చక్రపుఆకులవలె వరుసగా తిరిగితిరిగి వినిపిస్తున్నవి. నమలినకొంది తీయనివూటనిచ్చే పపడీవలె ఆ వాక్యాలనే నెమరువేస్తున్న కొంది భావసౌరభము అధికమవుతున్నది.

ఆతనుబ్రాసేవుత్తరం యెలావుంటుందో వూహాలుజేసి తృప్తిలేక తుడుపులువేసి మరోరీతిలో మార్చుకుని సరిజేసుకుని అంతటితో ఆగక యెలాబ్రాస్తే బాగుంటుందో వూహాలుచేసుకుంటున్నది.

రవిప్రసాద్ యిపుడొకవిచిత్రస్వభావిగా అలవడిపోయాడు.క్లాసులో ఆమెప్రక్కనే వుంటాడు.ఆమెను యింటివరకు దిగవిడ్చి వెళుతుంటాడు. కాని తానుగా సంభాషించుట విరమించుకున్నాడు. మనస్సులో యేమి దొర్లుతుంటవో యెవరికీ తెలియనీయకుండా బాహ్యనిర్మలతను ప్రదర్శిస్తుంటాడు. అవును, జ్వాలాముఖి పర్వతగర్భంలో యేమి జరుగుతుంటుందో యెవరికి కనిపిస్తుంది.

సరళ తానుగా పలకరించినపుడు ఆనందాబ్ధిలో మునకలువేసి నట్లవుతుంది రవిప్రసాద్‌కు. ఆమెప్రక్క అతివినమ్రతతో వుంటుంటాడు. ఆమె పరధ్యాసలో "రవీ!" అని పిలిచినపుడు "ఆఁ" అని నిరీక్షిస్తాడు. తిరిగి ప్రస్తావించకపోతే నోరు మెదపకుండా ప్రాప్తించిందేదో కోల్పోయినట్లు దీనవదనంతో వుండిపోతాడు. ఆ దృశ్యంచూసి నపుడు తనపొరపాటుకు నొచ్చుకుంటూ అతనిమీద జాలిగొంటుంది. తనను విసిగించకుండా, ప్రశ్నించకుండా తనమాటను ఆజ్ఞగా శిరసావహించను సర్వవేళలా సంసిద్ధంగా సైనికునివలె ప్రక్కనుంటున్న అతనియెడల యిపుడు విసగటకలుగుటలేదు. సానుభూతి పెరుగుతున్నది.

క్లాసులో యెన్నడైనా తననోట్సు ఆమె తీసుకున్నా తిరిగి రవి అడుగడు. ఆమె తనంతటతానుగా యిచ్చేవరకు అడుగడు. ఇంత నిగ్రహం ఆమెను కొన్నికొన్ని వేళలందు కలవరపరుస్తుంటుంది. పంతంగా పరీక్షించాలని అతిముఖ్యమైననోట్సునే తీసుకున్నది. వరకు యివ్వగూడదని యింటివద్ద వుంచింది. నెలరోజులు పోయినా రవి యెన్నడూ అడుగలేదు. ఎలా చదువుతునా

ఆమెఆదుర్దా. కొంతమంది కొన్నికొన్నిలేని కొరతతో ఆదుర్దాపడతారు. కాని అవి సమకూరినా వాటిని యెదుట పదిలపర్చి అవిలేకుండానే పని గడుపుతుంటారు. నోట్సు వగైరా అంతావుండి తాను చదువుకున్నదీ లేదు. అది లేనందువలన ఆగిపోయినట్లు అతను బాధపడుతున్నదీ లేదు. తన పుస్తకాలఅడుగుసబడిపోయినట్లు పొరపాటుగా చాలారోజులు గడిచిపోయినట్లు తన పరితాపాన్నిజోడించి నెలతరువాత రవికి నోట్సు యిచ్చినపుడు, అతను సర్వసామాన్యధోరణిలో స్వీకరిస్తూ "పరవా లేదులే సరళా" అన్నాడు. జాలితో ఆమెమనస్సు వణికిపోయింది.

మానవునిపరిస్థితులు కుదించికుదించి తనలో యిముడ్చుకుంటవి. జీవి అనుక్షణము పరిస్థితులతో పోరాటంసలుపుతూ అందులో లీనమై పోతాడు. దాన్ని జయమనుటకంటె పరాజయమంటె బాగుంటుంది.

సరళనిరాదరఛాయలు ప్రథమంగా పడినపుడు రవి సహించలేక పోయాడు. పోనుపోను ఆమెలోని ఆ తత్వం పెరిగినకొంది రవి దూరంగాజాలని అసమర్ధతతోఅణిగి అనుసరణకు అలవడిపోయాడు. ఆమెను మర్చిపోగలశక్తిగాని వేరుగాగలశక్తిగాని వున్నట్లయితే వికటంగా యెదురుతిరిగివుండేవాడు. కాని మనస్సును కోల్పోయాడు. అతని ఆత్మ ఆమెఅడుగులలో వుండిపోయింది. అలాంటి పరాధీనుడుగనుక, అనుకూలవాతావరణాన్ని సృష్టించుకున్నాడు.

ప్రేమ గుడ్డిదేగాదు, వెర్రిది, మూర్ఖమైంది. అంతస్తులు, తారతమ్యాలు లక్ష్యంచేయనిది. మొండిది. మధువు, పాషాణము కలిసినది, ఒకమాటు ఆ ప్రేమ వడిలోకి వరిగిననాడు తిరిగి కోలుకోలేడు. వాటి ·లూకు సౌరభం రవిప్రసాద్‌కంటివుంది గనుక సరళను అర్ధంచేసుకో ోతున్నాడు. తనయడలగల అశ్రద్ధకు కారణాలు వెతుక్కో-లేక శ్రద్ధ'న్నాడు. పరివర్తనను గుర్తించలేకపోతున్నాడు. గుర్తించినా, లకు వి·కున్నా, అసందర్భాలను తెలుసుకున్నా విడిచిపోగల, మర్చిపో బుచ్చినవాక్యాలు లేనపుడు యెవరైనా చేయగలిగిందేముంటుంది ! మన

మనస్సు సర్వవేళలా మనస్వాధీనంలోనే వుంటుందనుకోవటం గొప్ప పొరపాటవుతుంది.

"సరళా! యీవుత్తరం నీదేనా? యెక్కడినుంచి వచ్చింది?" అని చేతిలోనికవరును పరిశీలనచేస్తూ బయటనుంచివచ్చిన రవి ఆమె చేతి కందించాడు. చూడకుండానే దాన్ని పుస్తకంలోవుంచి మడిచి వేసింది. ఆవుత్తరాన్నిచదువుటకు యేకాంతసమయంకొరకు తెన్నులు యోచిస్తున్నది.



# 21. ఆదర్శవాది

రవిని వదిలించుకుని తనరీడింగురూములో యేకాంతంగాకూర్చుని కవరుచించి నిర్ఘాంతపోయింది. అది విజయ్‌నుంచివచ్చినకవరుగాదు. సకలానంద్ వుత్తరం. రాజకీయనాయకుని సుపుత్రుడు. ఆతనితండ్రిలారీబ్రోకరుగా వుంటూ రాజకీయాలలోప్రవేశించి మున్సిపల్‌కౌన్సిలర్ అయ్యాడు. ఆ హోదాతో మున్సిపల్‌పోరంబోకలో మంచిభవనం నిర్మించుకున్నాడు. ఆ తరువాతటరంలో శాశనసభ్యుడయి రెండు బస్సురూట్లను, ఒక కూపు గ్రాంటునుపొంది రెండుబ్యాంకుల్లో ఎకౌంటు పిల్లలపేర వోపెన్ చేశాడు. మూడోటరంలో పార్లమెంటుసభ్యుడయి యాభైయెకరాల విలువైన మాగాణిభూమిని గొన్నాడు. చిన్నకుమారునిపేర చిన్న రైస్ మిల్లును యేర్పాటుచేశాడు. భార్యపేర మూడంతస్తులమహల్ కొన్నాడు. మధ్యకుమారునిపేర రెండు గోదౌన్లు కట్టించాడు. ప్రియమైనకుమార్తె పేర పంచదారమిల్లులో కొన్నిషేర్లు కొన్నాడు. ప్రేమికురాలిపేర ఇండస్ట్రీస్ ప్రారంభించాడు. బావమరిదిని గొప్పవుద్యోగంలో జేర్పించాడు.

"ఇన్ని బందోబస్తులు అందరకూచేశారు గాని మీపేరుతో ఏమీ లేదేమిటి యం. పి. గారూ?" అని సన్నిహితులెవరైనా ప్రశ్నిస్తే, మందహాసంచేస్తూ "నాకు గావలసింది నాజేబులోనేవుంది. యీ వైరాగిటిక్కెట్టు నాకు చాలు. నెహ్రూగారి సోషలిస్టురాజ్యస్థాపన [illegible] కలలుగంటూ ప్రచారంచేయుటె నా లక్ష్యం. నెహ్రూగారిఅడుగుజాడల్లో నడుస్తూ, కాంగ్రెస్‌నే దేశకళ్యాణానికి యేకైకసంస్థగా [illegible]షించేస్తూ ముందుకుపోవుట నా ధర్మంగాను, ఆదర్శంగాను భావిస్తున్నాను. మా కుటుంబంలోని పదిమందిలో సమిష్టివ్యవసాయకేంద్రాన్ని స్థాపించి కార్యరంగంలో మా ఆశయాలను ప్రదర్శించుటకు [illegible] ఫారెస్టులోని 500 యకరాలను సాగుమంజూరుకు దాఖ చేసియున్నాను"

అని గర్వంపొంగుతున్న కంఠంతో చెబుతుంటాడు. ఆయన కాలికి చెప్పులువేయడు, ముతకఖద్దరు ధరిస్తాడు. రిక్షాలు యెక్కడు. చన్నీళ్ళ స్నానం చేస్తాడు. సామాన్యభోజనమే తృప్తిగా భుజిస్తాడు. గాంధీగారి ఆదర్శప్రాయమైన నిరాడంబరజీవితమే తన నాకర్షిస్తుందని,పరమయోగ్య మైందని వినిపిస్తుంటాడు. ఆయన వేదికమీద లక్ష్యాలనుగురించి, ఆదర్శ ఆశయాలనుగూర్చి, తన రాజకీయజీవితంలోని విశిష్టతనుగురించి, తన సజ్జనత్వము, సాధుస్వభావాన్ని, నిస్వార్థాన్ని, త్యాగాన్నిగూర్చి అద్భుత మైన శైలిలో గంభీరంగా వుపన్యసిస్తుంటే ప్రేక్షకులు పరవశమై కరతాళధ్వనులు చేస్తుంటారు. "చన్నీళ్ళస్నానం చేసి, ముతకఖద్దరులో మునిగి, చద్దిఅన్నం భుజించి, బైరాగిటిక్కెట్టుతో బయలుదేరి దరిద్రో ద్ధారణకు తిరిగే యిలాంటి త్యాగమూర్తులే యం.పి.లుగా యెల్లకాలం వుండాలి" అన్న ప్రచారం నలువైపులనుంచి వినిపిస్తుంటుంది.

అలాంటి రాజకీయమహానాయకుని పుత్రరత్నమైన సకలానంద్ వ్రాసిన వుత్తరమది. సరళచేతిలోని వుత్తరం చదువకుండానే జారి క్రిందపడింది. ఆ నిరాశాఘాతంనుంచి తేరుకుని వుత్తరంతీసి పుస్తకం లోని పాఠంవలె చదివివేసింది. తనలాంటి సుకుమార సుందరియువతి, రవిలాంటి అనామకునితో, వెర్రివానితో కలిసిమెలిసితిరుగుట పొరపా టని, అంతస్థుకు చాలనివారితో సాంగత్యంచేయుట అవ్యక్తమని, ఆమెను తను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నట్లు, తనతలిదండ్రులు సమ్మతించక, వారం దరిని విడనాడవలసివచ్చినా వెనుదీయనని, తనపేర లక్షరూపాయిలు బ్యాంకులోవుండుటేగాక ఒకబస్సు, లక్షరూపాయలుచేసే మహలు తన పేరనే వున్నవిగనుక యెవరినీ లక్ష్యపెట్టవలసిన పనిలేదని, తనకొరకని ఒక సినిమాహాలుకూడా నిర్మాణమవుతున్నదని, మనుగడకు ధనమే ముఖ్యమని, ఆ సౌఖ్యాలన్నీ తమకు పెట్టిపుట్టినటువంటివి గనుక తనను విశ్వసించమని వ్రాశాడు. తాను సరళను వివాహంచేసుకోను సర్వ విధాల సంసిద్ధుడైనట్లు, తనకు వెంటనే తగురీతిలో, వివరాలతో వుత్తరం వ్రాసి పోస్టుచేయకుండా యేదో ఒకపుస్తకంలోవుంచి తనకే యివ్వమని, ఆ వుత్తరంలో వ్రాయబడివుంది.

తన ప్రక్కబెంచీలోనుంచి పదేపదే కోరచూపులతో లోభత్వాన్ని ప్రదర్శించే సకలానంద్ దృశ్యాలు అనేకం గుర్తుకొచ్చినవి. ఆమెశరీర మంతా సూదులతో గుచ్చుకుంటున్నట్లు బాధ గలిగింది.

వారంరోజులు గడిచిపోయాయి. విజయకుమార్‌నుంచి ప్రథమ ప్రేమలేఖచేరింది. తాను వూహించినదానికంటె, ఆశించినదానికంటెగొప్ప స్థాయిలో తనను దేవతగా స్వీకరిస్తున్నది ఆవుత్తరం. ప్రేమ లేఖ యింత ఆధిక్యతతో, ఆకర్షిస్తూ హాయినిగొలుపు తుందని నేడనుభవంలో అర్థమవుతున్నది. ఆ వుత్తరం చదువుతున్న పుడు, తాను యదార్థంగానే దేవతామూర్తివలె అందాన్ని అధిగమింప జేసుకోవాలని, ఉదారతను విస్తృతం చేసుకోవాలని, వుత్తరంలో వర్ణించినట్లు కళకళలాడుతూ కనికరించే ప్రేమమూర్తిగానే వుండా లని, శీతలప్రకాశాన్నివెదజల్లు జాబిలివలె తాను మధుమయ నగ వును చిలికించాలని వుత్తరంలోని ప్రతివిషయాన్ని సరిపోల్చుకోప్రయ త్నిస్తున్నది. ఉత్తరం యెన్నిమారులుచదివినా తృప్తితీరుటలేదు. మంచి మధురశైలిలో వుంది. శృంగారంగా ఆకర్షణీయంగా దోస్తున్న అనేక శబ్దాలకు స్పష్టమైన శబ్దార్థం స్ఫురించలేదు. కాని ఆశబ్దాలు హృదయపు సున్నిత తంతువులమీద జిలిబిలిగా మీటుతున్నవి. పరవశపర్చే నాదా లను సృష్టిస్తున్నవి.

క్లాసుపాఠాలు చదువుటలో యెంత విసగడ, విరక్తి కలుగు తున్నదో అంత వుత్సాహము, ఆనందముకలుగుతున్నది యీ ప్రేమ లేఖను వల్లించుటలో. ఇంత ఆనందాన్నిచ్చేలేఖలు చదువమంటే, అన్న పానాదులు మానికూడా చదువగల, పద్యాలవలె కంఠస్థంచేసి పదేపదే వినిపించగల, ఈ పాడుపాఠాలకంటె యిలాంటి లేఖలే పాఠాలుగాపెడితే యెంత బావుండును! నీరు పల్లానికిపోవుటలో పరవళ్ళు త్రొక్కుతుంది. యెక్కలేనియెత్తుకు పోవాలంటే తలనొప్పితో యెదురుతిరిగి పోరాడు తుంది. మానవప్రవృత్తికూడా పరువులెత్తేవైపునే అధ్యయనమార్గాన్ని రచించితే యెంత బావుండును!

నీటిలో మునకలువేయబోయేవానికి మొదటిమునకకు చేసిన యత్నం రెండోమునక్కు వుండదు. అదేరీతి ప్రేమలేఖల ప్రవేశంలో వున్న బాధ ప్రారంభించాక వుండదు. సరళ విజయ్‌లమధ్య వుత్తరాలు ధారాళంగా నడుస్తున్నవి.



# 22. గ్రహచారం

విశ్వనాథం మహిళామండలిలో పూర్తిగా లీనమైపోయాడు. పారిజాత మిపుడు నిస్సంకోచంగా ప్రేమాదరచనువులతో పుణిమిన అధికారాన్ని ఆయనమీద దర్పంతో చలాయించగలుగుతున్నది. ఆతని ద్వారా అయ్యే కార్యమండలిలోపని యెవరికున్నా పారిజాతంద్వారా చేయించుకోగలుగుతున్నారు. సంచారకార్యక్రమంలో చిల్లరబాధ్యతలన్నీ ఆయనే వహిస్తున్నాడు.

ఏదో ఒక కుగ్రామంలో పాడుపడినపాఠశాలలో మకాంచేసినపుడు శుభోదయసమయాన యెదుటనున్న వేపచెట్టుపుల్లలు కావాలని యెవరో రేపెట్టారు. ప్రేమజాలంలోచిక్కిన పురుషుడు స్త్రీముందు భృత్యావతారిగా నిలుస్తాడు. వీరప్రదర్శకుడుగా చెట్టెక్కి పడిన విశ్వనాథం నెలరోజులు మంచానవున్నపుడు పారిజాతంచేసిన సేవకూడా గణనీయమైంది.

కుడిహస్తం పూర్తిబ్యాండేజీతో మెడకు తగిలించబడి, యెడమ ముంజేయి గాయపడి శయ్యమీదకెక్కిన ఆతనిస్థితి అతిదారుణమైంది. శారీరకబాధతోపాటు అభిమానం దెబ్బతిని వైరాగ్యపుఆలోచనలలో మునకలువేస్తున్న ఆతనిప్రక్కగా వచ్చి కూర్చుని పారిజాతం తన కొంగును తడిపి ఆతనిముఖమండలాన్ని పసివానికివలె తుడుస్తుంటే స్వాంతనపొందాడు. సరియైన సమయానికి భోజనంతెచ్చి, స్టూలు మీదుంచి, తనప్రక్కగా కూర్చుని,పారిజాతం కలిపిన ముద్దలు చిన్నవిగా చేసి ఒక్కటొక్కటిగా అతిప్రీతిగా తినిపిస్తూ, చుబుకంమీద అంటిన మెతుకులను తీసివేస్తూ, మధ్యలో కూరముక్కను దంతాలకందిస్తుంటే. అతనిబాధ, వ్యధ అదృశ్యమైపోయింది. ప్రయత్నపూర్వకంగా అపుడపుడు ఆమెఅంగుళీయాలను కొరికి ఆనందపడుతుండేవాడు.

ఆమె భోజనంతినిపిస్తూనే అనునయంతో "ఆడవారు అడిగారు అంతేచాలని చేయజాలనిపనులు చేయ సాహసంచేయగూడదు" అన్నది.

"గ్రహచారం సరిగా లేకపోతే భూమిమీద నడుస్తూనే పడిపోవచ్చుగదా!" అన్నాడు.

"ఎక్కడయినా అజాగ్రత్తవల్లే అనర్థాలు జరుగుతవి. అజాగ్రత్తతో ప్రాప్తించిన శిక్షలనుభవించునపుడు మానసికబాధ మరింత వుంటుంది" అన్నది.

"శిక్షలద్వారా సర్వవేళలా దుష్ఫలితాలు లభింపవు. సత్ఫలితం లభిస్తే ఆ శిక్ష వాంఛనీయమేగదా?" అన్నాడు.

ఆమె తీక్షణంగాచూస్తూ "దుర్ఘటనలోపొందిన గాయాలద్వారా సత్ఫలితాలుకూడా లభిస్తవా యేమిటి?" అని ప్రశ్నించింది.

"క్షతగాత్రులై పడే అవస్థలలోనే మానవుడు అవుసరమైన పరిపూర్ణసత్యాన్ని పొందుతాడు. అది సామాన్యవిషయం కాదుగదా!" అన్నాడు.

"అదొకభ్రమ గావచ్చు. ఈ దెబ్బలతో చేతులు విరగగొట్టుకోవటందప్ప మీరు పొందిందేముంది చెప్పండి?" అన్నది.

నవ్వుమొఖంతో చిలిపిగాచూస్తూ "ఏమరకుండా నీవు ప్రక్కనే వుంటున్నావు. పసివాని సాకుతున్నట్లు వేయివిధాల జాగ్రత్తలు తీసుకుంటున్నావు. నీచేతులతో తినిపిస్తున్నావు. నా ప్రతిమాటను అతిశ్రద్ధగా వింటున్నావు. ఇది నాకు అమృతయోగంకాదని యెవరంటారు?" అన్నాడు.

"సేవ చేయించుకుందామని రోగాలు కోరుకొనుట అవివేకమవుతుందేమో?" అన్నది.

"ఆత్మీయులెవరో అర్థమయ్యేది ఒక్క దుఃఖంలోనే" అన్నాడు.

"దుఃఖంలో ఆదుకున్నవారే ఆత్మీయులనుకొనుట పొరపాటు గావచ్చు. ఆపత్తులోనివారి నాదరించుట కర్తవ్యంగాయెంచి ఆప్తులుగా నిలిచినంతమాత్రాన ఆత్మీయులని యెలా అనగలరు?" అన్నది.

"ప్రేమకు, భక్తికి సామాన్యస్థాయిలో గొప్ప అంతరమే

వుంటుంది. కాని ప్రేమ వున్నతస్థాయికిచెంది ఆధ్యాత్మికరూపం పొందినపుడు భక్తిస్థాయికి చెందుతుంది. అలానే ఆప్తులుగా దుఃఖాన్ని శిరస్సున వేసుకోను సిద్ధపడినవారే పరమఆప్తులు, ఆత్మీయలు" అన్నాడు.

"ఆత్మీయుల గుర్తింపుకొరకు అనర్థాలను యెవరు కోరుకుంటారు!" అంటూ ఆతనిచుబుకాన్నిబట్టి పైకియెత్తి దృష్టిలో దృష్టి బరపింది.

ఆతనికంత మెందుకో బరువెక్కింది. "మానవుడు సుఖసంపత్తి కొరకు శోధించుచే జీవితము. గీటురాయిద్వారా స్వచ్ఛమైన బంగారాన్ని యెన్నుకున్నట్లు అనర్థాలద్వారా సర్వశ్రేష్ట ఆప్తుని పొందుట ద్వారా జీవితమే ధన్యమవుతుంది. పురుషుడు తగిన యోగ్యతలు, అణకువగలస్త్రీని పొందుటలోనే మధురజీవితాన్ననుభవించగలుగుతాడు" అన్నాడు.

పారిజాతం యేదోచెప్పాలని ప్రయత్నిస్తుండగా "మంచి తీరని కార్యక్రమమే లభించింది పారిజాతం!" అంటూ రాజ్యలక్ష్మి ప్రవేశించింది.

పారిజాతం సిగ్గు నభినయిస్తూ విశ్వనాధంప్రక్కనుంచి లేచి ముఖంత్రిప్పుకుంది.



# 23. కర్తవ్యం

గలగలలతో మందహాసంచేస్తూ "మమతరూపంలోని మాయలు కొన్ని మనుష్యుని వెంటాడుతుంటవి. జీవితవిలువనుగాని ఒకవస్తువు విలువనుగాని హెచ్చుచేయుట, హీనపర్చుట మనలోనే వుంటుంది. మాయలో చిక్కుకున్నవారికి అవి అర్థంగాక తమ అమూల్యజీవితాన్ని వ్యక్తిసేవలో అర్పణచేసుకుంటారు. వెలుగుతున్నదీపం గదిలో నున్నపుడు ఒకరిరువురికే మేలుచేయగలుగుతుంది. ఆ దీపమే రాజవీధి మధ్య నున్నపుడు వేలమంది కుపకరిస్తుంది. సమూహంతో గూడిన సంఘాని కుపకరించుట అమూల్యమైంది. ఒకవ్యక్తి మమతలోపడి జీవితాన్ని వ్యర్థంచేసుకునేకంటే సంఘసంస్కర్తగానిలిచి సామూహికసేవకు జీవితాన్నంకితం చేసినపుడే తరించినట్లవుతుంది" అన్నది రాజ్యలక్ష్మి.

"మీరు నన్నుగురించి యింతగా వుత్తేజితపరిచేమాటలు అనవలసిన పనిలేదు. మనలోవుంటూ మనమధ్య గాయపడినవారిని గడతేర్చుట కూడా అవుసరంగదా!" అని సమాధానంగా అన్నది పారిజాతం.

"ధర్మము, స్నేహము, జాలి పెనవేసినబుద్ధితో ప్రారంభించిన సేవలో లక్ష్యాలను విస్మరించి తననుతానుకూడా కోల్పోవచ్చు" అని మందహాసంగా అన్నది రాజ్యలక్ష్మి.

"ఒక్కరొక్కరుగా అనేకమందికలిసిన సమూహమే సంఘము. ప్రతిఒక్కరిక్షేమాన్ని, సుఖాన్ని సమర్థించగలిగేదే సంఘక్షేమ మవుతుంది. ఆ సంబంధంగావుండేదే, సంఘసేవగా రూపొందుతుంది. ఇంటి క్షేమ కాంక్షతో యింటిలోనివారు నరకబాధతో నలిగిపోతున్నా పాటించకుండా యింటినిబాగుచేయుట అవివేకమవుతుంది. ప్రతివ్యక్తి కష్టసుఖాలనుగురించికూడా గమనించనక్కరలేదా అక్కా?" అన్నది పారిజాతం.

"అది ఒకవిధంగా మనోదౌర్బల్యం, మరోవిధంగా క్షుద్రరూప

సేవాభావం. ఒకరుగాదు లక్షలమంది బాధలతో క్రమ్మగవచ్చు. మన పోరాటంలో మనలాంటి వేలమందిజీవితాలు హతంగావచ్చు. వాటినిగూర్చి చింతించుట వెర్రితనమవుతుంది. లక్ష్యసాధనలో, సిద్ధాంతపోరాటంలో సంభవించేనష్టాలు క్షుద్రమాత్రమైనవే. మనధ్యేయం స్త్రీజాతి నుద్ధరించుట. పురుషబానిసత్వంనుంచి విముక్తిని కలిగించుట. ఇది పవిత్ర పోరాటం. ఇందు హృదయదృఢత్వము, సంకల్పబలము అవుసరము. మన జీవితమూల్యాన్ని అర్థంజేసుకున్నపుడు మన అమూల్యసమయంలో ఒక్కక్షణంకూడా వ్యక్తిగతసేవలలో వినియోగించజాలము" అన్నది.

పారిజాతం అజ్ఞానివలె, అబోధకురాలివలె ఆమెవైపు చూస్తున్నది. విశ్వనాథం వుండబట్టలేక "మధ్యలో నేను కల్పించుకుంటున్నందుకు క్షమించండి. ఎన్ని నిబంధనలతో బంధించినా, నిర్బంధంగా యెన్నిబోధించి మనస్సులోనింపినా, ఎంత క్రమబద్ధమైన కట్టుబాట్లలో అలవర్చినా, లక్ష్యాలు, ఆశయాలు, అదర్శాలుఅనే ప్రేరణలతో వుద్రేకపర్చి తుపాకిమందుగా తయారుచేసినా వాటన్నిటికి తిలోదకాలిచ్చి, విస్మరించి, యెగరగొట్టి యేదో ఒకనాడు మానవమనస్సు యెటు పరువులెడుతుందో, యెక్కడ యేరూపంగా నిమగ్నంగా తాపత్రయపడుతుందో యెక్కడ మానవమనస్తత్వంలోని యదార్ధప్రవృత్తులు ప్రతిబింబిస్తవో అక్కడే మానవకళ్యాణము. అదే సమాజక్షేమము. దాన్నే సత్యం, శివం, సుందరం అన్నా సరిపోతుందని మీరు విశ్వసించేరోజుకూడా తప్పక వస్తుందని నా నమ్మిక" అన్నాడు.

"తమదౌర్బల్యాన్ని అంగీకరించలేక తర్కబలాన్ని ఆశ్రయించుట నేటి విద్యాధికులకు ప్యాషనుగా తయారయింది. వర్షించిన నీరంతా నదులలోకిరానట్లే, నదులలోని నీరంతా సముద్రానికిచేరనట్లే లక్ష్యసాధనలో సాగినవారంతా నిలుస్తారని, నిలవాలని యెక్కడా లేదు. అంతమాత్రాన ఆదర్శ, ఆశయ లక్ష్యాల పోరాటాన్నే పరిహసించుట అజ్ఞాననిదర్శనము" అన్నది రాజ్యలక్ష్మి.

పారిజాతం విశ్వనాథంవైపు తీక్షణంగా చూస్తున్నది, ఆమె చూపులు అర్థంగాక తడబాటులోమునిగి తట్టుకోలేక "ఏది ఏమయినా

లక్ష్యపోరాటంలో కంకణబద్ధులై నిస్వార్ధమూర్తిగా నిలిచిన మీముందు నేను తర్కించుట దోషమవుతుందేమో! నన్ను క్షమించండి" అని వినమ్రభావంతో అన్నాడు.

అధరాలను బిగబట్టి మందహాసాలొలికిస్తూ "కఠినసమస్యలు యెంతగా యెదుర్కొంటే అంతగా పొందే అనుభవంతో వ్యక్తిత్వం రాణించునట్లు, కీర్తి ప్రభవించునట్లు, ఆదర్శాలను, ఆశయాలను శిరస్సున ధరించి లక్ష్యసాధకులుగా పయనిస్తున్న మాబోటివారిని మీలాంటి యువకులు యెదిర్చి నిలిచినపుడే మాలోని త్యాగదీక్ష రుజువవుతుంది. విజ్ఞానంలోనే విమర్శవుంటుంది, విమర్శలోనే విషయవాస్తవికత అర్ధమవుతుంది. మమ్మ యెదిరించేవారే మాకు పూర్తిసహకారాన్నిచ్చేవారుగా తయారవుతుంటారు. అందుకు మిమ్మ మీరే తార్కాణంగా ఆలోచించుకోండి. మాలక్ష్యం పవిత్రమైంది. కృషి గణనీయమైంది గనుకనే మమ్మ యెదుర్కొనేవారికి మేము సుస్పష్టంగా అర్ధమయ్యి ఆకర్షింపబడతాము. నిన్ను మేము, మమ్మ నీవు అర్ధంచేసుకోగలిగినపుడు చిల్లరవిషయాలతో చీకాకుపడవలసినపని లేదు" అంటూ ఒక వేదికమీదిస్తున్న వుపన్యాసంలోని వుద్రిక్తఘట్టంవలె వుపన్యసించి, చిన్ననగవును విసరుతూ వెళ్ళిపోయింది.

ఆమెమాటలలోగాని, వ్యవహారాలలోగాని యెక్కడా లేశమాత్రపు ఆకర్షణకూడా లేదని, సానుభూతికూడా కలుగుటలేదని, అయినా అర్ధంగాని అజ్ఞాతశక్తిప్రేరణ యిటువైపుకే నెడుతున్నదని. ఇక్కడ యేదో గొప్ప ప్రభావవంతమైనశక్తి లేకపోతే తానిలా యిల్లు వాకిలి వదులుటెలా జరిగివుంటుందా, అనే ఆలోచనలతో కలవరపడిపోతున్నాడు విశ్వనాథం.

"అక్కమాటలు బాధ గలిగించినవా?" అని ప్రశ్నించింది.

"బాధవిషయ మెలావున్నా మీ అక్కమాటలు బాగా అర్ధమయినవి. కాని నీమాటలు యెంత ప్రయత్నించినా తెలియుటలేదు" అన్నాడు.

"పోనీ అలాంటివి తెలియకుండావుండుటే క్షేమంలెండి" అన్నది.

"మీ అక్కకు మంచి చిట్కామాటలనువేసి యెరగనట్లు వూరుకున్నావేమిటి పారిజాతం!" అన్నాడు.

"అక్క గొప్ప అనుభవజ్ఞురాలు, ప్రతిభావంతురాలు. అనుకున్న కార్యాన్ని చేసివేయగల సమర్థురాలు, పదవులు, హోదాలు లేకుండానే ఆమె సాధించినవి సామాన్యమైనవిగాదు. మా సిద్ధాంతాలను, కార్యరంగాన్ని, మమ్మ, అవహేళనగా, మూర్ఖంగా విమర్శించిన ఒక మహానాయకుడు మా రాజ్యలక్ష్మితో ప్రయివేటుగా విషయాలన్నిటిని తర్కించిన తదనంతరం మమ్మ, మా మండలి కార్యరంగాన్ని వేయినోళ్ళ స్తుతిస్తూ అనేకసభలలోనే ప్రకటించాడు. అప్పులుతెచ్చికూడా మా వుద్యమఖర్చులకు చందాలుగాయిచ్చిన సమయాలున్నవి. రాజ్యలక్ష్మి అక్క బహుముఖ ప్రజ్ఞావంతురాలు. నీరసజీవితంలో, నికృష్టాన్ననుభవిస్తూ నాలాంటి యావన్మందిని చేరదీసి వుత్సాహాన్ని, వూతాన్నియిచ్చి దీక్షనుగల్పించి నిత్యకళ్యాణంగా నడిపిస్తున్నది...." అని ఒకేబాణిలో బైబిలుప్రచారకురాలివలె వినిపిస్తున్న ఆమెమాటకు అడ్డుతగిలి "అడిగినవిషయాన్ని విడచి అనవసరప్రశంసలు యేకరుపుపెడతావెందుకు?" అన్నాడు.

ఆమె క్రోధాన్నభినయిస్తూ "పురుషజాతి పూర్తిస్వార్థంలో మునకలు వేస్తుంటుంది. అవుసరంలో అనునయము, వినతి గొప్పగా చేయగలరు, శిరస్సున ధరించగలరు. తరువాత నిరాదరంగా, నిర్దాక్షిణ్యంగా అదిమివేయగలరు. రాజ్యలక్ష్మిఅన్నట్లు స్త్రీసమానత్వం రావాలంటే హృదయకాఠిన్యం అలవర్చుకోవాలి" అన్నది.

"మీ ప్రయత్నమంతా యిపుడు ఆ కాఠిన్యత నలవర్చుకొనుటకేనా?" అన్నాడు.

వనజ వగైరాలు వచ్చి చేరినందున వారిసంభాషణ అంతటితోనే ఆగిపోయింది. వనజ పారిజాతంకంటె చిన్నవయస్కురాలు. మధురమైన కంఠము. ఆమె లేకపోతే మహిళామండలి పాటలలో ఆ మాధుర్యముండదనిపిస్తుంది. ఆమె యెక్కడినుంచి యెలావచ్చిందో, యెందుకు రావలసివచ్చిందో యెవరికీ తెలియదు. మూడుసంవత్సరాలక్రితం రాజ్యలక్ష్మి మద్రాసునుంచివస్తూ వెంటదీసుకొచ్చింది. అంతకుమించిన వివరాలు యెవరికీ యింతవరకు తెలియలేదు. ఎవరయినా వివరాలు తెలుసు

కోవాలని ప్రయత్నిస్తే కన్నీరుకారుస్తుంది. వెంటనే ఆ అడిగినవారు కవుగిటిలోకితీసుకుని కన్నీరు కొంగుతో అద్దుతూ బుజ్జగిస్తూ "మా బుల్లి చెల్లివిగదూ! పోనీ ఆప్రశ్న యిక అడగంలే, కన్నీరుకార్చకు చెల్లీ!" అంటూ వోదార్చి వదులుతారు. మహిళామండలికూడలిలోకల్లా చిన్న వయస్కురాలు, అందాలుచిందించే రూపవతి. కాని వనజ మితసంభాషిణి. డిటెక్టివ్ నవల్సులాంటి పుస్తకాలు చదువుతుంటుంది. ఒక్కపాట పాడుటలోదప్ప మిగతాకార్యక్రమంలో ఆమె పాల్గోదు. అవన్నీ ఆమెకు రుచించవేమో అనిపిస్తుంది. అందరూ ఆమెను చాలాప్రీతిగా జూస్తారు. వున్నతకుటుంబంలో జన్మించివుంటుందని, రూపురేఖలు శరీరంలోని నాజూకులు ప్రకటిస్తుంటవి.

ఆమెనుగురించి జాలితో యెన్నోవిధాల విచారిస్తుంటాడు. వనజ అడ్రసు తెలిసివుంటే తాను బలవంతంగానైనా తీసుకెళ్ళి తలిదండ్రుల కప్పగించి వచ్చివుండేవాడు. తలిదండ్రులు లేరేమోనన్న సందేహమూ కలుగుతుంటుంది. పారిజాతం, రాజ్యలక్ష్మి కార్యక్రమంలో మునిగినపుడు విశ్వనాథాన్ని కనిపెట్టివుండేభారాన్ని వనజ కప్పగిస్తుంది. వనజ అశుభం శుభం తెలియని పసిబాలిక అనే తలంపుతో అందరూ విశ్వసిస్తుంటారు, ప్రేమిస్తుంటారు.

చందాలు యెక్కువగా వసూలయ్యేఅవకాశం గనిపించనందున రాజ్యలక్ష్మి స్వయంగా మండలియావత్తుతోను దూరయాత్రకు సంసిద్ధమయింది. క్షతగాత్రుడైన విశ్వనాథం మండలియాత్రలో పాల్గోలేకపోయాడు. వనజనువుంచివెళ్ళే యేర్పాట్లుచేసింది పారిజాతం. ఈ రెండురోజులు స్పూన్‌తో యెలాగయినాభోంచేస్తూ కాలంగడపమని విశ్వనాథంకు వినతిచేసింది. వనజకుకూడా చేయవలసినవిధులను వివరించి వెళ్ళిపోయింది.

వనజకు పాకశాస్త్రపరిజ్ఞానం లేదు. అయినా అవుసరాలు సామర్థ్యాన్ని సృష్టిస్తవి. నూతనంగా వంటశాలలో ప్రవేశించి చేసిన పదార్థాలు బాగా రుచిగావుంటవి. తెలియకుండా ప్రవేశించినపుడున్న జాగ్రత్తలు ప్రావీణ్యంపొందాక వుండవు. అందుకే నేర్చుకునేవారు చేసిన పదార్థాలు యింకా యింకా తినాలనిపిస్తుంటుంది.

స్వయంగా అన్నంకలిపి, తీర్చి అమర్చినప్లేటును తెచ్చి విశ్వ నాధంముందుంచింది. తోముకొచ్చిన స్పూనును కొంగుతో తుడిచి అతనిహస్తానికి పట్టించింది.

ఆ స్పూనును రెండువ్రేళ్ళసందున యిముడ్చుకుంటూ "నాగురించి నీవు చాలా యిబ్బందిపడవలసివస్తున్నది. వాళ్ళతోకలిసి హాయిగా తిరగ టానికిబదులు, పోలీసునౌఖరీవలె యీ డ్యూటీలో వుండవలసివచ్చింది" అంటూ ఆమెవంక చూడకుండా స్పూన్‌తో భుజించ ప్రయత్నిస్తున్నాడు. కష్టపడి ఒక స్పూన్ అందుకోగలిగాడు గాని రెండోమారు తీస్తుండగా జారి ప్రక్కనున్న పుబుసుగిన్నెలోపడి చిందినవి.

వనజ తనలోతానే నొచ్చుకుంటూ తడిఅంగుళీయములతో అతని దుస్తులమీది మరకలను తుడుస్తున్నది. "ఆ మరక లలా వున్నందువలన వచ్చేనష్టమేమీలేదులే చెల్లీ! నన్నుగురించి నీవు మరీ శ్రమపడితే భరించలేనట్లు మనస్సు బాధపడుతున్నదమ్మా!" అన్నాడు.



160

# 24. భారతనారీ నమూనా

వనజ ఆ మాటలను విననట్లే తనపని తాను చేసుకుపోతున్నది. స్పూనునుతీసి కడిగి కొంగుతోతుడిచి, తిరిగి యధారూపంలో ఆతనిచేతి కందించింది. ఆమెను యెక్కువసేపు నిరీక్షణలోవుంచి బాధించకుండా పంపివేయాలనే ఆదుర్దాతోచేసిన యత్నంతో నోటికందబోతున్న స్పూను వడిలోపడిపోయింది. దుస్తులమీద చెల్లాచెదరుగాపడిపోయిన భోజన పదార్థం వికారంగా గనిపిస్తున్నది. వనజ బాధపడి అసహాయస్థితిగా చిత్రించుకుంటున్నది. యధావిధిగా తిరిగి శుభ్రపరిచింది.

"వనజచెల్లీ, వీటన్నిటినీవుంచి నీవు వెళ్ళిపో అమ్మా! నేను యెలాగో తంటాలుపడతానుగా!" అన్నాడు.

ఆమె శిరస్సువంచి అలానే నిలిచింది. ఏటవాలుగా తీర్చి అమర్చి నట్లున్న కాలువలోని నీరు నిశ్శబ్దంతో పరువులెత్తినట్లు ఆమెమనస్సులో ఆలోచనల్లు పరువులెడుతున్నవి.

ఆకస్మికంగా స్పూనుచేతబట్టి తానే తినిపించ నుద్యుక్తురాల యింది. ఆతను వెలవెలబోతూ "ఇదేమిటమ్మా! నీకీ శ్రమ యివ్వ జాలను. నీముందు నేను సిగ్గుపడుతున్నాను. నన్ను క్షమించు వనజా" అంటూ మరోవైపు చూడసాగాడు.

"పరవాలేదులెండి. సహాయ సహకార సానుభూతులు, దయా దాక్షిణ్యాలు, మమతలు, ప్రేమ పూర్తిగా లోపించినపుడు మానవత్వమే లోపిస్తుంది. ఆనాడు సంఘమే నశిస్తుంది. నేను చేస్తున్నది నా కర్తవ్యంమాత్రమే" అంటూ ఆతనిశిరస్సుమీద చేయివేసి ముఖాన్ని తనవైపుకు త్రిప్పి, స్పూనుతో తానే తినుపిస్తున్నది.

అలవాటులేని కార్యం, స్పూనుతో మరొకరికి తినిపించుట మరింత కష్టకార్యమైనందున ఆమె కసౌకర్యంగా తోచింది. ఈ విధానం

ఆతనికికూడ సుకరంగాలేనట్లు వ్యక్తంచేసుకున్నది. మనస్సును దృఢంచేసుకుని, స్పూనునువదిలి తనచేతితోనే తినిపించప్రారంభించింది. ఆతనిసర్వాంగాలు సిగ్గుదొంతరులతో పులకితమైపోతున్నవి.

పసివానికివలె తినిపించి, గ్లాసుడుమంచినీళ్ళు త్రాగించి, తడిచేత్తో మూతి తుడిసి, కొంగుతో అద్దివేసింది. ఆతనిదుస్తులమీదనున్న యెంగిలిని వేరేస్తున్నది.

ప్రేమార్ద్రకంఠంతో "వనజా, యీదృశ్యం నా మనస్సులో యెన్నటికీ చెరగనిముద్ర వేసుకున్నది. అబ్బ! నీ ఆదరం యెంత అమూల్యమైంది! పవిత్రమైనహృదయంద్వారామాత్రమే యీ ఆదరం లభ్యమవుతుంది. నాకు సోదరిలేనికొరత తీరినట్లు నూతనానుభూతులు అనుభవమవుతున్నవి" అని ఆమెముఖంవైపు పరిశీలనగా చూశాడు. కాని ఆతనికర్థమయిందేమీ లేదు. తన సామాన్యకార్యక్రమంవలె చేసుకుపోతున్నది. తనసేవలో విసగటచెందినట్లూహించి "పారిజాతం నీ కనవసరమైన శ్రమనిచ్చిపోయింది. నా శక్తిహీనతలో మీరు వూహించని బాధ్యతను నిర్వహించాల్సివచ్చింది. అందుకు నేనెంతో సిగ్గిలుతున్నాను. నన్ను క్షమించు" అన్నాడు.

ఆమె దృష్టిలో దృష్టిని బరపుతూ, మందహాసరేఖలను వెదజల్లుతూ "మీరలా యెందుకంటున్నారు! మీకుచేస్తున్నసేవలో నాకు తెలియని ఆనందానుభూతులనొందుతున్నాను. నాకు పెద్ద అనుభవంలేదు. తెలిసినంతలో చెప్పాలంటే స్త్రీకి స్త్రీసేవలో మనస్సు లగ్నంకాకపోవచ్చు కాని పురుషునికిచేసే సేవలో వుత్సాహం కలుగుతుంది, ఆనందం లభిస్తుంది. రత్నానికి రాపిడిలోనే తేజస్సు అధికమవునట్లు స్త్రీకి అలాంటి తీరని సేవాకార్యక్రమమే నిండుతనాన్నిస్తుంది. మీకు సేవచేసే యీ అవకాశంలభించుట అదృష్టంగా భావిస్తున్నాను" అన్నది.

పాదధూళితో కప్పుకుపోయిన పాలరాతిఫలకం వర్షపుపోతతో కడుక్కుపోయి స్వచ్ఛమెరుపులతో మిలమిలలాడునట్లు ఆమెమాటలతో విశ్వనాథంహృదయంలోని మత్తుగూడు కరిగిపోయి నిర్మలమయినట్లున్నది. భ్రమలోపడి చేసినయాత్ర అంతా పూబిలోనడిచినట్లు తోచింది.

ఇపుడు మహిళామండలి నినాదాలన్నీ, పరిహసిస్తున్నట్లు శిరస్సు దిమ్మెత్తిపోతున్నది. తానీ మండలిలోజేరి పరిహాసపాత్రుడుగా నిలిచింది మండలిఆశయ మత్తులోనా, సేవాప్రేరణలోనా అని ప్రశ్నపరంపరలు లేస్తున్నవి. తనలోతనకే సమాధానం లభించక వెలవెలబోతున్నాడు. నీవు పారిజాతంపిచ్చిలో మునిగి కొట్టుకుపోతూ మండలినావలో చేరావు, అన్న సమాధానమొచ్చింది.

అతనినేత్రాలముందు పారిజాతము, ఆమెప్రక్క వనజ నిలిచినట్లున్నది. ఒకరు ఉత్పాతాలఘోషణలతో ప్రవహించు గంగగాను, మరొకరు నిర్మలంగా, ప్రశాంతతో ప్రవహించు యమునగాను, ఒకరు తరంగాలతో తపతపలాడుక్రీడలతో పరువులెడుతుంటే, మరొకరు మౌనముద్రలో గంభీరత తొణకకుండా శాంతియుతంగా ప్రవహిస్తున్నట్లున్నది.

వనజనుచూస్తూ ఆమెమాటలను గుర్తుచేసుకుంటుంటే, ముగ్ధత గలిగి వుత్సాహంలో ఆగలేక "వనజా, నీహృదయం పవిత్రమైంది, వున్నతమైంది, నవనీతంలాంటిది. నీ భావాలు సున్నితమైనవి, ఆదర్శమైనవి. నీవు భారతనారీ నమూనావి. కాని నీలోని ఒక్కరహస్యాన్ని మాత్రం తెలుసుకోవాలని ఆదుర్దాపడుతున్నాను. అనుమతయితే అడుగుతాను" అన్నాడు.

"నాముందు నన్నుగురించి పెద్దపెద్దమాటలు వినిపించవదని కోరుతున్నాను. నాద్వారా తెలుసుకోవాలన్న రహస్యమేమిటో చెప్పండి" అన్నది.

"నన్ను నీ నిజసోదరునిగాభావించి అన్యధా తలంచక నీవు యెక్కడినుంచి యెలావచ్చావో, రాజ్యలక్ష్మికెలా తటస్థపడ్డావో వివరిస్తే మరెవరికి తెలియనీయకుండా నా హృదయంలోనే దాచివుంచుతాను" అన్నాడు.

క్షణంలో ఆమెముఖం కారుమేఘరూపమెత్తింది. అశ్రువులు యేకధారగా వలుకుతున్నవి. ఆ దృశ్యాన్నిజూచిన విశ్వనాధం వణికిపోతూ కరుణాభరితకంఠంతో "చూడు, వనజా! ఆ ప్రశ్న అడుగుట

నాపొరపాటయితే నన్ను క్షమించు. ఇక యెన్నడూ నిన్నీవిషయం ప్రశ్నించను. ఈ ప్రశ్న నిన్నింత కలవరపర్చేదని నేను తలంచలేదు. నా అపరాధాన్ని ఈ ఒక్కమాటుకు మన్నించు చెల్లీ!" అన్నాడు.

ఆమె అక్కడే కూలబడి కొంగుతోఅద్దుకుంటూ పావుగంటవరకు కన్నీరుకారుస్తూనే కాలం గడిపింది. అప్పటికి తేలికపడిందిగాబోలు ముఖం తుడుచుకుని ఆతనివైపు చూసింది. ముఖంలో నిర్మలరేఖలు తేరుకుంటున్నవి.

శీతలప్రకాశము హాయిని గొలుపుతుంది. చూచుటలో మరీమరీ ఆనందం గలుగుతుంది. కాని వుష్ణప్రకాశితమైన ప్రభాకరునివెలుగు ప్రాణికి మూలాధారమైనా ఆ స్నిగ్ధతీక్షణతను సూటిగా చూడలేము. అదేరీతి స్నిగ్ధభాజితతీక్షణలతో అనేకదీపశిఖలబోలిన వనజను సూటిగా చూడజాలక అధోముఖంచేసి కోరచూపులతో పరికిస్తున్నాడు.

"మౌనందాల్చా రెందుకు? నేను కన్నీరు కార్చినందుకు విచార పడుతున్నారా?" అని ప్రశ్నించింది.

"కాదుకాదు. నిన్నుసంతోషపర్చే విధానమేదా, నవ్వించేమాట లేవా, అని ఆలోచిస్తున్నాను" అన్నాడు.

"మీ సేవలో నాకుకలిగే ఆత్మతృప్తి అవిఛ్ఛిన్నమైందని చెబితే విశ్వసిస్తారా?" అని ప్రశ్నించింది.

"అది నాజన్మజన్మల పుణ్యఫలితంగా భావిస్తాను. కాని విశ్వసింప జాలని మాటలను విశ్వసిస్తున్నట్లు నీముందు చెప్పలేకపోతున్నాను. నేను పథవిహీనుణ్ణేమోననేశంక నీద్వారా కలుగుతున్నది. నాలో అణ గారిపోతున్న అనేకభావాలు పునరాంకురమవుతున్నవి. ఆదర్శాలు, ఆశ యాలు, లక్ష్యాలు అని గొప్పగొప్ప శబ్దజాలంతో శృంగారంగా వర్ణిస్తూ యిచ్చే వుపన్యాసాలు సారవిహీనంగా దోస్తున్నవి. వాటి తాలూకు సూక్ష్మచిహ్నాలనైనా అనుభవంలో ప్రదర్శించుట మహత్వనీయ మని నీద్వారా నూతనోత్సాహ వూహాలు గలుగుతున్నవి. మాటలు, ప్రచారాలు, ప్రగల్భవుపన్యాసాలు యెలాంటివయినా, వారివారి స్వభావ సిద్ధ ప్రవృత్తులు ఆచరణలో ప్రతిబింబిస్తుంటవి. నీ హృదయంలో పవిత్ర

నారీత్వమున్నది" అని యింకేమో చెప్పబోతుండగా ఆమె మధ్యలోనే కల్పించుకుని "చూడండి, తిరిగి మీరు అహితమైనపనినే చేస్తున్నారు. ప్రత్యక్షపొగడ్త స్త్రీకి రాణించదని, క్షేమమూగాదని ముందే చెప్పాను. తిరిగి అలాంటిమాటలనే మీరు ప్రారంభిస్తున్నారు" అన్నది.

"పొరపాటుజరిగింది. క్షమించు వనజా! ఆశ్చర్యమో, ఆనందమో, ఆత్మీయపులకితమో సంభవించినపుడు బహిర్గతంగా చెప్పుకోవాలనే ఆదుర్దా వశందప్పి పనిజేస్తుంటుంది. అలాంటి ప్రేరణఫలితంగా వచ్చిన మాటలను అన్యథా తలంచకండి" అన్నాడు.

"ఒకనాడు భ్రమింపజేసినవి మరోనాడు హేయంగా పరిణమిస్తవి. నిర్ణయంలో తొందరపడినపుడు నిరాశకూడా దగ్గరలోనే సంభవిస్తుందిగనుక, ఉదారనిర్ణయాలుచేసి కూర్చోకండి" అన్నది.

భీతావహంలోని వినమ్రతను ప్రదర్శిస్తూ "నన్ను క్షమించండి. మీ సలహాలు అమూల్యమైనవి. మీద్వారా నేనొక వెలుగును పొందినట్లున్నది. మీరు చిన్నవయస్సులోనే యింత అమోఘమైన అభిప్రాయాలనెలా యివ్వగలుగుతున్నారా, అని నాలో నాకే ఆశ్చర్యంకలుగుతున్నది...."

అని చెప్పుకుపోతుండగా వస్తున్న నవ్వును బిగబట్టి ఆపి "మీరు భలేవారు, చేసినపొరపాటునే చర్విత చర్వణంగా చేస్తున్నారు. నన్ను పొగడవద్దన్నాను. ఎటుదిప్పినా మీమాటలు ఆవైపుకే నడుస్తున్నవి. నేను చిన్నదాన్ని, స్త్రీని అని తెలిసికూడా గౌరవశబ్దాల నుపయోగించుట శ్రేయస్సుగాదు" అన్నది.

ఆయన వెలవెలబోతూ ఖంగారుపడుతున్నవానివలె "అవును, అవును! నేను పొరపాటేజేస్తున్నాను, నన్ను క్షమించండి. మనస్సు రవంత కళవళపడినపుడు అలాంటిపొరపాట్లు సహజంగానే జరుగుతుంటవి" అన్నాడు.

ఇక ఆపలేక గలగలనవ్వుతూ "తిరిగి ఆ పనినే చేస్తున్నారు. పదేపదే ఆ పొరపాటునేచేస్తూ క్షమాపణకోరతారేమిటి? మీరు నిజంగా విచిత్రమైనవారు" అన్నది.

అబ్బ! ఆ నవ్వు యెంత మధురమైంది! ఆనందాబ్ధిలో మునకలు వేసినట్లయింది. జన్మ పవిత్రమైనట్లు తోచింది. అంతటి నిష్కల్మషము, నైర్మల్యముతో స్నిగ్ధప్రేమకొలికించు నవ్వును యిదివరకెన్నడూ గాంచి యెరుగడు. ఆ నవ్వునుచూస్తున్నకొంది సర్వాంగాలు పులకితమైనవి. చిన్నగా నతనతగొడుతూ "అబ్బ! నీవు యేమాటలు నిషేధిస్తున్నావో, యే విషయంలో నిర్బంధిస్తున్నావో అవే అనాలనిపిస్తున్నది. గౌరవించుట, స్తుతించుట సహృదయంతో జరుగుతున్నపుడు దోషముండదని నా నిశ్చయము. దురాలోచనతోకూడిన పొగడ్తలు భరించరానివిగావచ్చు. గౌరవము వయఃపరిమితివెంట వుండేదిగాదు. గౌరవించేవారి హృదయ సౌకుమార్యాలకు సంబంధించింది. అందువలన క్షమించి నాకున్న అవకాశాలను నిరోధించవద్దని కోరుతున్నాను" అన్నాడు.

"స్త్రీ యెంత వివేకవంతురాలయినా బుద్ధిబలము, యోగ్యతలు యెన్నివున్నా పొగడ్తలముందు పరవశురాలై మగవారిమాయలకు గురిగాగలదు. పురుషునిద్వారా లభించే పొగడ్తలు స్త్రీకి యెల్లపుడూ కీడునే సమకూర్చగలుగుతవి. పురుషప్రేరణే స్త్రీకి సర్వనాశనహేతువవుతుంది" అన్నది.

"ఈమాటలన్నీ మీరు రాజ్యలక్ష్మివద్ద నేర్చుకున్నారనుకుంటాను. మహిళామండలివారి అందరివలె మీకూ స్త్రీపక్షపాతముంది. ఇంతకుముందు మిమ్ము యీమండలికి అతీతంగా తలంచి పొరపడ్డాను."

—అంటుండగా వనజ తిరిగి గలగలనవ్వుతూ "అందుకే తొందరపడి నిర్ణయించేస్తే ఆ తరువాత పశ్చాత్తాపపడవలసివస్తుందని ముందే చెప్పాను. కాని నా మాటలు రాజ్యలక్ష్మినుంచివచ్చినవని మాత్రం అనుకోకండి. స్త్రీ తన హక్కులకొరకని, ఆధిక్యతకొరకని పురుషులతో పోరాటంసలుపుట నాదృష్టిలో హాస్యాస్పదమయినది. పురుషునితో పోరాడి సమానహక్కును, ఆధిక్యతనుపొందిన స్త్రీలో స్త్రీత్వముండదని నా విశ్వాసం. ప్రేమను, ఆదరాన్ని, అభిమానాన్ని, ఆధిక్యతను ప్రేమద్వారాను, సేవద్వారాను, వినయంద్వారాను, ఆత్మార్పణద్వారాను పురుషునివద్ద పొందినపుడే స్త్రీ తన పూర్ణత్వాన్ని పొందగలదు. పురుషునితో పోరాటంద్వారా పొందేవిజయం స్త్రీకి క్షేమమైందీగాదు,

యోగ్యమైందీగాదు. స్త్రీపురుషపోరాటం శరీరంలోని ఒకఅవయవంతో మరొక అవయవం పోరాడుటలాంటిది. రాజ్యలక్ష్మిభావాలతో నేను యెన్నడూ యేకీభవించననిమాత్రం గుర్తుంచుకోండి" అన్నది వనజ.

విశ్వనాథం నివ్వెరపోయి అయిదునిముషాలు అలానే వుండిపోయాడు. అంతకుముందన్న ఆమెమాటలలో యెంత నిరాశపొందాడో, హేయపడ్డాడో అంతకుమించి ఆశ్చర్యపోతున్నాడు, తిరిగి ఆమె అన్న మాటలకు.

"మీమాటలు నాకర్థమయ్యేరీతిలో లేవు. రాజ్యలక్ష్మియెడల మీకభిమానమున్నదా లేదా?" అని ప్రశ్నించాడు.

ఆమె మందహాసంతో "మీలో చిక్కుప్రశ్నలే వుదయిస్తున్నవి. అలాంటి అనుమానమెందుకు చెప్పండి! ఆమెగారియెడల నాకున్న ప్రేమాభిమానాలు విశేషమైనవి. భక్తిశ్రద్ధలతోనే మెలగుతుంటాను. అంతమాత్రాన ఆమెఆశయాలను, కార్యరంగాలను ఆమోదించినట్లు కాదు" అన్నది.

"ఒకరియెడల భక్తిశ్రద్ధలతోవుంటూ, అనురాగాభిమానాలతో మెలగుతూకూడా వారిఆశయాలకు, అభిప్రాయాలకు భిన్నంగావచ్చు. కాని యే ఆశయసంబంధకార్యక్రమాలలో పాల్గొంటున్నారో ఆ కార్యరంగ ఆశయాలమీద, లక్ష్యాలమీద విశ్వాసం లేకపోవుట యెలా సంభవిస్తుంది" అన్నాడు.

"పరిస్థితులు ప్రతిఒక్కరిని లొంగదీస్తవి. వాటికతీతంగా తప్పుకోను అన్నివేళల సాధ్యపడదు. పోతున్నరైలుబండిలో ప్రయాణీకులు కానివారుకూడా పయనిస్తుంటారు" అంటుండగా ఆమెగొంతు బరువెక్కి రుద్ధమైంది. నేత్రాలు జలభరితమై శిరస్సు ప్రక్కకు త్రిప్పుకున్నది,

ఆతనిమనస్సు ఆ సమస్యలనుంచి ఆమెజీవితరహస్య శోధనవైపు మళ్ళింది. గొప్ప విషాదభరితఘట్టంతో ఆమెజీవితం తారుమారై వుంటుందని, ఆ రహస్యాన్ని బయటపెట్టలేక తనవ్యథను లోలోపలే అణచి గంభీరముద్రలమధ్య నిలిచి కాలాన్ని దొర్లిస్తున్నదని వూహాలుచేస్తున్నాడు. జీవితంలోనిరహస్యం యేమయివున్నప్పటికి మంచి సుశిక్షిత కుటుంబంలో జన్మించివుంటుందని, వున్నతఆశయాలు గలిగిన గొప్ప

ఆదర్శమహిళయని నిర్ణయించుకున్నాడు. పారిజాతంకంటె యీమే గొప్పదని అజ్ఞాతప్రవృత్తులు నిర్ణయిస్తున్నవి. తనతో వనజను పోల్చు కున్నపుడు తనసడవడిని తానే తడుముకోవటం జరుగుతున్నది. మహిళామండలి ఆశయాలకన్నా వనజచెప్పిన విషయాలే యదార్థ సత్యాలుగాను, పవిత్రమైనవిగాను తోస్తున్నవి. తన నిజస్వభావాలుకూడా అవేనేమోననిపిస్తున్నపుడు ఆమెయెడల కృతజ్ఞత కలుగుతున్నది. ఆమె జీవితరహస్యం తెలిస్తే, అవుసరమయితే తాను యెంత త్యాగానికయినా తయారయి ఆమె నుద్ధరించాలనిపిస్తున్నది, కాని ఆ విషయాలడుగున మనస్సు యెంతకూడదీసుకున్నా ధైర్యం సడలిపోతున్నది.

మండలివారు కార్యక్రమంలోవెళ్ళి రెండురోజులు గడిచిపోయి నవి. వనజ వంటపని ముగించుకుని మిగిలినసమయమంతా విశ్వనాథం యెదుటనే గడుపుతున్నది, "ఇన్ని అనుపానాలు అవస్థపడి చేయట మెందుకమ్మా! నాకు ఒక్కటిచేస్తే చాలదూ?" అంటాడు.

"పురుషుని గౌరవించుట, వీలయినంత తృప్తితో భోంచేయ బెట్టుట స్త్రీ ప్రథమధర్మంగదా! చనువును, సన్నిహితాన్ని దుర్విని యోగం చేసుకోకుండా ధర్మాన్ని నిర్వర్తించుటలోనే శ్రేయస్సుంటుంది" అంటుంది వనజ.

ఇపుడు బెరుకులుపోయినవి. పరస్పరఅనురాగాలు పెరిగినవి. అన్యోన్యత యెక్కువయింది. అయినా ఆమెగీటునుదాటి రహస్యమయ జీవితఘట్టాన్ని అడిగేధైర్యం లేదు.

రాజకీయజీవితం జీడిలాంటిది, ఒకమాటు అంటుకుంటే తొంద రగా వదిలిపెట్టదు. తాను విరక్తితో దూరమైనా సహచరులులాగి లైను మీద పెడుతుంటారు. అందు కీర్తిరూపప్రచలితాన్ని ఒకమాటు అందు కున్నాక మనస్సుమీద వ్యామోహముద్రను శాశ్వతంగావేసిపోతుంది. ఆ వాతావరణంనుంచి బైటపడుట అంతతేలికయినపని గాదు. పోనుపోను జీవితంలో కొందరి కది కంపతోడుగుగా భావనకలిగినా పారిపోలేకలాగే పిచ్చిని పొందుతారు. అందువలన రాజకీయపిచ్చివాళ్ళ సంఖ్య యెక్కువ గానే వుంటుంది. తన జీవితంలోని ఒకనాటివైభవాన్ని నెమరువేసు కుంటూ యెంత చీకాకులోనైనా ఆనందాన్ని సమకూర్చుకుంటుంటారు.

విజయ్ విద్యార్థిలోకఅభిమానాన్ని చూరగొన్నపుడు యేకైక నాయకుడుగా యెన్నికయినాడు. అనేక సన్మానాలందుకుని, సభలలో ప్రసంగించి ఘనతగా ప్రశంసలనందుకున్నాడు. విద్యార్థియూనియన్‌కు నూతనశోభను కల్పించాడు. ఆఫీసుకు మెరుగులుకల్పించి కార్యక్రమాన్ని వివిధవిధాల పరువులెత్తించాడు. స్నేహితులసంఖ్య పెరిగింది. పనులను కల్పించేవారు, చెప్పేవారితోపాటు కోరేవారిసంఖ్య అధికమయింది. అందువల్లనే ఆరోజుల్లో క్షణం వ్యవధిలేకుండా హడావుడులతో గడిచి పోయింది. కాని కాలేజీలోపాఠాలు ప్రారంభమయ్యాక బాహ్యకార్యక్రమాలు క్రమక్రమంగా సన్నగిలినవి. రోజుకోమాటు ఆఫీసులో కొద్ది సమయం యిష్టాగోష్టితోనే కార్యరంగం ముగిసిపోతున్నది. అందువలన విజయ్ యింటికి ముందుగానే వెళ్ళగలుగుతున్నాడు.

ఆవిధంగా యూనియన్‌కార్యక్రమం సన్నగిలి, చదువుమీద యెక్కువధ్యానముంచవలసిన రోజుల్లోనే సరళాదేవినుంచి పుత్తర మొచ్చుట, ఆ తరువాత యాత్ర వగైరాలతో ప్రేమలేఖలు ప్రారంభమైనాయి. ఈ రంగం రాజకీయరంగంకన్నా బలవత్తరమైంది. ఈ ప్రేమ యోగంలో కొంతదూరంవరకుమాత్రమే తానుగా పయనించగలుగుతాడు. ఆ తరువాత తనను నిమిత్తమాత్రునిగాజేసి ఆ ప్రేమజ్వాలలే పరువులెత్తిస్తవి. విజయ్ ఆ మెట్టువరకు పయనించాడు. క్లాసులోకూర్చున్నా పుత్తరాలకొరకు మనస్సు వెదుకుతుంటుంది. బయటకొస్తే యూనియన్ పాతనాయకులంతా పట్టుబట్టి ఆఫీసులో, గూర్చొబెడతారు. ఇంటికివెళితే వినమ్రురాలై బీబీజాన్ యెదుట నిలుస్తుంది. ఆమెను మరిపించలేక తప్పుకుని యేకాంతంపొంది సరళకు లేఖ వ్రాయాలి. అది సామాన్యలేఖ గాదు. ప్రేమలేఖ. హృదయాన్ని చలింపజేస్తూ, నరాలను నమిలివేస్తూ తరంగాలలో తపతపలాడే భరింపరానివలపులను కాగితంలోకి వలికించి పంపుట అంతతేలికయినపని గాదు. తన కోమలప్రేమహృదయాన్నే ఆ పాడుకాగితంలోపెట్టి మడతలువేసి కవరులోవుంచ గత్యంతరంలేక పంపి యెవరిహృదయంకొరకో యెదురుచూడాలి!

వినయవిధేయతలతో, ప్రేమాదరాలతో, భక్తివిశ్వాసాలతో ధృవతారవలె యెదుటనిలిచి తనహృదయంలోని జాలిని, దయను దోచుకుంటాన్నారొకరు. తనమతిని పరాధీనంలోముంచి ఆకర్షణలో అత్మార్పణ చేయిస్తున్నారు మరొకరు. తనను గొప్ప విద్యార్థినాయకునిగా యెంచి తన సన్నిహితాన్ని, స్నేహాన్ని, సలహాసంపత్తినికోరి విడువకుండా వెంటాడుతున్న స్నేహశీలురైన విద్యార్థులతోను మెలగుతున్న విజయ్‌కు పాఠాలు చదువాలని ఆశ అపుడపుడు గిరగిర మనస్సులో తిరుగుతున్నా పుస్తకంచేతబూని కూర్చుంటే అందులో ఆ పుత్తడిప్రతిమలాంటి సరళ కనిపిస్తుంది.

# 25. నాడీజాతకం

ఆలోచనలు, ఆశలు యెక్కువగావుండి అసఫలత్వంలో మునకలు వేసేవారు ధైర్యాన్ని పూరించుకుని జ్యోతిష్కులసన్నిధికి చేరతారు. సంకల్పాలు ఒకటి రెండే అయినా విశ్వాసం సడలినపుడు గారిమేడలను నిలుపుకోనుకూడా జ్యోతిశ్శాస్త్రాన్నాశ్రయిస్తారు.

విజయ్‌కు పరీక్షలలో ప్యాసుకావాలనివాంఛ వుంది. అంతకు మించి ఖ్యాతితో విద్యార్థినాయకుడుగా పరిగణింపబడాలనివుంది. కాని ప్యాసుకానిదే ఆ స్థానంనిలువదనే భయంతో ప్యాసుకావాలని జపిస్తున్నాడు. వాటన్నిటికి అతీతంగా సరళప్రేమకు అంకితమైపోయాడు. అక్కడ తా నస్వాధీనుడై పోయాడు. ఆమెనుపొంది జంటగా వెంటత్రిప్పి చరిత్రాత్మకవిషయాలనెన్నో వినిపించాలని కోర్కె.

నిరాశలో ఆశను సృష్టించుకోకపోతే ముందుకు పోలేరు. తాను చదివింది లేదు. ప్యాసయ్యేది అంతకంటె లేదని తెలుసు. అయినా లక్ష్యంకొరకు మనస్సు వుపాయాలను వెదుకుతున్నది. ఎవరికీ తెలియకుండా శుక్రనాడీజ్యోతిషాలయానికి వెళ్లాడు. ఒకమారుగాదు అనేకమారులు జ్యోతిషులవారిని దర్శించాడు. వారు కోరినట్లు తన జన్మనక్షత్రము, వారికివ్వవలసిన ప్రతిఫలము సమర్పించుకున్నాడు.

జ్యోతిశ్శాస్త్రిలవారు తాళపత్రకట్టలను ముందుంచి బూజు దులుపుతూ, నేడు తాను క్రొత్తగా అంకణాలతో అంచనాలువేసి జరిగినవి, జరుగనున్నవి చెప్పబోవుటలేదని, వేలసంవత్సరాలక్రితమే శుక్రమహాఋషి వ్రాసిపెట్టిపోయిన అనేకుల జీవితసంగ్రహాలలో విజయ్‌ది వెదికి చదివి విపులంచేయు నిమిత్తమాత్రుడే తానని మొదలగు వివరాలు చెప్పినపుడు అయోమయుడయ్యాడు. ఎన్నో అనుమానాలను ప్రకటించాడు.

జనన విఘడియలో ఆయాస్థానాలలోవున్న రాసులనుబట్టి అంకణాల గుణకారంతో ఆ జీవితయోగాలను సవివరంగా చెప్పగలుగుట

శాస్త్రీయవిధానమని, మహాపురుషులు తమయోగబలంతో అనేకజీవిత గాథలను ఆ రూపంగానేఅతితేలికగా దివ్యదృష్టితోచూసి వ్రాయగలిగారని, పూర్వజన్మపుణ్యఫలితాలున్నవారి జీవితసంగ్రహాలే ఆ విధంగా వ్రాయబడివుంటవని వినినపుడు మరింత ఆశ్చర్యంలో మునిగిపోయాడు.

వేలసంవత్సరాల తరువాత వుద్భవించే కొందరివ్యక్తుల జీవిత సంగ్రహాలను ఆ ఋషులు యెలా వ్రాయగలిగారు. కోట్లజనాభాలో ప్రత్యేకించి కొందరిజీవితాలనే యెందుకు యెన్నుకునివుంటారు. దేవుడులేడు. పునర్జన్మ లేదు అని ప్రగల్భాలుగొట్టే వారికేమి చెప్పగలరు? మొదలగు అనేకప్రశ్నలు తర్కించాడు.

రాత్రి పగలు రావటానికి, అమావాస్య పౌర్ణమి యేర్పడటానికి, మేఘాలుగర్జించి వర్షాలు కురవటానికి, గ్రహకూటమి ప్రకృతిసిద్ధస్వభావాల్లో, దేవుడనేవాడు వున్నా లేకపోయినా వాటికార్యక్రమానికి మార్పెలా వుండదో అదేరీతి ఆ యా గ్రహాలస్థానాలను, స్థానమార్పులనుబట్టి గణిత ప్రయోగాలలో తయారుచేసే ఫలితాలసంగ్రహమని, మహాఋషులు వారి పరిశోధనాత్మకఫలితాలుగా యేదో ఒక ఘడియను యెన్నుకుని, ఆ ఘడియలో రాసులున్న స్థానాలనుబట్టి ఫలితాలఅంకణాలుచేసి వివరించుచేనని, ఆ యెన్నుకున్న ఘడియనుంచి ఒక్కొక్కజీవితసంగ్రహాన్ని రచించారని వివరాలు చెప్పబడినవి.

జీవితంలో పెద్దరహస్యాన్ని అర్థంచేసుకున్నట్లు తోచింది. భారత ప్రాచీనవిజ్ఞానాన్నిగురించి గర్వంగా తలంచాడు. ఇంత విజ్ఞానజాతికి వారసుడైన తానుకూడా విజ్ఞానవేత్తఅయినట్లు పులకితుడై పొంగిపోయాడు. శ్రీరామచంద్రుడు జన్మించకముందే సంపూర్ణరామాయణం రచించిన వాల్మీకిమహాముని యీ విధానంతోనే వ్రాసివుండవచ్చునని, ఆ విధంగానే తనచరిత్రనుకూడా శుక్రమహాఋషి రచించాడేమోనని, అందులో యేమేమిఘట్టాలున్నవో తెలుసుకోవాలని, తన భాగస్వామినిగా సరళనే నిర్ణయించివుంటాడని, తనకున్నఖ్యాతి పెరిగి పెద్దదయ్యేవిషయము, యెన్నికలలోనిలిచి యేనాటికైనా విద్యాశాఖ మంత్రి కాగల యోగముందో లేదోనని మొదలగు ఆలోచనలలో వుక్కిరిబిక్కిరయిపోతున్నాడు.

తాను విద్యామంత్రిగావస్తే యెవరిని యేవిధంగా గౌరవించాలో, యీ ప్రాణాంతపరీక్షలను యెలా సంస్కరించాలో వూహ జేస్తున్నాడు. క్లాసుల్లో మస్తరుపుస్తకాలు లేకపోతే బావుంటుందనిపించింది. పాఠ్య పుస్తకాలలోని అనేకపాఠాలను నిషేధించాలనుకున్నాడు.

కాని జాతకం వేరువిధంగా వచ్చింది. సంస్కృతభాషలోని ఆ తాళపత్రమందున్న తన జీవితసంగ్రహాన్ని జోస్యులవారిద్వారా ఆంధ్రీక రించుకుని వ్రాసుకున్నాడు. దశలవారీగా వ్రాసుకున్నప్రతి 600 పేజీలు తయారైంది. అందు గతాన్నంతాపోల్చుకుని సరిజేసుకుంటుంటే సరి పోతున్నది. 9 మాసాలక్రితమే శనిమహర్దశ ప్రారంభమైనట్లు, పది సంవత్సరాలపాటు మహాయోగాన్నివ్వ నున్నట్లు, శనిదశ ప్రారంభిం చిన సంవత్సరానికే విదేశయాత్ర యోగమున్నట్లు, జ్ఞానసముపార్జన నిమిత్తం వెళ్ళి అఖండఖ్యాతిని ఆ దేశంలోనేపొంది గొప్ప స్వాగతాలతో మాతృభూమికి వచ్చునట్లు అందున్నది. ధనయోగ మంత విశేషమైంది గాదని, ఆ కొరతద్వారా బాధలురాకుండా యెప్పటికప్పుడు ఆదుకునే ఆత్మీయులు ప్రాప్తించుట తథ్యమని, విదేశయాత్రద్వారా మహాయోగ దశ ప్రారంభమవుతుందని అందున్నది. తనకోర్కెమేరకు ధనుర్లగ్న జాతకురాలైన ఒక సుకుమారసుందరితో వివాహం జరుగుతుందని, ఆ వివాహం విదేశయాత్ర అనంతరమే జరుగుతుందని, యాత్రకుముందు వివాహంజరిగితే అనర్థాలకుగురియై యాత్ర స్థగితమవుట, జీవితమే మారిపోవుట, రాణింపుకురాకపోవుట తథ్యమని సుస్పష్టరీతిలో వ్రాయ బడివుంది. అందు తనపేరు, తలిదండ్రులపేర్లుకూడా వివరంగా వ్రాయ బడివుంది. తన తలిదండ్రులు గొప్పవారైనట్లు, వారిపుణ్యఫలంలోనే తాను మంచియోగంతో జన్మించినట్లు తెలుసుకున్నపుడు మలయమతి యెడల ప్రేమోద్యుల్లత శరీరమంతటా పరువులెత్తింది.

తనకాబోయే సతివిషయంకూడా అందులోవున్న విషయాలను చదివి అనేకవిధాల ఆలోచనలు చేశాడు. ధనుర్లగ్నజాతకుల రూపు రేఖలు, స్వభావము మొదలగువిషయాలు జ్యోతిశ్శాస్త్రివారినడిగి వివ రంగా తెలుసుకున్నాడు. ఆ తెలిసినవిషయాలను సరళకు పోల్చుకుంటే

ఆమెగానే రూఢిఅయింది. కాని తనవిదేశయాత్ర అనంతరమే వివాహ యత్నం జరుగుతుంది. ఈ విషయం మనస్సులో మెదిలినపుడు చాలా బాధ గలిగింది. సరళనువిడిచి అంతకాలం తానెలా గడపటం! ఆమె యెంత బాధపడుతుంది! ఆ విషయాలు ఆలోచిస్తుంటే హృదయం దడ దడ కొట్టుకుంటున్నది. అయినా జాతకంలోని రాతను తప్పుకొనుట యెవరికి సాధ్యం! అనిపించింది. కాని తన పరీక్షాఫలితాలు వివరంగా అందులో లేవు. ఆ విషయమే వెనువెంటనే తెలియవలసింది. ఆ తాప త్రయంతో బాధపడవలసినపని లేకుండా విదేశయాత్రతో తన జీవిత అంతస్తే మారిపోతుందని వున్నందుకు సంతృప్తి కలుగుతున్నది. తను మహానాయకుడయ్యేయోగం వుండబట్టే నాందిగా తాను విద్యార్థిలోకంలో అధినేతగా ఆదరింపబడ్డాడు, పూజింపబడ్డాడు. కోర్టుద్వారా తాను ప్యాసయిననాటినుంచి జరిగిన చరిత్రను నెమరువేసుకుంటుంటే జాతకం లోని వివరాలన్నీ దృఢమై ఆనందాన్నిస్తున్నవి. విదేశాలలోనే తాను ఖ్యాతినిపొందుట యెంత విశిష్టవిషయం!

విజయ్ జ్యోతిషాలయంనుంచి యింటికిచేరి మలయమతి ప్రక్కగా కార్పెట్‌మీద కూర్చుని ఆమెముఖంవైపు దీనంగా చూస్తు న్నాడు. ఆమె వక్కపలుకును నమలుతూ, ఆకుమీద సున్నం పూసుకుంటూ "ఏం బాబూ?" అని ప్రశ్నించింది. విజయ్ తనవద్దకు ఆ విధంగా వచ్చుట ఆశ్చర్యంగానే వుంది. అయినా ఆమెలోని నిండుతనం తొణకలేదు. విజయ్ ఆమెపాదాలను అంటి శిరస్సును వాల్చివేశాడు.

మలయమతిమనస్సు క్షణంపాటు వెలవెలబోయింది. ఆతనిశిర స్సును బాహువులలోకితీసుకుని స్పృశిస్తూ "ఏమిటి నాయనా, ఏమి జరి గింది?" అని బరువుకంఠంతో ప్రశ్నించింది. ఆమె అరచేతులను ముఖానికేసి అదుముకుంటూ "నీవు చాలా గొప్ప పుణ్యసంపన్నురాల వమ్మా" అన్నాడు. ఇది ఆమె కర్థంగాని అసందర్భపుసంభాషణగా తోచి నది. అందు కామె యివ్వగలసమాధానమూ లేదు, ఆలోచించవలసిన అవుసరమూ లేదు. తాను పుణ్యసంపన్నురాలో కాదో తానెలా నిర్ణ యించుకోగలుగుతుంది! నేడు ఆకస్మికంగా తనబిడ్డ వేసిన ప్రశ్న యెంత విస్మయాత్మకమైంది!

"తల్లిదండ్రుల పుణ్యఫలితంతో పుత్రుడు విఖ్యాతిసంపన్నుడవుట గొప్పవిషయంకాదా అమ్మా! నీ పుణ్యఫలితంతో నేను విదేశాలువెళ్ళి చదివి అఖండకీర్తిని పొందనున్నాను అమ్మా!" అన్నాడు.

ఆమె అర్థంచేసుకోగలిగింది. "ఈ విషయం యే సాధువు చెప్పాడు బాబు?" అని ప్రశ్నించినపుడు అతనిలోని ఉత్సాహం చల్లబడింది. ఆమె కెలా తెలిసివుంటుందా, అని యెన్నోవిధాల పరిశీలన చేశాడు.

"వెర్రిమొర్రిసాధువులు చెప్పేమాటలు నమ్మను, నేను పిచ్చివాడిని కాదమ్మా" అని ప్రేమవొలుకుమాటలతో అన్నాడు.

"నన్నుగురించి నేడు క్రొత్తగా తెలుసుకున్నావేమిటి?" అంటూ ఆమె తాంబూళం వేసుకుంటున్నది.

చెప్పాలనుకున్న విషయాలను చెప్పకుండానే "తరువాత చెబుతాలే అమ్మా" అంటూ లేచి వెళ్ళిపోయాడు.

గదిలోకివెళ్ళి స్థిమితంగా తన జాతకకథ ప్రతిని తిరుగవేస్తూ గడిపాడు.

పరీక్షలు జరిగిపోయినవి. పరీక్షలకుముందు కనీసం పాఠాలన్నిటినీ ఒక్కమారైనా చదివి అదృష్టాన్ని పరిశీలించాలని ప్రయత్నించాడు. ప్యాసయ్యే అదృష్టంకొరకు కలలుకంటూ పేజీలను తిరుగవేశాడు. కాని తీరా ప్రశ్నాపత్రం చేతికందినపుడు అంత తేలిగ్గా కనిపించలేదు, తనకు తెలిసిన ఒకటిరెండు ప్రశ్నలకే సమాధానాలు కాగితాలన్నిటిలోనూ నింపి వదిలాడు. ప్యాసుకానని దృఢనిర్ణయంచేసుకున్నాడు. కనుకనే అవుసరమైన చోటల్లా పరీక్షాఫలితాలకు ప్రాధాన్యత నివ్వకుండా విజ్ఞానవికాస సముపార్జన విధానాలను యోచిస్తున్నాడు. దేశాటనము, విదేశాలలో సంచరించుట ఆద్వారా ప్రాప్తించే విజ్ఞానము, అవసరమైతే గొప్పగొప్ప డిగ్రీలనుసైతం విదేశాలలో తేలిగ్గా పొందగలిగేవిధానాలను ఆలోచిస్తున్నాడు.

సరళ రవిప్రసాద్ లుకూడా పరీక్షలలో బాగానే వ్రాశామంటున్నారు గాని ఫలితాలు తొందరగా ప్రకటించకపోతే బాగుండుననుకుంటున్నారు.

"ఈసారికూడా నీవు ప్యాసుగాకపోతే నేనుకూడా తప్పుతాను సరళా" అంటాడు రవి.

"నేను తప్పి నీవు ప్యాసవుతావనుకో, తప్పించమని యెవరిని ప్రార్థిస్తావు" అని సరళ అంటుంది.

"నేను తప్పినట్లే పరిగణించి తిరిగి నీతోపాటుగానే వుంటాను" అంటాడు రవి.

"నేను ప్యాసయి నీవు తప్పితే యేమిజరుగుతుందో చెప్పు?" అని ఆమె ప్రశ్నిస్తుంది.

"అలాజరగను వీలులేదు. ఏదిజరిగినా యిద్దరకు ఒకటే జరుగుతుంది" అని నొక్కి దృఢంగా పలుకుతాడు. అతని అజ్ఞానానికి అమాయకత్వానికి తనలోతానే పశ్చాత్తాపపడుతుంటుంది.

తీవ్రమైన యెండాకాలమంతా గడిచిపోయింది. పరీక్షాఫలితాలు ప్రకటింపబడినవి. విజయ్‌కుమార్ తప్పినవిషయం తెలిసినపుడు విద్యార్థులందరికి నిరుత్సాహం కలిగింది. కొందరికి వుత్సాహము కలిగింది. ఇంత ప్రతిభగలవాడు, తమకు యేకైకనాయకుడుగా మెలిగినవాడు, అందరిలో ఆదరంగామెలిగే సహృదయుడు తప్పినందుకు బాధగలిగింది. విజయ్ ప్రజ్ఞావంతుడుగనుక సమర్థయోధుడుగనుక తనను తప్పించినందుకు పరీక్షాధికారులమీదపడి కోర్టులద్వారానో మరోరీతిగానో చెండాడుతాడుగనుక వాళ్ళ చాదస్తము, గర్వము, పిసినారితనము యీసారితో అడుగంటుతుందని కొందరికి ఆనందము గలిగింది.

రవిప్రసాద్ సరళలుకూడా తప్పారు. తాను కోరినట్లే యేది జరిగినా ఒకటే జరిగిందిగనుక రవి ఆనందపడ్డాడు. విచారమే కలుగలేదు. దినపత్రికలోచూసిన ఆ విషయాన్ని ప్రథమంగావెళ్ళి తానే సరళకు తెలియజేశాడు. మహాపండితులుగా నేడు పూజింపబడుతున్నవారిలో అనేకమంది ఆరోజులలో తప్పినవారేనని, అందుకు సిగ్గుపడాల్సిన పనిగాని, విచారపడాల్సినపనిగాని లేదని ధైర్యాన్నికూడా చేకూర్చాడు.

కాని సరళ క్షణపాటు దిగాలుపడిపోయింది. బాగా చదివి ప్యాసు కావాలని అనేకమారులు నొక్కిచెప్పిన విజయ్‌మాటలు కలవరపెడుతున్నవి. తాను ప్యాసుకానందుకు ఆయ నెంత నిరుత్సాహపడతాడోనని ఆమె అంతర్గతంగా వ్యధచెందుతున్నది.

పరీక్షాఫలితాలు ప్రకటనజరిగి పదిరోజులు గడిచిపోయినవి. విజయ్ తప్పినట్లు సరళకు, సరళ తప్పినట్లు విజయ్‌కుకూడా తెలిసినపుడు అన్నివైపులనుంచి మనస్సులు తేలికపడిపోయినవి. ఆ తరువాత లేఖలద్వారా సమయనిర్ణయము స్థలనిర్ణయము చేసుకుని విజయవాడలో కలిశారు.

జీవితపువిలువలను నిర్ణయించేది కేవలం యీ పరీక్షలుకాదని, పరీక్షలలో ప్యాసయితే పొందేది అమాయక ఆత్మతృప్తితప్ప కలిగే గొప్పఫలితాలేమీ లేవని, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో విజ్ఞానవికాసంపొంది మహోన్నతస్థాయికి చేరగల మార్గాలనేకమున్నట్లు గొప్ప వుపన్యాసాన్ని వల్లించాడు విజయ్. సరళ కిపుడు ఆయనభావాలస్థాయి చాలా వున్నతంగా గనిపించింది. మాటలు పొందికగా తోచాయి. అయినా తప్పాడు. అంతకుమించి యేదో వున్నదంటున్నాడు. కాంగ్రెస్‌పార్టీ సెలక్షన్లలో సీట్లురాని నాయకులవలె నిరాశలోని ఆశను విశిష్టరీతిలో వివరిస్తున్నాడు. తానుకూడా తప్పిందిగనుక ఆ మాటలలో తెలియని తీయదనం గనిపిస్తున్నది. పరిష్కారమేమిటో తెలుసుకోవాలని తహతహలాడుతున్నది.

ఆతరువాత అనేక కుశలప్రశ్నల అనంతరం నాడీజాతకాలవిధానము, వ్రాసినవారినిగురించి, యెన్నివేల సంవత్సరాలనాడు వ్రాసి పదిలపర్చిపోయినది, అవి యేరూపంగా లభ్యమవుతున్నది, యెక్కడెక్కడ యేరూపంలో ఉన్నది, యేరీతిలో వాటిని తెలుసుకోవలసింది మొదలగు వివరాలను తన ఊహాశక్తినంతటినీ ధారవోసి వివరించాడు. రాజకీయ నాయకుని యెన్నికలవుపన్యాసం వింటున్న శ్రోతలవలె వింటున్నది సరళ.

తరువాత తనసంచిలోని జాతకవ్రాతప్రతిని తీసి కొన్ని ముఖ్య ఘట్టాలు చదివి వినిపించాడు. జరిగిపోయిన జీవితంలోని తన ఘట్టాలను సరిజూపి యదార్థాలుగా నిరూపించాడు. తరువాత తన విదేశయాత్రా ఘట్టాన్ని, వివాహసంబంధం ఘట్టాన్ని చదివి వినిపించినపుడు ఆమె విస్మితురాలైంది. మనస్సులో భీతికూడా కలిగింది.

తన జన్మలగ్నం ఆమెకు తెలియదు. కాని ఆయన వర్ణించి పోల్చి చెప్పినపుడు తనది ధనుర్లగ్నజాతకమే అయివుంటుందని విశ్వసించింది. విజయ్ తను నిర్ణయించుకున్న విదేశకార్యక్రమమంతా విన్నపుడు ఆమె సుతరాము సమ్మతించలేదు. ఈ జాతకవ్రాతలంతా భ్రమ, వాటిలోవున్నవని, అలానే నడువాలని ప్రయత్నిస్తే వెర్రితనమవుతుందని చులకనజేసికూడా మాట్లాడింది.

విశ్వసించవలసినచోట విశ్వసించకపోవుట అవివేకమో చాదస్తమో అవుతుందన్నాడు విజయ్. లక్ష్యాన్ని సాధించుటకు పరీక్షలనుబట్టి ప్రాకులాడేకంటె శ్రేష్టమైన సోపానాలను నిర్మించుకొనుట వివేకమవుతుందన్నాడు. పరదేశం పోయినపుడు పరభాషాపాండిత్యం అనివార్యంగా వస్తుందని అమూల్య అనుభవం ప్రాప్తిస్తుందని, అవుసరమైన డిగ్రీలను అవలీలగా పొందవచ్చుని యెన్నోవిధాల వినిపించాడు. ఆయనధోరణి దృఢమవుతున్నకొలదీ ఆమె మౌనంవహించింది.

జాతకంలోవున్నది విధిగా జరుగుతుంది, కష్టమైనా సుఖమైనా అనుభవించక తప్పదన్నాడు. అవి పిరికిని ఆశ్రయించే మాటలన్నది. తను చెప్పినట్లు నడిస్తే ఆ జాతకమంతా ఒక మనోరంజన బూటకమని రుజువుచేస్తానన్నది ఆమె. ఆ తలంపు అజ్ఞానసూచక అహంకారమన్నాడు. విధినుంచి తప్పుకొనుట మహామహులకుకూడా సాధ్యంకాని విషయమని యెన్నోవిధాల వివరించాడు. తనను ప్రేమవలలో యిరికించి హృదయానికి కట్టివేసుకుని నేడు ప్రేమకే వాయిదావేసి తనను విడిచి విదేశాలకెళ్ళుట అసందర్భమైన విషయమని, అలా జరుగటానికి వీలు లేదని నొక్కి వక్కాణించింది. కోర్కెలను పెంచుకొనుట దుఃఖాన్ని కొనితెచ్చుకొనుటలాంటిదని, దురాశలతో దుష్ఫలితాలు పొందేవారే జ్యోతిషపరిశోధనలో పడతారని, అలాంటి అసందర్భాలవైపు పరువులెత్తక వెనువెంటనే యిక్కడ చేయదగినవిషయాన్నే నిర్ణయించేయమని కోరింది. దీర్ఘకాలయెడబాటును తలచుకుంటేనే హృదయం కంపిస్తున్నదని, అలాంటి విషాదభరిత యెడబాటును కలిగించవద్దని వేడుకుంటూ పాదాలమీద వాలిపోయింది.

విజయ్ దృఢసంకల్పం గలవాడు. చలించుటకుబదులు యింకా

దృఢపడ్డాడు. ఆమె యీరూపంగా నిరోధాన్ని ప్రకటించకుండా ఏకధారగా అశ్రువులనొలికిస్తూ అదురుతున్న అధరాలతో సమ్మతించిఉన్నట్లయితే విజయ్‌మనస్సు చలించిఉండేది. ఆమెకు యెడబాటుకాలేని బాధకలిగేది. మౌనంతోసహించే బాధలోని భరింపరాని దీన, సహనముయెదుట వారిని ఆకర్షించినంతగా తర్కబలప్రదర్శన ఆకర్షించదు.

విజయ్ సర్వశక్తితోను, అనునయంతోను ప్రయత్నించి లాలింపులతో ఆమెను ఒప్పించుటలో కృతకృత్యుడయినాడు. ఆమెచేతిని శిరస్సునుంచుకుని గొప్పగొప్ప ప్రమాణాలు చేశాడు. తనహృదయంలో ఆమె దివ్యమూర్తిని ప్రతిష్ఠించుకున్నానన్నాడు. అది చెరగని శాశ్వతమైనది అన్నాడు. ఆ మూర్తి ఆరాధనలోనే యెడబాటును గడిపివేయగలనన్నాడు. ఆమెలేకుండా తనజీవితమే లేదన్నాడు. ఆమె పాదపద్మాలను పదేపదే ముద్దిడుకున్నాడు. శిరస్సును హృదయానికిహత్తుకుని ప్రేమాశ్రువులను వక్షస్సుమీద కార్చాడు. ఆమెముఖాన్ని ముఖానికి వత్తుకుని రుద్ధకంఠంతో "సరళా! నీవు నాశరీర ప్రతిఅణువులో ప్రతిబింబిస్తున్నావు. నిన్ను మర్చిపోవుటగాని, యెడబాటుగాని నాకు సాధ్యంగాని విషయం. నే నశక్తుణ్ణి. కాని మనయిద్దరికలియకతో సామాన్యజీవితరంగాన్ని నడుపుట అమాయకత్వమవుతుంది. కనుక మనదాంపత్య భావివిశేషతకొరకు మనస్సును కట్టుదిట్టంజేసుకోక తప్పుటలేదు. ఒక లక్ష్యసాధనకొరకు మనస్సును రాయిచేసుకోవటం తప్పనిసరి. అలా చేయగలిగినపుడే విజ్ఞత ప్రదర్శితమవుతుంది. జీవితాలు ధన్యమవుతవి" అని ఆమెను తృప్తిపరచాడు.

# 26. విదేశయాత్ర

తప్పినందుకు సానుభూతితెలుపాలని కొందరు, తప్పి వూరుకునే ఘటంగాదు యేమి చేయబోతున్నాడో తెలుసుకుందామని కొందరు విజయ్యింటికి నిత్యము కాలేజివిద్యార్థులొచ్చి పోతున్నారు. వారందరికి యీ పరీక్షలు, కాలేజీలే విలువలేనివిగా వివరిస్తున్నాడు. పుస్తకాలపురుగులుగా రటనలతో ప్యాసయి డిగ్రీలుబొందివచ్చిన అమాయకకుర్ర వాళ్ళనే లెక్చరర్స్‌గా నియమిస్తారు యీ కాలేజీలలో, వారివద్ద వుండేది వారిరటనదప్ప చెప్పగలిగిందీ వుండదు, అనుభవము అసలేవుండదు. యదార్థానికివి సమర్పించేది రటనాయోగ్యతగల డిగ్రీలుదప్ప జ్ఞానం గాదని, యోగ్యత జాతకదశాఫలితాలువుంటే యూరప్‌లో తేలికగా కావలసినన్ని డిగ్రీలను పొందవచ్చుని చిన్న వుపన్యాసధోరణిలో చెబుతున్నాడు.

విజయ్ విదేశాలువెళ్ళేయత్నంలో నున్నాడని విద్యార్థులందరిలోను ప్రచలితమైపోయింది. విన్నవారంతా యెదుటబడి విశేషంగా స్తుతిస్తున్నారు. పెద్దవారు కొందరు కాలేజీచదువు పూర్తిజేసివెళితే బాగుండునని సలహాగా చెబుతున్నారు.

మలయమతిదగ్గర అనుమతిబొందటానికి నిత్యము యత్నంచేస్తున్నాడుగాని ఆమె యెదుటపడినపుడు యేరోజుకారోజు ధైర్యంసడలి తప్పించుకువస్తున్నాడు. తనసంకల్పం దృఢంగావున్నట్లు తెలిసినపుడు ఆమె నిరోధించదని తెలుసు. అయినా సంకోచం వెంటాడుతున్నది. ఆమెఅనుమతి పొందకపోయినా ప్యాసుపోర్టు ప్రయత్నాలన్నీ చురుకుగా జరిగిపోతున్నవి.

ఉదయం పదిగంటలసమయ మది. యువభాస్కరుడు మిసమిసలాడుతున్నాడు. శాల్మలీవృక్షదళాలు విసుగులేకుండా ఆడుతున్నవి. గోడకు అతికివున్నబల్లి ఏకదీక్షలో నున్నది. పంజరంలోని చిలుక ఏమిపలు

కాలో తెలియకగాబోలు బిక్కమొఖంతో చూస్తున్నది. వ్రేలాడుతున్న క్యాలెండరు పెండ్యులంవలె వూగుతున్నది. దొడ్డిగచ్చుఅంతా ధూళిని కప్పుకున్నది. రాలినవృక్షదళాలు గెంతులాట ఆడుతున్నవి. వేపచెట్టు మీదనున్న కాకులు పండినఫలాలను వెదికి భుజిస్తున్నవి. క్రిందరాలిన వాటిని యీగలు చప్పరిస్తున్నవి.

వంటశాలపని ముగించుకువచ్చిన బీబీజాన్ మలయమతిప్రక్కన కూర్చుని గోలీలవలె ఆమెచేసిపెట్టిన పిండితో అప్పడాలు వత్తుతున్నది. మలయమతిచేతుల కయిన నేతిని పిండికద్ది, విశ్రాంతిగాకూర్చుంటూ "వాడికి సగ్గుబియ్యపుఅప్పడాలంటే మహాయిష్టం" అన్నది.

"నాకూడా యివంటేనే యిష్టమమ్మా" అన్నది బీబీజాన్.

"వాడికిష్టమైనవన్నీ నీకూ యిష్టమంటుంటావు, పిచ్చిదానివి" అన్నది మలయమతి.

"బాబుతిన్నట్లే నేనూ మీచేతితోనే తిన్నాను,మీ పాలనలోనే పెరిగాను గనుక, వారికి రుచించినవన్నీ నాకు రుచిస్తవి అమ్మా" అని సమర్థించుకున్నది.

వెనుకగావచ్చిన విజయ్ తల్లిప్రక్కన కూర్చుంటూ "అమ్మా" అని అతి లోస్థాయిలో అన్నాడు. ఆ పిలుపులో హృదయాంతర్గతప్రేమ వుట్టిపడుతున్నది. మలయమతికి ఆశ్చర్యంగానేవుంది. యీరీతిగావచ్చి యిలా కలిసిమెలిసి తిరిగేరోజులు వెనుకబడిపోయినవి. తన కనుసన్నలలో తనఆజ్ఞలలోమెలగిన ఆ రోజులు మనస్సులోమాత్రమే గుర్తుగా వుండిపోయినవి. నేడు వ్యవహర్తగా, నాయకుడుగా స్వేచ్ఛతో తిరుగుతున్నాడు.

ఆకస్మికంగా రావటంలో గొప్ప కారణమున్నదని ఆమెకు తెలుసు. "ఏం బాబూ?" అన్నది.

సంకోచాలను సడలింపజేసుకుంటూ "చదువుకోను విదేశం పోవాలనివుందమ్మా" అన్నాడు.

"నీ ప్యాస్‌పోర్టు రావటానికింకా ఒకవారంపడుతుంది నాయనా" అని ముక్తసరిగా జవాబిచ్చినపుడు మ్రాన్పడిపోయాడు. తనతల్లి కూడా ఒక గొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్తేమోననిపించింది. నోరెత్తి మరోమాట

అడగగలశక్తికూడా లేకుండాపోయింది. ఎవరిద్వారానైనా వినికిడిగా విన్నమాటకూడా కాదు. తనప్లీడరుచెప్పిన విషయమే తల్లి చెబుతున్నది. ఆయనద్వారా తల్లికి కబురుతెలియదని తెలుసు. అయినా స్పష్టంగా టయింసహితంగా చెప్పింది. నిరుత్తరుడై వెళ్ళనుకూడా మనసొప్పలేదు.

ఎవరోనేర్పిన మాటలవలె "విదేశంవెళ్ళి చదువుకోను అనుజ్ఞ యివ్వు అమ్మా" అని ప్రశ్నించాడు.

ఆమె తీక్షణంగా చూస్తూ "నా సంప్రతింపులవలన కలిగే ఫలితమేముంది గనుక నా అనుమతికావాలి? నీకు యెలాతోస్తే అలానే చేయిబాబు" అన్నది.

"నీ అనుమతిలేందే నేను యెక్కడికీ పోనమ్మా" అన్నాడు చిన్నగా.

"నేను వద్దంటే ఆగుతావా?" అన్నది.

"నీఆజ్ఞలేకుండా యెలా వెళ్ళగలనమ్మా?" అన్నాడు.

"అయితే అనుమతిలేకుండానే ప్యాస్‌పోర్టుకు దాఖలుచేసిందెందుకు?" అన్నది.

"దాఖలుచేసినందువలన గొప్ప నష్టమేముంది! పోవచ్చు పోకపోవచ్చు" అన్నాడు.

"ఈదేశంలోలేని చదువులు, సందర్భపడని కోర్సులు చదువను విదేశాలు వెళతారుగాని యిక్కడ చదవలేక, ప్యాసుకాలేక మరోదేశంపోయి చదువాలనుకొనుట హాస్యాస్పదమవుతుంది నాయనా" అన్నది.

ధైర్యాన్ని కూడదీసుకుని "అన్నిషాపులలోను కావలసిన సరుకులన్నీవున్నా ప్రత్యేకించి వెతుక్కుంటూ యెక్కడోవున్న షాపుకు కొన్ని విశేషసౌకర్యాలనుకోరి వెళ్ళటలేదా అమ్మా! ప్యాసుకావటం కేవలం విద్యార్థిలోపమే కాదని కోర్టుతీర్పు రుజువుచేసిందిగదా!" అన్నాడు.

"నాయనా విజయ్! నాముందు యేవిషయాన్నయినా యెన్నడూ తర్కించవద్దని నాకోర్కె. నీవు యెటువెళ్ళినా, యేమిచేసినా అడ్డగించే తలంపు లేనేలేదు. ఎలా ప్రవర్తించినా కన్నతల్లి సదా బిడ్డక్షేమాన్ని

గోరుతుంటుంది. వాదవివాదాలతో పవిత్రమైనసత్యం బయటపడుతుం దనటానికి వీలులేదు. కొన్నివేళలందు తర్కవితర్కాలద్వారా పరమ సత్యాన్ని అవహేళనపర్చినట్లవుతుంది. నేను అనుమతించినా, అనుమ తించకపోయినా వెళ్ళాలన్న నీతలంపు నాకు విదితమేగదా!" అన్నది.

"నన్ను క్షమించమ్మా! నేను కేవలం డిగ్రీలకొరకువెళ్ళాలని కోరుటలేదు. జీవితంలో యేదో ఒక గొప్పలక్ష్యాన్నిసాధించుట అవు సరం. ఆవిధంగా జీవితాన్ని కృతార్థంచేసుకునేయోగం విదేశయాత్ర ద్వారా సంభవించనున్నట్లు నాడీజాతకంలో విపులంగా వ్రాసివుందమ్మా. అవి బ్రహ్మలిఖితంలాంటివైనపుడు, అందులోవున్నది గనుకనే విదేశ యాత్రకు సంసిద్ధుడనయ్యాను" అని వినిపించాడు.

ఆమె చిన్నగా మందహాసంచేస్తూ "పెద్దపెద్దవ్యవహారాలను నెత్తినవేసుకున్నా నీ హృదయంలోని పసితనమింకా మెదులుతూనే వున్నది విజయ్! ఏసాధువో చెప్పిన జ్యోతిషశబ్దాలు బ్రహ్మలిఖితాలని భ్రమించుట యెంత వెర్రితనం. ఎవరో ప్రాచీనతాళపత్రం తీసి చదివి చదివి చెప్పిన విషయాలకు దాసుడవై వాటినిపాటిస్తే అలానే జరుగు తుందని భ్రమించుట యెంత వెర్రితనం! జీవితంలో అన్నీ కర్మబద్ధమూ, యోగబద్ధమూ కావు. కొన్ని వుండవచ్చు. కాని జాతకంలో భిక్షాటన యోగమున్నదని మెడకు జోలితగిలించుకు తిరుగుట యెంతహాస్యాస్ప దమో గుర్తించు. జాతకంలో వ్రాసివున్నందువలన గాదు, స్థితిగతులు మారి వుపాయరహితమై గత్యంతరంలేక యాచనలోకి దిగవచ్చు. అలాంటి అనివార్యస్థితులవలన దుర్గతులు, గొప్ప వున్నతావకాశాలు లభిస్తుంటవి. ఏదిలభించితే దాన్ని అనుభవింపకతప్పదు గనుక వాటిని విధికృతమన్నా, జాతకఫలమన్నా తప్పులేదు. భవిష్యత్తును అక్షరాలా చెప్పగలిగినవారు యీలోకంలో యెవ్వరూ వుండరనునది నిర్వివాదము. ఈ జ్యోతిషవ్రాతలన్నీ తెలుసుకోవాలనిచేసే కృషిఫలితాలు మాత్రమే. మనుష్యజీవిత భవిష్యత్తును యథాతథంగా తెలుసుకోవటం యెన్నటికీ సాధ్యపడని విషయం. జాతకఫలితాలను సేకరించి గతాన్ని స్మరిస్తూ సరిపుచ్చుకుని ఆత్మతృప్తిని పొందుతారు. ఆ తరువాతకూడా కొన్ని సూటిగా సరిపోయినట్లు భ్రమనుపెంచి అఘాతంలో ముంచుతవి. భ్రమ

మానవునివెంటాడు పిశాచంలాంటిది. అందు కొందరు వ్యక్తిత్వాన్ని కోల్పోవటము, కొందరు వ్యక్తిత్వాన్ని పొందటము జరుగుతుంది. కనుక జాతకంలోవ్రాసివున్నదనే భ్రమతో విదేశయాత్ర పెట్టుకోవద్దని నాకోర్కె. ఇక్కడ బాగాచదివి ఆతరువాతకూడా చదివే వుత్సాహముంటే తప్పకుండా వెళ్ళు" అన్నది.

మ్లానతచెందినముఖంతో, దీనంగా "నేను మామూలుజాతకాన్ని బట్టి వూహచేయుటలేదమ్మా. నీవు దేవుణ్ణి విశ్వసించేదానివిగనుక చెబుతున్నాను. రామాయణంవ్రాసిన మహాఋషి వాల్మీకిని కాదనలేవు. ఆయన శ్రీరామచంద్రుడు జన్మించకముందే రామాయణంవ్రాసింది కాదనలేవు. ఆ కోవలోని అనేక మహామునులు వ్రాసిన నాడీజాతకంలోని విషయాలను విశ్వసించకపోవుట దేవుని పరిహసించినట్లవుతుందమ్మా—" అంటూ తనమనస్సులోని ఆలోచనలను యెన్నోవిధాల వినిపించాడు.

విజయ్‌చెప్పిన విషయాలనన్నిటిని విన్నాక "నాయనా! ఈ నాడీ జాతకవిశ్వాసంతో జీవితనాశనాన్నిపొంది అశాంతితో బాధపడేవిషయాన్నికూడా ఆ తాళపత్రంలోనే యెక్కడయినావుంచేమో యింకా వెదికించకపోయావా" అన్నది.

విజయ్ అభిమానం దెబ్బతిన్నదేమో, మారుమాటలేకుండా ఆమె పాదాలంటి లేచి వెళ్ళిపోయాడు.

అప్పడాలుచేస్తున్న బీబీజాన్ వీరిసంభాషణలు విని విస్మయమందుతున్నది. ఈ జాతకాలేమిటో, ప్రయాణాలేమిటో అర్థమవక అమాయకురాలివలె చూస్తున్నది.

విజయ్ వెళ్ళిపోయాక "నాడీజాతకమంటే యేమిటమ్మా!" అని ప్రశ్నించింది బీబీజాన్.

దిగమ్రింగుకుంటున్న విసగడతో "జాతకమంటె పిశాచి, నాడీ జాతకమంటె మహాపిశాచి. ఆ మహాపిశాచి వాడిని ఆవేశించింది!" అన్నది.

"విదేశయాత్ర యేమిటమ్మా?" అని తిరిగి ప్రశ్నించింది బీబీ.

"ఆ మహాపిశాచి వాడిని యేమేమిచేయిస్తుందో యెవరికితెలుసు!" అన్నది మలయమతి.

బీబీజాన్ ఆమెముందు మౌనంవహించింది. అప్పడాలు వత్తుతూనే వున్నది. కాని మనస్సు కళవళపడిపోతున్నది. చేసే ఆలోచనలు యెక్కడికక్కడ తెగిపోతున్నవి. స్వయంగా విజయ్‌నే అడిగి తెలుసుకోవాలని, అతను పొరపాటుగా జీవిత సర్వనాశనంవైపు తిరిగితే యెదుర్కొని తన ప్రాణాన్నయినావడ్డి అడ్డుపడాలని వివిధరీతుల విచారిస్తున్నది. విజయ్ తిరిగి యింటి కెపుడు చేరతాడా, ఒంటరిగా గదిలోవున్నపుడు, యేరూపంగా వినతిచేసుకోవాలో మననంచేస్తూ అప్పడాలు వత్తుతూనే వున్నది.

విజయ్ చాలా సందిగ్ధంలో పడిపోయాడు. తనతల్లి యింతగా నిరోధిస్తుందని యెన్నడూ అనుకోలేదు. తన అభిప్రాయాలను నిష్కర్షగా వెల్లడించింది దప్ప తన కార్యరంగాన్ని అడ్డుకోదని, డబ్బువిషయంలోకూడా అభ్యంతరపెట్టదని తెలుసు. అయినా ఏ జాతకంద్వారా తనతల్లియెడలగల భక్తి పెరిగి పెద్దదయిందో ఆ జాతకఆశయంతోనే దేవతామూర్తిలాంటి తల్లిని నిర్లక్ష్యంచేయుట భరింపరానిదిగా బాధిస్తున్నది.

లక్ష్యం అచంచలమైనదైనప్పుడు అడ్డంకుల మ్రింగివేస్తుంది. తల్లిఅభ్యంతరాలను త్రోసిపుచ్చుటగాదు విస్మరించి ముందుయత్నములలో మునిగిపోయాడు విజయ్. ప్లీడరుసహాయంతో ఆలస్యంలేకుండా ప్యాస్‌పోర్టు పొందాడు. ఆ ప్యాస్‌పోర్టురికార్డులో తనతల్లి అనుమతితోయిచ్చిన స్టేట్‌మెంటుకూడానున్నట్లు ప్రభుత్వఆఫీసులోని విషయం ప్లీడరుద్వారా విన్నపుడు విస్మయమందాడు. అంతగా నిరోధించిన తనతల్లి సమ్మతితో స్టేట్‌మెంటు యెలా యిచ్చిందో యెంత ఆలోచించినా తోచుటలేదు. తనతల్లి వుదారతకు తనలోతానే గర్విస్తూ తన సంకుచిత్వానికి తానే చిన్నబోతున్నాడు.

ప్యాస్‌పోర్టు సత్వరంగా చేతికి అందిన ఆనందంతో యింటికి వెంటనే చేరిన విజయ్ గదిలోచేరి ఆ ప్యాస్‌పోర్టును యెన్నోమారులు చదివి జాతకపుస్తకాలలో పదిలంజేస్తుండగా వెనుకగావచ్చిన బీబీజాన్ "విజయ్‌బాబూ! మీరు విదేశం వెళుతున్నారా?" అని ప్రశ్నించింది.

అవునని అస్పష్టధ్వనిలో చెప్పాడు. ఆమె అనేకప్రశ్నలు

వేసింది. విజయ్ విసగడలేకుండా ఆమెముందు అన్నివిషయాలను పూర్తివివరాలతో చర్వితచర్వణంగా చెప్పాడు. జాతకపుట్టుపూర్వోత్త రాలనుంచి తనవిషయంవరకు వివరంగా వర్ణించి చెప్పాడు. కాని ధను ర్లగ్నసంబంధవిషయంమాత్రం అతి మెలకువతో తప్పించివేశాడు.

"మీరు ప్రజలందరిచే పూజింపబడే గొప్ప యోగమున్నపుడు అది యెంత కష్టసాధ్యమైందయినా ఆ వైపుకేపోవుట మంచిది విజయ్ బాబూ" అన్నది.

అతను వుత్సాహతుడై ఆమెవైపుచూస్తూ "అయితే నీవు జ్యోతిషాలు నమ్ముతావా?" అని ప్రశ్నించాడు.

"ఆ విషయాలు నాకంతగా తెలియవు. మొన్న అమ్మగారు అంటున్నమాటలు విన్నాను. వారిమాటలే శిరోధార్యాలు. కాని మీరు గొప్ప ఖ్యాతివంతులవుతారని వున్నట్లు మీద్వారావింటుంటే నిష్కల్మషంగా నమ్ముతున్నాను. నమ్మబుద్ధవుతున్నది" అన్నది.

"అమ్మ నా యెడబాటును సహించలేక అలా అనివుంటుంది"" అన్నాడు.

"అమ్మగారు పవిత్రహృదయులు. మరుగునబెట్టి మాటాడుట వారికి చేతగాదు" అన్నది.

"అయితే నా ప్యాస్‌పోర్టుదరఖాస్తు యెంక్వయిరీకి వచ్చినపుడు అమ్మ సమ్మతిస్తూ యెందుకు వ్రాసియిచ్చింది?" అని ప్రశ్నించాడు.

"వారిది ఒకరిస్వేచ్ఛను నిర్బంధంగా అరికట్టేస్వభావం కాదు. మీకు వ్యక్తిత్వం వచ్చిందని తలంచి తనఅభిప్రాయాన్ని వినిపించింది. అంతవరకే" అన్నది.

"నేను విదేశాలువెళ్ళుట నీకు మనస్ఫూర్తిగా యిష్టమేనా బీబీ?" అన్నాడు.

"మీ యెడబాటును అమ్మగారెలా సహించలేరో నేనూ అంతే. అంతకు మిన్న. కాని మీరు గొప్పవారవుతారని వింటున్నపుడు తెలియనివూహలు, వాటిలోనే విశ్వాసము, ధైర్యము కలుగుతున్నవి" అన్నది.

అతనిజాతకంలో అతనువెళ్ళే విదేశాన్నిగురించికూడా వ్రాసి

వుంది. ఆ దేశంలో యెన్నినదులు ప్రవహిస్తున్నది. దేశవిస్తీర్ణము, ఆకారము వర్ణించబడివుంది. నామము రెండక్షరాలతోనే వుంటుందని కూడా వుంది. ఆ పరిభాషను పరిశోధించి అది ఫ్రాన్సుదేశముగా నిర్ణయం జరిగింది. అందువలనే అతను ఫ్రాన్సుకుపోవాలని సంకల్పించి ప్యాస్‌పోర్టుకు దాఖలుజేశాడు. తన దరఖాస్తులోకూడా జాతకంలోని విషయాలను ప్లీడరుద్వారా వ్రాయించాడు.

విదేశయాత్రకు సంసిద్ధమైనపుడు మలయమతి వివశురాలై ఆఖరి వినతిగా "నాయనా! విమానాలు యెక్కువగా ప్రమాదాలకు గురియవుతుంటవి. కనుక నీవు ఓడలో ప్రయాణంచెయ్యి" అంటూ కోరింది.

"మృత్యువు ఆసన్నమైనపుడు యెక్కడ యేరూపంలోవున్నా అంతంగాక తప్పదమ్మా! ఎన్నోరోజులు సముద్రాలమీద బాధలుపడే కంటే సునాయాసంగా చేరేవిధానాన్ని యెన్నుకొనుట మంచిది" అని చెప్పాడు.

విజయ్ హైద్రాబాద్‌నుంచి విమానంలోబయలుదేరి పారిస్‌చేరాడు. కాని తనను ఆహ్వానించటానికివచ్చినవారు ఒక్కరూలేరు.

సంచి చంకకుతగిలించి బెడ్ చేతబట్టి వెళుతున్నవారి ననుసరించాడు. తనదేశస్థు లెవరూ తనతో దిగినవారు లేరు. అక్కడ కనిపించిన వారు లేరు. ఏరోడ్రోంకస్టమ్స్ ఆఫీసులో గంటవరకు నిరీక్షణలో వుండవలసివచ్చింది. తనను ప్రత్యేకించి నిర్లక్ష్యంగానిలిపి, వచ్చినవారిని వచ్చినట్లు పంపుతున్నందుకు మనస్సు నొచ్చుకొనుటలేదు. తననుతాను మర్చిపోయి ప్రతిఒక్కటి వింతగాచూస్తూ నిలిచిపోయాడు.

ఆఖరిలో తీక్షణపరిశోధన తరువాత ప్యాస్‌పోర్టులోని వివరాలు నోట్‌చేసుకుని అనేకప్రశ్నలనంతరం బయటకు పంపించబడ్డాడు. బయటకువచ్చిన ప్రతివారికి స్వంతకారుగాని, టాక్సీగాని ముందువచ్చి నిలుచుట అందు వెళ్ళిపోవుట జరుగుతున్నది. కాని విజయ్ అక్కడ నిలిచినపుడు వాహనాలకుబదులు ప్రశ్న లనేకంగా వచ్చి ముందు నిలుస్తున్నవి. ఎక్కడికి వెళ్లాలి, అనే దొక భయంకరప్రశ్నగా తోచింది. రెండు ఫర్లాంగులు ముందుకునడిస్తే ట్రాఫిక్‌రోడ్ కనిపిస్తున్నది. ఎవర్ని ఏమి అడగను మనస్కరించలేదు, ధైర్యములేదు. ముందుకు నడిచాడు.

మహానందాన్నిగొలిపే ప్రకృతిసౌందర్యంకూడా అర్థంగానంత నూతన శోభలతో ఎన్నడూ వూహించనిరీతిలో కనిపిస్తున్నది. పృథ్విలోని అంగుళంమేర వృధాపోని ఫలవృక్షాలతోను, పైర్లతోను, పుష్పగుచ్ఛాలతో నిండిన శృంగారవృక్షాలలోను నిండివున్నవి. పైర్లు, వృక్షాలులేని చోట హరిత్శ్చాదితభూమి మరింత ముద్దుగావున్నది. దానిమీదదొర్లితే పాన్పులకుమించిన హాయినిస్తుందనిపించింది. స్ఫటికపలకంతో తీర్చి దిద్దినట్లున్న ఆ రోడ్డుమీద అడుగులువేస్తుంటే తనబూటుగుర్తులు పడి మాసిపోతుందేమోననిపిస్తున్నది.

ట్రాఫిక్‌రోడ్‌మీద వచ్చేపోయేబస్సు లనేకం. ఆ బస్సులమీద వ్రాసివున్న పేర్లు అన్నీ తన కపరిచితమైనవి. పారిస్‌లోని యే ప్రాంతానికి వెళ్ళవలసింది తన కసలు తెలియదు. ఏ బస్సుయెక్కాలో అంత కంటె తెలియదు. నిర్ణయంలేని ఆలోచనలుచేస్తూ, దిక్కులను పరికిస్తూ ప్రక్కనున్న బస్‌స్టేజికి చేరాడు. ఒకరిద్దరెవరో నిలిచారు. వారెక్కడికి వెళ్ళేవారో తెలుసుకోగలశక్తి లేదు. ఏదిఏమయినా పట్టణంవైపునకిచే బస్సులో యెక్కాలని నిర్ణయించుకున్నాకకూడా నాలుగుబస్సులు వెళ్ళి పోయినవి. తీరా బస్సువచ్చాక తడబడుతూ అక్కడే ఆగిపోయాడు.

కూడదీసుకున్నధైర్యంతో ఒకబస్సు యెక్కాడు. కాని యెక్కడి వరకని చెప్పగలడు! ఎండుకుపోయిన భీతికంఠంతో 'పారిస్' అనే చెప్పగలిగాడు. కండక్టరు జాలితో అనేకప్రశ్నలు వేశాడు. కాని ఒక్కటీ తెలియలేదు. అతనిలోని సానుభూతిమాత్రం అర్థమవుతున్నది. కండక్టరు యేమినిర్ణయించాడో ఒకటిక్కెట్టును, చిల్లరను చేతిలోపుంచాడు. గొప్ప చిక్కుసమస్యనుంచి బయటపడినట్లయింది విజయ్‌కు. మనస్సు స్థిమితపడింది. నిర్ణీతమైనచోటికెళుతున్నట్లు తోచింది. బస్సులోని ప్రతిఒక్కరిని పరిశీలనగా చూస్తున్నాడు. తాను తనదేశంలో చాలామంది ఇంగ్లీషువారిని చూశాడు. వారికంటె వీరిపోలికలు అందమైనవనిపించింది. వారిది తెలుపురంగయితే వీరిది తేరిపోయిన కెంపు రంగనిపించింది. వారికంటె వీరిశరీరాలే నాజూకుగా తోచినవి.

బస్సు అనేకచోట్ల ఆగుతున్నది. దిగేవారికంటె యెక్కేవారి సంఖ్య పెరుగుతున్నవి. ఒకచోట అకస్మాత్తుగా కండక్టరు చేయితట్టి

దిగమని ఇంగ్లీషులో స్పష్టంగా అన్నాడు. ఆ స్పష్టమైనశబ్దం విన్నపుడు తెలుగువిననట్లే వుంది. వెంటనే తనసామానుతో దిగిపోయాడు. ప్రక్కగావెళ్ళి నిలిచి చూశాడు. మహాపర్వతపంక్తులమధ్యనున్న లోయలోనున్నట్లు గనిపించింది. రోడ్డు విశాలమైంది. కాని యిరు వైపులనున్న భవనాల అంతస్తులను ఒక్కటొక్కటిగా లెక్కవేసుకో వలసివస్తున్నది. గగనంలో బారులుతీరి నిశ్శబ్దంతో గాలిని కోసుకుపోవు పక్షులవలె రోడ్డుమీద కారులు నడుస్తున్నవి. ఆప్రక్క అటుపోయేవి, యీప్రక్క యిటుపోయేవాటికి అంతులేదు. కాని అంతట్రాఫిక్కులో కూడా హారన్లు వినిపించుటలేదు. శబ్దం లేకుండా ట్రాఫిక్‌జరుగుట ఆశ్చర్యంగా తోచింది. సుశిక్షణతోగూడిన సక్రమబద్ధనడవడి వారిలో యెంతగా అలవడిందో ఆ చిన్నివిషయంలోనే అర్థంచేసుకోగలుగు తున్నాడు. రోడ్డుప్రక్కల నడిచివెళుతున్నవారిలో స్త్రీలను చూసినపుడు ప్రతిఒక్కరిమీద తన స్నిగ్ధదృక్కులను బరపి నొచ్చుకుంటున్నాడు. వారు నడుస్తున్నందుకుగాదు. తీర్చిదిద్దిన ప్రతిమలలాంటి ఆ ముఖాలు అరుణకాంతులతో రోజాపుష్పాలవలె వికసిస్తూ బింబాఫలసమాన ఆ ముఖాలను తనదేశపు స్త్రీ దుస్తులమధ్యవున్నట్లు వూహిస్తున్నపుడు అద్భుతమై శోభిస్తున్నట్లు తోస్తున్నది. గిరజాలతోధరించిన గౌనుతో, హైహీల్డ్ బూటుతో తమ చిందించేఅందాలను వికృతంచేసుకున్నందుకు జాలి కలుగుతున్నది. వారిముఖాలలోని కోమలత్వంచూసి తన్మయత్వం చెందుతున్నాడు. కనిపించిన ప్రతిస్త్రీని సరళ ధరించిన ఆ జరీచీరె, మఖమల్‌జాకెట్టు ధరింపచేస్తే యెలావుంటుందో పోల్చుకుంటున్నాడు. ఆవిధంగా తనను తాను మరిచి యెంతసేపున్నాడో తనకే తెలియదు.

189

# 27 ప్రవాస జీవితం

కొండజాతులలోని బాలకుడు తప్పిపోయి పట్నంజేరి భయభీతులతో బెదిరిపోయినట్లు విజయ్ సడలిన ధైర్యంతో తప్పటడుగులతో రోడ్డువెంట పయనంచేస్తున్నాడు. ఎవరిని ప్రశ్నించను ధైర్యం చాలుటలేదు. పోతూ వస్తున్నవారిలోని సంభాషణలో ఒక్కమాటకూడా అర్ధమవుటలేదు. వారిముందు తన భాషలూ వ్యర్ధంగాదోచింది. తల్లి జెప్పిన మాట లొక్కొక్కటిగా గుర్తుకొచ్చి పశ్చాత్తాపంతో పరితపిస్తున్నాడు. ఎక్కడికక్కడ నిలిచి నలువైపుల చూస్తూ ఆశ్చర్య పడిపోతుంటాడు. హోటలుకు చేరాలని, సేదతీర్చుకుని ఏదైనా పాఠశాలను తెలుసుకుని విచారించి వివరాలు తెలుసుకోవాలని వాంఛ. కాని అది తెలుసుకోగల ధైర్యంలేక వెతుక్కుంటూ బజారున బోతున్నాడు. హోటలు కనిపించినప్పుడు ప్రవేశంవరకు వెళ్ళి లోపలున్న వున్నతస్థాయినిచూసి విస్తుపోతూ వెనుదిరుగుతున్నాడు.

విజయ పారిస్‌చేరి నాలుగురోజులు గడిచిపోయినవి. పెద్ద ప్రయాసతో ఒకచిన్న యింగ్లీషు హోటలులో చేరాడు. ఆ హోటలు యజమాని తండ్రి ఆంగ్లేయుడు. లండనునుంచి పారిస్, పారిస్‌నుంచి లండను దొంగ సామాను జేరవేసే వ్యాపారంలో తిరుగుతూ ఒక పారిస్ వనిత ప్రేమలో మునిగి పారిస్‌లోనే నిలిచిపోయాడు. గడించినదాంతోనే తృప్తిపడ్డాడు. కొంతకాలానికి లండనునుంచి వచ్చి పారిస్‌లో వుద్యోగం చేసుకుంటున్న ఒక మిత్రుడు తటస్థపడి తన యింటిలోనే మకాంపెట్టాడు. ఆ మిత్రుడు తన జీతంలోని కొంతభాగాన్ని భోజనఖర్చులు వగైరాలక్రింద యిస్తుండేవాడు. ఆరూపంలోనే మరో మిత్రుడుకూడా జేరి ఖర్చులక్రింద కొంత యిస్తుండేవాడు. ఇలా అతని యిల్లు ఒక 'డిక్'గా (పేయింగుగెస్టులను అనుమతించే యిల్లుగా) తయారయింది.

ఆ డిక్ యజమాని పుత్రుడు నెపోలియన్ బోనాపార్టు వీరత్వం కార్యదీక్ష, బుద్ధికుశలత వింటున్నప్పుడు, తాను ఆ నెపోలియన్ వార

సుడే అయినట్లు. ఫ్రెంచిభాషే తన మాతృభాషగా గర్విస్తాడు. ఆ నెపోలియన్ బోనపార్టే స్వార్థంతోను బంధుప్రీతితోను మెలిగి నిజసోదరుల ద్వారానే ద్రోహంపొందిన విషయం విన్నప్పుడు "ఫ్రెంచి జాతిలో వ్యక్తిగత స్వార్థం యెక్కువ. బంధు ప్రీతి యెక్కువ. మా ఆంగ్ల జాతి దేశక్షేమాన్ని జాతిక్షేమాన్ని కోరుతుంది. బంధుప్రీతిలో స్థానాన్ని తప్పే అలవాటులేదు. స్వేఛ్ఛాపూరిత వ్యక్తిత్వం కొరకు సూర్యాస్తమయంగాని మహాసామ్రాజ్యాన్ని త్యజించిన విండ్సర్ ప్రభువులాంటివాడు ఫ్రెంచి చరిత్రలోనేలేడు." అని తాను ఆంగ్లేయుడయినట్లు మాట్లాడుతుంటాడు. అందుకే అతను లండన్ పారిస్ సమ్మేళనా ప్రతిబింబము.

ఆంథోనీ తన డిక్‌ను హోటలుగా రూపొందించాడు. అదొక హోటలుగాగాక వుండేవారికి గృహ వాతావరణంగా తోస్తుంటుంది. చదువు సంగతెలావున్నా విజయ్‌కు కొంత సౌకర్యం కలిగినందుకు ఆనందపడుతున్నాడు.

ఆంథోనీకి ఫ్రెంచిభాషలో పరిచయమున్నట్లు ఆంగ్లంలోనూ వుంది. కాని ఆయన వుచ్చారణలో రెండూ ఒకటిగానే వినిపిస్తావి విజయ్‌కు. తాను చెప్పిన విషయాలను ఆంథోనీ అర్థంచేసుకో గలుగుతున్నాడుగాని తనకు ఆయన మాటలు అగమ్యంగా వుంటున్నవి.

ఆంథోనీ హోటల్లో వుంటూనే నిత్యము పట్టణంలోని అనేక ప్రాంతాలకు తిరుగుతున్నాడు. ఒక చర్చిలోని ఫాదరుతో పరిచయం చేసుకున్నాడు. ఆయన మాటలనుకూడా అర్థంచేసుకోవటం కష్టమే. పారిస్‌లోని చర్చి లన్నిటిలోను ఆయనొక్కడే ఆంగ్లము తెలిసినవాడు. పాశ్చాత్య భాషలన్నింటిలోను పాండిత్యమున్నవాడు, లాటిన్‌లో గొప్ప పండితుడు. విజయ్ చెప్పే మాటలను అర్థంచేసుకో గలిగినా, వివరంగా వ్రాసి యివ్వమని తాను ముందు ఒకకాగితం మీద స్పష్టమైన అక్షరాలతో వ్రాసియిచ్చాడు. ఒక గొప్ప మార్గం యేర్పడినట్లు విజయ్ ఆనందపడుతూ తానూ చక్కగా వ్రాసి తన యాత్రఆశయాలను విశదంగా వ్రాసి వారికిచ్చాడు.

మతగురువు ఆ విషయాలను చదివి మొఖాన్ని చిట్లించుకుంటూ యెంతగానో ఆలోచించి, పారిస్‌లోని భారతరాయబారి కార్యాలయానికి

వెళ్ళమని సలహా యిచ్చాడు. వారు ప్రభుత్వంద్వారా విచారించి అందుకు తగిన కళాశాలను చూపగలరనికూడా చెప్పుతూ అడ్రసును యిచ్చాడు.

ఇపుడు విజయ్ తెల్లకాగితాలను జేబులోవుంచుకు తిరుగుతున్నాడు. తను అడుగదలచిన విషయాలను వ్రాతపూర్వకంగా తెలియజేస్తున్నాడు. ఇంగ్లీషు తెలిసినవారివద్ద యీ విధానం బాగా వుపయోగపడుతున్నది. ఆంథోనీదగ్గర మరింత వుపయోగంగావుంది. ఆయన్ను వెంటబెట్టుకుని భారతరాయబారికార్యాలయానికివెళ్లాడు. అక్కడ అయిదుగంటలనిరీక్షణలో వున్నాక తను యేమి చదివింది, యేమి చదవదలచింది, చిరునామా మొదలగు వివరాలన్నిటిని వ్రాసుకున్నాక వారంరోజుల తరువాత రమ్మని సమాధానం చెప్పారు. భారతకార్యాలయంలో చాలామంది ఆఫీసు స్టాఫ్ కనిపించారు. వారిలో తెలుగు వారొక్కరైనా కనిపిస్తారేమోనని యెంతో ప్రయత్నించాడు. కాని మలబారీలతో నిండివుంది. ఒకరిరువురు మైసూరు వారున్నారు. తెలుగువారొక్కరూ లేనందుకెంతో చింతించాడు. స్వయంగా రాయబారిని కలుసుకునే అదృష్టంకూడా కలుగలేదు. సెక్రటరీ వారం తరువాత కనిపించమన్నాడు.

నిరుత్సాహంలో కొంత వుత్సాహం కలిగింది విజయ్‌కు. వుత్సాహంతోనే యింటికి వుత్తరాలు వ్రాస్తున్నాడు. తన చిరునామాను యిస్తూ డబ్బుకూడా పంపమని కోరాడు. బీబీజాన్ అనేకవిధాల ప్రోత్సాహపరుస్తూ వ్రాసింది.

నెలరోజులు గడిచిపోయినవి. తను చదువుకొను తగిన కళాశాల నెతుకు కార్యక్రమం పేరుతో నిత్యము తిరుగుతున్నాడు. నిర్ణయాత్మకమైన కార్యక్రమం కాదుగనుక బస్సులోగాని, రైలులోగాని పయనించుటలేదు. కాలినడకలో నున్న స్వేచ్ఛ బస్సులోగాని, రైలులోగాని దొరకదు. తనకు మనోరంజన నిచ్చే దృశ్యాలు గనిపించినచోట, యిష్టమైనంతసేపు నిలచిచూడగల అవకాశం నడకలోనే వున్నది. ఒక్కో భవనం ముందు చిత్రవిచిత్రంగా చిందిస్తూ గుమ్మటాలవలె గిరగిర తిరుగుతున్న ఫౌన్ టెన్‌లు, వాటిచుట్టూ వంపులతోను, వక్రాలతోను నిర్మించిన పాలరాతి అరుగులు, జోడించిన సోపానాలు, నవరంగులతో వికసించి సౌర

భాన్ని వెదజల్లుతున్న పుష్పగుచ్ఛాలతో శోభిస్తున్న గార్డెన్సును జూస్తున్నప్పుడు ప్రఫుల్లిత హృదయుడై అక్కడే నిలిచిపోతున్నాడు.

కాలేజి విడచు సమయానికి "మదర్ మేరీకాలేజీ" గేటు ముందున్నపుడు ఆయన మనస్సెంతో ఆనందపడుతుంది. కాలేజీనుంచి బయటకు వెడలు యూనిఫారంలోని విద్యార్థినుల జూస్తుంటే హృదయం పరవశమవుతుంటుంది. నవయవ్వనం చిందిస్తున్న వయస్సులో రబ్బరు బొమ్మలవలె కనకాంబర కాంతులతో మెరుస్తున్న ఆ విద్యార్థినులు శ్వేత నురుగులవలె నున్న నిక్కరు అర్ధషర్టులు ధరింటం చూస్తూ తనను తాను మర్చిపోతుంటాడు. నవనాగరికతకు శృంగారరూప అలంకారాలకు ప్రపంచానికే పారిస్ కేంద్రమని కొన్ని రచనలలో చదివాడు, విన్నాడు. పారిస్‌లోని శృంగారాలకు అలంకారాలకంటె ఆ మహానగరంలో జన్మించిన ప్రతివారిలోను స్వతఃసిద్ధసౌకుమార్యము, సౌందర్యమును అద్వితీయమైనట్లు అనుభవమైంది.

మర్నాడు రాయబార కార్యాలయానికి వెళ్ళి పెద్ద ప్రయత్నంతో రాయబారినే కలిశాడు. ఎర్రకలువలవలెె మిరమిరలాడే నేత్రాలతో కొట్ట వచ్చినట్లు గనిపించాడు. ఆయనముందు మాట్లాడను మరింత భీతికలిగింది. జోడించిన హస్తాల నలానేవుంచి నతనతలాడుతూ "ఏదైనా కాలేజీలో చదవాలని వచ్చాను. కాని నాకిక్కడ భాష తెలియక బాధపడుతున్నాను. ఇంగ్లీషు చదువను నాకు దగినచోటును చూపగలిగితే...." అని తేరిపార చూస్తున్నాడు. ఉదయంపూట మొదటి నిషాలో వున్నాడు గాబోలు రాయబారి మహాశయుడు తూగుతూ విన్నాడో వినలేదో పది నిముషాల అనంతరం బెల్ మోగించాడు. క్షణంలో హాజరయిన జవాను ముందు గురకలోని శబ్దాన్ని బోలిన మాటలతో ఏదోగొణిగాడు.

ఆ జవాను విజయ్‌ను సెక్రటరీముందుకు తీసుకెళ్ళి నిలిపాడు. జవాను చెప్పినమాట విని ఆ సెక్రటరీ నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తూ మరేమో గొణిగాడు. అక్కడినుంచి ఒక గుమాస్తా దగ్గరకు తీసుకురాబడ్డాడు. తాను మొట్టమొదటగా విన్నవించుకున్నది ఆ గుమాస్తాదగ్గరే. ఆయన ఒకప్రెపుచేసిన కాగితాన్ని అందించాడు విజయ్‌కు. "ఈ లిస్టులో వున్న స్కూళ్ళలో పూర్తి ఇంగ్లీషు చెప్పబడుతుందికనక నీ యిష్టమొచ్చినచోట

చేరవచ్చు. కాని యీ లిస్టులో స్టార్ మార్కు పెట్టబడిన పాఠశాలలో మాత్రం అడ్మిట్ అవుట కష్టం. పారిస్‌లోవున్న ఇంగ్లీషు పాఠశాలల లిష్టు అంతా మాకిస్తున్నారు." అని ముగించి తన పనిలో నిమగ్నమైనాడు.

ఏదో ఒకఆధారం లభ్యమైనట్లు ఆ లిస్టు చేతబట్టుకుని బరబర బైటకొచ్చాడు. ఫుట్‌పాత్ ప్రక్కనే నిలిచి ఆ లిస్టును అనేకమారులు చదివాడు. అందు సగం స్టార్ మార్కుతో నున్నవి. ఇన్ని పేర్లిచ్చి తనను అయోమయంలో తోయుటకంటె, తనను బాగా విచారించి విషయాలన్నీ వివరంగా తెలుసుకుని తగినదేదో వారేనిర్ణయించి, ఆ స్కూలు మానేజిమెంటుతో వారే ఫోనులో మాట్లాడి లేక వుత్తరప్రత్యుత్తరాలు నడిపి తనను చేర్పించితే యెంత బావుండేది! తను ధర్మం అడుగలేదు, అప్పు అడుగలేదు. కేవలం సలహాతోగూడిన సహకారాన్ని. అదైనా చేయజాలని యీ రాయబారులు యిక్కడెందుకు? అని బాధగలిగింది. త్రాగి తందనాలతో హాయినిగ్రోలే రాయబారుని దూరుకుంటూ ఆ లిస్టును మడిచి జేబులో వుంచుకుని మామూలు కార్యక్రమంలో మునిగిపోయాడు.

ఏ వస్తు విషయాలను దృశ్యాలను యెన్నిమారులు చూసినా విసుగులేకుండా ఎప్పటికప్పుడు విసూత్నరూపంలో గోచరిస్తున్నవి. కనుకనే విజయ్ రోడ్లవెంట తిరుతున్నంతసేపు తన మనస్సులోని అసలు విషయం మరుగునపడి, వుల్లాసపు వూహాలతో మునకలు వేస్తుంటాడు.

విజయ్ యీరోజు తొందరగా యింటికిచేరాడు. ఆంథోనీకి తన జేబులోని లిస్టునిచ్చి "వీటిలో మంచి పాఠశాల యేదో సెలక్టుచెయ్యి" అన్నాడు. దగ్గరలోవున్న ఒక స్కూలుపేరును చూసి "ఇక్కడ ట్రై చేయండి" అన్నాడు. ఆ స్కూలుకు వెళ్ళవలసిన రోడ్డు మలుపులను కూడా కాగితంమీద వ్రాతద్వారా తెలియజేశాడు.

మరునాటి వుదయం రొట్టె తీసుకున్నాక ఆనందంతో పయనమయ్యాడు. కొంతదూరం పోయాక ఏ రోడ్డుకు వెళ్ళవలసింది తెలియక ఆంథోనీ వ్రాతపూర్వకంగా తెలియజేసిన కాగితాన్ని తీసి చదువుతూ ముందుకు నడుస్తున్నాడు. దృష్టంతా కాగితంమీద కేంద్రీకృతమైనందున ఎదుటి వ్యక్తిని ఢీకొన్నాడు. ఘల్లుమని ధ్వనించింది. ఎదుటివాని చేతి

లోని గాజుపాత్ర జారిపోయింది. ఆ పాత్ర, పాత్రలోని కోడిగ్రుడ్లు పగిలి పోయినవి. గ్రుడ్లసొన బంకగా ప్రక్కకు ప్రవహిస్తున్నది. ఎదుటి వ్యక్తి వాటిని చూడగలిగే అవకాశంకూడా లేకుండా స్టంటు పిక్చరులోని హీరోవలె ముష్టిబిగించి విజయ్ రొమ్ముల్లో ఒక్కపోటు పొడిచాడు. ప్రమత్తతలోవున్న విజయ మొదలుతెగిన మ్రానువలె పడిపోయాడు! ఎదుటివ్యక్తి బూటుకాలును వీపుమీద వేసి వూపివూపి బలంగా నెట్టాడు. విజయ రెండుపొర్లిగింతలతో దిమ్మపోయాడు. అతనిముఖం భూమిమీద వలుకుతున్న ఆ సొనకు రుద్దుకున్నది. నలుగురుచేరి వినోదాన్ని తిల కిస్తున్నారు. కొందరు పోతూనే సాధారణ విషయంగా చూస్తున్నారు. ఆ వ్యక్తి విజయ్‌ను అంతటితోనే విడువదలచలేదుగాబోలు యింకా రోషాన్ని ప్రదర్శిస్తూ బూటుకాలును ఆడిస్తూ మీదకుపోతున్నాడు.

అప్పుడే సమీపించిన ఒక స్త్రీ క్రోధంగా ఏదోమాటలు అంటు న్నది. ఆమెవైపు కొరకొర చూస్తూనే ఆ వ్యక్తి పంతంగా విజయ నడుంమీద బూటుకాలువేసి అటుయిటు వూపుతున్నాడు. ఆ స్త్రీ అతని భుజంమీద చేయివేసి ఆవలకు బలంగా నెడుతూ కఠినంగా మందలిం చింది. ఆ కోడిగ్రుడ్లవ్యక్తి కరకరలాడే శబ్దాలతో కఠినంగానే యెదురు పల్కాడు. ఆమె తన చేతిలోని బ్యాగ్‌తెరచి అతనిచేతిలో యేదోపెట్టి దూత్కారంగా అన్నది. చేతిలోపడిన దానిని చూసుకుంటూ ఆ వ్యక్తి మామూలుస్థాయికి వచ్చి పశ్చాత్తాపాన్నిపోలిన ముఖంతో ఆమెకు సాల్యూట్‌చేసి వెళ్ళిపోయాడు. చూస్తున్నవారికి ఆనందం అంతమైనట్లు తోచిందిగాబోలు వెళ్ళిపోతున్నారు...విజయ్ లేవను ప్రయత్నిస్తున్నాడు. ఆ స్త్రీ యింకా పోలేదు. ఆమె బూటులు విజయకు కనిపిస్తూనే వున్నవి. అభిమానం దెబ్బతిని ప్రతీకార కాంక్షకు బదులు నైరాశ్యత చెంది నప్పుడు శరీరంలోని సత్తువ చచ్చిపోతుంది. శరీరంలోని స్నాయువులు పట్టునివ్వవు. భూమిమీద చేతులుబెట్టి శిరస్సును యెత్తినపుడు మొఖానికి పులుముకున్న జిడ్డు అలుముకుంటున్నది. నేత్రాలలోకి జారిందిగాబోలు మంటగలిగి ఫలకాలు గట్టిగా మూశాడు. అలానేవుండి తల్లిని తలుచు కుంటున్నాడు.

ఎవరో తన రెక్కబట్టి లేవదీసి నిలిపారు. శ్వేదను తీసివేసినట్లు అంగ్రేయములతో ముఖాన్ని తుడుచుకుని చేతిని విదిలించాడు. కాని నేత్రాలు తెరువలేకపోతున్నాడు. తనను లేవనెత్తిన మహానీయుని చూడాలని కాంక్షపడుతూ ఫలకాలమీది సొనను తొందరగా తుడుచుకుంటూ ఫలకాలుయెత్తివేయ చూస్తున్నాడు. ఎదుట యేదో మాటవినిపించింది. కాని దాని భావంతెలియలేదు. ఆ మాటలో సానుభూతి ధ్వనించింది. తన చేతిలో యెవరో గుడ్డను పెట్టారు. నేత్రమంటలలో బాధపడుతున్న విజయ్ వెంటనే ఆ గుడ్డతో మొఖాన్ని తుడుచుకున్నాడు. ఇపుడు కోడిగ్రుడ్లసొన వాసనపోయి సుగంధ సౌరభం ఘుమాళించింది. మరోమాటు బాగా తుడుచుకుని యెదుటివారిని చూశాడు. ఎవరోకాదు తన కొరకు పోరాడిన స్త్రీ. తన చేతిలోవున్న గుడ్డనుచూశాడు. అది ఆమె చేతిరుమాలుని అర్థమయింది. కాని దానినిండా కోడిగ్రుడ్లసొనవున్నది. తిరిగి ఆమె కివ్వను సంకోచిస్తూ "ధన్యవాదాలు" అని ఇంగ్లీషులో అన్నాడు. ఆమె ముఖంలోని లోతురేఖలలో ప్రసన్నత ప్రభవించింది. ఇంకేమో వినిపించాలని ప్రయత్నిస్తుండగా ఆమె వెనుదిరిగి వెళ్ళిపోయింది. గొంతెత్తి పెద్ద కేకతో ఆమెను పిలిచి, ఆమెముందు కడివెడు కన్నీరు కార్చాలనిపించింది. ఆమెకు తన యావత్తు బాధను వినిపించాలనిపించింది. కాని నోరు పెగలలేదు. ఇంతలో ఆమె వెళ్ళిపోయింది. జనంలో కలిసిపోయింది. మనస్సులోని బాధ మనస్సులోనే వుండిపోయింది. తను యెక్కడ చదవాలి? ఒక్కమాటకూడా అర్థంగాని యిక్కడ యెలా చదవాలి? ఆమె తప్పక యేదో గొప్ప వుపాయాన్ని సూచించివుండేది. కాని మెరుపువలె ఆమె కనుపించి మాయమైంది. ఆమెలో ఆదరస్వభావం వుంది. వుపకారబుద్ధి వుంది. కాని తాను దురదృష్టవంతుడు. ఈ ఆలోచనలతో మనస్సు బరువెక్కి పోతున్నది.

ఆమె విడిచిపోయిన చేతిరుమాలు మరీమరీ చూచుకున్నాడు. అవి సాధారణమైందే. అందు రక్తపుమరకలుకూడా కనిపిస్తున్నవి. నొప్పిగా వున్న కపోలంమీద చేయివేసి నిమురుకున్నాడు. రుధిరం అంటింది. గాజుపెంకు గుచ్చుకున్నట్లు తెలిసిపోయింది. అతనిగుద్దుల ఫలితంగా గాబోలు గుండెల్లో నొప్పిగావున్నది.

ఆంథోనీ వ్రాసియిచ్చిన కాగితం యెంతవెదికినా కనిపించలేదు. ఎటుకొట్టుకుపోతున్నదో! బసవైపు నడిచాడు. తనకున్న ఖరీదుగల వున్నిదుస్తులు మూడు జతలే. ఉన్నది పరదేశం గనుక డబ్బును తూకం తోనే వాడుతున్నాడు.

ఆంథోనీ అనేక ప్రశ్నలు వేశాడు కాని అందు అర్థమైంది ఒకటి లేదు. పోయిన పని యేమయిందని, అడిగినట్లు భావించాడు. చాలా కాలానికి నేడే విజయ్ ఫలాని చోటుకని, అడ్రసు వివరాలతో బయలు దేరాడు కాని మధ్యలోనే విషాదఘట్టంతో తిరిగివచ్చాడు. ఆ విషయాన్ని వివరింపజాలక పోలేదని తెలియజేశాడు. అవకాశం చిక్కినా ఆ స్కూలులో చేరదలవలేదని మరోమంచిదాన్ని సెలక్టుచేసిపెట్టమని తిరిగి లిస్టును ఆంథోని చేతిలో పెట్టాడు. ఆయన పరిశీలన చేసిచేసి, మనస్సు కుదరక "బాగా విచారించి చెబుతాను" అని ఆ లిస్టును తీసుకున్నాడు.

విజయ్ మనస్సు తేలికపడింది. తనభారాన్ని యెవరో వహించి నట్లు తోచింది. అంధకారంలో ప్రవేశించినవాడికి ఆ క్షణం కన్ను పొడుచుకున్నా కనిపించక తికమకలతో తత్తరపోతాడుకాని ఆ తమపరి మనస్సు కుదుటపడుటతోపాటు అలవాటయిన అంధకారమే వెలుగయి నట్లు కావలసినవి కనిపిస్తుంటవి.

విజయ్ నిప్పుడు లక్ష్యం బాధించుటలేదు, నిస్పృహలో నీరసిం చుటలేదు. భాష తెలియనితనం వికలపెట్టుటలేదు. నిత్యము పట్టణ సర్వేలో తిరిగి తిరిగి రాత్రికి హోటలుకు చేరుట కార్యక్రమంగా అలవా టయిపోయింది. ఆయన్ను ఆకర్షించి పదేపదే రప్పించుకునే శక్తిగల దృశ్యాలు కొన్ని స్థిరపడినవి. "మదర్ మేరీకాలేజీ"నుంచి విద్యార్థినులు బయటకొచ్చు దృశ్యాన్ని యెన్నిమాపులు చూసినా మరోమాటు చూడాలనిపిస్తుంటుంది.

మనస్సు వికలం చెందినపుడు హోటలు టెర్రిస్‌మీదకు చేరి తన జాతకపుస్తకాలను తిరుగవేస్తుంటాడు. పంక్తి పంక్తిని పరిశీలనతో చదివినపుడు తాను నెడు పొందుతున్న దురవస్థ భావాన్ని గలిగిన రెండుమూడు వాక్యాలు కనిపించినవి. వాటిని యింకా యింకా చదువు చున్నపుడు జాతకంలో వున్నవే వాస్తవికంగా జరుగుతున్నట్లు తోచింది.

మొదటతాను వాక్యవాక్యాన్ని క్షుణ్ణంగా అర్థంచేసుకోకపోవటం పొర పాటయిందని, జరుగుతున్నదంతా జాతకంలో వున్నట్లే జరుగుతున్న దని, ఈ అంతర్దశ చివరిభాగం యేదో మేలును కలుగజేసి పోతుందని ఆ తరువాత మహర్దశాయోగం ప్రారంభమవుతుందని మనస్సును తృప్తి పరచుకున్నాడు. విశ్వాసం పునః ప్రవేశించింది.

ఆంథోని కొంత పరిశోధన జరిపి ఒకపాఠశాల అడ్రసును సం పాదించుకొచ్చి విజయకిచ్చాడు. అందులో ప్రవేశించుటెంత తేలికో ప్యాసవుటకూడా అంతే తేలికని వివరాలుకూడా చెప్పాడు. కాని అది నాలుగుమైళ్ళదూరంలో వున్నది. బస్సులో వెళ్ళవచ్చు. వుత్తరాలద్వారా వివరాలు తెలుసుకొనుటే మంచిదని విజయ్‌కు తోచింది. ఆంథోని సహాయంతో ఆ కార్యక్రమాన్ని ప్రారంభించి నిశ్చింతుడయ్యాడు.

కాని అతని మనస్సులో పదేపదే ఆ స్త్రీ మెదులుతుంటుంది. నిర్మలమైన ఆ మొఖంలో కరుణరేఖలు కనిపిస్తుంటవి. ఆమె ధరించిన దుస్తులు చవుకపారు సిల్కువి. ఆ బునుగు రంగు ఆమెకు అత్యధిక శోభను గల్పిస్తున్నవి. శిరోజాలు వెలిసిపోయిన నలుపురో నున్నవి. కాని మృదుత్వం ముద్దుగా గనిపిస్తున్నది. పిన్నులతో పొదగబడింది, ఎంతోమంది వినోదంగా చూస్తూ వెళ్ళిపోతుండగా ఆమె తనయడల యెందుకంత దయచూపింది? అంత దయజూపిన ఆమె ఆఖరిలో తన విషాదగాథను వినకుండానే యెందుకు వెళ్ళిపోయింది? అనే ప్రశ్నలు అనేకమారులు రేకెత్తుతున్నవి. అవును ఎక్కడ యెవరికి యే క్షణంలో యే సందర్భంలో క్రోధావేశా లుద్భవిస్తవో దయారసాలు పొంగిపొరలు తవో యెవరూ చెప్పజాలరని సమాధాన పచ్చుకుంటాడు. దూరంగా పోతూ ఆమె ధరించిన రంగుదుస్తులనే ధరించి కనిపించినపుడు భ్రమతో పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ సమీపించి నిస్పృహతో నిలిచి పోతాడు. కొన్నికొన్ని సమయాలలో ఆ పోలికలు కలిగినవారిలో ఆమెనే చూడగలుగుతాడు కాని క్షణం తరువాత భ్రమ తొలిగిపోతుంది.

ఆంథోని ఆచూకీతీసిన స్కూలు విషయంలో చేసిన ప్రయత్నాలు నిష్ఫలమయినవి. అక్కడ అన్యజాతులకు ప్రవేశంలేనట్లు తెలియ పర్చారు. ఆ తరువాత ఆంథోని యీ విషయంలో శ్రద్ధతీసుకోవటం మానివేశాడు. పరాయిబాధను విస్మరించవచ్చు. కాని యెవరిబాధ వాళ్ళని వెంటాడుతూనే వుంటుంది. విజయ్ యిప్పుడు ఆ లిస్టులోని ఒక్కొక్క స్కూలు విషయంలో తెలుసుకొను యత్నిస్తున్నాడు.

ఆంథోనిద్వారా పారిస్‌నగర వివరాలతోగూడిన పటాన్ని సంపాదించాడు. చాలా విలువైనది పూర్తి వివరాలుగలది అయినందున ఆపటం ద్వారా కొన్నికొన్ని ప్రదేశాల కెళ్ళుట సునాయాసమైపోయింది. కొన్ని కొన్ని యెంత ప్రయత్నించినా కష్టతరమవుతున్నది. కాని యెల్లవేళ ఆపటం మడతలతో చిన్న బైండింగు నోటుబుక్కువలె చేతిలోనే వుంటున్నది.

తనదేశీయు లెవరినైనా కలిస్తే బావుండునని, తన భాషరాని కొరతపోయి సహకారం లభిస్తుందని యెంతో ప్రయత్నించాడు. ఒకరిరువురిని గొప్పప్రయాసతో కలిసినపుడు పొందిన నిస్పృహ చెప్పరానిది. ఒకరు పంజాబీవారు. యెంతో ఆదరంచూపారు కాని వారి ఆంగ్లంగాని స్వభాషగాని అసలే అర్ధమవలేదు. ఆదరంతో యిచ్చిన ఆతిధ్యాన్ని స్వీకరించి తిరిగివచ్చాడు, తిరిగిపోవుటకు సంకోచంతో మనస్కరించ లేదు. ఒక ఆంధ్రుని కలుసుకోగలిగాడుగాని ఆయన యేదో చదువు సంబంధంగా 30 సంవత్సరాల క్రితమొచ్చి ప్రేమికురాలితో కలిసి స్థిర పడిపోయాడు. ఈ 30 సంవత్సరాల అనుభవంతో మంచి వ్యాపారిగా తయారయ్యాడు. అర్ధడజను సంతానంమధ్య భార్యాభర్తలు సుఖప్రద యానం సాగిస్తున్నారు. ఆయన ఫ్రెంచిభాషకు అలవడి ఆంగ్లాన్ని కూడా మర్చిపోయినాడు. తెలుగు అంతకుముందే మర్చిపోయాడు. ఫ్రెంచిదేశీయుడుగానే చలామణి అవుతున్న ఆయన ఆతిధ్యంకూడా లభించింది విజయ్‌కు. అంతకుమించిన శ్రమ ఆయనకివ్వలేక తిరిగి వచ్చివేశాడు.

ఆరోజు విసిగిపోయిన విజయ్ సంధ్యాసమయాన పార్కులో ఒకమూల ఏకాంతస్థానంలో కూర్చుని పటాన్ని భూమిమీద పరుచుకుని పరిశీలనగా చూస్తున్నాడు. ఇపుడు నిర్దిష్టమైన తలంపులేవీ లేవు. వుత్సుకతాలేదు, నిరాసక్తతలోనే అలవడిన రీతిలో పాలుబోక చూస్తున్నాడు. వీనుకగా అడుగుల సవ్వడి వినపించి ఆగిపోయింది. ముఖాన్ని ప్రక్కకు దిప్పిచూశాడు. ఎవరో వెళుతూ వెళుతూ ఆగిపోయినట్లు అర్థమయింది. పూర్తి ఆకారాన్నిచూసి ఆశ్చర్యపోయాడు. ఆమె తనముందున్న పటాన్ని దీక్షగా వంగిచూస్తున్నది. కాని ఆమె మరెవరోగాదు తన నా రోజు కాపాడిన దేవదేవిని బోలిన దయామూర్తి.

—

# 28. ఆతిధ్యం

విజయ్‌ముఖాన్ని చూసి గుర్తించింది గాబోలు ఆమె పటాన్ని విడచి అతనిముఖాన్ని మరీమరీ చూస్తున్నది. ఆ దృష్టిలో ఆదరణ వుట్టిపడుతున్నది. ఆమెముఖాన్ని చూసినతరువాత నెమ్మదిగా లేచి కృతజ్ఞతతో కృంగిపోతున్నవానివలె హస్తాలు జోడించి "నమస్కారమండి" అని తెలుగులోనే అజ్ఞానివలె అనేశాడు. ఆమె పెద్దగా నవ్వేసింది. విజయ్ అర్ధంజేసుకుని తడబడుతూ "వెరీసారీ. గుడ్ యీవినింగ్" అంటూ తిరిగి చేతులు జోడించాడు. ఆమె తిరిగి గలగలనవ్వింది. చిన్నబుచ్చుకున్నముఖంతో దీనంగా నిలిచాడు. అధోముఖంచేసి కోరగా ఆమెబూటును చూస్తున్నాడు. ఆమె అయిదునిమిషాల అనంతరం ముందుపరిచివున్న పటందగ్గర మోకరిల్లి పరిశీలిస్తూ ఏదో ప్రశ్నించింది. ధ్వనిలో మాధుర్యముంది. కాని అర్ధంగాలేదు. అతనిలో మార్పులేదు. ఆమె ఆ పటాన్ని చేతపట్టుకుని ప్రక్కగానిలిచి అతనివైపు చూసిచూసి, శిరస్సుమీద చేయివేసి "అలా వున్నావేమిటి?"అని స్పష్టమైన ఆంగ్లంలో ప్రశ్నించింది.

వడగాడ్పులలో పైకిపోయి తిరుగుతున్న మేఘాలకు శీతలపవనాలు తగిలి నీరుకావటం ప్రారంభించినట్లు అతనిహృదయం నవనీతమైపోయింది. ఆమెదృష్టిలో దృష్టిబరపిన మరుక్షణమే అశ్రుబిందువులు బయల్పడినవి. అవి ఆమె నాకర్షించినవి. "భయపడబోకు. ఆపదలలో ధైర్యాన్ని విడనాడగూడదు" అని ఇంగ్లీషులో అన్నది. కాని స్పష్టంగా అర్ధంగాలేదు. జవాబుగా వెలవెలబోతూ ఆమెవైపే చూస్తున్నాడు. ఆమె జాలితో మిళితంజేసిన నవ్వును చిన్నగా ప్రదర్శిస్తూ క్షణంపాటు అతన్ని చూస్తూ గడిపింది.

ఆ పటాన్ని మడతలువేసి అతనిచేతికిచ్చి "నాకూడా రండి" అంటూ ఆదరంతో అతనిహస్తాన్నిబట్టి మృదువుగా లాగుతూ గేటువైపు నడిచింది. శబ్దాలు స్పష్టమైనా, కాకపోయినా ఆదరింపుగా గ్రహించి

ఆమె ననుసరించాడు. రాజబాటను రెండుఫర్లాంగులు నడిచాక ఒక గల్లీలో ప్రవేశించి కొంతదూరం పోయాక ఒకషాపులో ఏవో అయిదారు పొట్లాలు కట్టించి తీసుకున్నది. తిరిగి మెట్లు దిగివచ్చి "రండి" అన్న భావాన్ని వ్యక్తంచేయునట్లు శిరస్సు వూపుతూ ఆ గల్లీలోనే ముందుకు నడుస్తున్నది. అతను వెంటనేపోతూ ఎక్కడికి తీసుకెళుతున్నదో. తన యింటికే అయితే యెవరెవరు వుంటారో, వారు తనను అందరివలెనే హీనంగాతలంచి వెడలగొడుతూ ఆమెనుకూడా కోపగిస్తారేమోనని ఆలోచిస్తూ నడుస్తున్నాడు. ఆమెలో అందరివలె గర్వం లేదు. వినయము, ఆదరము, అభిమానము ఆమెలో వుట్టిపడుతున్నవి. కనుక ఆమెద్వారా తన కెలాంటి అవమానం లభించినా, ఆనందంతోనే స్వీకరించుట మంచిదని తనలోతానే నిర్ణయించుకున్నాడు. మోసగించేవారే ప్రీతిని, ఆదరాన్ని ప్రదర్శించి, నమ్మించి నిలువున ముంచివేస్తారనే ఆలోచనతో మనస్సు మరోవైపు పరువులెట్టింది. తనను మోసగించి పొందే దేమిటి? తనవద్ద దోచుకోగలసంపత్తి యేమీలేదు గనుక చేయగలిగిందేమీ లేదని తనలోతానే స్థిమితాన్ని పొందాడు. అయినా మనస్సు ఆందోళనచెందుతూనేయున్నది. పిచ్చివానివలె ఆమెవెంట వెళ్ళి ఇంటిలోనివారి క్రోధావేశాలకు ఆమెను గురిజేసి, తానూ దూత్కారాలతో అవమానాలబొందుట యెంత వెర్రితనమవుతుంది! అనే ఆలోచనాభీతితో వెనుకనే జారుకుంటే బావుండుననిపించింది. అడుగులు మందగించినవి. వెనుకవైపు తిరిగిచూశాడు. రెండుమైళ్ళపైన నడిస్తేగాని తిరిగి బసకుచేరడు. ఆమె చాలా ముందుకు వెళ్ళిపోయింది. వెనుదిరిగి చూసిందిగాబోలు. రెండడుగులు వెనక్కువేసి పిలిచింది. ఆమెపిలుపు గాలంవేసి లాగినట్లయి సరసరవెళ్ళి ఆమెలో కలిశాడు. ముందువెళ్ళుటకు బదులు అతనిముఖంవంక చూస్తూ ప్రక్కప్రక్కగా నడుస్తున్నది. మందహాసం చేస్తూ మధురమైనబాణిలో యేమో అన్నది. "వెనుకనుంచే జారుకుందామని చూస్తున్నారా?" అన్నట్లు భావించి, సమాధానంగా నతనత గొట్టాడు. తిరిగి ఆమె యేదో అంటూ అతనిహస్తాన్ని చేతిలోకి తీసుకుని నడుస్తున్నది. "భయపడుతున్నావా?" అని అర్ధమేమోనని వూహాలు చేస్తున్నాడు. ఆమెస్పర్శతో శరీరమంతటా విద్యుల్లత ప్రవహించింది.

తాను పొరపాటుదారిలో పడినట్లు శరీరం కంపిస్తున్నది. ఆమెప్రక్కగా అనివార్యమై అజ్ఞానివలె తప్పటడుగులు వేస్తున్నాడు.

గల్లీలోపలకు వెళుతున్నకొంది పురాతనదృశ్యాలు కనిపిస్తున్నవి. రెండుమూడుచోట్ల శిధిలాలుకూడా కనిపించినవి. ఎవరో ఒకరు తూలుతూ యెదురువచ్చి పడబోతూ పడబోతూ నిలదొక్కుకుని ఆమె వైపు చేయి చాచాడు. ఆమె ప్రక్కకుతొలుగుతూ విజయ్‌నుకూడా జోరుగా తనతో లాక్కుని ముందుకు సరసరనడిచింది. ఆ తూలుతున్న వ్యక్తి వారివైపుతిరిగి అస్పష్టధ్వనిలో యేదో అన్నాడు. ఆమె వాటిని విననట్లే ముందుకుపోయింది. మరో ముగ్గురుదొరలు వారిలోవారే ప్రగల్భాలు కొట్టుకుంటూ ఒకరిమీదికి ఒకరు పడుతూ వస్తున్నారు. అందులో ఒకరిహాట్ క్రిందపడింది. దాన్ని తీసుకోబోయినవ్యక్తి దానిమీద బోర్లా పడిపోయాడు. అతనిని అపహాస్యంచేస్తూ లేవనెత్తబోయినవ్యక్తి అతని మీద పడిపోయాడు. మూడోవ్యక్తి మరింతనిషాలోనున్నాడు గాబోలు తనంతటతానే పడి గురగురశబ్దంతో ఏదోఅంటున్నాడు.సిగరెట్ త్రాగుతూ కూనిరాగాలుతీస్తూ వచ్చిన ఒకస్త్రీ పడిపోయి లేవ నుద్యుక్తులవుతున్న ముగ్గురదగ్గరకు వచ్చి, ఒక్కొక్కరిని తనబూటుకాలుతో దారికడ్డం లేకుండా నెట్టివేయాలని ప్రయత్నిస్తున్నది.

విజయ్‌ను ఆమె త్వరత్వరగా లాక్కెళుతున్నది. వారిముందు యింకా అలాంటి త్రాగుబోతులదృశ్యాలే కనిపిస్తున్నవి. ఆ దాపులో చవుకబారు జనతాసారాషాపు వుందిగాబోలు. విజయ్‌ధైర్యం సడలిపోయింది. ఒక గొప్పమోసంలో మునిగిపోయినట్లు బాధచెందుతూ బయటపడేమార్గంకొరకు మనస్సులో వెదుక్కుంటున్నాడు. ఇంతకు ముందు దయామూర్తిగా, దేవతాప్రతినిధిగా అనుకున్న ఆమెనుంచి పారిపోను తహతహలాడుతున్నాడు. ఆమెచేతిలోనుంచి తనచేతిని జారదీసుకొనుటకు యత్నిస్తున్నాడు. భీతితో శరీరం గగుర్పాటు చెందుతున్నది.

ఒక పురాతన భవనంలో ముందువైపు మూలగా ప్రత్యేకద్వారంతో నున్న గదితాళం తీసింది ఆమె. ఆ భవనం నెపోలియన్‌కాలంలో నిర్మించినదై వుంటుంది. ఆ తలుపు తెరచినపుడు మాగుడువాసన తేలి

కగా తగిలించింది. గది చిన్నదిగాదు. ఒకానొకప్పు డది చిన్నషాపుగా నుండినట్లు తెలుస్తున్నది. వర్షానికి నీరుకారుతవని గోడలనున్న పెద్ద పెద్దస రలు గుర్తుజేస్తున్నవి. ద్వారాని కెదురుగానున్న గోడమీద మేరీ మాతఫొటో పెద్దది వారగా తగిలించివున్నది. ఆ పటంక్రింద, పటం మీద ఆరిపోయిన కొవ్వువత్తులున్నవి. గది ఒకప్రక్క చిలకస్టాండు వున్నది. దానికి రెండు సిల్కుకోటులు, ఒక వున్నికోటు వ్రేలాడు తున్నవి. క్రింద రెండురకాలబూట్లు పాలిష్‌తో మెరుస్తున్నవి. ఆ ప్రక్క ఆదికాలంనాటిబల్ల వుంది. ఆ బల్లమీద పాన్పు, దానిమీద క్విల్టు, దానిమీద ప్లానలేషీటు పరిచివుంది. రెండోవైపు ఒక యీజీఛైర్, మరో మామూలుకుర్చీ లున్నవి. శయ్యకు కాళ్ళవైపు ప్రక్కగానున్న స్టూలు మీద ఒక పెద్దపెట్టె, దానిమీద చిన్న సూట్‌కేసు వున్నది. మూల ప్రక్కగానున్న గోడఅలమరాక్రింద కరెంటుస్టౌ వున్నది.

పరిశుభ్రతతోవుండే విద్యార్థినిగదివలె నున్నది. గోడలు పురాత నత్వాన్ని ప్రదర్శిస్తున్నవి. నీరుకారిన మరకలు దారులుదారులుగా నున్నవి. మేరీఫొటోదప్ప మరేవీలేకుండా నిరాడంబరంగా నున్నది. గదిలోని పరిశుభ్రతను చూస్తున్నకొంది విజయ్‌లోనిభయం సడలిపో తున్నది. కాని యింతకుముందు గల్లీలో తానుచూసిన వాతావరణం గుర్తుకొచ్చి మనస్సు కలవరపడుతున్నది. ఆమె యేకాంతంగా యిలాంటి వాతావరణంలోవుంటూ యెన్నో దుర్గుణాలకు అలవడివుంటుందని అను కున్నాడు. మరెవరూ లేకపోవుట మంచిదేఅని మళ్ళీ అనుకున్నాడు. ఈమె యీపాపంగా వంటరిగా యెందుకుంటున్నది? విద్యార్థినిమాత్రం కాదు, అయినా అలమరాలో పుస్తకాలున్నవేమో. చదివేవైఖరి కనిపిం చుటలేదుగా! అంటూ పలువిధాలుగా ఆలోచిస్తున్నాడు.

తనను యీజీఛైర్‌లో కూర్చోమని సౌంజ్ఞచేసింది. కూర్చుని ఒక్కటొక్కటిగా పరిశీలనచేస్తున్నాడు. తనవద్ద యేమీలేదు, మోసంచేసి పొందగలిగేది లేదు, అనే సంతృప్తిపడ్డాడు.

ఆమె తనచేతిలోని బాగ్‌ను చిలకకొయ్యకు తగిలించింది. స్టౌ దగ్గరున్న అలమరాతెరిచి తానుతెచ్చిన పొట్లాలను అందుంచింది. అయిదు

నిమిషాలలో ఆమె బజారునుంచి తెచ్చిన బ్రెడ్‌ను ముక్కలుచేసి యెలక్ట్రిక్ స్టౌమీద రోస్టుచేసింది.

కుర్చీ ఆతనిముందుకులాగి దానిమీద రొట్టెముక్కలప్లేటును, వెన్నప్లేటును, మటన్‌ప్లేటును వుంచింది. స్పోర్కును, స్పూనునుతెచ్చి రొట్టెలున్నప్లేటులో పెట్టి, ఆయనవంకచూస్తూ "తీసుకోండి" అన్నది. ఆ ఇంగ్లీషుశబ్దాలు బాగా అర్ధమయినవి.

అనుకోనిరీతిలో చేస్తున్న విచిత్రమైన యీ ఆతిధ్యం తప్పక ఒక గొప్ప ద్రోహానికి నాందియైవుంటుందని ఆతను అనుకున్నాడు. వాటిలో యేమైనా మత్తుపదార్ధం కలిసిందేమోననే భయంకూడా కలిగింది.

పగటివెలుగు తగ్గిపోతున్నది. లైటు వేసింది. ఆ లైటువెలుతురులో ఆమెప్రసన్నముఖాన్ని చూస్తుంటే యెక్కడా మయిదురేఖలుగాని, కౄరపోలికలుగాని కనిపించుటలేదు. సందేహంతో అలానే చూస్తూవున్న అతనిదృష్టిలో దృష్టినిబరపి "భయపడవద్దు, తీసుకొండి" అన్నది.

క్షణకాలం అతనిమనస్సులోని సందిగ్ధాలు ఆగిపోయినవి. కాని ఆమెకూడా తనతోపాటు కూర్చుని భుజిస్తే మర్యాదగా నుండుననిపించి దీనంగా చూస్తున్నాడు. ఆమె కూర్చోనుగాని, ప్లేటులు పెట్టుకోనుగాని కుర్చీలూలేవు, బెంచీలూలేవు. కనుక యెలా కూర్చోగలుగుతుంది! అయినా ఆమెకింకా పదార్ధాలు మిగిలివున్నవో లేవో, అనే సందేహమూ కలిగింది. స్థితి చాలా బీదదనిమాత్రం అర్ధంచేసుకున్నాడు. వెంటనే భుజించాడు. స్టౌమీద మసలుతున్న నీటిలో నాలుగుగరిటెల పవుడరును వేసి, దించి ఆరబోసి కప్పులోతెచ్చి ముందుంచింది. రంగు విచిత్రంగా వుంది. రుచి అంతకంటె తానెన్నడూ యెరుగనివిధంగా వుంది. అది యేమయినాగానీ త్రాగక తప్పదని త్రాగివేశాడు. ఆదరఫలితంగా ఉత్సాహం కలిగింది. జేబులోని సిగరెట్‌పెట్టె, సిగార్‌లైట్ తీసి కాల్చబోయాడు. ప్లేటుసర్దుతున్న ఆమె తనపనిని ఆపి "ఇస్....దయచేసి...." అంటూ ముక్కుమీద వ్రేలుంచి నేత్రాలు పెద్దవిచేసింది. విజయ్ వెలవెలబోతూ ఆమెనే చూస్తున్నాడు. ఆమె చేయిచాపి మేరీమాతపటంవైపు

చూపింది. వెంటనే అదరాలమధ్యనున్న సిగరెట్టునుతీసి తిరిగి జేబులోకి చేర్చుకున్నాడు.

తా నింతకుముందుపడిన అనేకవిషయాలకు తనలోతానే సిగ్గుపడి పోతున్నాడు. గది పరిశుభ్రతవలెనే ఆమెహృదయంకూడా పరిశుద్ధ మైందిగా తెలిసిపోయింది. గల్లీలోనిదృశ్యాలు చూశాక యీామెకూడా విలాసినియని, త్రాగుబోతు, మోసగత్తె అయివుంటుందనుకున్నాడు. కాని యిపుడు మనస్సు తారుమారైంది. ఆమెఆదరంలో ఆత్మీయతదప్ప కృత్రిమంలేదని విశ్వాసం కలుగుతున్నది.

ఆమె దగ్గరగావచ్చి యెదుటనిలిచి మందస్మితవదనంతో "ఇక పదండి" అంటూ చేతులుజోడించి నమస్కరించింది. ఆశ్చర్యాన్వితు డయినాడు. తాను పార్కులో అలవాటుచొప్పున పొరపాటులో నమస్క రించినట్లే నమస్కరించింది. అవహేళనగామాత్రం కాదు. తడబడుతూ కుర్చీలోనే వుండిపోయాడు. ఆమె కరచాలనానికి చేయిచాచినట్లు చాచి అతనిచేతినిబట్టి వూపుతూ "మీకెపుడయినా భరించరానంతబాధ గలిగి నపుడు యిక్కడకు రండి" అంటూ ఆమె బయటకు దారిదీసింది. ఆ మాటలు యెంతో స్పష్టంగా అర్ధమయినవి. ఆమెకు ఇంగ్లీషు బాగా వచ్చునని తేలిపోయింది. ఆలోచన లెన్ని వుద్భవించుతున్నా బయటకు నడచుట తప్పనిసరి అయింది. "పెద్దరోడ్డువరకు పంపిస్తాను పదండి" అంటూ గదికి తాళంపెట్టి బయలుదేరింది. ఆమె ననుసరించి తానూ నడుస్తున్నాడు. కాస్తదూరంపోయాక ఒకగుంపు నిలిచివుంది. ప్రక్క యిద్దరు ముష్టియుద్ధం జరుపుతున్నారు. ఒకరు పడిపోయారు. రెండో వ్యక్తి గుంపులోనున్న స్త్రీని భుజాలమీదకు యెత్తుకుని వెళ్ళిపోతున్నాడు. ఆ స్త్రీ భుజాలమీదవాలి పగలబడి నవ్వుతున్నది. ఆ గుంపులోనుంచి ఒక యువకుడు త్రాగుబోతుధ్వనిలో ప్రలాపిస్తూ విజయ్ముందు నడు స్తున్న ఆమెవైపు చేతులుచాస్తూ ముందుకొచ్చాడు. ఆమె సింహంవలె గర్జించింది. హతాశుడై అక్కడే నిలిచిపోయాడు.

ట్రాఫిక్‌రోడ్డువరకు వచ్చి "గుడ్‌బై" అంటూ హస్తాలు జోడిం చింది. ఆ లైట్లవెలుగులో ఆమెచిరునవ్వు సుస్పష్టంగా కనిపిస్తున్నది. విజయ్‌మనస్సులో ఆవరించిన చిరాంధకారంలో జ్యోతిని వెలిగించింది.

ఆమెనుంచి విడిపోవుటకు మనస్కరించుటలేదు. కాని ఆమె పొమ్మంటున్నది. పోకపోతే యేమనుకుంటుందోననే భయంతో హోటలువైపు పయనమయ్యాడు. కొంతదూరం నడిచాక వెనుదిరిగిచూశాడు. ఆమె అక్కడే నిలిచి తనవైపేచూస్తూ చేయి పైకియెత్తి ఆనందాన్ని తెలియజేస్తున్నది. తానుకూడా చేయిఊపుతూ అలానే వుండిపోయాడు. ఆమె అయిదునిమిషాల అనంతరం వెనుదిరిగి గల్లీలోకి వెళ్ళిపోయింది. క్షణంలో నిరాశపొందినవానివలె శక్తిహీనతతో మార్గోన్ముఖుడైనాడు.

విజయ్‌మనస్సులో తర్కశాస్త్రం అన్నివైపులనుంచి తొంగిచూసి అంతుబట్టక ఆగిపోతున్నది. అనుమానాలు అదృశ్యమైనవి. "ఆమె కేవలం దయతో తనను ఆదరించిందని, ఆమెహృదయం కరుణాసాగరం లాంటిదని, ఆనాడు తనను ఆపత్తునుంచి రక్షించింది, నేడు ఆదరంతో ఆతిధ్యమిచ్చి పంపివేసింది" అని ఆలోచనలను సంక్షిప్తంచేసుకున్నాడు.

—(౦)—

# 29. కరుణామయి

హొటలుకు నేడు చాలా ఆలస్యంగా చేరాడు. ఆంథోనీతో మాట్లాడే అవకాశమే లేకపోయింది. భోజనంచేసేపనికూడా లేదనిచెప్పి దుస్తులు మార్చుకుని పవళించాడు. రగ్గు పూర్తిగా కప్పుకున్నాడు. ఆమె గదిలోని శయ్యమీదపడుకున్నట్లే వున్నది. నేత్రాలు మూసుకుంటే ఆ గదిలోని ప్రతిఒక్కటి స్పష్టంగా కనిపిస్తున్నది. ఆ పరిశుభ్రతకు, సంక్షిప్తసామగ్రికి ముగ్ధుడైపోతున్నాడు. సిగరెట్టును కాల్చనివ్వని ఆ దృశ్యం గుర్తుకొచ్చినపుడు మనస్సు మరింత పరవశమైపోతున్నది. ఆమె తేనెకళ్ళల్లోకూడా యెంతో అందముంది. గంభీరముద్రలోకూడా చిందించిన ఆనందరేఖలు అత్యధిక ఆనందాన్నిచ్చినవి. ఆమెలో అపుడపుడు తొంగిచూసిన చిరునగవు యెంత మధుమయమైంది! ఆమె చేతులు జోడించి నిలిచినదృశ్యం మరపురానిది. ఆ నూతనత్వంలో యెంత ఆకర్షణుంది! ఆ దృశ్యాన్ని యెన్నిమారులుచూసినా తనివితీరనిది. ఒకే గదిలో వంటరిగావుంటున్న దెందుకని? ఈదేశస్థురాలు కాదేమో, లేక మరెచటినుంచైనావచ్చి చదువుకుంటున్నదేమో, అయితే హాస్టలులో చేరాలిగా! ఉద్యోగం చేసుకుంటున్నదేమో. అని యెన్నెన్నోరకాల వూహలు గలుగుతున్నవి. ఇంతవరకు తనకు తటస్థపడిన వారందరికంటె ఆమెఇంగ్లీషు బాగా అర్థమయింది. భారతరాయబారకార్యాలయంలో కూడా అంతగా అర్థంగాలేదు. వారు గర్వప్రదర్శనలో అర్థంగాకుండా మాట్లాడారు. ఈమెలో గర్వం మచ్చుకుకూడా లేదు. సేవాస్వభావిని. ఈ పట్టణంలోని అందరిమానవత్వము అదృశ్యమయి, అంతా యీమెలో ప్రవేశించిందేమో! ఈమెకే తనకష్టగాథ వినిపించితే యెంత బావుండును! అనుకుంటూ నిద్రలో మునిగిపోయాడు.

విజయ్ రాయబారకార్యాలయం వారిచ్చిన లిస్టును చించి పారవేశాడు. ఇపు డిక పాఠశాలలగురించిన అన్వేషణ జరుగుటలేదు. ఆ

దయామయినిగురించే ఆలోచిస్తున్నాడు. తిరిగి ఆమెకనిపిస్తే బావుండు ననిపిస్తున్నది. ఎక్కడతిరుగుతున్నా నేత్రాలు ఆమెకొరకే వెదుకు తున్నవి. ఏపార్కులో ఆమె కలిసిందో ఆ పార్కులోనే ఆ స్థానంలోనే నిత్యమూ సంధ్యవేళలు కాలయాపనచేస్తున్నాడు. ఆమెధరించిన సాదా రంగుదుస్తులనే ధరించి దూరంగా కనిపించి ఆమెగా భ్రమకలిగినపుడు హృదయంలో విద్యుల్లత ఝళిపించుతుంది.

ఆమెపేరు తెలియనందుకు యెంతో విచారపడుతుంటాడు. ఏ పేర యితేబావుంటుందో నిర్ణయించనుయెన్నిరోజులుఆలోచనచేసినా మనస్సుకు నచ్చలేదు. ఫలానాపేరయితే బావుండునని అనుకున్న మరుక్షణమే ఆ పేరు శబ్దార్థంలోవుండే కరుణ చాలదనిపిస్తుంది. "కరుణామయి లేక దయామయి" అనే పేరులు ఆమెకు తూచినట్లు సరిపోతవని ఆలోచన. కాని అంతతూకంగల ఆ భావాన్ని ప్రకటిస్తూ ఆ శృంగారాన్ని వెదజల్లే శబ్దాలు ఇంగ్లీషులోయెక్కడా లభించక అసంతృప్తితోబాధపడుతున్నాడు.

భ్రమ మానవుని వెర్రివానిని చేస్తుంటుంది. ఆమె పేరేమిటో తెలియదు. తనకు నచ్చిన పేరును వెతికి నిర్ణయించినందువలన ప్రయోజనంలేదు. తనకునచ్చిన పేరుతో ఆమెను స్మరించుకోవాలని కోర్కె. ఎంత విచిత్రం! అందుకొరకు ఆంథోనీ సహాయంతో ఆంగ్లశబ్దకోషను పొందికూడా తిరుగవేసి విసిగి విరమించుకున్నాడు. ఆమెకు "కరుణామయి" అనే తెలుగుపేరునే పెట్టుకుని తృప్తిపడ్డాడు. ఆ పేరుతోనే యిపుడామెను వూహజేస్తున్నాడు.

ఆ కరుణామయిద్వారా తనకు కావలసిన సహాయం లభించినా లభించకపోయినా, తన బాధలను ఆమెకు వినిపించాలని వున్నది. ఆమెపేరు, ఆమెగాథ వినాలనికూడా వున్నది.

కరుణామయి స్మరణలో వారంరోజులు గడిచిపోయినవి. భక్తి విశ్వాసాలు ఆమెయెడల పాతుకపోయినవి. ఇపుడు యెక్కడ తిరుగుతున్నా, యే దృశ్యాలు చూస్తున్నా మనస్సులోని ఒక కోణం ఆ కరుణామయిని పోల్చుకో ప్రయత్నిస్తుంటుంది.

తాను కరుణామయికి చెప్పదలచుకున్న విషయాలను చెప్పగలనో లేదో అనే భయంతో, చెప్పినా తన యింగ్లీషు ఆమెకర్థమవుతుందో

కాదో నన్న జంకుతో తన స్థితి, పారిస్‌రావటానికి గల కారణాలను, వచ్చి పొందుతున్నా నిరాశను విపులంగా పది పేజీలలో వ్రాశాడు. మార్కులకొరకు పరీక్షలలో వ్రాసిన కాంపోజిషన్‌వలె అతి జాగ్రత్తగా వ్రాసి, తిరిగి చదివిచూచుకున్నపుడు అనేక మార్పులు చేయవలసి వచ్చింది. కొట్టివేతలతో నిండిన ఆ పేర్లతో తృప్తి పడజాలక యెత్తి వ్రాశాడు. జాతకంలోని విషయాలు యెక్కువగా వ్రాయవలసి వచ్చింది. అవే, తన విదేశయాత్రకు నాంది గనుక వాటిని విపులంగా వ్రాయక తప్పలేదు. తన దస్తూరి అందమైందిగాదు. అందువలన అంత శ్రమపడి వ్రాసికూడా తృప్తి చెందలేకపోతున్నాడు.

తను వ్రాసి తయారుచేసుకున్న ఆ పదిపేజీలు తన జీవిత చరిత్రలో ముఖ్య అధ్యాయంగా తోచింది. దానిని తన దరఖాస్తుగా భావించి కరుణామయి చేతిలో వుంచాలని తలంపు. అందుకని భాషను భావాన్నీ వడపోతలో దించాడు. ఆ వ్రాతప్రతిని ఆ పార్కులోని తన స్థానంలో కూర్చుని తానే యెన్నోమారులు చదువుకున్నాడు. తాను చదువుకుంటుండగా ఆ కరుణామయి వస్తే యెంతో బావుండునని యెన్నో మారులనుకున్నాడు. ఆ ప్రతిని ఆంథోనీకికూడా చూపాడు. అది చాలా బాగున్నదని మెచ్చుకున్నాడు. ఆ రూపంగా ఆ కాగితాలు నలిగిపోయి నందున తిరిగి వ్రాయాలని ఆలోచనలుచేస్తూ ఆఖరుకు టైపు చేయించాడు. టైపులో రెండుప్రతులను తీయించాడు. ఒక గొప్పకార్యంసాధించినట్లు ఆత్మానందం కలిగింది.

కరుణామయి ఆతిధ్యంనుంచి తిరిగివచ్చి పక్షంరోజులు గడిచి పోయినవి. ఆ గల్లీవరకుపోయి అక్కడే అటూ యిటూ తిరిగి యెంతో నిరీక్షణచేసిన సమయాలున్నవి. కాని ఆమె దర్శనభాగ్యం లభించలేదు. ఆ గొందిలోకి వెళ్ళి చూసి రావడానికి ఎప్పటికప్పుడు ధైర్యం చాలలేదు. ఒకనాటి అపరాహ్న సమయంలో ధైర్యంచేసి కరుణామయి గదివరకు వెళ్ళాడు. కాని తాళం బిగించివుంది.

కరుణామయిని కలసి తన దరఖాస్తును దాఖలుచేసుకోవాలనే ప్రయత్నంలో మరో పక్షంరోజులు గడిచిపోయినవి. అపరాహ్నసమ యాలందు, అనేకమారులు వచ్చి ఆమె గదినిచూసి వెళ్ళిపోయాడు. ఈ

ప్రయత్నంలోను, నిరీక్షణతోను యిన్నిరోజులు గడిచిపోయినా మనస్సు వ్యధ చెందుటలేదు. మేఘాలచాటున తొంగిచూస్తూ పయనించే జాబిలి వలె దోబూచులాటగా సాగిపోతున్నది విజయ్‌కు. ఆ కరుణామయిద్వారా తనకు విముక్తి కలుగుతుందని, తన కిచట కావలసినవన్నీ సమకూరుత వని వుల్లాసపడుతూ సమయాన్ని దొర్లిస్తున్నాడు. ఇన్నిరోజులు గడిచి నవిగనుక తనను మరిచిపోయించేమోనని, చూసినా గుర్తుపట్టజాలక దూరంగా పొమ్మంటుందేమోనని భయ తలంపులుకూడా ఊహలలో పరువులెడుతున్నవి. ఆమెద్వారాకూడా నిరాదరింపబడితే తానిచట సాధించగలిగేదేమిటి? అని అనుకున్నపుడు మనస్సు వికలం చెందు తున్నది. అలాంటి విషాదఆలోచనలనుంచి విముక్తి పొందను ఆమె చేతిరుమాలు గుర్తుకొచ్చింది. దాన్ని సబ్బుతో శుభ్రపరచి, జేబులో పదిలపర్చుకున్నాడు. దుష్యంతుడు శకుంతలకు సమర్పించిన వుంగరం వగైరా శకుంతలా పరిణయంలోని ఘట్టాలు గుర్తుకొచ్చినవి. ఆ వుంగర రూపమైందిగానే గనిపించింది తనజేబులోని చేతిరుమాలు. తను టైపు చేయించుకున్న దరఖాస్తు విలువకంటె ఆ రుమాలు విలువ అధికమయి పోయింది. ఒకదాని తరువాత ఒకటిగా రెంటిని యెన్నోమారులు చూసు కుంటూ సంతృప్తిని కలిపించుకుంటున్నాడు.

అనేకమారులు కరుణామయిగదికి వెళ్ళి విఫలమయి సఫలితంగా ఒక నిర్ణయానికికొచ్చి, టైపుచేయించుకున్న తనగాధరూపంలోని దర ఖాస్తును కవాటాల సందుగుండా ఆమెగదిలోనికి విడచివచ్చాడు. నకలును మాత్రం జేబులోనే రుమాలుతోపాటు వుంచుకున్నాడు.

కరుణామయి ఆరోజు ఆఫీసునుంచి సినిమాకు వెళ్ళిందిగాబోలు చాలా పొద్దుపోయి యింటికొచ్చింది. భోజనంపనికూడా హోటల్లోనే తీర్చు కొచ్చింది. అందువలన తలుపులు లోపల గడియపెట్టి, లైటువేసుకుని దుస్తులు మార్చుకుని, బెడ్‌లైట్‌వేసి శయ్యమీదికి చేరింది. విజయ్ తలుపుసందుగా జారవిడిచి వెళ్ళిన కాగితాలకట్ట అక్కడేవున్నవి. ఆ కాగితాలలోని ఆత్రత యెంతవిశేషమైందో అంతనిరాదరం పొందింది. కొన్నివేళలందు ఆత్రతలే ఆలస్యాలకు కారణాలవుతుంటవి.

బాలభాస్కరుడు కవాటాలసందులగుండా తొంగిచూస్తున్నాడు.

చలిబాధ సగం యెగిరిపోయింది. కరుణామయి అటూ యిటూ పొర్లిగింతలు పెడుతూ బడలికను పారద్రోలుకుంటున్నది. గడియారం అరగంట క్రితమే అలారం మ్రోగి విఫలమైంది మామూలు టిక్కు-టిక్కు-లలో సమయాన్ని ఖండఖండాలుగా నరికివేస్తున్నది.

కరుణామయి నేత్రాలుతెరిచి యెండపొడలను చూసిందిగాబోలు గాబరాపడుతూ లేచింది. శుభోదయాన్నిచూడను తలుపులు తెరచింది. తన స్లిప్పర్స్ ప్రక్క-గా పాదాలకేదో తగిలినట్లు గ్రహించి అధోముఖం చేసి ఆశ్చర్యపోయింది. అదొక కాగితాల మడత, అన్ని కాగితాలు అక్క-డికొచ్చి యెలా పడినవా! అని ఆమర్ధాపడుతూ తీసింది. అవి తన సంచిలోవికావు. తననుంచి జారిపోయినవికావు. ఎవరోతెచ్చి జార విడిచినవి, చిన్నిచిన్నివి పెద్దపెద్దవి ప్రేమపత్రాలు అనేకం అందేవి. కొన్ని ప్రత్యక్షంగానూ అందేవి. ఆమెమనస్సుకవి బాధనుగలిగించినవి. వాటినిచదివి, ఆ ప్రేమికుల స్తోత్రాలను తెలుసుకోగల సహనంకూడా లేకపోయింది. అందుకే ఆమె ఆ ఉద్యోగాన్ని వదిలిపెట్టింది. వున్న బస మార్చి బీదలవాతావరణానికి చేరింది. ఈగదిలో ప్రవేశించి సంవత్సరం గడిచిపోయింది. ప్రారంభదశలో చిన్నచిక్కు-లుయేర్పడినా సర్దుబాటయినవి. క్రిందితరగతి ప్రజలలోని ఆలోచనలకు దీర్ఘయత్నాలుండవు. అనుకున్నవాటిని ఆ క్షణమే యత్నించి సఫలమో విఫలమో తేల్చుకుని స్థిమితపడిపోతారు. పైవారు అనుకున్నవాటి సాధనకు దీర్ఘయోచనలతో సన్నాహాలు జరుగుతవి. అందుకనే వారిలోని వైరాలు దీర్ఘమైనవి. బీదలలోని వైరాలు క్షణికమైనవి.

కరుణకుమారి యీగదిలో ప్రవేశించినపుడు అనేకులు చీకాకుపడ్డారు. ఆమె తేలికస్త్రీకాదని తెలిసిపోయినపుడు అందరూ ఆమెను ఆదరంగా చూడప్రారంభించారు. ఎవరయినా నిషామత్తుతో ఎదురుపడి అనరానిమాటలు అన్నా, ఆ తరువాత పశ్చాత్తాపాన్నికూడా ప్రదర్శించి పోతుంటారు. ఈవిధంగా ఆమె ప్రశాంత వాతావరణాన్ని పొందింది. నేడు చాలా కాలానికి ఆకస్మికంగా యీ కాగితాల పొత్తినిచూసి వెలవెలబోయింది.

తెరచిచూసింది. వ్రాతగాదు. టైపులోనున్నది. ఫ్రెంచిభాషగాదు

ఆంగ్లము. అది ప్రేమప్రతాపముగాదు. విచిత్రగాధగా తోస్తున్నది. చదువాలనే ఆత్రుత మరీమరీ కలుగుతున్నది. కోర్టుద్వారా ప్యాసవుట, జాతకంలో వున్నదిగనుక విదేశయాత్రచేయుట మొదలగు విషయాలను చదువుచున్నపుడు జాబిలితో ఆడుకుంటున్నట్లున్నది. సగంవరకు చదివి, అక్కడే నిలిచి పైవంకచూస్తూ ఆలోచిస్తున్నది. ఆ వుత్తరం లోని భారతీయుడు హస్తాలు జోడించి ముందు నిలిచినట్లు గనిపిస్తున్నాడు. అతనిని మరీమరీ గుర్తుజేసుకొనుటకుప్రయత్నించి, తిరిగి చదువసాగింది. ఒకమాటుగాదు రెండుమారులు చదివింది. ఎన్నో ప్రేమలేఖలను చూసింది. గొప్ప శృంగారరూపంలోని వున్నతస్థాయిగల వుత్తరాలను చదివింది. వాటిని నిరసించింది. కాని యిది అర్ధంగాని విచిత్రమైంది. ఇందులో ప్రేమయాచనలేదు, ఆర్థికయాచనలేదు. పనికిరాని కధలోని ఒక ఘట్టాన్ని బోలివుంది. చూచుటకు విజ్ఞాపనాపత్రంవలె వుంది. అర్థించేదేమిటో తెలియలేదు. తలుపుబిగించి లైటువేసి శయ్యమీద పవళించి మరోమాటు ఆ పది పేజీలను చదివింది. నేత్రాలుమూసి, వుత్తరంలోవున్న హస్తాలను వక్షస్సుమీదుంచుకుని ఆ అమాయక భారతీయుని గురించి ఆలోచిస్తున్నది. అతను హస్తాలను జోడించిన దృశ్యంకంటె, అశ్రుబిందువులతో కనిపించినదృశ్యం ఆమె నత్యధి కంగా ఆకర్షిస్తున్నది. వంటవానిద్వారా దెబ్బలుతిన్ననాటి అతనిస్థితి మనస్సులో మెదిలినపుడు హృదయం ద్రవించింది. తెరలుతెరలుగా జాలిపొందుతున్నది. అతనిముఖంలోని దీనత్వం వూహించినపుడు హృదయం కంపిస్తున్నది. అతనికి సహాయపడేవిధానాన్ని గురించి యోచిస్తున్నది. ఏరూపంగానైనా ఆదరించాలని మనస్సా నిర్ణయించు కున్నది. కాని అతని వాంఛితార్థమేమిటో, యేమిచేస్తే అతనికి స్థిమితం కలుగుతుందో యెంత ఆలోచించినా తోచలేదు.

చేస్తున్న ఆలోచనలు యెంతకూ ముడివడక, చెదిరి నేత్రాలు తెరి చింది. ఎదుటనున్న గడియారంలో ఎనిమిదిగంటలయింది. పదిగంట లకు ఆమె కార్ఖానాకు జేరవలసిన టయము. అందువలన గాభరాపడుతూ లేచి, ఆ వుత్తరాన్ని బ్యాగ్‌లోపెట్టి యింటికార్యక్రమంలో మునిగి పోయింది.

విజయ్ ఎవరిపేరు కరుణామయిగా తనమనస్సులో నిర్ణయించుకున్నాడో ఆమె అసలుపేరు బ్రీజ్‌బెల్లా. ఆమె లండనులోని ఒక బ్రిగేడియర్ కుమార్తె. ఆమె నాలుగోయేట తండ్రి మరోవనిత ప్రేమవలలో పడి తనను తనతల్లిని నిరాదరంచేసినందువలన కోర్టులకుపోవుట, ఆ తరువాత విడాకులుపొందుట జరిగింది. బ్రీజ్‌బెల్లా కోర్టుతీర్పు ననుసరించి తండ్రితోనే వుండిపోయింది. తండ్రి బ్రిగేడియర్ ప్రేమించినస్త్రీని వివాహమాడిన రెండుసంవత్సరాలవరకు ఆదరంగా అక్కడే వుండిపోయింది. తండ్రికి మరోసంతానం కలిగిన తదుపరి, వారి కఠినప్రవర్తనలకు గురియై అజమాయిషీలేని ఒక హాస్టలులో చేర్చబడింది.

బ్రీజ్‌బెల్ తల్లి విడాకులుపొందిన తదుపరి, తనబిడ్డను తనకివ్వమని ప్రాధేయపడి నిరాశపొంది, బాధపడుతూ, ఇంగ్లీషుకోర్టులను, ఇంగ్లీషుజాతిని నిందిస్తూ నీతిలేనిదిగా చిత్రిస్తూ ఒకసంవత్సరం వంటరి జీవితాన్ని గడిపింది. ఒక ఫ్రెంచిప్రొఫెసర్‌తో సాంపర్క్యాన్నిపొంది, తనప్రోత్సాహంతో వుద్యోగానికి వుద్వాసనమిప్పించి పారిస్ తీసుకెళ్ళి, అక్కడ అతన్నివివాహమాడి ఆనందంగా జీవితనావను నడుపసాగింది.

బ్రీజ్‌బెల్లాను అనాధనుచేసి హాస్టలులోచేర్పించిన విషయం పారిస్‌లోనున్న తల్లికి తెలిసినపుడు పరితాపంతో తనభర్తను ప్రాధేయపడి పుత్రికను తనవద్దకు తెప్పించుకోగలిగింది. దురదృష్టం వెంటాడినపుడు స్వర్గధామానికివెళ్ళినా దురదృష్టం తప్పదు. బ్రీజ్‌బెల్లా తల్లి చెంతకుజేరి మూడుసంవత్సరాలు మాతృప్రీతిని బొందింది. ఇంతలో మరోసంతానం కలిగింది. తల్లికి యిద్దరూ తనసంతానమే అయినా భర్తకు బ్రీజ్‌బెల్లా అన్యురాలయింది. అన్నివైపులా అయిష్టం పొడచూపింది. ఇంటిలో అశాంతి తొంగిచూసింది. ఫలితంగా బ్రీజ్‌బెల్లాను ఒక హాస్టలులో జేర్పించుట జరిగింది.

ఆమె ఆ హాస్టలులోనేవుంటూ స్కూలులో చదువుకుంటూ పెద్దదయింది. వయస్సుతోపాటు అపుసరమైన అనుభవాన్నిపొందింది. తల్లిదండ్రుల అశక్తతను తనదురదృష్టంగా భావించి తనజీవితాన్ని తానే గడుపుకోవాలని హాస్టలు విడిచిపెట్టింది. తల్లిసహాయాన్నికూడా పొందగూడదని నిర్ణయించుకుని తెలియనిపేటకు చేరి ఒక పాఠశాలవుద్యో

గంలో నియుక్తురాలయింది. దాపులోనే ఒక అద్దెయింటిలో చేరి పోయింది. తాను చదువుకుంటూ చదువులుచెబుతూ అయిదుసంవత్స రాలు గడిపింది.

వయస్సులోని యవ్వనత్వపుశృంగారాలు పొంగినకొంది ఒక్కొ టొక్కటిగా అనుకోనిబాధలు తారసిల్లసాగినవి. వచ్చే ప్రేమలేఖలకు కొదవలేదు. వట్టిలేఖలే అయితే చించివేయగలదు కాని గొప్ప మర్యాద పురస్కారాలతో దగ్గరకుజేరి మయిదుతో తనను వశంచేసుకోవాలని గొప్పయత్నాలు చేసిన అనేకమంది కులీనయువకులతో విసిగిపోయింది. ప్రతిఒక్కరు మోసగాళ్ళుగా తలచి భయపడిపోయింది. రాత్రులు వంట రిగా యింటిలో పవళించనుకూడా అధైర్యం అంకురించింది.

ఆ బాధలతోను, భయాలతోను ఆ వుద్యోగాన్ని, ఆ పేటను విడిచి యెవరికీ తెలియని దరిద్రులునివసించే పాడుబడ్డపేటకు చేరింది. ఈ గదిలోచేరిన ప్రథమంలోకూడా కొన్నిఅవరోధాలు కలిగినా క్రమేణా సర్దుబాటయి శాంతియుతజీవితాన్ని పొందింది. బ్రీజ్‌బెల్లా సుగుణవతి, సుశీలవతి యని ఆ పేటవారందరికి ప్రచలితం. అందుకే నేడు ఆమెను అందరూ గౌరవిస్తారు, ఆదరిస్తారు.

ఆ గదిలోవుంటూ తిరిగితిరిగి ఒక కార్ఖానాలో వుద్యోగం సంపా దించింది. కొయ్యబొమ్మలుచేసే కార్ఖానాలో మొదట రోజువారీకూలీగా చేరి అందించేపని చేస్తుండేది. రంగులు కలుపుతుండేది. ఇప్పుడు రంగులు స్వయంగా తానే వేయగలుగుతుంది. ఇపుడామెజీతం రెట్టిం పయింది. నెలలవారీగా ముడుతున్నది. ఉద్యోగం ఆ కార్ఖానాలో ఖాయమైపోయింది. స్వయంగా బొమ్మలుచేయను యెంతో శ్రద్ధతో నేర్చుకుంటున్నది. ఆ బొమ్మలుచేయుటలో నేర్పరితనం పొందితే ఆమె జీతం యింకా పెరుగుతుంది. అపుడామె వున్నతస్థాయిలోని జీవి తాన్నే గడుపవచ్చు. రేయింబవలు ఆ కృషిలోనే నిమగ్నమై కాలం గడుపుతున్నది.

బ్రీజ్‌బెల్లాకు ఆంగ్లభాషలోను, ఫ్రెంచిభాషలోను, సమానప్రతిభ వుంది. ఇంకా చదువాలని భ్రమవుంది కాని అవకాశాలు అడ్డుకున్నవి. తలిదండ్రులిరువురిమీద క్రోధమూ, ద్వేషమూ లేదుగాని, కన్నబిడ్డను

ఆదరించలేకపోయినవారి అశక్తతకు, అసమర్థత్వానికి, పశుత్వప్రలోభన లకు బాధపడుతుంటుంది. వేర్వేరు బిడ్డలతో అల్లుకుపోయిన వారిరువురి కంటబడగూడదని నిర్ణయించుకున్నది. ఎందుకనో సినిమాలకంతగా పోదు. పుస్తకాలు యెక్కువ చదువనుకూడా అంత మనస్సుండదు. ఎక్కడపని చేస్తున్నదో అక్కడ మనస్సు పూర్ణంగా లగ్నమై వుంటుంది. కార్ఖానాలోని బొమ్మలపనిలో గొప్ప నిపుణత్వం సంపాదించాలనే అభిలాష అమితమైంది.

బ్రీజ్‌బెల్లా (కరుణామయి) ఆరోజు అపరాహ్నసమయంలో విశ్రాంతికని విడువబడిన గంటలో తన సంచిలోని వుత్తరాన్నిదీసి యేకాంతంగా కూర్చుని మరోమాటు చదువుకుని తిరిగి సంచిలోనే పదిల పర్చి ఆవిషయాన్నే ఆలోచిస్తున్నది. ఎంత విచిత్రం! ఈ ఖాళీ సమయాలలోకూడా బొమ్మలు నిర్మించుట నేర్చుకొనుటలో అలవాటుగా నుండే ఆమె నేడు వంటరిగాకూర్చుని తపోనిమగ్నంలో నున్నట్లు ఏమేమో ఆలోచిస్తున్నది. ఇపుడామెకు గడిచిపోయిన జీవితంలోని అనాధ ఘట్టాలన్నీ వరుసగా మనసులో మెదులుతున్నవి. తన బాధలను నెమరువేసుకున్నట్లవుతున్నది.

ఆ వుత్తరాన్ని కార్ఖానాకు తనగదికి త్రిప్పుతూ మూడురోజులు గడిపివేసింది. మానవమనస్సు కఠినత్వంతో పరువులెడుతున్నంతసేపు అచంచలమై ముందుకు మూర్ఖతతో పరువులెడుతుంటుంది. బలహీనత పడినపుడు జలమువలె చంచలములై తొణికిసలాడుతూ వలకను వెదుకులాడుతుంటుంది. పెద్దపెద్ద కుటుంబాలకుచెందిన యువకులువ్రాసిన వుత్తరాలను చదువనుకూడా యిచ్చగించక వుగ్రురాలై చించివేసి చిందులుద్రొక్కిన బ్రీజ్‌బెల్లా నేడు ఒక అమాయకుడు అర్భకుడు అన్యదేశీయుడు అవహేళనపాత్రుడు అయిన ఒక వెర్రివాడువ్రాసిన వుత్తరాన్ని ఒకమాటుగాదు అనేకమారులు చదువుతూ ధాతృత్వ మూర్తిగా నూతనత్వాన్ని ధరిస్తున్నది.

నాల్గోరోజు ప్రభాతసమయంలోకూడా మొదటవుత్తరంవలెనే ద్వితీయ పత్రం దొరికింది. అది ఒకే పేజీలోని వ్రాతఉత్తరం.

"ఓ కరుణామయ దేవతా,

దురవస్థలలోబడి దుఃఖిస్తున్న దీనుణ్ణి. నేనొక అన్యదేశపు అనాధను. నా మాటలను అర్ధంచేసుకోగల శ్రద్ధ యెవరికీలేదు. నాకు యిక్కడిమాట ఒకటీ అర్ధంగాదు. నా మాటలునాకే అర్ధంకాకుండా, నాకు నేనే అయోమయుణ్ణిగా తయారవుతున్నానని భయంగావుంది. నా ప్రయత్నాలన్నీ వ్యర్ధమయినవి. మీరు శ్రద్ధను శ్రమనుతీసుకుని నాకు ఒక బాట చూపుతారని అవిచ్ఛిన్నమైన ఆశకలుగుతున్నది. అందుకే నా విషయాలను విపులీకరిస్తూ వ్రాసిన పదిపేజీల వుత్తరాన్ని యిక్కడే విడిచిపోయాను. యేనాడయినా మీరు యీ గదికి రావటం జరిగితే యీ రెంటినీ చూడగలరని ఆశపడుతున్నాను." అని ఆ వుత్తరంలోవుంది.

ఈ ద్వితీయఉత్తరాన్ని చదివినపుడు ఆమె హృదయం మరింత కంపించింది. ఇపుడు మొదటివుత్తరం విలువతగ్గింది. ఈ వుత్తరం అమూల్యమైందిగా తోస్తున్నది. ఆ పదిపేజీలకంటె యీ అరపేజీ వుత్తరం అతని బాధను సుస్పష్టంగా వ్యక్తంచేస్తున్నది.

అతను బాధలలోనుంచి విముక్తిపొందే బాటను చూపమంటున్నాడు. "అది యెలాంటిబాట? ఏమిబాట?" అని ఆమెలో ఆమె అనేకమారులు ప్రశ్నించుకున్నది. ఆ బాటకొరకు మనస్సు శోధిస్తున్నది.

రక్తపోటు బాధలోని వ్యక్తి మొదటిమాటుగా నిషామత్తు సేవించినప్పుడు హాయిని పొందినపుడు, పదేపదే ఆ నిషామత్తువైపుకే పరువులెత్తినట్లు, అంధకారంలో తపుళ్ళాడుతున్న విజయ్‌కు బ్రీజ్‌బెల్లా ద్వారా తనకు సహకారం లభిస్తుందని ఆశించాడు. ఏదో ఒక ఫలితాన్ని ప్రత్యక్షంగా పొందేవరకు మనస్సు అటుఇగ్నమవుటలోనే వుపశాంతి లభిస్తుంది. అందుకే రెండో ఉత్తరం, తరువాత మూడోది, వ్రాశాడు.

ఇపుడు బ్రీజ్‌బెల్లాగది కవాటాలు తెరిచినపుడే వుత్తరమేమయినా వుందేమోనని నిత్యము లైటువేసి వెదికి నిశ్చింతురాలవుతున్నది. రెండోవుత్తరం దొరికిన తరువాత నాలుగురోజులకు మరో వుత్తరం తృతీయం లభించింది.

"అభాగ్యుడనైన నన్ను ఆపత్తిలో దెబ్బలబారినుండి రక్షించి,

మరోమాటు ఆతిథ్యమిచ్చి ఆదరించిన దేవతాస్వరూపిణియైన ఓ కరుణామయీ__

ఆశా నిరాశలమధ్య నలిగిపోతున్న అయోగ్యుణ్ణయిన నేను నీ కిదివరకే తెలియజేసుకున్నాను. ఏ పార్కులో కూర్చుని మ్యాపులో వెతుక్కుంటున్నవాడిని ఆదరంతో తీసుకెళ్ళి ఆతిథ్యమిచ్చావో ఆ పార్కులో ఆచోటే యెక్కువగా గడుపుతున్నాను. అక్కడినుంచే నీ తెన్నులు చూస్తూ నిత్యనిరాశ పొందుతున్నాను. తిరిగి నీ దర్శనభాగ్యం యీ దీనుడకి కలుగదేమోనని భయకంపితుడ నవుతున్నాను. నీ గదిచుట్టూ తిరిగి విఫలుడనైకూడా ఆశతో యీ వుత్తరాన్ని వ్రాస్తున్నాను. ఆశతో బ్రతుకుట ఆశతోనే చచ్చుట మానవునికి మామూలుగాబోలు" అనివుంది.

ఇంగ్లీషు స్థాయికూడా బాగుంది. ఇపుడీ వుత్తరంముందు ద్వితీయ వుత్తరం విలువకూడా తీసిపోయింది. ఈ వుత్తరం రెండో వుత్తరం కన్న చిన్నది. అయినా యిందులోనే విషయాలన్నీ వున్నట్లు తోచింది. అతను నిత్యమూ ఆ పార్కులో వుంటున్నట్లు వ్రాశాడు. అది ఆమెకు మరింత ముఖ్యంగా తోచింది. అందుకనే ఆ పంక్తిని మరీమరీ చదివింది.

బ్రీజ్‌బెల్లాకు నిద్రపట్టలేదు. ఏసుప్రభువు తనకుకూడా ఒక గొప్ప ఆధిఖ్యత నిచ్చినట్లుతోచింది. అల్పమైన తాను ఒక మానవునికి జీవిత మార్గాన్నిచూపగల శక్తివంతురాలుగా పరిగణింపబడుతున్నందుకు మానసికఆనందం కలుగుతున్నది. తను గొప్పగా జీవించుటకంటె మరొకరిని అంధకారంనుంచి వుద్ధరింపగలుగుట మహోన్నతమైందిగా ఆమెలోని మనస్సు ప్రతిధ్వనించింది. ఆ పార్కులోకి వెళ్ళి ఆ వెర్రివానిని కలుసుకుని ఆదరించాలనుకున్నది. అతనిని వుద్ధరించే వుపాయాలను కూడా నిర్ణయించే ఆలోచనలతో రాత్రిని గడిపివేసింది.

తెల్లవారి తలుపు తీసినపుడు గదిముందు గచ్చుమీద రుధిర మరకలు రెండుమూడుచోట్ల కనిపించి చకితురాలయింది. పరిశీలనగా పరికించినపుడు గదిమెట్లుప్రక్కగా రెండుచోట్ల రెండుగుండీలు కనిపించినవి. అక్కడ యెవరూలేరు. వూహకు అందనూలేదు. ఆమె మనస్సు తిరిగి ఆ వుత్తరంమీదికి, ఆ పార్కుకు వెళ్ళే విషయంవైపుకు

మరలింది. ఆకర్షణీయమైన ఆ విషయాలముందు యిలాంటివి మరపుతెర క్రిందనో అశ్రద్ధఅడుగునో పడిపోవుట పరిపాటి.

నేడు స్టొ వెలిగించే అంత టయంలేదన్నట్లు, రెండుగంటల ముందే ఆఫీసుకు బయలుదేరింది. ఆమె పాదాలు ఆ పార్కువైపుకే నడిచినవి. ఉండవలసిన స్థానంలో అతనులేడు. పార్కు అంతటా వెదికినా అతనులేడు. ఆయన నివాసమెక్కడో తెలియదు. ఆ విషయం వుత్తరాలలో వ్రాయనూలేదు. తాను తొందరపడి వుదయమే వచ్చిందిగాని యీ సమయంలో యెందుకుంటాడు. అని తనలోతానే అనుకుని ఆఫీసు వైపు వెళ్ళిపోయింది.

కార్ఖానానుంచి అందరికంటే వెనుక బయలుదేరే బ్రీజ్‌బెల్లా రెండుగంటల ముందే ప్రత్యేక పర్మిషన్‌తో బయలుదేరింది. వెతుక్కుంటూ పార్కులోని ఆ స్థానానికొచ్చి నిస్పృహతో దీర్ఘనిట్టూర్పును విడచింది, అక్కడే నిలచి అన్నివైపులాచూసింది. హతాశురాలై అక్కడే కూలబడి దిక్కులు వెదకసాగింది. అతని తృతీయ వుత్తరాన్ని తీసి చదివింది. అందులో స్పష్టంగా పార్కులో నిత్యమూ యెదురు చూస్తున్నట్లున్నది. మిగిలిన రెండు వుత్తరాలను కూడా తీసి చదివి అన్నిటినీ తిరిగి బ్యాగ్‌లో పెట్టుకుని రెండుగంటలు కాలయాపన చేసింది. అతని జాడ లేదు. నిరాశతో యింటికి వెళ్ళిపోయింది.

మరోవుత్తరమయినా పడివుంటుందేమోనని ఆత్రుతతో నిత్యమూ తలుపులు తెరచి పరిశీలనచేస్తూ నాలుగురోజులు గడిచిపోయినవి, కాని నిష్ఫలమయింది. కార్ఖానానుంచి రోజూ పార్కుకు వెళ్ళి గంటకాలక్షేపం చేస్తూ నిరీక్షణచేసింది. ప్రయోజనంలేదు. ఉత్సాహానికి వూతం దొరక నందువలన ఆమె మనస్సు చంచలమైంది. ఆ వుత్తరాలయెడ నిరాదరం కలిగింది. అందులోనివన్నీ అబద్ధాలనిపించింది. కృత్రిమంతో మోసానికి యీ రూపంగా ప్రారంభించి భయంతో విరమించుకుని వుండవచ్చును కున్నది. ఆ వుత్తరాలలో వ్యక్తంచేసిన బాధ భక్తి అన్నీ శుద్ధ నటనగా నిర్ణయించుకున్నది. భారతదేశంనుంచి వచ్చిన ఒక యువకుడు యింత మోసానికి దిగుట భరింపరానిదిగా మనసులో ద్వేషం ప్రబలింది. ఆ వుత్తరాలను చించి పారవేయాలనుకున్నది. ఆ వ్యక్తి కనిపించే

నపుడు కఠినంగా దండించను ఆధారాలుగా వాటిని వుంచుటే మంచిదని నిర్ణయించుకున్నది. అతని దీనదృశ్యాలు గుర్తుకొచ్చినవి. అతివినయం లోనే దూర్తత దాగివుంటుందని, తాను అమాయకంగా అతనివైపు జాలితో పార్కుకువెళ్ళి వెదుకుట గొప్ప పొరపాటని యెన్నోమారులు అనుకున్నది. ఆ విషయాలు గుర్తుకొచ్చినకొంది హృదయం రెచ్చి పోతున్నది.

ఆ మరురోజే కార్ఖానాలోవున్న బ్రీజ్‌బెల్లాకు పోలీసుసమను వచ్చింది. బ్రీజ్‌బెల్లాకు సమనున్నదని పోలీసు కేకబెట్టినపుడు ఆమె హృదయం దడదడ కొట్టుకుంటున్నది. పనివాండ్రందరు వుత్సుకభరిత దృక్కులతో చూస్తున్నారు. కార్ఖానాకామందు బాధతో నొచ్చుకుంటూ "ఏమి జరిగింది? ఆమె చాలా యోగ్యురాలు" అన్నాడు పోలీసువానితో. "ఆమెగారికి ఒక సాక్ష్యసమను యివ్వ వచ్చానుసార్" అని వినయంతో అన్నాడు పోలీసు.

"ఏమికేసు అది?" అని కార్ఖానాకామందు ప్రశ్నించాడు.

"క్రిమినల్ కేసండి. అందులో బ్రీజ్‌బెల్లాగారి కేమీ సంబంధం లేదు. కేవలం సాక్షిగామాత్రం వారికి సమనుచేశారు" అన్నాడు పోలీసు.

ఆమెనేరమేమీ లేదని, ఆమె కేవిధమైన అపకారము జరుగదని తెలిసి కామందు ఆనందపడ్డాడు. ఆమె అందరికంటె మిన్నగా శ్రమ జేస్తూ కార్ఖానాక్షేమాన్ని కోరుతుంది. అందుకే కామందు కామెయెడల ప్రత్యేకాభిమానమున్నది.

పోలీసు, కామందుకుచెప్పిన మాటలు వినినపుడు ఆమెహృదయం కుదుటపడింది. నేత్రాలుమూసి ఏసుప్రభువును ఒక్కమాటు స్మరించింది. కదిలివెళ్ళి ఆ పోలీసుయిచ్చిన సమను నకలుమీద సంతకంపెట్టి యిచ్చి వేసి నిట్టూర్పు విడచింది. తనకందిన ఆ సమనును బ్యాగ్‌లోపెట్టుకుని కార్యక్రమంలో లీనమైంది. ఆమె కార్ఖానాయందు మానమర్యాదలతో గూడిన గంభీరతతోనుంటుంది. అందుకే ఆమెతో అనవసరవిషయా లలో సంభాషించే సాహసముండదు. అది యేమికేసో, సాక్ష్యమేమిటో యెవరూ ప్రశ్నించలేదు. పొందిన భీతినుంచి బయటపడినట్లు భావించిన ఆమె పరిశీలనలో దిగలేకపోయింది.

ఇంటికిచేరిన బ్రీజ్‌బెల్లా ఆ సమనును యెంతో పరిశీలనచేసింది. కేసునెంబరు, కోర్టువివరము, వాయిదాతారీఖుమాత్రం స్పష్టంగా అర్థమవుతున్నవి దప్ప, ఎవరిసంబంధమో, నేరమేమిటో, తానేమి చెప్పాలో తెలియలేదు. తన నేరంగాదు, తనకు ప్రమాదమూలేదు అని మనస్సును స్థిమితపర్చుకున్నది. వాయిదా కింకా రెండురోజులు పైమున్నది.

బ్రీజ్‌బెల్లా కిపుడు ఆ భారతీయునిగురించి గాని, అతని వుత్తరాల గురించి గాని యెక్కువ ఆలోచించగల, నిందించగల అవకాశంలేదు. కోర్టుకెళితే యేమి అడుగుతారో, యెవరినిగురించి యేమి చెప్పాలో, తనకది యేరూపంగా సంబంధించినవిషయమో, మొదలగు విషయాలు ఆమె మనస్సులో పరువులెడుతున్నవి. తన తల్లికో, తండ్రికో సంబంధించిన విషయమేమోనని ఆందోళన కలుగుతున్నది.

ఎన్నడూ ఆమె సెలవుకోరి యెరుగదు. అనివార్యమై కోర్టు కొరకు సెలవుకోరింది. పగలు 12 గంటలకు కోర్టులో హాజరుకమ్మని ఆ సమనులో వుంది. కాని ఆమె యెన్నడూ కోర్టు చూసియెరుగదు. భయంతో 10 గంటలకే బ్రీజ్‌బెల్లా ఆ సమనులోని అడ్రసుప్రకారము కోర్టుకు చేరింది. అది పోలీసు ప్రత్యేకకోర్టు. అందు యెక్కువ చేరిన జనం లేరు. అరడజనుమంది రెండుబల్లలమీద కూర్చున్నారు. లోపల హాలువలెనున్న పెద్దగదిలో టేబులుముందు కూర్చున్న పోలీసుఆఫీసరు ప్రక్కన రెండువైపుల ఇరువురు చిన్నఆఫీసర్లు నిలిచి సావధానచిత్తులై యున్నారు. దూరంగావున్న ఒక బల్లముందున్న మరో చిన్నఆఫీసరు విసుగులేకుండా ఫైల్సు తిరుగవేస్తూ వ్రాసుకుంటున్నాడు.

అరగంటలో బల్లమీదనున్న వారందరిని విచారించి వాయిదాలు వేసి పంపించారు. క్రొత్తగా వచ్చినవారు ఖాళీఅయినచోట ఆసీనులవుతున్నారు. బ్రీజ్‌బెల్లా ఎవరిని సంప్రతించాలో, యేమిచేయాలో తెలియక గోడప్రక్క నిలిచివుంది. ఆమెను యెవరూ పలుకరించలేదు.

సంకెళ్ళువేసిన ఒక ఖైదీని యిరువురుపోలీసులు వెంట తీసుకొచ్చి లోపల ప్రవేశపెట్టారు. బైట బల్లమీదనున్న యిరువురిలో ఒక్కొక్కరినిగా పిలిచి సాక్ష్యవాఙ్మూలంగాబోలు తీసుకుని పంపివేశారు. ఖైదీని తిరిగి జైలువైపు తీసుకెళ్లారు. ఈదృశ్యాలను చూస్తున్న

బ్రీజ్‌బెల్లా గడియారం చూసుకున్నది. 12 గంటలయింది. తనను కోర్టులో హాజరుగమ్మన్న టైము సరిగ్గా యిదే. ఆ లోపలనున్న ఆఫీసరు ముందు హాజరుగావాలనే కోర్కెతో రెండడుగులు ముందుకువేస్తుండగా శిరస్సుకు బ్యాండేజి కట్టబడి రోగిరూపంలోనున్న ఒక ఖైదీని బేడీలు తగిలించి యిరువురు పోలీసువారు తీసుకొస్తుండుటను చూసి నిలిచి పోయింది. ఆ ఖైదీ చురుకుగా అడుగులు వేయలేకపోతున్నాడు. ప్రక్కనున్న ఒకపోలీసు చేతిలోని బొండుబుక్కతో కపోలంమీద బలంగా తపుక్కుమని కొట్టాడు. ఆ ఖైదీ "అబ్బ!"అంటూ పాదాలను ముందుకు నెడుతున్నాడు. ఆ శబ్దం శ్వేతజాతిభాషలలోనిది కాదు. ఆ ఖైదీ శ్వేత జాతిలోనివాడు అసలేకాదు.

బ్రీజ్‌బెల్లాను ఆ ఖైదీ చూడలేదు. కాని ఆమె అతన్నిచూసి గుర్తించినపుడు మ్రాన్పడిపోయింది. కోలుకోవటానికి అయిదునిమిషాలు పట్టింది. ఆమె మనస్సులోని విషయాలు వుక్కిరిబిక్కిరయి పోతున్నవి. అతను యేమినేరం చేసివుంటాడు, అనే ప్రశ్న క్షణమొకరీతిగా మనస్సును మెలికలు త్రిప్పివేస్తున్నది.

ఆ ఖైదీని పోలీసుఆఫీసరు ముందుంచారు. వెంటనే ఒక పోలీసు బైటకొచ్చి "వెల్డన్" అని కేకలుబెడుతూ అటూయిటూ చూశాడు. బైటనుంచి రొప్పుకుంటూ, రోజుకుంటూ సరసరవస్తున్న వ్యక్తి "వస్తున్నాను, వస్తున్నాను" అంటూ మెట్లెక్కి పైకివచ్చాడు. అతనినిచూసి బ్రీజ్‌బెల్లా వెలవెలబోతున్నది. అతను తనపేటలోని ఆటోరిక్షాడ్రైవరు. అత నెందుకొచ్చినట్లో తోచక వికలపడిపోతున్నది. వెల్డన్ పెద్ద పొగరుబోతనికూడా.ఆమెకు తెలుసు. రిక్షాబాడుగలో తగాదాజరిగి ఆ భారతీయుణ్ణి కొట్టివుండవచ్చని వూహ కలిగింది.

వెల్డన్ పోలీసుఆఫీసరుయెదుట నిలిచి సాల్యూట్ చేశాడు. ఆఫీసరు యేవో ప్రశ్నలు వరుసగా ఒకేమాటు వేశాడు. ఆరోజు అపరాహ్న సమయంలో తనరిక్షాను రోడ్డుప్రక్కనుంచి తనయింటికి గల్లీనుంచి పోతుండగా యీ నేరస్థుడు బ్రీజ్‌బెల్లాగదిలో ప్రవేశించి ఆమె సూటుకేసు, బ్యాగు దొంగిలిస్తుండగా ఆమెకు మెలకువకలిగి కేకలువేసినపుడు తానువెళ్ళి అతనిని పట్టుకోను పోరాడినట్లు, ఫలితంగా అతను బయట

రాతిమీద పడిపోయినట్లు, శిరస్సుమోదుకుని రుధిరంకూడా అక్కడే ప్రవహించినట్లు, ఆ సమయంలో బ్రీజ్‌బెల్లా భయభీతితో వణికిపోయి నట్లు వివరంగా తన వాగ్మూలమిచ్చాడు. ఆఫీసరువేసిన మరికొన్ని ప్రశ్నలకు సమాధానంగా, నేరస్థుని తాను యెన్నితిట్టినా, కొట్టినా, అడి గినా ఒక్కజవాబుకూడా చెప్పలేదని అన్నాడు వెల్డన్.

మూడోవుత్తరం దొరికిననాటితెల్లవారే తనవాకిటముందుకనిపించిన రుధిరమరకలు,రాలిపడివున్న గుండీలు ఆమెమనస్సులో మెదులుతున్నవి. తాను పార్కులో వెదికి, నిరీక్షచేసి, నిస్పృహపొంది, అపోహతో అనేకవిధాల నిందించినందుకు విచారపడుతున్నది. వెల్డన్‌మీద చాలా చిరాకు కలుగుతున్నది. బాగా విచారించినపుడు దొంగ అనుకునే పట్టి కొట్టి పోలీసువారి కప్పగించివుంటాడు గనుక అతనిదోషమూ లేదని పరి తాప పడుతున్నది. ఆ ఖైదీ అదోముఖంచేసి ఆఫీసరుముందు నిలిచి వున్నాడు. ఆమె అతనివైపు తదేకంగా చూస్తున్నది. అతనినేత్రాల నుంచి కారుతున్న అశ్రుబిందువులు ఒక్కటొక్కటిగా పృథ్విమీద పడు తున్నవి. అతనిదీనతను భరించలేకపోతున్నది. కంఠం శుష్కించి పణుకుతున్నది.

"బ్రీజ్‌బెల్లా" అన్నపిలుపు లోపలినుంచి వచ్చింది. ధైర్యాన్ని పూరించుకుని, అడుగులో అడుగువేసుకుంటూ లోపల ప్రవేశించి గోడ ప్రక్క నిలిచింది. హృదయం కళవళపడిపోతున్నది. ఏమి అడుగు తారో, యేమిచెప్పాలో, ఆ అమాయకుడు యేమయిపోతాడోననే భీతితో తానొక అసమర్థురాలయినట్లు హృదయాంతరాళంలో కలుగుతున్న తప నతో వూగిపోతున్నది. తా నతనిని విడిపించగలిగితే ఎంత బావుం టుంది! జీవితమే ధన్యమవుతుంది, అని గొణుక్కుంటున్నది.

వ్రాసుకుంటున్న ఆఫీసరు బ్రీజ్‌బెల్లావైపు చూస్తూ "బ్రీజ్‌బెల్లా నీ పేరేనా? వాల్టేర్‌స్ట్రీట్‌లోని 4697/355వ నెంబరు యింటిలో బయటి వైపు గదిలో నీవు వుంటున్నావా?" అని ప్రశ్నించాడు. ఆమె అవునని సమాధానం చెప్పింది. తాము తయారుచేసివుంచిన సాక్ష్యవాగ్మూలం మీద ఆమెసంతకంకొరకు ఆమెవైపు నడిచాడు.

ఆ వాగ్మూలం ఫ్రెంచి వాడుకభాషలో వ్రాసివుంది. ఆఫీసరు

ముందు దాన్ని చదువగలధైర్యం లేదు. చదువాలనేకాంక్ష లేదు. నిరాసక్తతో సంతకంపెట్టి తిరిగి యిచ్చింది. ఆఫీసరు చిన్నినవ్వును ప్రదర్శిస్తూ "సంతకంతోనే సరిపోదు. చదివి అర్థంచేసుకుని సమ్మతించండి" అన్నాడు.

దీనంగా ఆ కాగితంవైపు చూస్తున్నది. ఆఫీసరు సౌంజ్ఞతో ఆ కాగితం తిరిగి ఆమెకివ్వబడింది. అక్షరాలు అలికినట్లు కనిపించుటలేదు. దీక్షను కేంద్రీకరించుకుని చదువ ప్రయత్నించింది.

పగటి రెండవజామున తలుపులు వోరగావేసి తాను గదిలో నిద్రిసుండగా యాచకుడుగా వాకిటముందుచేరిన ఆ నేరస్తుడు గదిలో ప్రవేశించి తన బ్యాగ్‌ను సూటుకేసును చేతబట్టి వెళుతుండగా తలుపు చెక్క తగిలి పడిపోయిన శబ్దంతో తానులేచి కేకలుపెట్టినట్లు, దారిన పోతున్న వెల్డన్‌వచ్చి అపరాధిని పట్టినట్లు, ఆ కొట్లాటలో నేరస్తుడు బయటకొచ్చిపడి రాతికి శిరస్సు మోదుకున్నట్లు రుధిరం కారినట్లు, వెల్డెన్ లేకపోతే తనప్రాణాన్ని తీసివుండేవాడని, నేరస్తుడు దోపిడితనంలో అలవడుటేగాక హత్యచేయ వెరపులేని భయంకరవ్యక్తి గనుక కఠినమైన శిక్ష యివ్వవలసిందిగా తాను కోరుతున్నట్లు తనవాగ్మూలంలో వుంది.

విషాన్ని దిగమ్రింగినట్లు, హృదయాన్ని చిక్కబట్టుకుని వుత్తరాన్ని ముగించివేశింది. ఆమె శరీరమంతా కంపిస్తున్నది. పాదాలుకూడా అదురుతున్నవి. ఆ నేరస్తునివైపు చూసింది. అతని శిరస్సింకా అధోవైపే వున్నది. చిన్న కోరదృక్కులుమాత్రం ఆమెకు కనిపించినవి. అందు భయభీతి జాలి పెనవేసి స్నిగ్ధరూప దీనత ప్రదర్శితమవుతున్నది. ఆరోజు వంటవానిద్వారా రోడ్డుమీద అతను పొందిన పరాభవము కనుల ముందు కనిపించి మనస్సు ద్రవించింది. తిరిగి తన చేతిలోని వాగ్మూలంవైపు చూసినపుడు మనస్సు మరింత వేడెక్కిపోయింది. టపటప భాష్పకణాలు రాలుతున్నవి. తన సాధారణ కార్యక్రమంలోనున్న పోలీసు ఆఫీసరు తను వ్రాస్తూ అర్థంలో ఆపినదానివైపు చూస్తూ ఆమెచేతిలోని స్టేట్‌మెంటు కాగితంకొరకు చేయిచాపాడు. కాని ఆమెనేత్రాలముందంతా అంధకారం ఆవరించింది. గమనశక్తిని కోల్పోయింది. తూలును

ఆపుకోలేక రెండడుగులు ముందుకువేసి, ఆఫీసరు ముందున్న టేబులు మీద శిరస్సును వాల్చింది. ఆఫీసరు ఆశ్చర్యపోతూ లేచి నిల్చి ఆదుర్దా చెందుతున్నాడు. కేసును సృష్టించినవారు గాబరా పడుతున్నారు. బేడీలలో నిలిచిన నిందితుడు వెలవెలబోతూ ఆమెవైపు చూస్తున్నాడు.

అయిదు నిముషాల అనంతరం ఆమె తెప్పరిల్లుకుని శిరస్సు పైకెత్తింది. చేతులలోవున్న కాగితంమీద కారిన కన్నీటితో అక్షరాలు అలుక్కుపోయినవి. సంతకం తుడుచుకుపోయింది. అశ్రుబిందువులు శ్వేదబిందువులు మిశితమై ముఖమంతా తడిసినట్లున్నది. నేత్రాలు రక్తంపూరించుకుని జ్యోతులవలె భీతిని గొల్పుతున్నవి. జేబురుమాలుతో ముఖం అద్దుకున్నది. అధరాలు అదురుతున్నవి.

"ఏమిటి? అలా అయిపోయారేమిటి? మీకేమయినా ఫిట్సు వస్తుంటవా?" అని ప్రశ్నించాడు అధికారి.

ఆమె ఆయనవైపు దీనంగా చూస్తూ, గాద్గదిక కంఠంతో "నన్ను క్షమించండి. అంతా అయోమయంగావుంది. ఈ కేసేమిటో నాకసలు అర్థమవుటలేదు." అంటూ చేతిరుమాలు కళ్ళమీదవేసి అదుము కుంటున్నది.

అధికారి కఠినకంఠంతో— ఆ భారతీయుణ్ణి నీ వెరుగుదువా?

బ్రీజ్‌బెల్లా : రోడ్డుమీదపోతూ ఒక వంటవానికి యీ వ్యక్తి తగిలినందున అతని చేతిలోని గాజుపాత్ర వగైరాలు పగిలిపోయినవి. ఆ క్రోధంతో ఆ వంటవాడు వీరిని కొడుతుంటే నేను అడ్డుపడి విడిపించాను.

అధికారి : అయితే అతనికి నీ గది తెలుసా?

ఆమె : పై సంఘటన జరిగిన కొంతకాలానికి పార్కులో కలిసి నపుడు, అతని దీనతకు, అమాయకతకు జాలినొంది వెంట తీసుకొచ్చి నా గదిలోనే ఆతిధ్యమిచ్చి పంపాను.

అధికారి : అతనినిగురించి మీకేమయినా తెలుసునా?

ఆమె : చదువుకొరకని యీ దేశమొచ్చి బాధపడుతున్నాడు. భాష క్రొత్త, దేశముక్రొత్త, వాతావరణం క్రొత్త, ఆదరించేవారు ఒక్కరూలేరు. అందువలన వికలం చెందుతున్న బాధితుడు.

అధికారి యింకా అనేక ప్రశ్నలువేసి ఆమెద్వారా పూర్తి వివరాలు తెలుసుకొనిన అనంతరం, ఆమెకింతవరకు యీ కేసు పెట్టిన విషయము వగైరాలు తెలియనట్లు వినినపుడు పోలీసువారందరిమీద వుగ్రుడై మండి పడ్డాడు. తనబ్యాగ్‌లోని వుత్తరాలనుతీసి చూపుతూ ఆమె ఆ వ్యక్తి యెడల కన్నీరు కారుస్తూ, ఆ అమాయకునియెడల తనకు జాలి అపారంగా కలదని, అతనిని విడిచిపెట్టమని ప్రార్థిస్తూ ఆకస్మికంగా అధికారి పాదాలమీద వాలింది.

జరుగుచున్న సంభాషణలోని శబ్దార్థాలు తెలియకపోయినా అభిప్రాయాలు అర్థమవుతున్నవి విజయ్‌కు. తాను యెవరిని కరుణామయిగా తలంచాడో ఆమెపేరు బ్రీజ్‌బెల్లా అని అర్థంచేసుకున్నాడు. ఆమె తన కొరకుచేస్తున్న వినతిని చూస్తున్నపుడు తను యీ నాలుగైదు రోజులు అనుభవించిన మానసికబాధంతా సుఖంగా గోచరిస్తున్నది. తాను పడిన కష్టమంతా తపస్సు అయినట్లు అది నేడు ఫలించి ప్రభవించినట్లు ఆత్మానందం భాష్పకణాలరూపంలో బయల్పడుతున్నది.

పోలీసుఅధికారి తన పాదాలమీదవాలిన బ్రీజ్‌బెల్లాను లేవనెత్తి యీ కేసుద్వారా ఆమెకేవిధమైన అపకారము జరుగదని హామీనిస్తూ ధైర్యాన్నిస్తూ, బుజ్జగింపుమాటలతో ఆ అన్యదేశస్థుడు, అన్యజాతివాడు అయిన అతనినిగురించి అంతగా ఆమె బాధపడవలసిన అవుసరంలేదని, ఆమె సాక్ష్యంలేకుండానే అతనిని విచారిస్తామని చెప్పాడు.

ఆ మాటలతో ఆమెలోని వ్యథ అధికమైంది. రుద్ధకంఠంతో అతనిని విడుదల చేయమని వినతితో ప్రార్థించింది. అది కేవలం తన లోని కరుణతప్ప మరేమీకాదని కూడా చెప్పింది. అతను యెక్కడుంటున్నది, ఎలా వుంటున్నది మొదలగు వివరాలు పూర్తిగా విచారణ జరుగనిదే విడుదలచేయను వీలుపడనందున తాను జామీనుగావుండి విడుదల చేయించింది.

సంకెళ్ళనుంచి విముక్తుడైన విజయ్ భయకంపిత హృదయంతో కనిపించిన పోలీసుకల్లా శాల్యూట్‌చేస్తూ, తప్పటడుగులు వేసుకుంటూ ప్రహరీ బయటకొచ్చాడు. బయటవైపు గేటుప్రక్కగా నిలిచి రోడ్డుమీద కార్లట్రాఫిక్కును చూస్తున్న కరుణామయినిచూసి

విస్మితుడయ్యాడు. ప్రీతితో పెంచుకుంటున్న జాతికుక్క యెవరి బంధం లోనో యిరుక్కుపోయి అనేక అవస్థలు పొందిన అనంతరం విముక్తి పొంది యజమానిముందు చేరినపుడు ఆయన పాదాలమీద దొర్లిగింతలతో విన్యాసాలద్వారా తన భక్తి విశ్వాసాలను తెలుపుకొనునట్లు క్షణంలో విజయ్ ఆవేశితో త్వేరణతో ఆమె పాదాలకు చుట్టవేసుకున్నాడు. లెమ్మని యెంతబోధించినా వినిపించుకోగల స్థితిలోలేడు. ఎవరయినా చూసి యేమనుకుంటారో ననే సిగ్గుతో కుంచించుకుపోతూ శిరస్సుబట్టి తానే లేవనెత్తింది. దృష్టిలో దృష్టిబరపినపుడు అతని నేత్రాలు జల భరితమైనవి.

ఆమె గంభీరతను కూడదీసుకుంటూ "నన్ననుసరించండి." అని నడక ప్రారంభించింది. ఆలోచనలు చేయగల స్థితిలోలేడు. తల్లివెంట తన్మయత్వంలో పరువులిడు పసివానివలె ఆమె ననుసరించి అడుగులో అడుగువేస్తూ పోతున్నాడు. ఆమె మనస్సులో యేమి ఆలోచనలు దొర్లు తున్నవోగాని దీర్ఘమైన పరధ్యాసలోనే పయనిస్తున్నది. ఒకచోట వెనుం వేగంగా వస్తున్న ట్రక్కుక్రింద పడిపోయేదే. ఆమె నడకలో వేగం లేదు. వెతుక్కుంటున్నదానివలె పయనిస్తున్నది. అరగంటప్రయాణాన్ని గంట నడిచింది. మనస్సులో యెన్నో విషయాలు మరుగుతున్నా నిశ్చిం తుడై ఆమె అడుగులో అడుగు వేసుకుంటూ నడిచాడు విజయ్.

ఎటుచేరాడో ఎలాచేరాడో తెలియదుగాని తనకంటె ముందేచేరి తనగదియెదుటనున్న వెల్డన్‌నుచూసి బ్రీజ్‌బెల్లా తడబడింది. భయంగాతో చింది. కోరచూపులతో కనవెనుకనున్న పరదేశిని గమనించింది. గది ద్వారంవైపు వెళ్ళకుండా ప్రక్కనున్న వెల్డన్ యెదుటకెళ్ళి యేమిటని ప్రశ్నించినట్లు ముఖాముఖిని చూసింది.

అతను అణచుకున్న క్రోధంతో "నీవు చేసింది చాలా చెడ్డపని" అన్నాడు.

బ్రీజ్‌బెల్లా నూతనంగా యీ పేటలో ప్రవేశించినపుడు ప్రేమ యాచనలు ప్రలాపాలు జరిపినవారితో వెల్డన్‌కూడా ముఖ్యుడు. వెల్డన్ చదువుకున్నవాడు, ముష్టియుద్ధవీరుడు. డ్రామాల పిచ్చితో నెపోలియన్ వీరుడుగాను, మహోచోట రసికుడుగాను, పాత్రలు ధరిస్తుండేవాడు. గాలి

తిరుగుడులో అలవడినందున వుద్యోగాలలో నిలువలేక ఆటో రిక్షా నడుపుకుని జీవనం దొర్లిస్తున్నాడు. ఒక తల్లి బాధ్యత తప్ప యింటి బాధలంటూలేవు. అతన్ని పేటలో రౌడీయని ప్రచలితంగా చెప్పుకుంటారు. మూర్ఖుడుమాత్రంకాదు. అందువలనే అతనివలన అపకారాలు పొందినవారు లేరు. ఉపకారాలు పొందినవారు అనేకం.

తన ప్రేమను నిరాదరంచేసినపుడు తాను వివాహంచేసుకుని తన శిరోధార్యంగా పూజిస్తానన్న వినతిని నిరాదరంచేసినపుడు వెల్డన్ ఆవేశ పూరితుడై ఆమెయెడల క్రుద్ధుడయినాడు. కాని కొన్నిమాసాలు జరిగాక ఆమె పవిత్రురాలని, శాంతిప్రియురాలని, ఒక క్యాథలిక్కు మహాభక్తురాలని అర్థంచేసుకున్నపుడు ఆమెయెడల నున్న విరుద్ధత పోయి ఆదరాభిమానాలు కలిగినవి. అందుకే ఆమెకు తా నపకారం చేయకుండుటే గాక, జరుగకుండా రక్షకవచమువలె చూస్తున్నాడు. నేడు ఒక అనాథ అనామక అన్యదేశీయునియడల, తనయిల్లు దోయవచ్చిన దొంగయడల కరుణాభరితురాలై రక్షించి వెంట తీసుకొచ్చుటను సహించలేకున్నాడు. ఆ విషయాలలోని అనేకభాగాలను అర్థంచేసుకోగలిగింది గనుకనే బ్రిజ్ బెల్లా వణికిపోతూ అతనిని ప్రాధేయపడగోరుతున్నది.

"నన్ను క్షమించమని ప్రాధేయపడుతున్నాను" అని దీనాతి దీన స్వరంలో అన్నది.

"కొరివితో తల గోక్కుని తరువాత పశ్చాత్తాపపడక తప్పదు" అని హుంకరిస్తూ అన్నాడు. కాని ఆమె వూహించిన స్థాయికంటె అతను ప్రకటించిన కోపం చాలా తక్కువయినందుకు ధైర్యంగలిగింది.

అనునయంతో తన సంచిలోని మూడువుత్తరాలను తీసి ఆతని కిస్తూ, తనకూ అతనికి ప్రత్యేకమయిన యే సంపర్కమూ లేనని, వాస్తవికంగా అత నొక అసమర్థుడై అనేకఅవస్థలకు గురియవుతున్నాడని, తను ఒక వంటవాని ఆపదనుంచి రక్షించినవివరము మొదలగు యావత్తును గడగడ చెప్పేసింది. తా నొకమాటు యిచ్చిన ఆతిథ్యవిషయము చిత్రించి తిరిగి అలానే, నేడుకూడా అతిథ్యమిచ్చి పంపివేస్తానని, ఈవిషయం తనను క్షమించి అన్యథా భావించవద్దని ఆమె వినతి చేసింది.

ఆ అన్యదేశీయునియెడలగల హేయత హృదయంలో కోతకోస్తున్నది. కాని ఆమెను నిరోధించలేకపోతున్నాడు. సంవత్సరంపొడుగున అనుభవంతో తాను చూస్తూవచ్చిన ఆమెపవిత్రతను, వ్యక్తిత్వాన్ని శంకించలేక నిరుత్తరుడై సరసర వెళ్ళిపోయాడు.

ఒక ఘోరఆపదనుంచి విముక్తిపొందినవానివలె, దీర్ఘశ్వాసను విడుస్తూ వెళ్ళి గదితాళం తీసింది. వెనుదిరిగి "రండి" అంటూ తలుపు తెరిచి లోపల ప్రవేశించింది.

ఫ్రెంచిభాషలో జరిగిన వారిసంభాషణలో ఒక్కమాటకూడా అర్థంకాలేదు. ఆమెపిలుపు బాగా అర్థమైంది. శబ్దంలో మధురత్వం వుట్టిపడుతున్నది. ఆమెముఖంలో ఉత్సాహరేఖలు వురకలు వేస్తున్నవి. ఆమె ఆజ్ఞానుసారం వెళ్ళి యీజీఛైర్‌లో కూర్చున్నాడు. అతని దుస్తులమీద మాసిన రుధిరమరకలు కనిపిస్తున్నవి. గడ్డం పెరిగివుంది. తైలసంస్కారంలేని శిరస్సు మరింత వికారంగావుంది.

క్షణంలో ఆమె యెలక్ట్రిక్ స్టౌమీద మాల్టు తయారుచేసి తెచ్చి ముందుంచి "తీసుకోండి" అన్నది.

ఆమె తానుకూడా మాల్టు సేవిస్తూ "శిరస్సుమీద గాయాలు తగిలినవా?" అని ప్రశ్నించింది.

"అంత పెద్దవికావు. దానికంటె అవమానించుటద్వారా హృదయానికి కలిగిన గాయమే పెద్దది" అని ఇంగ్లీషులో అన్నాడు.

అతను పొందుతున్నవన్నీ అవమానాలు, ఆపదలు తప్ప మరేమున్నది అని బాధపడింది. కేవలం సలహాతోనే ఒక అమాయకుని సరిదిద్ది సమర్థునిచేయగల సావకాశం వుండికూడా ఒక్కరైనా లక్ష్యం చేయకపోతున్నందుకు బాధపడింది. "కష్టాలలోనే మనుష్యునిశక్తి పెరుగుతుంది, సమర్థత్వం సమకూరుతుంది. కనుక ధైర్యం సడలనీయకండి, క్రమేణా అన్నీ చక్కబడుతవి" అని ఆమె ఆంగ్లంలో విన్నవించినపుడు, ప్రతిశబ్దము స్పష్టంగా అర్థమయింది. ఇంత బాగా ఇంగ్లీషువచ్చికూడా యిదివరకింత స్పష్టంగా యెందుకు మాట్లాడలేదా అను శంక కూడా కలిగింది. అందరికీ యిలానే తెలుసునేమోననిపించింది. తెలిసినా తనకొరకని ప్రతిశబ్దాన్ని నొక్కి విడదీసి పలుకవలసిన అవుసర

మేముంది! అందరికీ అన్యభాష అంతగా యెందుకు తెలుస్తుంది? అని అనుకుంటుండగా "ఏమిటి ఆలోచిస్తున్నారు?" అన్నది.

సిగ్గిలుతున్న ముఖంతో "యేమీలేదు - యేమీలేదు" అన్నాడు.

ఆమె కప్పును అవలపెట్టి దగ్గరగానిలిచి అతనిశిరస్సుకున్నకట్టును విప్పదీసింది. శిరస్సు వెనుకభాగాన దూది అంటివుంది. గాయం అంత పెద్దదిగా కనిపించలేదు. అంటివున్నదూది సరిజేసి మిగిలినదూదిని కట్టుగుడ్డను తీసుకెళ్ళి బయట పారవేసింది. "ఇక కట్టు అనవసరం" అన్నది.

అతను "ధన్యవాదాలు" అంటూ చేతులు జోడించాడు.

ఆమెస్నిగ్ధప్రేమపొలుకుచిరునవ్వునుప్రదర్శిస్తూ "హూఁ" అన్నది.

తన గదితలుపులను బిగించి లోపల గడియవేసివచ్చి, నూనెసీసా దువ్వెన, అద్దము చేతులలోవుంచి "నూనె వ్రాసుకుని, గాయాన్ని రేప కుండా దువ్వుకోండి" అన్నది.

అతను మారుమాటలేకుండా వెర్రివానివలె చూస్తున్నాడు. బ్రీజ్ బెల్లా అలమరాతీసి ఒక్కటొక్కటిగా డబ్బాలు తీస్తున్నది. టక్‌టక్‌మని తలుపులనుంచి యెవరో మ్రోగిస్తున్నశబ్దం విని, ఆమె అలానే ఆగిపో యింది. వెల్డన్ తిరిగి వచ్చివుంటాడని, యీదఫా యేదో ప్రమాదంచేయ కుండా విడువడని భయకంపితురాలయింది. తిరిగి ధ్వని మరింతగా విని పించింది. తలుపు తీయకపోతే నేరం ఘోరరూపం దాలుస్తుందని, వివశురాలై పిల్లిఅడుగులు వేసుకుంటూ భావిదృక్కులను అతని వైపు బరపుతూ తలుపులు తెరచింది.

ఆవచ్చింది వెల్డన్‌గాదు, కార్ఖానాలోని బంట్రోతు. ఆమెమనస్సు కుదుటపడింది. తన క్షేమయినా చిక్కుసమస్య లుత్పన్నమైనవేమోనని, అసలా సాక్ష్యమేమిటని తెలుసుకురావలసిందిగాను, కార్ఖానా సర్వవిధాలా సహాయపడ సంసిద్ధంగావున్నదని మొదలగు వివరాలు దూతగావచ్చిన ఆ బంట్రోతుద్వారా వినినపుడు హృదయానందం కలిగింది. ఈ లోకంలో తనను ఆదరించేవారు, తనబాధలను దిద్దేవారు వున్నట్లు భావించినపుడు నేత్రాలు చెమ్మగిలినవి. వెంటనే ఆ బంట్రోతుకు కొంకి బుట్ట, డబ్బు యిచ్చి యేమోచెప్పి పంపివేసింది.

# 30. అనాధస్వరూపమే యేసుప్రభువు

తలుపులు తీసివుంచే విజయ్‌కెదురుగా బ్రీజ్ బెల్లా కుర్చీ లాక్కుని కూర్చున్నాడు. అతని పెరిగినగడ్డము, మాపుపట్టిన రక్తపుమరకలతో నున్న దుస్తులు, భయభీతులతో చుట్టివేసిన అతనిలోని దీనతచూస్తూ తననుతాను మర్చిపోయింది. సిలువమీదున్న యేసుప్రభువు తనముందున్నట్లుంది. ఆ ప్రభువు ఆర్తనాదం వీనులకు వినిపిస్తున్నది. "అనాధ స్వరూపమే యేసుప్రభువు. అనాధల ఆదరించుటకే ప్రభువు జన్మించాడు. శాంతిసహనాలే ఆయినస్వరూపము. ఆశ్రయించిన అమాయకులను రక్షించుటే ఆయన ఆశయము. ఈ విశ్వంలోని ప్రేమే ప్రభువు విరాట్‌రూపము" అని ఆమె అంతరాత్మ కెవరో వినిపిస్తున్నట్లుతోచింది. నేత్రాలు నులుముకుని తన యెదుటనున్న ఆ అన్యదేశీయుని తీక్షణంగా చూసింది. అతనిమీద కలిగే ఆదరం అధికమవుతున్నది. లోకలోకాలను పరిపాలించే ఆ దేవదేవుని బిడ్డయైన యేసుప్రభువు అంశాలు అనేకం అతనిలో ద్యోతితమవుతున్నది. ఆకలిగొన్నవానికి అన్నము, అనాదరంతో అలమటించేవానికి ప్రేమాదరం, అశాంతితో అంధకారంలో నిస్పృహపొందేవానికి ప్రేమసందేశంలోని వెలుగునుయిచ్చుట తనకు నేరుగా ప్రదానంచేసినట్లని ప్రభువు పలుకులుగా వినిపించినవి. అన్ని దేశాలలోని యావత్తుమానవులు ప్రభువుబిడ్డలేనని, దుఃఖితులవెంట రక్షకుడుగా వుంటూనే పరీక్షలు సలుపుతుంటాడని తనమనస్సులో తానే అనుకున్నది. ఎదుటనున్న అనాధునిమీద ఆదరణ మరింత పెరిగింది. అతన్ని యేదో ప్రశ్నించాలని ప్రయత్నిస్తుండగా, కార్ఖానాబంట్రోతు తిరిగి బుట్టతో హాజరయ్యాడు. వాటి నందుకుని అతనిని పంపివేసి తలుపులు తిరిగి బిగించి లైటువేసింది.

దుఃఖఘట్టంలో సుఖమనేది క్షణపాటు లభిస్తే అది అమూల్యమైంది. అది మనస్సులో చిరస్థాయిగా నిలిచిపోతుంది. ఈనాడు బ్రీజ్

బెల్లాద్వారా లభించిన ఆదరసత్కారాలు సామాన్యమైనవిగావు విజయ్‌కు. తాను ప్రక్కనవుండి ఒక్కటొక్కటిగా తినువరకు బలవంతపెట్టింది. కమ్మటి విలువైన పదార్థాలు, అమృతాలొలుకు పలుకులు, అబ్బ! ఎంత మధుమయ ఘడియలు! ఈ దేశంలో యీ రకమైన ఆదరం యెల్లపుడూ వుండి, తాను కనీసం అనామక డిగ్రీనైనా పొంది పోగలిగితే తనయాత్ర సఫలమైనట్లు భావించుతూ ఆనందడోలికలలో వూగిపోతున్నాడు.

అయిదుగంటలు దాటిపోయింది. ఈ రాత్రికి యిక్కడే పడుకోనిస్తే బావుండుననిపించింది. వెంటనే వెల్లన్ ఏమి వుపద్రవం లేవనెత్తుతాడోనని భీతిగలిగింది. సందిగ్ధఆలోచనలతో కప్పులు సాసర్లు సర్దుబాటుజేసి పని ముగించుకున్నాక, ఆమె హృదయం దడదడలాడింది. భీతిలోని గంభీరతతో "మంచిది, ఇక మీరు వెళ్ళి మరెపుడైనా రండి." అన్నది.

ప్రాధేయపడుతూ తను వుత్తరాలలో విన్నవించుకున్న విషయాలను గురించి తిరిగి ప్రశ్నించాలనిపించింది. కాని ఆమె గంభీరతను జూచినపుడు ధైర్యంచాలక నమస్కరిస్తూ బయటకు నడిచాడు.

రాత్రి పదిగంటలయినా బ్రీజ్‌బెల్లాకు నిద్రపట్టలేదు. నేత్రాలు మూసినా తెరసినా అతని దీనతే కనిపిస్తున్నది. అతనికేదో ఒక సదుపాయాన్ని చేయకపోతే యేసుప్రభువు క్రుద్ధుడవుతాడని పదేపదే అనిపిస్తున్నది. అతనుచేసిన దోషంలేదు పాపంలేదు. నిష్కల్మషమైన సజ్జన హృదయుడు, లోక అనుభవాన్ని అర్ధంచేసుకోజాలక వుత్సాహంతో వూహలవెంట పరువులెత్తుకుంటూ పరాయిదేశంలో వచ్చి పడిపోయాడు. దురాశలుగాని దుష్ట అభిప్రాయంగాని లేని అమాయకుడు. ఇంతవరకు వచ్చాక విషయాలు వివరంగా తెలుసుకున్నాక సహాయపడకపోవటం కూడా పాపమే అవుతుందని ఆమె మనస్సు ఆందోళన పడుతున్నది.

ఏమిచేయటం, ఎలా సహాయపడటం, అని ఆలోచించినపుడు మనస్సు వేడెక్కుతున్నదిగాని సరియైన నిర్ణయం యేరూపంలోను గోచరించుటలేదు. ఆర్థికసహాయమయితే ప్రతినెలా తన జీతంలోని కొంత మొత్తాన్నయినా యిచ్చి సరిపుచ్చుకో గలనని అనుకున్నది. ఆ కొరతను సూచించేమాట యెక్కడయినా వున్నదేమోనన్న ఆదుర్దాతో

వెంటనే లైటువేసి తిరిగి వుత్తరాలన్నిటిని చదివింది. ఆ భావం సూచించే వాక్యం ఒక్కటీ కనిపించలేదు. ఆ ప్రశాంత వాతావరణం స్థిరమనస్సుతో చదివి ఆలోచించినపుడు అందులో అర్థించేదేమిటో అసలే తెలియలేదు. భాషతెలియక పడుతున్నబాధలు, చదువుకొనుటకని తిరిగిన విఫలయత్నాలు, తాను బలుదేరినపుడు వుత్సాహాలు, కారణాలు మొదలగునవన్నీ వివరంగా వున్నవి. కాని తాను చేయగలిగిందేమిటి? ఏ రూపంగా అతనికి సహాయపడగలదు! ఆలోచనలుచేస్తూ అలానే నిద్ర పోయింది.

ఆ విచిత్రవ్యక్తి తనగదినుంచి వెళ్ళి పదిరోజులు గడిచిపోయింది. తిరిగివచ్చి తనముందు హాజరై మరేదో వుపద్రవాన్ని సృష్టిస్తాడని ఏరోజుకారోజు ఆలోచనలుచేస్తూ యెదురు చూస్తున్నది. కాని రాలేదు. తలుపుసందులగుండా వుత్తరంవేసి పోతాదేమోనని గదితలుపులు తెరచి నపుడల్లా యెంతో ఆశతో వెదికి నిరాశపొందింది. ఆశ్చర్యంగానూవుంది. తిరిగి ఏ బాధకు గురియైనాడో, అనుకుంటూ ఆదుర్దా చెందుతున్నది.

బ్రీజ్‌బెల్లా గదినుంచి బయలుదేరిన విజయ్ ఆంథోనీకి తన జైలు దురవస్థలు చెప్పగూడదని నిర్ణయించుకున్నాడు. షాపులో గడ్డముచేయిం చుకుని, శిరస్సుమీద గాయానికంటివున్న దూదిని కనపడనీయకుండా జుట్టును సర్దుకుని, ఆంథోనీ కంటబడకుండా గదిలోకి ప్రవేశించాడు. దుస్తులనుకూడా మార్చివేసుకున్నాడు. ఒక మిత్రునివద్ద అతిథిగా యిన్ని రోజులు గడిపినట్లు చెప్పుకున్నాడు.

విజయ్‌మనస్సు బ్రీజ్‌బెల్లావైపుకే నడుస్తున్నది. ఆమెతప్ప తనను ఆదరించేవారు వుద్ధరింపగలవారు యీ దేశంలోలేరు. కాని ఆ గదికి పోవడానికి ధైర్యంచాలడంలేదు. ఆ వెల్డన్, పోలీసులు గుర్తుకొచ్చి నపుడు గుండె దడదడలాడిపోతున్నది. ఆ వైపుకు పోవడానికి భీతి కలుగుతున్నది.

ఎక్కడెక్కడ తిరిగినా సంధ్యాసమయాలందు ఆ పార్కులోనే కాలక్షేపంచేస్తున్నాడు. తాను యే స్థానంలో బ్రీజ్‌బెల్లాను కలుసుకున్నాడో ఆస్థానంలోనే కూర్చుని "అప్పటివలెనే ఆ దేవదేవి వెనుకగావచ్చి దర్శన మిస్తే యెంతబావుండును! ఆమె స్థితిమంతురాలుకాదు. అందరికంటె

ఆకర్షణీయమైన పరిశుద్ధ ఆత్మను కలిగినది. ఆమెతప్ప నాకీ దేశంలో ఆదరించి వుపాయాన్ని కల్పించువారులేరు. ఆమె యెక్కడున్నదో యేమి చేస్తున్నదో, యెపుడు కనిపిస్తుందో?" అని తెరపిలేని ఆలోచనలు చేస్తుంటాడు.

ఏమయినా యెవరికీ కనిపించకుండా ఆఖరి వుత్తరంగా ఆమె గదిలోవేసి రావాలని నిర్ణయించుకున్నాడు.

"కరుణామయి,

నీ పేరు యేమయినా కానీ, నాపాలిటి ధర్మదేవతవైన నిన్ను కరుణామయిగానే పిలుచుకుంటాను. నీ యెదుటపడినపుడు ఆదుర్దాలు ఆలోచనలు అదృశ్యమై మనశ్శాంతి కలుగుతుంది. ఏమికోరాలో ఏమి కావాలో వూహించగల స్థితి అసలే వుండదు. బాధానివృత్తి జరిగినట్లే నిశ్చింతితుడనై పోతుంటాను. కాని దూరంగా వచ్చినపుడు నిస్పృహతో నీరైపోతుంటాను. నా వుత్తరాలు చదివారా! అర్ధమయినవా? అని అడుగాలనిపిస్తుంది. తీరా మీ ముఖంచూసినపుడు ప్రభవించే స్నిగ్ధతేజస్సు ధైర్యాన్ని సడలింపజేస్తుంది. ఈ దుస్థితిలోని నన్నుద్ధరించి మార్గోన్ముఖునిచేయగల సమర్ధులు మీరే అయినట్లు నా మనస్సంతా మీవైపే కేంద్రీకరించుకుని వున్నది."

అంటూ వ్రాసిన వుత్తరాన్ని అసంపూర్తితోనే ఆపి ముగింపుగా నిశ్చయంచేసివేశాడు. దాన్ని ఆమె గదిలో విడిచి రావాలని రెండు రోజులు ఆవైపుకే నడిచాడు. కాని ఆ గల్లీలో ప్రవేశించను సాహసించలేక పోయాడు. వుత్తరం జేబులోనే వుండిపోయింది.

పార్కులో అదేస్థానంలో కూర్చున్నపుడల్లా ఆమె స్మృతి ప్రేరణలతో ఆందోళితుడై లేఖారచన కుపక్రమించి సాంత్వన పొందుతుంటాడు. జేబులో వుత్తరాన్ని జేబులోనే వుంచి మరో వుత్తరాన్ని ప్రారంభించాడు.

"మిస్ బ్రీజ్‌బెల్లా!

అబ్బ! నీ అసలు పేరులోకూడా మాధుర్యముంది. భగవంతుడు వుదారత్వం వహించినపుడు, హద్దులను తుడిచివేసుకుంటాడు. అన్ని వైపులనుంచి తన ఉదారతను ప్రదర్శించివదులుతాడు. మీ పేరులోవున్న

మాధుర్యమే మీహృదయంలోను వున్నది. అంతకుమించిన మాధుర్యమే మీ మనస్సులోను, స్వభావంలోను వున్నది. అందం అంతకు మించి శోభించునది. ఇందుకు భగవంతుని అనేకవిధాల అభినందిస్తున్నాను. అన్నీచేసికూడా భగవంతుడు ప్రతిచోట ఎక్కడో ఒక వెలితిని అట్టి పెడతాడంటారు. ఆ లక్షణంతోనేగాబోలు మీకు అన్నిటిని గల్పించి ఆర్థిక అంతస్తు నివ్వలేదు. అయినా అది లేనందువలనే మీలోని సుగుణ సంపత్తి చెదరలేదేమో! మీలోని మానవత్వమే సర్వశ్రేష్టమైంది. అలాంటి దేవతాస్వరూపిణిలాంటి మీకు చిన్న గదిలో వుంటూ, రోజూ యెక్కడో వుద్యోగాని కెళ్ళే దురవస్తను గల్పించుట దేవునికి న్యాయం గాదని నా మనస్సు బాధ చెందుతున్నది.

మీ పరిచయము, ఆదరము లేకపోతే నేను బహుశ వెళ్ళిపోయి వుండేవాడిని.మీ ఆదరం నన్ను పోనీకుండా ఆశలతో ముంచుతున్నది."

అంతవరకు వ్రాసిన తరువాత కలం నడువలేదు. ఆమె కళ్ళ ముందు కనిపించినట్లయి పరువులెడుతున్న ఆలోచనలలో వ్రాయలేక నేత్రాలు మూసుకు ధ్యానమగ్నుడైనాడు.

ఈ విధంగా ఆమెను గురించిన ఆలోచనలతోనే పొద్దుబుచ్చుకో గలుగుతున్నాడు. అదే తన దైనందిన కార్యక్రమమైంది. ఆమె ద్వారానే తనకు విముక్తి కలుగుతుందని, తన ఆశయం సఫలమవుతుందని, ఆమెకు జీవితాంతం కృతజ్ఞతచూపాలని, తనదేశం వెళ్లాక ఏమి బహుమతి పంపితే బావుంటుందా?దంతంతోచేసిన పెద్ద మేరీమాత ప్రతిమను, యేసుప్రభువు ప్రతిమను పంపితే బావుండునేమో, ఆమెకు తన సర్వస్వాన్నీ ధారవోసినా పొరపాటుగాదని ఆలోచనలు చేస్తున్నపుడు, ఎంత సమయమయినా హాయిగా గడిచిపోతుంటుంది. ఆమెద్వారా తానొక గొప్ప వ్యక్తిగా తయారై వెళ్ళునపుడు ఆమె ఫొటోను పొంది తీసు కెళ్ళాలని, ఆ ఫొటోకు గొప్ప ప్రాధాన్యత నివ్వాలని, ఆ ఫొటోనే పూజించినా తన జీవితం ధన్యమవుతూందని, ఆమె ఫోటోను యెంతో పెద్దదిగా యెన్లార్జి చేయించాలని, అంతటి పరిశుద్ధాత్మ గలిగిన ఆమె ప్రతిమనే నిత్యమూ పూజించినా తప్పుకాక ఫలిత మేవుంటుందని, ఆలోచ

నలు చేస్తున్నాడు. ఈ ఆలోచనలలో విసగట కలుగుటలేదు. ఆత్మ తృప్తి కలుగుతున్నది.

విఫలప్రయత్నాలలో, దుఃఖాలలో భరించరాని బాధలకు గురియైన వారు ఆలయాలుజేరి దేవునిముందు స్తోత్రిస్తూ సంతృప్తినిపొందునట్లు విజయ్ పార్కులోని ఆ స్థానంలోజేరి ఆమెనుగురించిన ఆలోచనలలో తనదుఃఖాన్ని మర్చిపోతున్నాడు. ఒక్కటొక్కటిగా అయిదువుత్తరాలను వ్రాశాడు. వాటిలో కొన్ని అసంపూర్తివి. కాని అన్నిటిని తన జేబులోనే పదిలపర్చుకున్నాడు. ఆమెగదిలో జారవిడువగల ధైర్యం లేక తానే చదువుకుంటూ తృప్తి జెందుతున్నాడు.

ఆ అమాయకునిఅడ్రసు తెలుసుకోనందుకు బ్రీజ్‌బెల్లా యిపుడు చాలా విచారపడుతున్నది. అతనికి సహాయపడమని ప్రభువే తనముందుకు పంపినా, తాను చేయజాలకపోయినందుకు నేడు చింతిస్తున్నది. ఇక ఆ దుఃఖితుని యెన్నడూ చూడలేననుకున్నపుడు మనస్సు నొచ్చుకుంటున్నది.

అది ఆదివారంరోజు. సెలవు. క్యాథలిక్కుచర్చినుంచి తిరిగి వస్తున్న బ్రీజ్‌బెల్లా గదికివెళ్ళి అనవసర ఆలోచనలతో బాధపడుటకంటె కొంతసమయం పార్కులో తిరుగాలని అనుకున్నపుడు, ఆమెమనస్సులో ఆ అర్భకుడు మెదిలాడు. అక్కడ కనిపిస్తే యెంత బావుండును అనుకుంటూ పార్కువైపు నడిచింది.

పగలు 11 గంటలసమయ మది. జాబిలివెన్నెలవలె శీతలయెండ హాయిని యిస్తున్నది. పార్కులో ప్రవేశించిన బ్రీజ్‌బెల్లా ఆనాడు అతనున్న వైపుకే చూస్తూ నడుస్తున్నది. అదేవ్యక్తి అక్కడే వున్నాడు, ఆమె బాగా గుర్తించింది. ఆనందానికి మేరలేదు. సరసర అడుగులు ముందుకు పడుతున్నవి. ఆ వ్యక్తి ఆమెనుచూశాడు గాబోలు ఆత్రుతతో లేచి చేతిలోని కాగితాలను మడతవేసుకుంటూ యెదురువస్తున్నాడు. వెర్రివానివలె దారితప్పి నేరుగా అడుగులువేస్తూ వస్తున్న అతనికాలు నీటి జాలులో పడి గిలకలవరకు మునిగింది. క్షణంమాత్రం కాలు చూసుకుని, అందుకు పరితాపంకూడా లేకుండా నవ్వుముఖంతో ముందుకు వస్తున్నాడు.

ఆమెకు నవ్వు, ఆశ్చర్యము పెనవేసి హృదయంలో పొర్లు తున్నవి. అనురాగం వూటవలె వుబుకుతున్నది. గంభీరతను కూడాదీసు కుని అక్కడే నిలిచిపోయింది.

ఆ వస్తున్నవ్యక్తి దూరంనుంచే హస్తాలు జోడించి, చిరునవ్వు లతో గొణుక్కుంటూ ఆమెముందు కొచ్చి "గుడ్ మార్నింగ్"అని ఆమె పాదాలను అంటుకోబోయాడు. ఆమె రెండడుగులు వెనక్కువేసి, నేత్రాలు పెద్దవిచేసి, అధరాలమీద వ్రేలువేసుకుని "ఇస్స్....తప్పు! అలా చేయకూడదు" అన్నది.

హతాశుడైనట్లు అతనిముఖం వెలవెలబోయింది. ఆమెవద్ద తాను వూహించిన చనువు లేకపోవుటతో అలానే ఆగిపోయాడు. కొన్నివేళ లందు యేమిచేస్తే ఆత్మశాంతి, ఆనందము లభిస్తవో అది చేయ సంద ర్భపడినపుడు అసంతృప్తి, అశాంతులతో నలిగిపోతాడు. అది గమ నించి ఆమె వెంటనే "ఎలా వున్నారు?" అని ప్రశ్నించింది.

విజయ్ అంతకుముందు జేబులోవుంచుకున్న అయిదువుత్తరాల పొత్తిని తీసి ఆమెచేతిలో వుంచాడు. ఆమె మందహాసంచేస్తూ "మీరు చేస్తున్నపని యిదన్నమాట" అన్నది.

"క్షమించండి" అన్నాడు.

ఆమె చిన్నిఅడుగులతో ఒక బెంచివద్దకు నడిచి దాని మీద ఒకవైపు కూర్చుంటూ "కూర్చోండి" అన్నది. కాని అతను అప రాధివలె ప్రక్కగా నిలిచివున్నాడు. ఆమె ఆ ఉత్తరాలలో మునిగిపో యింది. ఒక్కటొక్కటిగా అన్నిటిని చదివింది. దీర్ఘశ్వాసనువిడుస్తూ అతనివైపు చూసి నొచ్చుకుంటూ "ఇంక నిలబడేవున్నారా? కూర్చోండి" అంటూ చేతితో బల్ల రెండోవైపును చూపింది. హస్తాలు ముడివేసుకు నిలిచిన అతను అలవాటుగా క్షణంలో జోడించినహస్తాలను ముందుకు వెనుకకు వూపుతూ "ఫరవాలేదులెండి" అన్నాడు.

ఆమెకు నవ్వు ఆగలేదు. గలగలనవ్వుతూ "మొత్తానికి నీవు మంచివాడివి" అన్నది. అతనిలోని నిష్కల్మషత, నిరాడంబరత స్పష్టంగా అద్దంలోవలె కనిపించినవి. అతని శాంతిస్వభావంకూడా

పూర్తిగా అర్థమయింది. కోపాన్నభినయిస్తూ స్వరాన్ని కఠినంచేసి "ముందు నేను చెప్పినట్లు కూర్చోండి" అన్నది.

"విజయ్ దీనతతో తదేకంగా చూస్తున్నాడు. ఆమె తిరిగి బుజ్జగిస్తూ "కూర్చో—మర్యాదను పాటించు" అన్నది.

విజయ్ వినమ్రుడై వదిగి వోప్రక్క కూర్చుని అటూయిటూ చూస్తున్నాడు. "నావైపు చూడండి" అన్నది. వెర్రివానివలె ఆమెవైపు చూస్తున్నాడు.

"నన్ను మీకొరకు ఏమి చేయమంటారో చెప్పండి?" అని ప్రశ్నించింది.

అతనిమనస్సు అతనే తవుడుకుంటున్నాడు. తనకు కావలసిన సహకారమంతా ఆమెద్వారా లభించగలదని కలవరిస్తూ వచ్చాడు. కాని యిపుడు అయోమయమైంది. అవును, తా నామెను యేమి కోరగలడు? శిరస్సువంచి బల్లమీద చూస్తున్నాడు.

ఆమె "నావైపు చూడండి" అన్నది.

అతను శిరస్సు పైకెత్తి చూస్తున్నాడు. ముఖంలో భయచిహ్నాలు కనిపిస్తున్నవి.

"ఏమి సహాయం కావాలో చెప్పరేమిటి?" అని గద్దించి అన్నది.

వ్రేలుబెట్టి ఆమెచేతిలోని తనవుత్తరాలను చూపాడు.

"అవును వీటిని బాగా చదివాను. అందుకే నేను చేయగలిగిందేమిటో చెప్పమని కోరుతున్నాను" అన్నది.

విజయ్ తిరిగి అధోముఖంచేసి అంగుళీయములతో బల్లను అటుయిటు వత్తుతున్నాడు.

"ఆడపిల్లల కిలా ఉత్తరాలువ్రాయటం యెంతనేరమో తెలుసా?" అన్నది.

ఆమాటలు విజయ్‌మొఖంమీద కొట్టినట్లు, గుండెల్లో పొడిచిన[illegible] అయింది. గొంతుకలోనితడి ఆరిపోయింది. వెంటనే లేచి నిలిచి "క్షమి[illegible] చండి. ఇక యెన్నటికి వ్రాయను. మీయెదుటికీ యెన్నడూ రాను" [illegible] గాద్గదికంగా అస్పష్టశబ్దాలతో అన్నాడు.

వెలవెలబోతూ భయవిహ్వలుడైన అతనినిచూసి జాలిచెం[illegible]తూ

బల్లమీదనుంచి తానూ లేచి "ముందు నాతో రండి"అంటూ ఆమె బయట వైపు బయలుదేరింది.

ఆమెనుచూస్తూ అత నక్కడేనిలిచివున్నాడు. వెనుతిరిగి చూసింది. భయకంపితుడై అత నక్కడే నిలిచి జారుకుని పారిపోతున్నవైఖరిని చూసి ముగ్ధురాలవుతూ తిరిగి దగ్గరగావచ్చి మృదువుగా రెచ్చగొడుతూ "అపరాధాలు చేసేవారు శిక్షలు పొందుటలో, పారిపోవుట అధమత్వ మవుతుంది. శిక్ష పరిహారం. అది పొందినపుడే అపరాధి ఆత్మోన్నతి వైపు వెళ్ళగలడు. భయం శిక్షకుమించిన ప్రాయశ్చిత్తాన్నిస్తుంది. పారి పోయి తప్పించుకోజూచుట, నేరాన్ని వృద్ధిజేస్తుంది. మీరు నావెంట రండి" అని గద్దిస్తూ అన్నది.

ఒక్కమాట మాట్లాడగలశక్తికూడా లేదు. గత్యంతరంలేక నిర్జీవివలె ఆమెవెంట నడుస్తున్నాడు. పోలీసులు, వెల్షన్ వగైరాలంతా అతనిమీద దూకబోతున్నట్లే తోచింది. ఈదఫా నిర్దాక్షిణ్యంగా చావ మోది జైలులో నెడతారని, తిరిగి విడుదలపొందే యోగమే వుండదని, ఎవరిని కరుణామయిగా ఆత్మలో పూజించాడో ఆమెద్వారానే తనజీవితం సర్వనాశనం కాబోవుటను వూహించి కన్నీరుకారుస్తూ అడుగులు వేస్తూనే వున్నాడు. "ఏది యేమిటో, ఏసమయంలో ఏరూపం దాలు స్తుందో ఏవరికీ తెలియని మానవభ్రమ యెంత విచిత్రమైంది!" అని అతనిహృదయం వాపోతున్నది.

గదిలోకిజేర్చి చిరునవ్వులతో యధాతధంగా కూర్చుండబెట్టి వెను కటివలెనే విందుభోజనమిచ్చి భోంచేయమని హుంకరించినపుడు అంతకు ముందు అతనిమనస్సులో రేగిన తుఫానంతా విడిపోతున్నది. ఆమె ప్రక్కన నిలిచి సాసరులోని యిగురుముక్కలను బలవంతంగా రొట్టె మీద వేసి తినమని మందహాసంచేస్తున్నపుడు తనలోతానే పశ్చాత్తాప పడుతున్నాడు.

# 31 ప్రేమలోపోయిన వ్యక్తిత్వం

సరళ విజయ్ యెడబాటును తట్టుకోలేననుకున్నది. కాని సమయం అందరిని సరిదిద్దినట్లే ఆమెను సరిదిద్దింది. ప్రారంభంలో వుత్తరాలకొరకని యెదురుచూసింది. కాని అంత దూరదేశం వెళ్ళిన అతను అభయమిచ్చినట్లు రోజుకోవుత్తరాన్ని వ్రాయుట అసాధ్యమే అయివుంటుందని, అలా ఆశించుట క్షేమముగాదని మనస్సును దృఢం చేసుకున్నది. అతను చెప్పివెళ్ళినమాటలను నెమరువేసుకుంటూ సంతృప్తిని పొందుతున్నది. విజయ్ సమర్థుడుగనుక తప్పినా ఒకమాటు కోర్టు ద్వారా ప్యాసుచేయించుకున్నాడు. తిరిగి తప్పించినందుకు యీ పరీక్షాధికార్లందరిని సవాలుచేసినట్లు పెద్ద డిగ్రీలను తేగలందులకు విదేశం వెళ్ళిపోయాడు. కాని తప్పిన తాను యేమిచేయుటో తనకే తెలియదు. ఆ విషయంలో విజయ్‌ను తాను సలహా అడుగనే మర్చిపోయింది. అడిగివుంటే గొప్ప సలహా తప్పక చెప్పివుండే వాడనుకుంటున్నది.

చదువుమీద భ్రమపోయింది. ప్యాసయినందువలన కలిగే ప్రయోజనంలేదని, అనుభవంద్వారా పొందే విజ్ఞానం అమూల్యమైందని, అలాంటి యదార్థ విజ్ఞానార్జనే ధ్యేయంగాచేసుకొనుట ముఖ్యమని మనస్సా నిర్ణయించుకున్నది. అందువలన ఆమెకిపుడు కావలసినంత తీరుబడి చిక్కింది.

రవిప్రసాద్ తన విషయంలో తానుగా ఆలోచించి బుర్రబద్దలు గొట్టుకోవలసిన అవుసరంలేకుండా సరళ ననుసరించుటే ధ్యేయంగా ఒకేమాటు నిర్ణయించుకున్నందువలన తన ముందు చిక్కు సమస్యలు లేవు. సరళను సంతోషపరచుటే ఆయన నిత్యసమస్యగా నిలిచిపోయింది. గాలిపటాల ఆటలకు చేప బాలునివలె నిత్యమూ రవిప్రసాద్ సరళయింటికి చేరుతుంటాడు.

విఫలంబొందిన రాజకీయవాదుల వలెను, రాణింపుకురాని రచ్చ

బండాధికారులవలెను, క్లబ్బులోజేరిన నిరుద్యోగులవలెను తర్కవిత ర్కాలతో గ్యాస్‌క్లబ్బుగా తయారుచేశారు సరళ రీడింగురూమును. ప్రతి విషయంలోను రవిప్రసాద్ తన వోటమిని అంగీకరించుట సరళ విజయగర్వాన్ని పొందుట సహజమైపోయింది.

"నీవొక తర్కపండితురాలవు. నిన్నెవరు గెలువగలరమ్మా" అంటుంది తల్లి సరళను. ప్రేమ హద్దులకుమించి వున్నచోట వ్యక్తిత్వాన్ని కోల్పోతారు. తనను తాను మర్చిపోతారు. ప్రేమించినవారిని సంతోషపెట్టుటకు నటకులైపోతారు. శిరస్సునధరించి చిందులు త్రొక్కుతారు. కాని అక్కడ దుష్ఫలితమే లభ్యమవుతుంది. సరళ ప్రేమలో వెర్రివాడైపోయిన రవిప్రసాద్, సరళకోరే ఆటబొమ్మగా వుపకరిస్తున్నాడు. విజయ్‌మీద కలలుకంటూ సమక్షంలోనున్న రవితో ఆటలాడుతున్నది.

నిర్దిష్ట కార్యరంగంలేనివారికి తీరుబడిచిక్కనన్ని చిత్రవిచిత్రాలను నెత్తిన వేసుకోవటం జరుగుతుంటుంది. ఒకకార్యంలో నిమగ్నమై తీరుబడిలేనివాడు మరో కార్యాన్నిగురించిగాని యితరలోకాన్నిగురించిగాని ఆలోచించగల అవకాశం లభించదు.

సరళకిపుడు నెమ్మదిగా మహిళామండలివారి స్నేహం అధికమైంది. పారిజాతం తన యింటికొచ్చినపుడు, ఆమె నాగరికత, మాటల వైఖరి, వ్యవహారదీక్షతలు చూసినపుడు సరళతల్లి ముగ్ధురాలవుతూ ఆమెను యెంతగానో పొగడుట వినినపుడు సరళ రవంత ఆ వాతావరణానికి ప్రభావితురాలైంది. పారిజాతం ప్రోత్సాహంతో మహిళామండలి వారి రెండుమూడు సంచార కార్యక్రమాలలోకూడా సరళ పాల్గొన్నది. వారిలోని స్వేచ్ఛ, నిరంతర నూతనకార్యక్రమ వుత్సాహము, కలిసి మెలిసి క్రీడారూపంగాచేసే యాత్రలు ఆమెను ఆకర్షిస్తున్నవి. రాజ్యలక్ష్మి వుపన్యాసధోరణి చూస్తున్నపుడు, ముగ్ధురాలై, తనకంతటిశక్తి కలిగితే యెంత బావుండును. విజయ్‌కుమార్ వచ్చినపుడు, సన్మానసభ యేర్పాటు చేసి, ఆయన్నుగురించి యింత వున్నతశైలిలో శ్రావ్యమైన కంఠంతో ధారాళంగా వుపన్యసిస్తే యెంత బావుండును, అని మనస్సులో పదేపదే తలపోస్తున్నది. బెరుకులేకుండా అనర్గళ వక్తగా తయారు కావాలన్న

వాంఛ మనస్సులో ప్రబలిపోయింది. అందుకే అన్యఆలోచనలు లేకుండా మహిళామండలివైపు ప్రభావితురాలైంది.

రవిప్రసాద్ ప్రేమపిచ్చిలో వ్యక్తిత్వాన్ని కోల్పోయినా పురుషుడు గనుక పర్యవసానాలను పరిశీలించగలశక్తి యింకా మిగిలివుంది.మహిళా మండలిమీద సరళకు ద్వేషాన్ని గల్పించాలని అనేకరీతుల ప్రయత్నించాడు. భయము భక్తి వున్నచోటే మాటకు విలువుంటుంది. అది లేని చోట మాట నిర్లక్ష్యంతో కొట్టుకుపోతుంది. వారినుంచి సరళను వేరు చేయలేక తానుకూడా ఆమెననుసరిస్తున్నాడు. తన మాటను నిర్లక్ష్యం చేసిన ఆమెకు దూరంకాగల శక్తి, స్వేచ్ఛ వుంటే తప్పక తాను చెప్ప కుండా వెళ్ళిపోయేవాడు. కాని ఆయన అస్వతంత్రుడు. ఆమెకు బానిస. ఆ సంగతి మాటలలోమాత్రం అంగీకరించడు. అయిష్టంతోనే ఆమెవెంట మహిళామండలిలో తిరుగుతూ ఆ వాతావరణానికి అలవడిపోయాడు.

రాజకీయ మహానాయకుని సుపుత్రుడైన సకలానంద్ తన దీర్ఘ లేఖను సరళకు పంపి గొప్పగొప్ప వూహలనుచేసి కూర్చున్నాడు. అందుకు జవాబులేకపోవుటేగాక ఆ రవితోనే తిరుగుతున్నందుకు ఆందోళన పడుతున్నాడు. పెద్దపెద్ద కట్నాలతో తనకువస్తున్న సంబంధాలు అనేకం చూసివున్నాడు. తనతండ్రి యింకా పెద్ద అంతస్తులోని సంబంధాలకొరకు వెదుకుతున్న విషయంకూడా తనకు తెలుసు. ఒక మాజీ మంత్రిగారి కుమార్తె నిచ్చుటకు ప్రాధేయపడుతున్న సంగతికూడా తెలుసు. అయినా ఒక సామాన్య విద్యార్థిని అయిన సరళ అందచందాలకు ముగ్ధుడై, వివాహమాడ నిశ్చయించుకుని వ్రాసిన వుత్తరాన్ని నిర్లక్ష్యంచేయుట ఆయనకు వేదనగా పరిణమించింది. ఒక ఆదర్శవాదిగా లవ్‌మారేజి చేసుకున్న ఖ్యాతిని పొందాలని తాను చేసినయత్నంలో విఫలమందుట కిష్టంలేదు. సరళతో ఏకాంతంగా మాట్లాడే అవకాశం లభిస్తే, తన అవిచ్ఛిన్నమైన ప్రేమను వివరించి, ఈ ప్రపంచంలో అత్యధిక ఆదరం యేది పొందుతున్నదో ఆ ధనాన్ని తన భాగంనుంచి ఒక లక్షరూపాయలు రొఖ్ఖాన్నైనా ఆమె చేతిలోపోయ సంసిద్ధుడైనట్లు చెప్పినపుడు ఆమె తబ్బిబ్బై సమ్మతిస్తుందని వూహలు చేశాడు. కాని ఆమెను కలియగల అవకాశం కలుగలేదు.

ఎక్కడో ఒక గ్రామంలో జరిగిన మహిళామండలివారి మహా సభలో సరళ ప్రార్ధనా గీతిక అద్భుతంగా పాడిందని, సరళ యిపుడు యింకా నగిషీతేలి మహా అందంగా వున్నదని చూసి వచ్చిన మిత్రులు కొందరు వినిపించినపుడు సకలానంద్ హృదయానికి మెరుపు తగిలినట్ల యింది.

మహిళామండలి నాయకురాలు తన తండ్రికి సన్నిహితురాలని తెలుసు. ఆమె కోర్కెలను కాదనలేక లిస్టులో వేయవద్దని గుప్తంగా తన తండ్రి యిచ్చిన మొత్తాలుతెలుసు, అందుకని మహిళామండలి తనదే అయినట్లు, అక్కడజేరిన సరళను చేపట్టుట అతి సునాయాసమైనట్లు నిర్ణయించుకుని ఆనందభరితుడైనాడు.

సినిమాలో హీరోగా నటించబోవువానివలె గొప్పగా ముస్తాబై, ఆలివ్‌ఆయిల్‌తో ముఖాన్ని మర్దన చేసిచేసి రక్తాన్ని కందగొట్టి సబ్బుతో కడిగి, విలువైన పౌడర్లు కపోలాలమీద మరింతగా అద్ది నునుపులుదేల్చి చమకులను గల్పించి స్వంతడ్రైవింగ్‌తో కారులో బయలుదేరాడు సకలానంద్.

మహిళామండలి భవనంముందు కారాగిన శబ్దంతో అందరూ చకితులై చూస్తున్నారు. కారులోనుంచి దిగిన నవయువకుడు షర్టును సరిదిద్దుకుంటూ మందహాసాలొలికిస్తూ నలువైపులా పరికిస్తున్నాడు. పారిజాతం ముందుకొచ్చి చూస్తున్నది.ఆ వచ్చిన యువకుడు చిరునవ్వుల చిందిస్తూ "మన నవుకరెవరైనా వుంటే రమ్మనండి." అన్నాడు. ఆమె లేరని చెప్పను సందేహిస్తూ ముందుకు రెండడుగులు వేసి "ఏమిటో చెప్పండి" అన్నది.

ఆ యువకుడు కారు వెనుక డోర్ తెరచి పళ్ళబుట్టలను క్రిందకు దించి "వీటిని లోపలకు చేర్చాలండి." అన్నాడు. పారిజాతం అల్పానందాన్ని ప్రకటిస్తూ "ఇందుకు నౌకర్లెందుకండి! నేను జేరవేస్తానుగా" అంటూ రెండు చేతులతో రెండు బుట్టలను పట్టుకు తీసుకెళ్ళుతున్నది. మిగిలిన నాలుగు బుట్టలనుకూడా ఆ మహిళలేవచ్చి తీసుకెళ్ళి రాజ్యలక్ష్మి ముందుంచారు. ఆమె వాటినిచూసి విస్తుపోతున్నది. ఆమెకు యీ రూపంలోని సత్కారం యిదివరకెన్నడూ జరుగలేదు. ఆ యువకుడు

తన దుస్తులనింకా సర్దుబాటు జేసుకుంటూ లోపల ప్రవేశించి నమస్కరిస్తూ "నన్ను మీరు గుర్తించలేదు లాగున్నది, యం.పి. గారి అబ్బాయి సకలానంద్‌ను"అన్నాడు.

రాజ్యలక్ష్మి మహానందభరితురాలవుతూ రెండడుగులు ముందుకు వేసి ఆ యువకునిచుబుకాన్ని పుణుకుతూ "నీవా బాబూ? యీ పళ్ళ ఫలాలేమిటి?" అని ప్రశ్నించింది.

మహిళామండలి సభ్యురాండ్రంతా దూరదూరంగాను, దగ్గరగాను కనిపిస్తున్నారు. ఒకేఒక పురుషుడు బయట చెట్టుక్రింద కనిపించినపుడు విశ్వనాధంగా గుర్తించాడు కాని అతను కనిపించకుండా తప్పుకున్నాడు. సకలానంద్ నేత్రాలు మరెవరికొరకో వెదుకుతున్నవి. రాజ్యలక్ష్మిప్రశ్న తడబడుతూ "ఒక చిన్నికార్యంలో కోరినవిధంగా సఫలం బొందాను. ఆ సంబంధమైన ఆనందాన్ని మీఅందరికీ పంచిపోవాలని వచ్చాను" అన్నాడు.

"కూర్చో ఆనంద్" అంటూ కుర్చీ చూపుతూ తాను కూర్చుని "నాకు చాలా ఆనందమైనపనిచేశావు బాబూ! ఈవిధంగా ఆదర్శతను అనుభవంలో ప్రదర్శించినపుడే సమాజం వుచ్చస్థాయికి చేరగలదు. దేవుడిని దయ్యమనే పిచ్చిభ్రమలలో పడకుండా తన సఫలతలోని ఆనందాన్ని సాటిమానవులకు పంచుటే ఆదర్శమని మా వాదము. అది నీవు వ్యవహారికంగా చేసినందుకు యెంతో సంతోషిస్తున్నాను. కాని ఆ సఫలమైందేదో చెప్పితే మరింత సంతోషిస్తాము బాబు" అని వినయంగా అడిగింది.

ఆమెప్రశ్నలకంటె, తనసమాధానాలకంటె ముఖ్యమైనదానికొరకు అతనినేత్రాలు తీక్షణంగా వెదుకుతున్నవి. ఆమెకు సఫలంబములు విఫలమని చెబితేనే బావుండుననిపిస్తున్నది. "కార్యం మీకు చెప్పతగినంత దేమీ కాదు. కలిగిన కాస్త ఆనందంతోనే మీరు గుర్తుకురావటంవలన యీఫలాలు తీసుకొచ్చాను. అంతే" అంటూ ముగించాడు. ఎక్కువగా సంభాషించాలనిపించుట లేదు. తను యిక్కడ యెవరిని చూడాలనుకున్నాడో వారు లేకపోవటంతో సర్వమూ వ్యర్ధమైనట్లు తోచింది.

రాజ్యలక్ష్మి దీర్ఘమైనసంభాషణలే ప్రారంభించింది. సకలానంద్

తండ్రిని ఘనతగా పొగడింది. సామాన్యమైన ఒక లారీబ్రోకరుగా జీవించే స్థితినుంచి, నేడు పరిపాలనలో ముఖ్యపాత్ర వహించగలస్థితికి వచ్చినందుకు అభినందించింది. అలాంటి బీదకుటుంబాలలోని వారే పరిపాలకులుగా వచ్చుట హర్షనీయము, ఆదర్శము అన్నది. సకలానంద్ తండ్రికి పెద్దచదువు లేకపోయినా వ్యవహారదక్షుడు గనుక వచ్చే యెన్నికలలో శాసనసభలో నిలిచి విద్యాశాఖామంత్రి అయితే యెంతో బావుంటుందని గాంధీగారిసూత్రాలు అమలుకువచ్చినట్లవుతుందని తెరిపిలేకుండా ఒక చిన్నివుపన్యాసాన్ని వినిపించింది.

సకలానంద్ చెవులలో యీమాటలు దూరుతున్నవో లేదో తెలియదు. పారిజాతం కాఫీకప్పు తెచ్చి బలవంతంతో సకలానంద్ చేతిలో వుంచి వెనుదిరిగి వెళ్ళిపోతున్నది. ఆమెవైపే చూస్తున్నాడు. ఆమె రెండోగదిలో ప్రవేశించి యెవరితోనో సంభాషిస్తుండుటనుచూసి, దృష్టిని అటే వుంచాడు. ఆమె లోపలినుంచి లాక్కొచ్చి ఒక బాలికను మండలి వారిలోకలిపి నిలిపి సరసరలాడుతూ ఆ పళ్ళబుట్టను చేతబట్టి అందరికీ పంచ ప్రారంభించింది. ఆ బాలికనుచూసిన సకలానంద్ బొమ్మవలె అలానే వుండిపోయాడు.

సకలానం దిపుడు నిత్యము మహిళామండలికి వచ్చి పోతున్నాడు. సరళ కనిపిస్తూనే వున్నది. కాని తా నెంతప్రయత్నించినా వంటరిగా కలువగల అవకాశం సందర్భపడుటలేదు. రవిని చూసినపుడు శరీరం వుడికిపోతున్నది. ఈ రవిపీడ లేకపోతే తనకార్యం నెరవేరగలదని అతని ఆశ.

మహిళామండలిలో కలిసి తిరుగుట ప్రారంభించాక రాజ్యలక్ష్మి కంటె పారిజాతమే ఆకర్షణీయమైందిగా తెలుసుకున్నది. మండలిలోని వారందరిని వుత్సాహపరుస్తూ ఆదర, ఆప్యాయతలతో మెలుగుతూ ఆత్మీయురాలిగా ద్యోతితమవుతుంటుంది. సరళకు బంధువైనందున పారిజాతంతో మరింతగా కలిసిపోయింది. సంచారకార్యక్రమాలకు వెళ్ళినపుడు ఆమె నంటివుంటుంది. మండలివారు మండలిభవనంలోనే వున్నపుడు బరువుభారా న్నంతటిని పారిజాతమే చూస్తుంటుంది. అందువలనే

సరళ యెక్కువగా వంటయింట్లోవుండి పారిజాతంతో ముచ్చటిస్తూ సహాయపడుతుంటుంది.

నాలుగురోజులు రాకపోకల్లోనే పారిజాతంప్రభావాన్ని గుర్తించి ఆమెను ఘనిష్టంచేసుకొను ప్రయత్నించాడు. పారిజాతంలో మృదుత్వము, స్నేహతత్వముతోపాటు సాహసంకూడా వుంది. లోకులను లెక్కించదు. గంటలతరబడి యిపుడు సకలానంద్ యెదుట కూర్చుని కబుర్లు చెబుతూనే వుంటుంది. ఆమె ప్రోత్సాహంతో యిపుడు సకలానంద్‌లో బెరుకు పోయింది. విశ్వనాథం, రవిప్రసాద్‌లతోకూడా స్నేహం కలిసింది. తమ అంతర్గతవిషయాలను దప్ప మిగిలిన లోకాభిరామాయణాన్నంతా మాట్లాడుకుంటున్నారు. రవిస్నేహంతోనే సరళ సన్నిహితత్వం కలుగుతుందని అతని ఆశ.

సకలానంద్ నిత్యము మహిళామండలికి వచ్చుటను సరళ సహించలేకపోతున్నది. అతను దుష్టుడని, దుర్మార్గుడని, ఇక్కడకురావటం మంచిదిగాదని, ఏదో వుపద్రవం తలపెడతాడని, కనుక రానీయవద్దని పారిజాతంకు బోధించింది. ఒక నాగరికుని నిష్కర్షగా రావద్దని కోరుట సభ్యతగాదని, ఎవరికుత్రిమాలు వారినే దహింపజేస్తవని, వ్యక్తిత్వం కలిగిన స్త్రీని దుష్టభావాలుగలవారు యెన్నడూ చెదర్చలేరని, మనభయం మనలను బలహీనపర్చి పొరపాటువైపుకే నడిపిస్తుందని నచ్చజెప్పింది. అంతేగాదు అతనితో నిర్భీతిగా మాటాడేటట్లుకూడా చేసింది.

ఇపుడు సకలానంద్ పారిజాతంతో మాటాడినంత చనువుగా సరళతోను, రవితోను, విశ్వనాథంతోనుకూడా మాట్లాడుతూ వారిలో కలిసిపోయాడు. సరళ కిపుడు తనమనస్సులోని మాటలను చెప్పగల ధైర్యము, కుతూహలంకూడా కలిగింది. కాని యేకాంతసమయం కుదురుట లేదు. వెనుకటివలెనే ఒక గొప్ప ప్రేమపత్రాన్ని వ్రాసి తయారు చేశాడు. సరళయెడ తనకుగల ప్రేమ అవిచ్ఛిన్నమైందని, ఆమెను పొందుటకు సర్వవిధాలా సంసిద్ధుడని, తన సర్వస్వాన్ని ఆమె పాదాల ముందుంచగలడని మొదలగు గొప్పగొప్ప అభయాలతోవ్రాసిన ఉత్తరమది. ఇటీవల తనతండ్రి యేదోరూపంలో పొంది తనపేర బ్యాంకిలో

వేసిన లక్షరూపాయలను కానుకగా తెచ్చి ఆమెపాదాలముం దుంచనైనా తయారుగానున్నట్లుకూడా అందు వ్రాశాడు.

కాని వ్రాసిన ఆ వుత్తరాన్నియిచ్చే అవకాశంలేక నాలుగురోజులు తనజేబులోనే వుండిపోయింది. ఆమె చదువుతూ చదువుతూన్న పుస్త కాన్ని ప్రక్కనబెట్టి కబుర్లు చెబుతున్నపుడు, నేర్పుగా ఆ వుత్తరాన్ని ఆ పుస్తకంలోకి నెట్టివేశాడు. చాలా వినయప్రార్థనలతోగూడిన సంభా షణ జరిపి సెలవుబుచ్చుకుని వెళ్ళిపోయాడు.

తిరిగి పుస్తకాన్నిచదువ ప్రారంభించిన ఆమెకు ప్రేమపత్రం లభ్యమైంది. ఆ ఉత్తరాన్ని పూర్తిగా చదివి వుగ్రురాలై పారిజాతం కొరకు వెదికి పట్టుకుని, తన క్రోధాభినయాన్ని పూర్ణరూపంలో ప్రద ర్శించి, ఉత్తరాన్ని ఆమెచేతిలో వుంచింది.

పారిజాతంపెంపుడుపక్షివలె వుంటున్న విశ్వనాధం కొన్ని సమ యాలలో బాధపడ్డాడు. మనస్తత్వాలను అతితేలికగా అర్థంచేసుకోగల దానివలె విరక్తివైపు మొగ్గనున్న క్షణంలో పారిజాతం ప్రక్కనజేరి లాలిస్తూ మత్తులో మునకలువేయిస్తుంది. ఆ బిర్రులో పారిజాత బహు ముఖ ప్రజ్ఞను స్తుతించుకుంటూ కాలం గడుపుతుంటాడు. మా వనజ చెల్లికున్న గొప్పగుణం మీలో ఒక్కరికీలేదు. భారతనారీత్వం ఆమెలోనే వున్నది. ఆమె ఆదర్శమహిళ, అంటూ కొన్ని సమయాలందు వనజను పొగడుతుంటాడు.

వనజ సర్వవేళలందు విశ్వనాధంను జాగ్రత్తగా చూస్తుంటుంది. ఎవరేమనుకుంటారో అనే వెరపు, రాజ్యలక్ష్మి భయములేకపోతే రేయిం బవలు ఆయన సరసనుండి సేవలుచేయాలని మనస్సు వాపోతుంటుంది. ఆ పిరికితనంతోనే అందరి దృష్టులనుంచి తప్పుకుంటూ అనేక రీతుల అతనికి కావలసినవి సమకూరుస్తున్నది.

పోనుపోను పారిజాతంయెడల విశ్వనాధానికి నిరుత్సాహం కలుగు తున్నది. ఆమెద్వారా తనకు కలుగుతున్న అత్యధిక ఆప్యాయత మరో క్షణం కలుగుతున్న నిర్లక్ష్యం అతన్ను అంతర్గతంగా కలవరపరుస్తు న్నది. వనజ సహకారము లేకపోతే ఆయనలోని ఆశల తాలూకు ఆఖరి

అంశాలుకూడా అదృశ్యమయ్యేవి. వనజద్వారా ఆయనలోని అసమర్ధత అలానే వుండిపోతున్నది.

సరళ తనచేతిలో వుంచిన వుత్తరాన్నితీసి చదివిన పారిజాతం ఒక దీర్ఘ నిట్టూర్పునువిడచి ఆమెవైపు తదేకంగా చూస్తున్నది.

సరళ తన ఆగ్రహాన్ని మరింతపెంచి "అతను యెంత హీనుడో యిపుడు తెలుస్తున్నదా? అతని దుష్టత్వపు నగ్నదృశ్యాలనింకా చూడాలని వున్నదా?" అన్నది.

పారిజాతం ఆశ్చర్యంతో కలిసిన మందస్మితంలో ఆమెను కవుగిట బంధించి అటునిటు వత్తుతు, తోటవైపు తీసుకెళ్ళి రబ్బరు మొక్కల గుబురు ప్రక్కనున్న హరోశ్ఛాదితపృధ్వీమీద కూర్చుండబెట్టింది. సరళ కపోలాలను బట్టి వూపుతూ నిట్టూర్పుల నిడుస్తూ "నీవు యెంత అమాయకురాలవు సరళా!" అన్నది పారిజాతం.

"అదేమిటక్కా! నేను పొరపాటు చెబుతున్నాననా లేక నే నన్నట్లు ఆ మూర్ఖుడు యెంతకయినా తెగిస్తాడన్నది అసత్యమనా?" అన్నది సరళ.

బిగబట్టిన దంతాలతో "పిచ్చి చెల్లీ!" అంటూ ఆమె ఫాలభాగం మీద చుంబించి "మానవులు కోర్కెలతో జన్మిస్తారు, కోర్కెలతోనే జీవిస్తారు, కోర్కెలతోనే మరణిస్తారు. కనుక తన మనస్సులోని దృఢ సంకల్పాన్ని తెలియపరచుట నేరంగాదు. తనకోర్కెవెంట బలప్రయోగాన్ని జోడించుట రాక్షసత్వ మవుతుందిగాని తనకోర్కెను వినయపూర్వక ప్రార్ధనలతో విన్నవించుకొనుట దుష్టత్వం యే రూపంగానూ కాదు. ఈ వుత్తరంలో వ్యధ బాధ వినతివుంది. ఇదిసజ్జనుల సంపత్తి. ద్వేషము, ఈర్ష్య, క్రోధము, దౌర్జన్యము, ప్రతీకారము దుష్టసంపత్తి ఈ దుష్టసంపత్తి ఛాయలుకూడా యీ వుత్తరంలో లేనపుడు అంఖంగారుపడుట అవ్యక్తమవుతుంది." అన్నది పారిజాతం.

"లేదక్కా, మరెవరినుంచైనా యిలాంటి వుత్తరం వచ్చివుంటే తప్పక నా అసమ్మతినైనా తెలిపివుండేదానిని. కాని యీ సకలానంద్ పరమ దుష్టుడు. అతనియడల నా శరీరము ద్వేషంతో కాలిపోతుంటుంది." అన్నది సరళ.

"కొన్నికొన్ని అలానే మనస్సులో గూడుకట్టుకుని వుంటవి. అలాంటి ద్వేషించినచోటే ప్రేమకలిగినపుడు అమృతం వర్షిస్తుందనేది కూడా పరమసత్యం. నీ భ్రమగాని అతనిలో దుష్టత్వమేమీ లేదు సరళా. అతని తండ్రి రాజకీయాలలోజేరి అతి వినయాన్ని, నిరాడంబరత్వాన్ని ప్రదర్శిస్తూ, ఆదర్శాలను, ఆశయాలను, లక్ష్యాలను వల్లిస్తూ లక్షలు ఆర్జిస్తున్నందున అతనిమీద కొందరికి కలుగుతున్న హేయత, అతని సంతానమైనందున సకలానంద్‌మీదకూడా ప్రతిబింబిస్తుంటుంది అంతే।" అన్నది.

"నా కతనిమీద కలుగుతున్న ద్వేషం ఆ రూపమైందికాదని మాత్రం గట్టిగా చెప్పగలను. నీముందు నిజం చెబుతున్నాను. అతను యిదివరకుకూడా ఒక వుత్తరం ప్రలోభనలను కల్పిస్తూ పెద్దగావ్రాశాడు. ఆ వుత్తరముద్వారా మాత్రమే ద్వేషం కలిగిందని చెప్పను. క్లాసులో మొదటినుంచీ అతను దోపిడిగానివలెను, ద్వేషివలెను, పిసినారివలెను నావైపు యెల్లపుడు కోరచూపులు చూస్తుండేవాడు. అతని చూపులే నాలో హేయతను కలిపించినవి, అక్కా।" అని బరువు కంఠంతో అన్నది.

ఆమె శిరస్సును తన కవుగిటిలో బంధిస్తూ ముద్దులతో ముంచెత్తిస్తూ, "చెల్లీ! అందము స్పృజేయమైంది. అదొకగొప్ప వరములాంటిది. నీవు గొప్ప అదృష్టవంతురాలవు. నీ అందము నన్నే ముగ్ధురాలను చేస్తున్నప్పుడు యువకులను నాట్యంచేయించుటలో ఆశ్చర్యమేముంది! అందము ఆకర్షించుటకే నన్నది నగ్నసత్యం. ఆకర్షణలేనిది అందము కాజాలదు. ఆ అందం అందరికీ వాంఛనీయం. కాని అదికోరితే లభించేదిగాదు. ఆకర్షితులై తనవైపు పరువులెత్తువారిని చూసి ద్వేషించుట అనభిజ్ఞతవుతుంది. పాఠశాలనుంచి యిపుడే అడుగు బయట పెట్టావుకనుక లోకానుభవంలేదు. నిన్ను శిరస్సునబెట్టికొనిపూజింప సిద్ధమైన సకలానంద్ సామాన్యుడుగాదు. నీకు సర్వసౌఖ్యాలు కల్పించగల సమర్థుడు. కనుక నీవు ద్వేషించుటకంటె సమయోచితంగా యోచించి ఒక నిర్ణయానికి రావటం మంచిది." అని బుజ్జగింపుగా అన్నది.

సరళ క్రోధితురాలై "అతనిని గురించి ఆలోచించినకొంది

నాలోని ద్వేషం ప్రబలరూపం దాలుస్తుంది. అనవసరంగా యీ విషయంలో నాకిక చెప్పవద్దక్కా." అని బాధతో అన్నది సరళ.

నిట్టూర్పు విడుస్తూ "సునాయాసంగా లభ్యమైనదాని విలువను తెలుసుకోగల నైపుణ్యంలేనివారు కాలదన్నుకుని ఆ తరువాత యెంతైనా పశ్చాత్తాపపడతారు. కనీసం అతనిని ద్వేషించేబదులు సానుభూతి చూపుటయినా నీ ధర్మమని మాత్రం చెప్పకతప్పదు. రవినికూడా ఆదరించే విధానం తెలియక నిరాదరం, నిర్లక్ష్యం చేస్తున్నావని నాకు తెలుసు. మరో విషయం యెప్పుడూ గుర్తుంచుకో సరళా. స్త్రీవైపు పురుషుడు మరీమరీ చూచుటగాని, ప్రేమించుటగాని, ప్రేమించి ప్రేమలేఖ వ్రాయుటగాని నేరంకాజాలదు. సఫలమందుట విఫలమందుట అతని అదృష్టం మీద ఆధారపడి వుంటుంది." అన్నది.

"ఆ ఉదారత నాలో లేదు. సహించగల శక్తిలేదు. ఆస్తులనుబట్టి అంతస్తులను వూహించుట నాకు చేతగాదు. సకలానంద్‌యెడల సహజ జనితమైన నాలోని ద్వేషాన్నికిగల కారణాలు నాకే స్పష్టంగా తెలియదు. ఆయనయెడల సానుభూతి కలుగుట అసంభవమైన విషయం. జీవితానికి సంభవించు లాభనష్టాలను లెక్కచేయని నిర్ణయాలు కొన్ని వుండుట కూడా కద్దు." అన్నది.

"ఇలాంటి నీలోని కఠినత్వం మారు సమయంకూడా ఒకనాటికి వస్తుంది. జీవితంలో అదొక మలుపుగా నీ కప్పుడర్థమవుతుంది. నేను యిన్నిమాటాడినందుకు మరేమీ అనుకోకు సరళా." అని బుజ్జగిస్తూ పంపి సకలానంద్ వుత్తరాన్ని తానే రెండుమూడుమారులు చదివి తనకు తెలియకుండానే దీర్ఘనిట్టూర్పును విడిచింది. ఆ ప్రేమలేఖలో వినతిరూప ఆత్మార్పణ కనబడుతున్నది. కుతంత్రము కృత్రిమ తాలూకు శబ్దమెంత వెదికినా కనిపించలేదు. అందులోని ప్రతి శబ్దము ప్రేమదీక్షను ప్రకటిస్తున్నవి.

# 32 పారిజాతం

పారిజాతం స్త్రీ అయినా వయస్సు చిన్నదైనా స్వానుభవం ద్వారా లోకాన్ని కొంతవరకు అర్థంచేసుకున్నది. మానవులు దేనికొరకు పోటీలుపడి పరువు లెడుతున్నారో ఆ సంపత్తి ప్రాధాన్యతను ఆమె అవగతం చేసుకున్నది. నేడు మానవ అంతస్తుస్థాయిని దేనిద్వారా కొలుస్తున్నారో ఆమెకు విదితమే. అంత అనుభవ ఆలోచన లామెలో కలవు గనుకనే సకలానంద్ యెడల ఆమెకు సానుభూతి కలిగింది. అతని అంతస్తును అతని ప్రేమను అర్థంచేసుకోజాలని సరళ అమాయకతకు జాలినొందుతున్నది. ఆ వుత్తరాన్ని పారవేయలేకపోయింది. సరళ కివ్వలేకపోయంది. అది పదిలంగా తన పెట్టెలో దాచుకున్నది.

సకలానంద్ కిపుడు పారిజాతం అధికమర్యాదలు చేస్తున్నది. వేదికమీది వుపన్యాసాలలో రాజ్యలక్ష్మి రాణించినట్లే మిగిలిన ప్రబంధక విషయాలలోను ఆప్యాయతలొలికిస్తూ అందరను ఆకర్షించగల శక్తితో పారిజాతం అగ్రస్థానం వహిస్తుంది. అన్నిపనులు, ఆటపాటలుగా కనిపించినట్లే ఆమె యెవరితో యెంతగా మెలగినా తప్పుగా భావించగల సామర్థ్యము యెవరికీ లేకుండా చేసుకున్నది.ఆ కారణంతోనే ఆమె నేడు సకలానంద్‌తో యెంత ముచ్చటిస్తున్నా యెవరూ ప్రత్యేక ఆలోచనలు చేయలేక పోతున్నారు.

సకలానంద్ యెదుట సరళను గురించి యెన్నడూ విమర్శించ లేదు. అతను సరళకువ్రాసిన వుత్తరంలోని విషయాలను వల్లించి ప్రశంసించింది. అది అతనిలో గొప్పతనమయినట్లు, త్యాగమైనట్లు, ఆదర్శభావమైనట్లు, పవిత్రప్రేమ అయినట్లుకాని సరళ అమాయకత్వం ముందు అవి నిరర్థకమైనట్లు, అర్థంచేసుకుని ఆదరించగల అంతస్తులేని వారిముందు యెంతటివైనా నిరర్థకమవుతవని విపులంచేసినపుడు సకలానంద్ హృదయం పొంగిపోయింది. అమూల్యరత్నం విలువ తెలుసుకో

లేనివారిముందు అది గాజుముక్కగానే నిరర్థకంగా వుండిపోతుందని వర్ణించి పారిజాతం వినిపించినపుడు తాను అమూల్యరత్నమైనట్లు తన హృదయ అంతస్తును పెంచుకున్నాడు. తననుతాను గొప్పగా వూహించు కున్నాడు. తాను నిజమైన ఆదర్శవాదిగానే వుండి ఖ్యాతి పొందాలని నిర్ణయించుకున్నాడు. పారిజాతం మాటలు వింటున్నంతసేపు తనకుతాను మర్చిపోతుంటాడు. యదార్థంగా సరళ అమాయకురాలు, అవ్యక్తురాలు అయినందుచేత సంసిద్ధతలోని విశిష్టత చవుకపారుగా తేలిపోయిందని పరితాపం కలుగుతున్నది. సరళయెడ మనస్సింకా మొగ్గుతున్నది. కాని మనస్సులోని విప్లవాత్మక ప్రవృత్తి ఒకటి నూతన పునాదికొరకు తపుళ్లాడుతున్నది.

నీటిలో తడిసినపుడు మట్టిపెళ్ళ తన గట్టితనాన్ని కోల్పోయి ఆకారంమాత్రమే నిలిచివున్నట్లు పొగడ్తలకు గురియైనపుడు మానవ స్వభావం పెల్లుబికి పరాధీనమైపోతుంది. అలవాటయిన వ్యక్తికి మత్తు పానీయం నిత్యావసరమైనట్లు సకలానంద్ కిపుడు పారిజాతంపొగడ్తలు, నిర్వచనాలు నిత్యావసరమైపోయినవి. సరళనుపొందాలను విషమపట్టు లిపుడు సడలిపోయినవి. ఆమెకొరకు మహిళామండలి రాకపోకల కల వడినా యిపుడు ఆ విషయంకంటె పారిజాతంసంభాషణల మోజు పెరిగి పోయింది. అనేకవిషయాలలో ఆమెద్వారా పొందిన సమాధానాలతో ఆశ్చర్యపోతూ ప్రభావితుడైనాడు. తా నడుగగల ప్రశ్నలే లేకుండాపోయి నవి. తనప్రశ్నలు, సందేహాలు నశేషమయిపోయినా నిత్య నూతన విషయాలను ఆమె వినిపిస్తూనే వున్నది. జీవితాంతం వింటున్నా యిదే రీతి చెప్పగల్గునని లానే నిశ్చయించుకున్నాడు. ఆమె యేది చెప్పినా అధునాతనంగాను, ఆకర్షణీయంగాను అనిపిస్తుందన్న అసలురహ స్యాన్నికూడా అర్థంచేసుకున్నాడు. ఆమె ముందుకు రాకుండా వుండలేని స్థితినిపొందాడు నేడు.

సంచారకార్యక్రమాలని, సభలని పారిజాతం పరుపులెడుతూ తనను కొన్నిసమయాలందు నిర్లక్ష్యంచేసినా భరించగలిగాడు విశ్వ నాధం. కాని నేడు మరో వెర్రివానితో గంటలతరబడి సంభాషించుటను సహించలేకపోతున్నాడు. తనను నిరాదరంచేసినట్లు స్పష్టంగా అర్థ

మయిన సమయాలందు, ఇక్కడి ఆలోచనలను యింతటితోనే సమాప్తం చేసుకుని వెళ్ళిపో నుద్యుక్తుడవుతుంటాడు. కాని వనజముందు నిలిచి నపుడు నిరుత్తరుడై నిలిచిపోతుంటాడు. మానసికవ్యధతో కళవళపడి పోతున్న సమయంలో మందస్మితవదనంతో వనజవచ్చి యెదుట నిలిచి "వినాశహేతువైన క్రోధాన్నాశ్రయించా రేమిటి?" అన్నపుడు, అతనికి తెలియకుండానే దానంతటదే విడిలిపోతుంటుంది.

వ్యధితకంఠంతో "యిక్కడినుంచి వెళ్ళిపోవాలనిపిస్తుంది చెల్లీ!" అంటాడు.

"నేనూ అలానే అనుకుంటుంటాను. కాని సందర్భాలు సమ కూరే సమయంకొరకు వేచివుండక తప్పదు" అంటుంది.

"అది అసమర్థతను చాటుతుందిదప్ప వివేకతకాదేమో ననిపిస్తు న్నది" అంటాడు.

"హేతువులేకుండా యేదీ జరుగదు. ఇక్కడికి రావటానికి హేతువు లేర్పడినట్లే పోవటానికికూడా ప్రతిహేతువులు స్పష్టంగా గోచ రించాలిగదా!" అంటుంది.

"నావిషయంలో అవీ భ్రమలే యివీ భ్రమలే అని తేలిపో యింది. అయినా మీకు వివరంగా యెలా చెప్పేది చెల్లీ!" అంటాడు.

"మీరేమీ చెప్పనవసరం లేదు. వెండినాణెంకొరకు వెదుక్కుంటూ వెంటబడితే బంగారునాణెం దొరికేయోగం లభ్యమైతే శ్రమ వృధా అని చెప్పగలరా చెప్పండి!" అన్నది.

"నీవు చెప్పేదేమిటో నాకు ఒక్కమాటకూడా అర్థమవుటలేదు చెల్లీ!" అన్నాడు.

ఆమె కోరగాచూస్తూ "పూరియింటి పునాదులకని త్రవ్వుతుంటే అమూల్యసంపత్తి దొరికి అంతస్తుకే మార్పుట అదృష్టం కాదంటారా?" అన్నది.

"అన్నా చెల్లెలు యేదో గొప్పగా సంభాషించుకుంటున్నారే!" అంటూ అకస్మికంగా ప్రవేశించిన రాజ్యలక్ష్మితో వారిసంభాషణ అంతటి తోనే ఆగిపోయింది. వచ్చి పదినిమిషాలే ప్రక్కనున్నా గంటలతరబడి మనస్సులో కూడుకున్న నిరాసక్తత యెగిరిపోతుంటుంది. వుత్సాహాన్ని

కల్పించి వెళ్ళి అంగలుపంగలు వేస్తూ అటూయిటూ తిరుగుతుంటుంది రాజ్యలక్ష్మి.

రాజ్యలక్ష్మి యెదుటవున్నపుడు సర్వమూ మర్చిపోయి నిశ్చింతు డవుతుంటాడు విశ్వనాథం. ఆమెవెళ్ళిపోయిన గంటకు తిరిగి నిస్పృహలో మునుగుతుంటాడు. కాని తనను అన్నివేళలా అంటిపెట్టుకుని వుంటున్న వనజసేవలో, ఆదరంలో ఆనందం లభిస్తుందిగాని మనస్సు ఒకకోణంలోని వెలితి వెళ్ళిపోను వెతుక్కుంటుంది. ఆమెదీనతనుకూడా అనేకవిధాల ఆలోచిస్తూ, అడిగితే కన్నీరు కారుస్తుందనే భయంతో విరమించుకుంటాడు. తనయెడల ఆమెకున్న భక్తికి ముగ్ధుడవుతుంటాడు. రాత్రులందు తాను వంటరితనంలో అంతంలేని ఆలోచనలలో మునిగి వేడెక్కిపోతున్నపుడు శాంతిప్రదాయిని మూర్తివలె చిన్నఅడుగులతో వచ్చి తనపాదాలప్రక్క కూర్చుని, పాదాలు వత్తుతుంటుంది. తాను యెంత నిరోధించినా వినదు. గంటలతరబడి సేవజేసి యెవరికీ తెలియకుండా పిల్లివలె వెళ్ళిపోతుంటుంది. చెల్లిహృదయము మనస్సేగాదు శరీరమంతా ప్రేమమయం అనుకుంటాడు.

సకలానం ఏపుడు సరళవైపుకు పరువులెట్టుటలేదు. ఆమెతో సంభాషించాలనిగాని, పలుకరించాలనిగాని ఆలోచించే సావకాశమే లేదు. పారిజాతంమాటలమోజులోబడి పరువులెడుతున్నాడు. అమెద్వారా తనలోని తనవిలువ పెరిగిపోయింది. తనలో గొప్ప త్యాగశక్తులున్నవని, ఆదర్శస్వభావ మున్నదని ఆమెద్వారా తెలుసుకున్నాడు. అందుకనే ఆమెమాటలు యెన్నిరోజులు వింటున్నా విసుగెత్తుటలేదు. స్త్రీపొగడ్త పురుషునికి మత్తుమందులాంటిది.

# 33. శ్రావ్యనాదం - ఆర్తనాదం

బ్రీజ్‌బెల్లా ఒకనిర్ణయానికి వచ్చింది. ఈ అనాథుడైన అన్యదేశీయుని ఆదరించుట ప్రభువుఆజ్ఞగా తలంచింది. కాని వెల్డన్‌భయం ఆమెను వెంటాడుతున్నది. నిర్లక్ష్యంతో నిలిచి మొండిగానిరోధించి నిందలకు గురికావటం ఆమె కిష్టంలేదు. అందువలన తననివాసాన్ని తన కనుకూలమైనచోటికి మార్చ నిర్ణయించింది. అంతవరకు అతనికి ఆ పార్కులోనే కలుస్తుండుట మంచిదని, ఆ విషయాన్ని విపులంగా చెబితే తనవుచ్ఛరణ బాగా అర్ధంగాదనేభయంతో కాగితంమీదవ్రాసి విజయ్‌చేతి కిచ్చింది.

“....నీవు పడుతున్న బాధలన్నీ అర్ధమయినందున ఆందోళన పడుతున్నాను. శ్రావ్యనాదంకంటె ఆర్తనాదం ప్రభువుకు సునాయాసంగా వినిపిస్తుంది. నీమొర యేసుప్రభువుకు వినిపించివుంటుంది. అందుకే ఆయన నీలో ప్రవేశించాడని నాకు రుజువవుతున్నది. నీకు సహాయపడుటే నా కర్తవ్యంగా నా ఆత్మప్రేరణను కలిపిస్తున్నాడు. దుఃఖస్వరూపమే ప్రభుస్వరూప మంటారు. నీలో ఆ ప్రభువు కనిపించుటద్వారా నాకా యదార్ధత ప్రత్యక్షప్రమాణంగా తెలిసిపోతున్నది. నీకు యెలా సహాయపడాలో, యేమిచేయాలో నాకూ తోచుటలేదు. ఆ మార్గాన్నికూడా ఆ ప్రభువు మనకుదొరికేట్లు చేస్తాడు. కనుక నీవు నిశ్చింతగా వుంటూ ఆ పార్కులోనే రోజూ కలుస్తూవుండు. నాకు వేరే వసతయినయిల్లు దొరికినపుడు నీవుకూడా అందే వుండేఅవకాశం కల్పిస్తాను” అని ఆ ఉత్తరంలో వున్నది. చక్కటిదస్తూరి సాఫీగా చదువగలిగాడు. చదివి శిరస్సు పైకెత్తి చూశాడు. ఆమె తనవంకే చూస్తున్నది. కాని దృష్టిలో దృష్టిబడినపుడు సిగ్గు కలిగించి.

"అర్థమైందా?" అని అడిగింది.

ఏమిసమాధానం చెబుతాడు? ఓప్రక్క ఆనందంతోను, మరో ప్రక్క కృతజ్ఞతను ప్రకటించేవిధానము శబ్దాలుతెలియక తికమకలతో వెర్రివానివలె చూస్తున్నాడు. ఆ చూపులోని దీనత్వం ఆమెను లాలించి నట్లయింది.

చిన్నగా నవ్వుతూ "భయపడవద్దు. నీవు చెప్పదలచుకున్నది పోనీ కాగితంమీద వుత్తరంవలెనే వ్రాయి" అన్నది.

ఆమాటలతో అతనిదృక్కులలోని దీనత స్నిగ్ధరూపందాల్చింది. ఆమె అతనివైపుకు వరిగి "స్త్రీలకు ఉత్తరాలువ్రాయుట బాగా తెలుసుగా, అలానే వ్రాయి. నీకు ప్రేమలేఖలువ్రాయటం బాగా తెలుసు గదూ?" అన్నది.

అపరాధం పట్టుబడిననిజంగా ఖంగారుపడుతూ "లేదులేదు.... క్షమించండి" అన్నాడు.

ఆమె మరింత వుత్సుకురాలై "ఖంగారుపడవద్దు. నేనేమి అనుకోను. మీ ఉత్తరాలలో ఆ పట్టుబడి కనబడుతున్నది.మీరు కాదన్నందువలన ప్రయోజనం లేదు. నిర్భయంతో నిజం చెప్పండి" అన్నది.

అతనిలోని భయం కొంత తీరిందిగాబోలు "తటాకంలోని జలము కట్టలోని ఒకమూల పగులువున్నవైపుకే ప్రవహించుటకు పరుపులెత్తుట స్వాభావికం. అదేరీతి దుఃఖితహృదయం ఆదరంకనిపించినవైపుకు వురకలు వేస్తుంది. ఇంతటి మహానగరంలో మీరుదప్ప ఒక్కరుకూడా నామాటను ఆలకించువారు లేరు. లోకానికి సూర్యడొక్కడే అయినట్లు, శశిధరు డొక్కడే అయినట్లు, నాకు రక్షాదేవతగా మీరొక్కరే కనిపించినందువలన నామనస్సంతా మీవైపే కేంద్రీకృతమైంది. అందువలన ఆవిధంగా వ్రాసినందుకు అన్యధా భావించకండి, క్షమించండి" అన్నాడు.

బాధలు అమాయకులకుకూడా ఆలోచనల నివ్వగలుగుతవి. ఇలాగే

ధైర్యంతో సంభాషణలు సాగించండి. మీకు కావాలనుకున్న సహకారం సాగుతుంటుంది" అంటూ అతన్ని పంపివేసింది.

నిత్యము యిపుడు నిర్ణీతసమయాలలో పార్కునందు సమావేశమవుతున్నారు. ఆమె శ్రద్ధ దినదినము అభివృద్ధిపొందుతున్నది. "ఈ రోజు యేమి చేశావు?" అని ప్రశ్నించినపుడు, ఏమీ లేదనలేక నవ్వివూరుకుంటాడు.

ఆమె కొంచెం తీక్షణరూపకంఠంతో "ఏమి కావాలనుకుంటున్నావో ఆ విషయంలో కృషి లేకపోతే యెలా చెప్పు?" అన్నపుడు ముఖాన్ని చిన్నబుచ్చుకుని ఆమెవైపు దీనంగా చూస్తాడు.

ఆమె సిగ్గిలినట్లు నటిస్తూ "మీకు నాద్వారా కావలసినసహకారమేమిటో స్పష్టంగా ఆలోచించుకుని వ్రాసి యివ్వండి" అన్నది.

"మీద్వారా నేను పొందవలసినదేమిటో పొందుతున్నాను. అలానే యీదేశంలో వున్నంతకాలం పొందితే చాలు. అంతకుమించి కోరుట దురాశ కాగలదు" అన్నాడు.

ఆమె ఆశ్చర్యపోతూ "నాకు తెలియకుండానే నాద్వారా ఒక ప్రయోజనాన్ని పొందుతున్నారన్నమాట. అయితే మిమ్ము సామాన్యులుగాను, అమాయకులుగాను తలంచుట గొప్ప పొరపాటుగా తోస్తున్నది" అన్నది.

అపరాధివలె బిక్కమొఖం దాల్చిన అతనిచుబుకాన్నిబట్టి పైకి లేవనెత్తి "మాటమాటకు మనస్సును కలవలపర్చుకోగూడదు. సర్దాకు అనే మాటలకుకూడా లోతుగా ఆలోచించి బాధ చెందగూడదు" అన్నది.

వారిరువురి సంపర్కము మరింత సన్నిహితమైంది. ఇపుడు విజయ్‌లోని బెరుకు తీరిపోయింది. చనువుతో సంభాషించగలుగుతున్నాడు. అడిగిన అన్నిప్రశ్నలకు జవాబులు సంపూర్తిగా యివ్వగలుగుతున్నాడు.

బ్రీజ్‌బెల్లా మనస్సిప్పుడు కార్యానాపనులలో లగ్నమవుటలేదు. ఆ అమాయకునిగురించిన ఆలోచనలతో పరువులెడుతున్నది. అత నిచ్చిన జవాబులను వల్లించుకుంటున్నందువలన కలిగే ఆనందం, యింకా యింకా స్మరణ చేయిస్తున్నది. ప్రథమంనుంచి అతను తనముందు

సంచరించిన విధానాన్ని గుర్తుజేసుకుంటున్నపుడు మనస్సు దాగుడు మూతలాటలో నున్నట్లనిపిస్తుంది. అతను పాదాలంటినదృశ్యము, హస్తాలతోజోడించిన దృశ్యము, భీతిలో తడబడలాడిన అనేకదృశ్యాలు మనస్సులో మెదిలినపుడు ఆమెలో ఆమెయే నవ్వుకుంటుంది. కార్ఖానా పని చేస్తున్న సమయాలలో నవ్వినపుడు ప్రక్కవారు ఆశ్చర్యపోతూ ప్రశ్నించుట, తనపొరపాటుకు నొచ్చుకుంటూ కారణాలను ఆకస్మికంగా సృష్టించలేక నతనతలగొడుతూ వారిని మరిపించుట యెన్నోమాపులు జరిగింది.

పనిలోవున్నా ఆ ధ్యాసలోనే వుంటున్నందువలన బ్రీజ్‌బెల్లాచేతి లోని కార్యాలు చెడిపోవటంకూడా జరిగినవి. అవి గమనించిన కార్ఖానా యజమాని "మిస్ బ్రీజ్‌బెల్లా! నీకు మానసికబాధలేవైనా వుంటే చెప్పమ్మా! నీకు యెంతటి సహాయాన్నయినా చేయుట మా ధర్మం. నీలోని ఉత్సాహము, దీక్షలు అదృశ్యమై పరధ్యాస పెరిగిపోతున్నది. అగ్నికి చెదలువట్టుట సాధ్యమా అనిపిస్తున్నది" అన్నాడు.

ఆమెకు మితిమించిన భక్తి శ్రద్ధలు యెవరిమీదున్నవో ఆ యజమాని మాటలకు మనస్సు యెంతో నొచ్చుకున్నది. అతనిముందు తన మనస్సులో వుద్భవించిన స్నేహ సానుభూతులను సవివరంగా చెప్పి వేయాలనిశించింది. ఆయనిలోని సరళత్వము నిష్కాపట్యము ఆమెకు బాగాతెలుసు. పొందుతున్న ఆదరాభిమానాలద్వారా మనస్సులోని కృతజ్ఞత ఆతనివైపు మొగ్గుతున్నది. అయినా యదార్థం చెప్పినందువలన ఆ అన్యదేశీయుడైన పిచ్చివ్యక్తికి యేమి ఆపద వాటిల్లుతుందోనన్న భయంతో పచ్చిఅబద్ధాన్ని ప్రకటించింది.

అపుడపుడు కరకరలాడే శిరోభారం కలుగుతున్నదని, ఆ సమయాలలో మనస్సంతా చికాకు చెందుతుంటుందని.........అస్పష్టరీతిగా చెప్పింది.

అందుకా కామందు గొప్ప ఆదుర్దాను ప్రకటిస్తూ ఫోనులో డాక్టరును పిలిచి వైద్యసహాయాన్ని కల్పించాడు. తన తలనొప్పి అదే పోతుందని యెంత చెప్పినా, ఖర్చునుగురించి భయపడవద్దని, అందు నిమిత్తమయ్యే ఖర్చంతా కార్ఖానాయే భరిస్తుందని ధైర్యమిస్తూ, పళ్ళు

ఫలాలకని బలవంతంతో కొంతమొత్తాన్ని ఆమెసంచిలో వుంచాడు. కృతజ్ఞతాభారంతో మరింత కృంగిపోతూ దడదడలాడుతున్నది. తన పొరపాటును కప్పిపుచ్చుకోను డాక్టరిచ్చే సూదిమందులను తీసుకోక తప్పలేదు.

బ్రీజ్‌బెల్లా యిపుడు విచిత్రమైన సంకటపరిస్థితుల్లో పడిపోయింది. రోగం లేకుండానే రోగివలె మందులు తీసుకుంటున్నది. తనపొరపాటు తనను క్రుంగదీస్తున్నది. అపరాధివలె, మోసంచేసినదానివలె భీతిలుతున్నది. కార్ఖానాకు వెళ్ళుటలోను, యజమానిని చూచుటలోను, పని చేయుటలోను క్షణక్షణము భయకంపనలతో విహ్వాలురాలవుతున్నది. ఈ మానసికవ్యధకు యెవరు కారకులో వారిమీదగల జాలితూకమే అధికమైందయినందున దూరం కాలేకపోతున్నది. పార్కుకువెళ్ళి ప్రతిరోజు అతన్ని పరామర్శిస్తోనే వున్నది. ఆతనియడబాటులో కలుగుతున్న ఆలోచనలఫలితమే పరధ్యాస అనికూడా తెలుసుకోగలిగింది. అందుకే ఆ వెర్రివ్యక్తి తనతోపాటేవుండు అవకాశం కలిగినపుడు అన్నీ చక్కబడుతవని ఆ యత్నంలోనే మునిగిపోయింది.

వెల్డన్ భయంతో తననివాసాన్ని మార్చివేసింది. లేబర్‌కాలనీకి బదులు ఓల్డుటవున్‌లో ఒక పాడుబడ్డ కారుగ్యారేజికి మార్చివేసింది. ఆ గ్యారేజి ముఖద్వారం నిర్జనము. గలీజు అయిన గల్లీ వెపుకుంటుంది. తాను ఒక్కతె అయితే ఒక్క గంటకూడా వుండజాలని స్థానమది. అందులో వుండుట ఒక అరణ్యకుటీరంలో వుండుటలాంటిది. ఆ గ్యారేజిని శుభ్రపరపించి, సామాను అంతటిని లాగుడుబండిమీద చేర్పించి అమర్చింది.

విజయ్‌సామానును తీసుకురమ్మని బ్రీజ్‌బెల్లా కోరినపుడు తనను నేరుగా విమానాశ్రయానికి తీసుకెళ్ళి పంపనేమోనని భీతిల్లాడు. అది ఆదివారంరోజు పగటి రెండోఝాము ముగుస్తున్న సమయం. బ్రీజ్‌బెల్లా విజయ్‌ప్రక్కగా కూర్చుంటూ "నీవు వెంటనేవెళ్ళి నీ సామానును మొత్తంగా తీసుకురా" అన్నపుడు మారుపలుకలేక వెళ్ళిపోయాడు. కాని ఆకస్మికంగా తన కిలాంటి ఆజ్ఞ రావటానికి కారణం యెంత యోచించినా తెలియలేదు. ఆమెగదివిషయం అతనికి తెలుసు. వెల్డన్‌ను

మరువలేదు. అందుకని తనను ఆహ్వానించుట దుస్తరం. తప్పక తనను పంపివేయనే యిలాంటినిర్ణయమై వుంటుందని బాధచెందుతూకూడా చేసేది లేక ఆమెఆజ్ఞ ననుసరించాడు.

విజయ్ బండిమీద రాలేదు. తన సూటుకేసును, సంచిని, మరో బ్యాగ్‌ను చేతులమీద తీసుకుని ఆమెముందు హాజరయ్యాడు. తనడబ్బే హోటలువారివద్ద వుంది. అడిగితే లెక్కలుచూసుకునే ఆలస్యమవుతుందని, వాటివిషయ మలానేవుంచి వచ్చివేశాడు. అంత నిరాడంబరంగా స్వయంగా మోసుకొచ్చినందుకు అభినందించింది. తానొక సంచిని తీసుకుని అతనిభారాన్ని తగ్గించాలని ఆమె యెంత ప్రయత్నించినా వినలేదు. ఆమెవెనుక కూలీవలె వాటిని మోసుకెళుతున్నాడు. భారంతో బాధ పడుతూ వెనుక అపుడపుడు క్రింద పెడుతున్నాడు. ఆమె వెనుతిరిగి చూసినపుడు, వెంటనే పైకియెత్తి బెట్టును నిలుపుకో ప్రయత్నిస్తున్నాడు.

పరస్త్రీముందు తన అభిమానాన్ని చూరగొన్న స్త్రీముందు పురుషుడు హద్దులకు మించిన సహనాన్నీ ప్రదర్శిస్తాడు. భరించరాని బాధ ననుభవిస్తూకూడా నవ్వుప్రదర్శనతో సానుభూతికి బదులు ప్రశంసను పొందగోరతాడు. ఆమెవెంట అంత బరువుతోను కిమనకుండా రెండు మైళ్ళు నడిచాడు. అంతదూరం పొయ్యాక ఆ పురాతన పట్టణభాగంలోని మురుగు గల్లీలో. ఆమె ప్రవేశించినపుడు శ్వాస ఆగిపోతున్నట్లు దోచింది. రాలిపోయిన చెట్లఆకులు గలగల దొర్లుకుంటూ పోతున్నవి. తనవద్దనున్న పట్టణమ్యాపులో యీ గల్లీ వుండదని, ఇది కార్పొరేషన్‌వారు రికగ్నైజ్‌చేసిన గల్లీ కాదని అనుకుంటున్నాడు. మున్సిపాలిటీవారి కసువు డబ్బాలుమాత్రం అక్కడక్కడ వున్నవి. అవి కసువుతోను, గాజుముక్కలతోను, రాతి మొరువులతోను బెల్లికలతోను నిండివున్నవి. ఒక కాపు గ్యారేజిముందు ఆగి తాళంతీసింది. ఆ తలుపులు నెపోలియన్ నాటివిగా వున్నవి. అంతటా క్రొత్త జాయింట్లువేసి వున్నవి. అయినా తేలికగా తెరువనువీలులేదు. తలుపు రెక్కలు పైకి యెత్తి భడభడధ్వనులతో తీయవలసివుంది.

# 34. దేవీపూజ

ఆ తలుపులను విజయ్ బలప్రయోగంతో తెరువగలిగాడు. లోపల గోడలు మొరికలుపోయివున్నవిగాని, పరిశుభ్రంగా కడుగబడివున్నవి. ఆ గదిలోవలెనే మేరీమాత ఫొటో గోడకు అమర్చబడివుంది. యీజీ ఛైర్, పలంగ వగైరాలన్నీ అవే యిక్కడ ఆ రీతిలోనే అమర్చబడివున్నవి. ఆయన ఆశ్చర్యపోతూ గది నలువైపులా చూస్తున్నాడు. ఆమె బయటవున్న విజయ్ సామానును తెచ్చి లోపల వుంచుతుంటే, అతను పశ్చాత్తాపపడుతూ "నా సామానును మీరు మోయుట యెందుకు?" అంటూ లాక్కోబోయాడు. కాని అందకుండా తీసుకెళ్ళి ఆమె లైనుగా సర్దివేసింది.

"గది నచ్చిందా?" అని చిరునవ్వులతో ప్రశ్నించింది.

బయట చూస్తుంటే భయమేస్తున్నది. లోపల కొండగుహలలో వలె మాగుడు దుర్గంధం వెడలుతున్నది. బాగున్నదని యెలా చెప్పగలడు? ఎవ్వరూ లక్ష్యంచేయని తనను ఆదరించి, గొప్ప త్యాగంతో తనకు స్థానమిస్తున్న దైవస్వరూపిణి యెన్నికను యేరూపంగా వక్రం చేయగలడు! ఆమెవైపు కోరగాచూస్తూ "ఆత్మద్వారా శరీరానికి విలువ కలిగినట్లు మీద్వారా యీ గది స్వర్గధామమై పోయింది." అన్నాడు.

"అయితే నీవు యిందులో వుండగలవా?" అని ప్రశ్నించింది.

"నేనుగా అయితే వుండలేకపోవచ్చు. మీ ఆజ్ఞతో నరకకూపంలోనైనా హాయిగా వుండగలను." అన్నాడు.

"అయిష్టము అసందర్భములతో సంభవంచినవాటిని సాఫీగా స్వీకరించలేక, సహించలేక యెదుటివారికొరకో, సహజీవన సంక్షేమం కొరకో, ఆదర్శ ఆశయాలను పాటించుటకొరకో నడుస్తున్నట్లు, పాటిస్తున్నట్లు ప్రకటించుకుంటారు కొందరు. అవి కేవలం ప్రగల్భాలు. సత్ఫలితాలకు చేసేకృషిలో దుష్ఫలితాలు సంభవించినపుడు వాటిని

మోయజాలక పారిపోవుట అసాధ్యమైన విషయము. ఆ దుష్ఫలితాలను కూడా శిరస్సునుంచి మోయకతప్పదు. తనకృషిలో పొందిన దుష్ఫలితాలను మోస్తూ, యెవరికొరకో మోస్తున్నట్లు దలంచి సంతృప్తిని పొందుట పిరికితనాన్ని సూచిస్తుంది." అన్నది.

ఆమె చక్కటి ఆంగ్లంలో స్పష్టంగానే అన్నది. కాని విజయ్‌కా మాటలు యథాతథంగా అర్థంకాలేదు. భావంతెలిసింది. ముఖం జేవురించింది. ఆమెలోని విశిష్టత గొప్ప వెలుగుగా గోచరించింది. "క్షమించండి....క్షమించండి." అని దీనంగా అన్నాడు.

"నామాటలకు అంత సీరియస్‌గా తీసుకుని బాధపడతారెందుకు? స్థితినిబట్టి మనస్సును స్థిరపర్చుకోవాలి." అన్నది.

"దీనికంటె ఆ గది చాలా బాగున్నదిగదా,యెందుకు మార్చారు?" అన్నాడు.

"నీకు సదుపాయాలు కల్పించటానికే యీ పని చేశాను. దీని ద్వారా నాకూ బాధ కలుగవచ్చు నీకూ బాధ కలుగవచ్చు. కొన్ని సౌకర్యాలకొరకు మరికొన్ని అసౌకర్యాలను నెత్తిన వేసుకోక తప్పదు." అన్నది.

కృతజ్ఞతాభరిత కంఠంతో "ధన్యవాదాలు. నా జన్మలో మరువరాని ఘట్టమిది. మిమ్ము జీవితాంతం దేవతగా పూజించుకుంటాను." అన్నాడు.

అతని భుజస్కంధాలమీద హస్తాలువేసి వూపుతూ దంతాలు బిగబట్టి ముద్దువొలుకు కంఠంతో "మనుష్యలను దేవతలుగా చేయుట మహా దోషం. అంతటితో వదలక పూజలుసలిపితే యిక ఆ పూజింపబడిన వ్యక్తి మహా పాపిగా తయారుకాక తప్పదు." అన్నది.

"రక్షించినవారిని పూజించుట అపరాధముగాదు. అకరణీయమూ కాదు. నన్ను రక్షించి ఆదరించినవారే నాకు ప్రత్యక్ష దైవంగా భావించి పూజించుటలోకలిగే ఆత్మతృప్తి అజ్ఞాతదేవుని ఆరాధించుటలో కలుగదు. నదీజలము తన స్వభావసిద్ధ స్వేచ్ఛతో ప్రవహించుటలోనే సాగర గర్భంలో లీనమైనట్లు మానవునికికూడా స్వేచ్ఛాపూరిత కార్యాచరణలోనే ఆత్మతృప్తి వుంటుంది. స్వేచ్ఛ నంటకట్టే నియమములతోను, నీతులలోను

అనుశాసనాలతోను అంతరాత్మ అనుక్షణము అజ్ఞాతరూప పోరాటము సలుపుతూనేవుంటుంది. పవిత్రమైన - నిష్కామంతోగూడిన - అంతరాత్మలోని ప్రేరణ దైవసందేశంలాంటిది. కనుక నా అంతరాత్మ ప్రేరణతో పూజింపబడే మీరు పవిత్రతనుంచి మహాపవిత్రతకు చేరవలసిందే." అన్నాడు.

ఆమె చిందించే నవ్వులతో అతని చుబుకాన్నిబట్టి అటు యిటు వూపుతూ "వ్యక్తి పూజవైపు నీ మనస్సు మహా మొగ్గుతుందన్నమాట. నన్ను దేవతనుచేసి పూజించుటలో నీ ఆత్మ తృప్తిపడవచ్చు. నీ తృప్తి కొరకు నన్ను దేవతనుచేసి హీనపరచుట న్యాయమా చెప్పు?" అన్నది.

"నిరాదరంతో హీనస్థితి పొందినంతమాత్రాన నాలోని జ్ఞానం నశించలేదు. పూజించుట అవమానించటం యెన్నటికీకాదు. స్వచ్ఛమైన గౌరవంతో అగౌరవం యెన్నడూ వుండదు. పవిత్రమైన ప్రేమాదరమే దైవస్వరూపమని ప్రవక్తలనిర్వచన. మీరూపంలోనే దైవత్వమున్నట్లు నేను విశ్వసించుట అపరాధం యెన్నటికీ కాజాలదు." అన్నాడు.

"అమాయకుడవనుకున్నాను చాలా చామత్కారివి సుమా. అవును మూగరాయిలోనివెలుగు కప్పివున్నందువలన తేజోశక్తి పెరుగుతుంది. నన్ను పూజించుటకంటె, నామీద శ్రద్ధవుంచి నా వుద్దేశాన్ని పాటించమని నాకోర్కె" అన్నది.

"మీ వుద్దేశాలను దైవాజ్ఞగా పాటిస్తాను. దయచేసి సెలవివ్వండి." అని వినమ్రతతో ప్రార్థించాడు.

జంకుతున్న కంఠంతో "ఒకరి విశ్వాసాన్ని మరొకరిమీద వేసి రుద్దుట అంత యోగ్యతయిన పనిగాదు. అయినా నీ క్షేమంగోరి చెప్పుట అపరాధంగాదు. నీకభ్యంతరం లేకపోతే ఆ గోడనున్న మేరీమాతను రోజూ పూజించు." అన్నది.

"అన్యమతస్థుడ గనుక అందుకంగీకరించనని మీరు శంకించవలసిన పనిలేదు. మేరీమాతను యేసుప్రభువును మనసార పూజిస్తాను. నేనేగాదు యేసుప్రభువుకు మోకరిల్లుటలో, హిందువులలోని యేఒక్కరూ యేవగించుకోరు. అధికులందరిని గౌరవించుటవలె దైవమన్న యే దేవునికయినా ఆనందంతో పూజించుట హృదయవిశాలతను వుదారతను

సూచిస్తవి. మీ ఆజ్ఞావరిస్తే మేరీమాతను పూజించగలను కాని మిమ్ము పూజించుటలో నాకు కలిగే ఆనందం విశిష్టమైంది. మిమ్ము పూజించగల హక్కును తొలగింపవద్దని నా ప్రార్థన." అన్నాడు.

ఆమె తన ఆనందాన్ని అణచుకుంటూ అతని కపోలంమీద వ్రేలుతో పొడుస్తూ "చాలా మంచిది! అయితే అంగీకార సూచకంగా నేనేమి చేయాలో చెప్పు." అన్నది.

"మీ ఫొటోను నాకిస్తే సరిపోతుంది." అన్నాడు.

"అలాంటిదొకటీలేదు. నేను కెమేరాముందు యెన్నడూ నిలువ లేదు." అన్నది.

"పోనీ త్వరలో యిచ్చే ప్రయత్నం చేయండి." అన్నాడు.

విజయ్ సామానుకూడా బ్రిజ్‌బెల్లా సర్దింది. తన శయ్యను అతనుకు బలవంతగా యిచ్చింది. ఈజీఛైరును తన శయ్యగా చేసుకున్నది. తానే ఆ యీజీచైర్‌లో పవళిస్తానని విజయ్ పోరాడాడు. యీజీఛైర్‌లో నిద్రించుటలో తనకు ప్రత్యేక అలవాటు కలదని ఆమె తనదిగా చేసుకున్నది. తనకొరకని ఆమె యింతటి అసౌకర్య గృహంలో ప్రవేశించి బాధపడుతున్నదని అతని పరితాపం. కాని అనుభవంలో ఆమెకది మామూలుగానే వున్నట్లు అర్థంచేసుకుని సంతృప్తి పడ్డాడు.

ఇరువురుకలసి నూతన గృహంలో ప్రవేశించి వారంరోజులు గడిచిపోయినవి. ఒకరికిమించి ఒకరుగా యిరువురు అందు అలవడి పోయారు. నిష్కల్మషమైన ఆదరాభిమానాలతో చేరిన రెండు హృదయాలు సానుభూతి స్నేహప్రేమలను సమభాగాలుగా పంచుకోగలుగుతున్నది.

బ్రిజ్‌బెల్లా కార్ఖానాలో యిపుడు వుత్సాహంతో పనిచేయగలుగుతున్నది. ఆమె ఆరోగ్యమిపుడు కుదుటపడినట్లు తలస్తున్నాడు యజమాని. కాని కార్ఖానా బెల్ మోగిన మరుక్షణమే బయటికి అందరికంటె వుత్సాహంగా వెళ్ళిపోతున్నది. అపరాహ్న విశ్రాంతి సమయాలందు వెనుకటివలె పనిచేయుటకు బదులు వోప్రక్కజేరి నిద్రదేవత నారాధిస్తుంటుంది. జబ్బునుంచి కోలుకుంటున్నందువలన నిద్ర యెక్కువయిందని కామందు నిర్ణయం.

హోటలుకుబదులు యిపుడు అన్నిపదార్థాలు స్టౌమీద స్వయంగా తయారుచేస్తున్నది బ్రీజ్‌బెల్లా. విజయ్‌కు యేది యిష్టమో యెలా చేస్తే యిష్టమో తెలుసుకోను అనేకవిధాల నొక్కి అడిగి తెలుసుకో ప్రయత్నిస్తుంటుంది. తాను నిరర్థకుడుగా ఆమెప్రక్క నిలిచి అన్నివైపులనుంచి ఆమెకు శ్రమను కల్పిస్తున్నందుకు మానసిక వ్యధను నొందుతుంటాడు విజయ్. ఇన్ని సౌకర్యాలను కల్పించి పెంచి, ఆంగ్లభాషలకు విరామం లేకుండా తగిన సౌకర్యాలు కల్పించగల శక్తి లేకపోయినందుకు చింతిస్తున్నది బ్రీజ్‌బెల్లా! "బాగా ఐశ్వర్యం కలిగివుంటే యెంతబావుండును!" అన్న కాంక్ష నేడామె మనస్సులో మెదులుతున్నది.

జీవితం విచిత్రమైంది! నేడు విజయ్ అనాశ్రయ స్థితిలోలేడు. జీతభత్యాలు లేకుండా, ప్రతిఫలాపేక్ష తెలియకుండా ఆదరాభిమానాలతో అధ్యాపనము చేయిస్తూ, సర్వసౌకర్యాలను సమకూర్చే ధాతృదేవతవడిలో నున్నాడు. హోటలులో దొరికిన దానినే తృప్తిగా భుజించిన అతని జిహ్వ నేడు కారంమీద, పులుపుమీద పరువులెడుతున్నది. ఆవకాయ మీద, అల్లపుపచ్చడిమీద, చింతకాయ పచ్చడిమీద, కందిపచ్చడిమీద నాలుక పీక్కుంటున్నది. కందిపచ్చడి దొరికితే యెంతో బావుండునని యెన్నో ఆలోచనలు చేస్తున్నాడు. బ్రీజ్‌బెల్లా కావిషయం తెలిసినపుడు అలా తయారుచేసి సంతృప్తిపరచాలని యెంతో ప్రయత్నించింది. కాని చేసే విధానంఅతనికే తెలియనందున అతని తప్పుడు దర్శకత్వంలో చేసినవన్నీ విఫలమయినవి.

బ్రీజ్‌బెల్లా రోజూ కార్ఖానాకెళ్ళివస్తుంటుంది. విజయ్ రేయింబవలు యింటిలోనే వుంటుంటాడు. ఏకాంతంలో చదువుమీద లగ్నంకావటానికి బదులు అతని మనస్సు చంచలత్వంలో పరువెడుతున్నది. ఆమె వైపుకే మనస్సు పోతున్నది. ఆమె యెంత మంచిది, యెంత సుగుణ సంపన్నురాలు! ముఖకవళికలు తీర్చిదిద్దిన తెలుగువారివి, వన్నె పారిస్‌లో ప్రశస్తతబొందే యెలిసిపోయిన కెంపును బోలినది. వంగనారిలోని ధాతృత్వము త్యాగము సహనములుపొందినది, ఇటలీవారి నిరాండబరత, ఇంగ్లీషువారి దక్షతసాఫీయత దీక్ష ఆమెలో అడుగుఅడుగున ద్యోతిత మవుతుంటవి. ఈ విషయాలతోనే మనస్సు కావుర్లు క్రమ్ముతుంటుంది.

ఆమెలోని తనకు నచ్చని విషయాలకొరకు యెంత వెదికినా కనిపించుటలేదు. ఆమెలోని వున్నత గుణగణాలు పోటీలు పడుతున్నవి. కాంతి పుంజాలను వెదజల్లు వజ్రము గట్టితనంలో కఠోరమైందయినట్లు లావణ్యాలతో శోభించే ఆమెశరీరంలోని మృదుత్వంలోని కండరాలు బిగుతరమైనవి. ఆమె కష్టజీవి, కరుణామూర్తి, ప్రేమదేవత. ఈ ఆలోచనలలో వూపిరిసలుపుటలేదు. విసగటలేదు.

తన్మయత్వాన్ని కల్పించే యీ ఆలోచనలనుంచి బయటపడలేక మునకలువేస్తూ, ఏ వస్తువు యెక్కడుంటే బావుంటుందో, ఆమెకు నచ్చుతుందో వూహించి చక్కబెడుతున్నాడు. కార్ఖానానుంచి తిరిగివచ్చాక ఆమె వరుసగాచేసే సర్దుబాటులన్నీ చూసినప్పుడు గనుక అదేరీతి కసువు శుభ్రపరచుటతోసహా చేసిన పనికొరకు వెదుకుతున్నాడు.

చంటివానికొరకు తాపత్రయపడుతూ పనిలోనుంచి పరువులెత్తు కొచ్చు తల్లివలె యింటికొచ్చిన బ్రీజ్‌బెల్లా అటూ ఇటూ పరికించి, యెదురుగావచ్చి నిలిచిన విజయ్‌ను తన మందస్మిత దృక్కులతో పునీతంచేస్తూ "వూఁ....మీరీ పగలంతా బాగా చదివారుకదూ!" అన్నది.

అందుకు జవాబేమి చెప్పగలడు! అపరాధివలె దీనంగా చూస్తున్నాడు.

ఆమె పరిహాసకంఠంతో "అవకాశాలు దొరకనపుడు ఆ నెపంతో లోకాన్ని నిందిస్తారు, దురదృష్టానికి దుఃఖిస్తారు. సావకాశాలు సమకూరినపుడు తాము యెందు నిమిత్తం వాపోయారో ఆ అసలు విషయాన్ని విస్మరిస్తారు. అంటున్నానని అన్యధాభావించవద్దు." అంటూ ఆమె తన బ్యాగ్‌ను చిలకస్టాండుకు తగిలించి, అలమారా తీసింది. అందులోనూ అన్ని పాత్రలూ శుభ్రపరచి వున్నవి. ఆమె ఆశ్చర్యపోతూ "మీ దేశంలో యిలాంటి కార్యాలన్నీ పురుషులేచేస్తుంటారా? స్త్రీల ఆధిక్యతే యెక్కువగా వుంటుందా?" అని ప్రశ్నించింది.

విజయ్ ముఖం వెలవెలబోతున్నది. తను పురుషజాతికేగాదు, భారతనారీలోకాని కంతటికి తీరని అపచారంచేసినట్లు చింతాక్రాంతుడైనాడు. "భారతదేశంలోని మహిళా పాతివ్రత్యము, పతిసేవ ప్రపంచంలోనే విశిష్టమైంది. పతినే ప్రత్యక్షదైవంగా పూజించే మహిళకు వికృత

రూపాన్ని ఆపాదించిన నీ నేరం సామాన్యమైందిగాదు." అని మనస్సు ప్రతిధ్వనించింది. బ్రిజ్‌బెల్లా ముఖంచూడలేక అధో ముఖంచేసి రెండో వైపు తిరిగాడు. ఆమెలోని అపార్థాన్ని తొలగించాలని మనస్సు ఆవేదన పడుతున్నది. కాని అసాధ్యమైందిగా తోచింది. పారిపోతే బావుండునని ఆలోచనలు రేగుతున్నవి. ఒకరి ఆశ్రయంలోజేరి తన స్వేచ్ఛను కోల్పోవుటకంటె నిరాశ్రయ స్థితిలోని బాధలే మంచివనిపిస్తున్నవి. పొరపాటులో చేసుకున్న నిర్ణయాలమోజులో పట్టుదలతో ప్రాకులాడి నపుడు పొందేదానికంటే పోగొట్టుకునేదెక్కువని తెలిసిపోయింది. దెబ్బలు తినినపుడుగాని, పోలీసువారి నిర్బంధంలో కటికబాధలు పడి నపుడుగాని కలుగని వైరాగ్యపు ఆలోచనలు నేడు కలుగుతున్నవి. ప్రాణాపాయానికి ఆయుపుపట్టు ఉన్నట్లే కొందరిని కొన్ని ప్రత్యేక మాటలు వేలబాకులతో పొడిచినట్లు కాగలదు. ఏ క్షణంలో యెవరిని యేమాట శూలంవలె హృదయంలో పొడుస్తుందో అన్నివేళలా చెప్ప సాధ్యంగాదు.

బ్రిజ్‌బెల్లా స్వశక్తితో జీవనోపాధినిపొంది స్వేచ్ఛతో జీవి స్తున్న స్త్రీ. కనుకనే ఆమె అనుభవకూడలిక వంటిది. అనుభవం మన స్తత్వాలను అర్థంచేసుకుంటున్నది. సర్దాతోను వేళాకోళంతోను తానన్న మాటలు అతన్నువిమూఢుని జేసినవని తెలుసుకున్నది.

ప్రాధేయపడుతున్న కంఠంతో "కోపంవచ్చిందా?" అన్నది.

జవాబుకుబదులు గోడవైపుకు రెండడుగులు వేశాడు.

ఆవేశంలోని ఉద్ధృతం ఆమె కర్థమయింది. వెనుకగావెళ్ళి చేయ్ బట్టి తనవైపు తిప్పుకుని "వేళాకోళంగా అన్నమాటలకు యింత బాధ పడకూడదు." అన్నది.

ఆయన తిరిగి గోడవైపుకు ముఖం బెట్ట ప్రయత్నిస్తున్నాడు. ముఖంలోని జేగురింపు, గంభీరతలు గాఢరూపాన్ని పొందినవి. ఇంతగా నొప్పించినందుకు ఆమె మనస్సు బాధపడుతున్నది. హస్తాన్నిబట్టి లాక్కెళ్ళి శయ్యమీద బలవంతంగా కూర్చుండబెట్టి తాను ప్రక్కన కూర్చుని చుబుకాన్నిబట్టి తనవైపుకు త్రిప్పుతూ "విజయ్, నిన్ను యింతగా గాయపర్చేమాట లన్నందుకు నేను చింతిస్తున్నాను. తన

యిష్టమైనచోట ప్రియమైనచోట, మనస్సులో మనస్సును కలిపివేయగల చోట విరసము సంభవించేంత దూరము సరసమాడుట స్త్రీస్వభావము. అధికప్రీతి వున్నచోటే హద్దుల నధిగమించి స్త్రీ సంభాషించగలదు. కనుక నా మాటలకు వేరుగా భావించి చింతించవద్దు. నీవు చేసిన యీ పనులన్నీ నాయెడలగల శ్రద్ధాభక్తులతో చేశావని నాకుతెలుసు, చేయ రానివి కాదని నాకు తెలుసు. ఇదంతా నీ హృదయంలోని విశ్వాసప్రతి బింబమని నాకు తెలుసు. కాని అసలు ధ్యేయం మరుగున పడిపోకుండా నీవు శ్రద్ధగా చదువుకోవాలని నాకోర్కె. నీవు యింటిలో వుండి చేసిన యీ కార్యాలకు నేను ఆత్మీయంగా ముగ్ధురాలనే అవుతున్నాను. నీవు పొరపాటుగా అర్థంచేసుకుంటే నన్ను క్షమించు విజయ్." అంటూ అతని శిరస్సు మీద నిమురుతున్నది.

అతను మనస్సులోని కావుర్లు చల్లగా సర్దుకుంటున్నవి. క్షణంలో ఆమెయెడల గలిగిన విరక్తి నెమ్మదిగా తుడుచుకు పోతున్నది. ఆమె లోని వుదారత లోతులు మరింత స్పష్టంగా గనిపిస్తున్నవి. ఆమె మాటలకు నవ్వి వూరుకొనుటకు బదులు యింత బాధను ప్రదర్శించుట పొరపాటయినట్లు పశ్చాత్తాప పడుతున్నాడు. ఆమె ముఖంలో చూస్తూ నవ్వను ప్రయత్నించాడు. కాని వెలవెలబోయింది.

ఆమె బుజ్జగింపుగా శిరస్సునుబట్టి వూపుతూ వెళ్ళి మాల్టు తయారు చేయుటలో నిమగ్నమైంది. ఆమె దగ్గరగావెళ్ళి కూర్చుని క్షమాపణ వేడాలనిపించింది. ఎంత కూడదీసుకున్నా ధైర్యం సడలి చెంతకు చేర లేకపోయాడు.

మాల్టుకప్పును అతని కందించి కోరగాచూస్తూ కుర్చీలోకివెళ్ళి కూర్చుంటూ "మిమ్మ యేమయినా అంటే కోపంవస్తుంది. ఎందు కొచ్చింది. నేనేమీ అనను" అంటూ అతనివైపు చూసింది. మాల్టు కప్పును ప్రక్కనపెట్టి వినమ్రతతోలేచివచ్చి ఆమెహస్తాన్ని చేతులలోకి తీసుకుని "నన్ను క్షమించు. మీరు సరసానికంటున్నమాటలను తెలుసు కోలేక బాధపడ్డాను" అన్నాడు.

"కేవలం నేను పరిహాసానికే అనలేదు. నీ చదువుమీద శ్రద్ధ నుంచుకోవాలనే ఆశయంతో అన్నాను. చదువును అశ్రద్ధచేస్తే అసలు

విషయిం మరుగునపడ్డాక శ్రమ నిరర్థకమవుతుందిగదా! ఆ విషయాన్నే చనువుతో అన్నాను, అంతే. నీవు చేసినపని చేయరానిదిగాదు. నన్ను పరవశంచేసేదే, నిన్ను కడతేర్చుట నా కర్తవ్యంగదా!" అన్నది.

విజయ్‌మనస్సు మరింత బాధతో కలవరపడిపోయింది. పవిత్రమైన ఆమెహృదయంమీద కించపడినందుకు చింతిస్తూ ఆమెను స్తుతించుకుంటున్నాడు. "ఈ ఒక్కమాటుకు క్షమించి నా పొరపాటును విస్మరించండి. ఇక యెన్నటికీ అలా చేయను. మీరు యేమిఅన్నా ఆనందంతో ఆస్వాదిస్తాను" అన్నాడు.

బ్రీజ్‌బెల్లా నూతనగృహంలో ప్రవేశించి నెలరోజులు గడిచిపోయినవి. నిర్జనగల్లీలో రాకపోకలు ఆమె కలవాటయిపోయింది. కావలసిన తినుబండారాలన్నిటిని తానే తెస్తున్నది. విజయ్ బయటముఖం, బజార్లముఖం చూసే అవకాశం లేకపోతున్నది. తనఅడ్రసును యెవరికీ యివ్వవద్దని బ్రీజ్‌బెల్లా సలహాయిచ్చింది. డబ్బు తెప్పించుకొనుటకు ఉత్తరంవ్రాసి పోస్టుచేయుటకు బ్రీజ్‌బెల్లా చేతికిచ్చినపుడు, ఆమె చించివేసి ఆ అవసరాలు లేవని, కొన్నాళ్ళు అజ్ఞాతజీవితాన్ని గడుపుట అవసరమని వివరించినపుడు, ఆజ్ఞగా శిరసావహించాడు విజయ్.

విజయ్‌కు చదువాలనికాంక్ష వుంది. బ్రీజ్‌బెల్లాభయమూ వుంది. కాని పదినిముషాలకంటె మనస్సు నిలుచుటలేదు. ఆమె కోపంగా అన్నమాటలు, మృదుత్వంతోచేసిన లాలింపులు ఒక్కటొక్కటిగా చెలరేగి చదువుమీది ధ్యాసను భగ్నంచేస్తుంటవి. ఆమె పవళించేముందు మేరీమాత పటంయెదుట మోకరిల్లి వక్షస్సుమీద క్రాసుగుర్తును వ్రేలుతో అనుకుంటూ నేత్రాలుమూసి అరగంటవరకు ప్రార్థన సలుపుతుంటుంది. మేరీమాతపటంక్రింద వెలుగుతున్న మయినపువత్తుల ప్రక్కగా కాలుతున్న దూదువత్తులసుగంధధూమ్రం గదిఅంతటా క్రమ్మి ఆహ్లాదాన్ని కలిగిస్తూ, ఆ ప్రశాంతవాతావరణంలో జ్ఞానసంబంధ ఆలోచనలు రేకెత్తిస్తుంటుంది.

ఆ మయినపువత్తులవెలుగులో ద్యోతితమవుతున్న మేరీమాత (ఫొటోను) ప్రతిమను పవిత్రంచేస్తూ సుడులుసుడులుగా పరువులెడుతున్న సుగంధధూమ్రాలమబ్బులమధ్య ఆకర్షణీయంచేస్తూ హృదయంలో

జ్ఞానజ్యోతులను వెలిగిస్తున్నది. అనేకరోజులు ఆ దృశ్యాలలో మునిగి పోయిన విజయ్‌కు ఆ సమయంలో స్థిరత్వం కనిపిస్తూ, మోకరిల్లి యేకాగ్రతలోనున్న బ్రీజ్‌బెల్లాను అనుకరించాలని అంతరాత్మప్రేరణ జరుగుతున్నది.

మేరీమాతముందు మోకరిల్లి, నేత్రాలుమూసి, అధోముఖంజేసి, ధ్యాననిమగ్నంలోనున్న బ్రీజ్‌బెల్లాను యెంతసేపు చూసినా చూడాలనిపిస్తున్నది. ఆ నిశ్చలత్వంలో, నిష్ఠలో యేకాగ్రంలోనున్నపుడు ఆమె అందం పవిత్రజ్యోతివలె ప్రకాశిస్తున్నది. ఈలోకంలో తుచ్ఛమైన సర్వ తాపత్రయాలను కొన్నిక్షణాలపాటైనా విస్మరించి ప్రశాంతతను ప్రభవించే ఆ అనంతవెలుగులో ఆత్మార్పణ చేసుకోగలిగిన ఆమెశక్తికి విస్మితుడవుతూ తననుతాను మర్చి ఆమెనుచూస్తూనే వుండిపోతున్నాడు. దేవుడనేవాడు వున్నా లేకపోయినా ఆ అజ్ఞాతశక్తిస్వరూపమే దేవుని విశ్వసించేవారికి శోభను కలిపించే నిష్ఠలు, నియమాలు, శాంతిని, ఆత్మతృప్తినికలిగించే భక్తిలోని ఆత్మార్పణ ప్రత్యక్షసత్యాలుగాను, అవి మానవమన స్తత్వాలను ఉన్నతస్థాయికి తీసుకెళ్ళునవిగను అనుభవమవుతున్నట్లు తోచింది. ఆత్మబలము, ఆత్మవిశ్వాసము లేని మానవులు ఈ అజ్ఞాతదేవుని నిర్మించుకుని, విశ్వాసాన్ని కుదుర్చుకుని భక్తిమార్గాలను అల్లుకున్నారని వాదించేవారి వాదనలే సత్యమయినా ఆ హేతువులు మృగ్యం గానంతవరకు అవి పవిత్రమైనవి కాదనుట నేరమనిపిస్తున్నది విజయ్‌కు. ఉండి పొందే ఆనందంకంటె వూహాలోకంలోపొందే ఆనందం తక్కువైనదని యెవ రనగలరు!

# 35. అఖండవెలుగు

నిష్ఠలో, యేకాగ్రధ్యాన నిమగ్నంలోనున్న బ్రీజ్‌బెల్లానుచూస్తూ ముగ్ధుడైపోతున్నాడు విజయ్. ఆమెలోని తపోశక్తి విశిష్టరూపంలో ప్రభాసిస్తున్నట్లు అనుభూతిని పొందుతున్నాడు. ఆమెస్పర్శద్వారా తప్పక కొంతశక్తి తనకూ సంప్రాప్తమవుతుందని ఆశ కలుగుతున్నది గాని, పవిత్రమైనఅగ్నిని అంటుట సాధ్యమా? అని భీతి గలుగుతున్నది. కాంతిపుంజాలు వెదజల్లుతున్న ఆమెముఖం చూస్తున్నపుడు తన జన్మ జన్మల పుణ్యఫలితంగా ఆమెఆదరంలో జేరినట్లు ప్రఫుల్లితుడై పోతున్నాడు. ఆమెను చూస్తున్నంతసేపు ప్రబోధాలులేకుండా, వాదవివాదాలు లేకుండా గొప్ప జ్ఞానసంబంధభావా లుత్పన్నమై హృదయం వికాస మొందుతున్నది. లోకలోకాలనుకప్పి నిండి నిబిడీకృతమై సృష్టిలయలకు మూలమై సర్వజగత్తులను సంభ్రమాశ్చర్యాలగొలుపు రీతిలో నడుపు తున్న ఆ విరాట్‌శక్తిని యెవరిరూపంలో చూసి పూజించినా, యే నామంతో సంబోధించి ప్రార్థించినా ఒకేరూపవిరాట్‌వెలుగు, ఒకే రూప నాదము, ఒకే ఫలితము సంభవిస్తవని, వివిధజాతుల ఇంధనాలు ఒకే రూపు వెలుగును సృష్టించురీతి దేవుళ్ళందరూ పరమసత్యంమీదనే నిలిచారని, అందరూ ప్రేమస్వభావులని అతనిమనస్సులో ఆలోచనలు చెల రేగుతున్నవి. ఆ విరాట్‌వెలుగులోని, విశ్వప్రేమలోని, పరమసత్య స్వరూపులైన దేవుళ్ళందరూ ఒకే అణువులోని ప్రతిబింబాలని, గగన మండల సుదీప్తిజేయు ప్రతితారలోను ఒకేరీతి వుష్ణము, వెలుగు వున్నట్లు దేముళ్ళందరిశక్తి ఒకే రూపమైందయినట్లు అతనిమనస్సుకు తోచింది. బ్రీజ్‌బెల్లావైపు చూస్తున్నకొంది ఆమెలోకూడా అదేవెలుగు, అదేతేజస్సు దివ్యరూపంలో గోచరించింది. ఆమెముందు ఆమెకే మోకరిల్లి భక్తి విశ్వాసాలతో ప్రార్థించాలని మనస్సులోని ప్రేరణ ముందుకు నెడుతున్నది.

పసివారలకువలెనే అతనిమనస్సు ఆమెచేసిన పూజాకార్యాలవైపు పరువులెడుతున్నది. అపరాహ్నసమయాలందు ఏకాంతంలో ఆమె ననుకరించాలనే వుత్సాహంతో తలుపులు బిగించుకుని, గదిని అంధకారం చేసుకుని మేరీమాతపటంముందు ఆమెవలెనే మైనపువత్తులు, పూదు వత్తులు వెలిగించి, ఆమె మోకరిల్లినచోట అదేరీతి మోకరిల్లి నేత్రాలు మూసి ధ్యాననిమగ్నుడైపోయాడు. తనకోర్కెలను వల్లించి దేముని ప్రార్థించాలని మనస్సుకు తోయలేదు. దేముడంటే అఖండజ్యోతిని దర్శించాలని సంకల్పించి నేత్రాలు మూశాడు. నేత్రాలుమూసిన అయిదు నిమిషాలఅనంతరం ఆ అఖండవెలుగు కనిపిస్తున్న అనుభూతిని పొందు తున్నాడు. కాని ఆ వెలుగులో అస్పష్టరూపు, నిర్మలప్రతిమ కనిపిస్తు న్నది. ఆ ప్రతిమను స్పష్టంగా చూడాలని మనస్సును యేకాగ్రం చేసి నపుడు ఆ మూర్తి సుస్పష్టమవుతున్నది ఆ వెలుగంతా ఆ దేవతనుంచి వెలువడుతున్న కాంతిపుంజాలని తెలిసిపోయింది. అబ్బ! ఆ దేవత ముఖారవిందంనుంచి వెలువడుతున్న సువర్ణకాంతులు యెంత అమృత ప్రాయమైనవి! ఆ ముఖమండలంలో యెక్కడా చిన్ని దోమమరకకూడా లేని స్ఫటికఫలకనిర్మితంవలె వున్నది. ఆ ప్రతిమ అధరాలలో ప్రేమాద రాలను చిలికించే చిరునవ్వులు తొంగిచూస్తున్నవి. కాని ఆమె నిత్యము తనను కాపాడుతూ తనయెదుటనే వుండు దేవతవలె గనిపించింది. ఆ ప్రశాంతమూర్తి పాదాలు పట్టుకుని ప్రార్థించి ఆమె వడిలోనే తనకు స్థానమివ్వమని కోరాలనిపించింది. ఆమె పాదాలమీద హస్తాలుంచాలని సంకల్పం కలిగినపుడు మనస్సు కంపించి చలించింది. వెంటనే ఆ దివ్య ప్రతిమ స్వరూపం బ్రీజ్‌బెల్లాదని తెలిసిపోయింది. తనకు తెలియకుం డానే తన మనస్సులో చిత్రించుకుపోయిన ప్రతిమనేత్రాలు మూసి నపుడు స్పష్టరూపంలో గోచరించుట స్వాభావికం.

తన నేత్రాలముందున్న అఖండ వెలుగు, యేప్రతిమ ప్రతిబింబిత కాంతిపుంజాలుగా గోచరించినవో, ఆ ప్రతిమ తన ఆదర దాత్రియైన బ్రీజ్‌బెల్లా దయని తెలిసినపుడు, విజయ్ మనస్సు ఆనందడోలికలలో వూగసాగింది. తన తపస్సు ఫలించి తాను సిద్ధిపొందినట్లు హృదయం గర్వరాగంతో వూగింది.

చల్లగాలినిగోరి షైపుకెళ్లినట్లు, ఉల్లాసంతో వూయలలో యెక్కి వూగునట్లు, మోకరిల్లి పొందే ఆత్మానందంకొరకు విజయ్ మనస్సు ఆరాటపడుతున్నది. బ్రీజ్‌బెల్లా కార్ఖానాకు వెళ్ళగానే వుత్సాహ వుద్వేగాలతో మేరీమాతముందు మోకరిల్లి ప్రార్థన కుపక్రమించి ఆనందాన్ని పొందుతుంటాడు. ఆ వుత్సాహంలోనే వూగిపోతూ యిల్లంతా చక్కబెట్టి కార్యక్రమాలు చేస్తాడు. తన దుస్తులనేగాదు ఆమె దుస్తులనుకూడా యెలక్ట్రిక్ పెట్టెతో యిస్త్రీచేస్తుంటాడు. ఇవన్నీ తనకొరకు చేసుంటాడు. రోజూ ఆఖరిఘడియలలో ఆమె భయాన్ని గుర్తుచేసుకుని పుస్తకాలు ముందు బెట్టుకు చదువుతుంటాడు.

ఆమె సంధ్యాసమయం యింటికి చేరినపుడు, బుద్ధిమంతునివలె శ్రద్ధతో చదువుతున్న దృశ్యాన్నిచూసి, ప్రసన్నురాలవుతూ "చాలా సంతోషం! అంతశ్రద్ధగా చదివినపుడే మీ కోర్కె ఫలిస్తుంది." అన్నది బ్రీజ్‌బెల్లా.

"తన కోర్కెలు, ఆశలు, లక్ష్యాలు, నాడీజాతకఫలితాలు గుర్తుకొచ్చి తపుడుకున్నట్లయి ముఖం జేవురించింది.

అతని ప్రక్కన గూర్చుంటూ, భుజంమీద చేయివేసి నిమురుతూ "ఎందుకలా వెలవెలబోతావు! నీకు మంచికి చెడుకు పచక్షణలేదులాగుంది. నేను సంతోషాన్ని ప్రకటించినపుడు సంతృప్తిని పొందటానికి బదులు ఖిన్నత జెందుటమంచిదా చెప్పు!" అంటూ ప్రారంభించి ప్రశంసించింది.

అతని మనస్సు కుదుటపడి వుత్సాహాన్నిపొంది, ఫ్రెంచిపాఠాన్ని కూడా గడగడ చదువగలిగాడు.

ఆరోజు బుధవారం. పట్టణ వ్యాపారస్తుల సంక్షేమ కమిటీలో సభ్యుడుగా కార్ఖానా యజమాని యెన్నుకోబడ్డాడు. ఆ శుభసంతోషంతో కార్ఖానాకు వంటిగంటనుంచి సెలవు యివ్వబడినందున బ్రీజ్‌బెల్లా నేరుగా యింటికి వచ్చింది. కవాటాలు మూసివున్నవి. కాని వోరగా సందు గనిపిస్తున్నది. విజయ్ నిద్రిస్తుంటాడని వూహజేసి, అయినా చూడాలనే ఆదుర్దాతో నెమ్మదిగా కవాటాలు తెరచింది. ఆశ్చర్యంతో అక్కడే నిలిచిపోయింది. విజయ్ తనవలెనే మేరీమాత ఫొటోముందు మోకరిల్లి

ప్రార్ధనలో మునిగివున్నాడు. కొవ్వొత్తులు వెలుగుతున్నవి. పిల్లి అడుగులతో విజయ్ ప్రక్కకు వచ్చి తొంగిచూసింది. అతని యేకాగ్రత చెదరలేదు. నేత్రాలు మూసేవున్నవి. అతని ముఖం చూడగానే ఆమెలోని ఆదుర్దాలు వేళాకోళాలు యెగిరిపోయినవి. వినమ్రతతో నిశ్శబ్దంతో అతని ప్రక్కగా తానూ మోకరిల్లి నేత్రాలు మూసి నిమగ్నురాలయింది.

"అనంతవెలుగులోని ఓ దేవతా! నీవే నా యేకయిక దేవతవు. నాకు ఆశ్రయమిచ్చి ఆదరించి మార్గోన్ముఖుని చేసిన ఓ కరుణామయీ నీవు ప్రత్యక్షమైవానివి. నిన్ను జీవితాంతం పూజిస్తాను, దేవదేవీ. ప్రేమ నీసొత్తు, కరుణపూరిత ఆదరసత్కారాలు నీ స్వభావాలు. నీలోని గంభీరత నన్ను భయపెట్టి కర్తవ్యోన్ముఖుని చేస్తుంటుంది. నీ అందం అద్వితీయమైంది. నీ నిరాడంబరత్వం అందానికి ధాతృత్వానికి మెరుగులు దిద్ది దేవీపీఠానికి చేరుస్తున్నవి. నీఆదరాన్ని పొందుతూ నిన్ను పూజించగల అవకాశాన్ని బడసిన నా జీవితమే ధన్యం." అంటూ యింకా మనస్సులో గొణుక్కుంటున్నట్లు వినబడుతున్నది.

ఆమె కంగారుపడుతూ నేత్రాలు తెరచి ఒక్కటొక్కటిగా అన్నీ విని ఆశ్చర్యంతో అలానే వుండిపోయింది. లోతుస్వరంతో, వినిపించని స్థాయిలో యింకా అస్పష్టధ్వనులు వస్తూనేవున్నవి. వీపుమీద చేయివేసి పిలవాలనుకున్నది. కాని ముఖంచూచినపుడు దీక్షలోని గంభీరత స్పష్టమవుతున్నందున చెదర్చలేకపోయింది.

అతని నోటినుంచి యిపుడుమాటలు వచ్చుటలేదు. కాని ఆ మాటలే వీనులకు వినిపిస్తున్నవి. మోకరిల్లింది మేరీమాత ముందు, కాని చేస్తున్నస్తోత్రం తనకు, ఆమెకు అర్ధమయింది. ఒక అన్య దేశస్థుడు, అన్యమతస్థుడు స్వేచ్ఛాపూరిత భక్తిప్రపత్తులతో తన మేరీమాతను ఆరాధిస్తున్నట్లు చూసినపుడు ఆశ్చర్యపోయింది, ఆనందపడింది. కాని ఆ నూతనోపాసకుడు మాతముందుగూర్చుని తననే ఆరాధిస్తున్నట్లు తెలిసినపుడు, క్షణపాటు కలవరపడింది, ఆ తరువాత ఆమె హృదయం విడిలిపొంగింది.

మానవమనస్సు వున్నతవైపుకు పో ప్రయత్నిస్తుంటుంది. ఫలితం అన్నివేళలా అందుబాటుగాదు గనుక అజ్ఞాతశక్తి అధీనంలో పయనిస్తుం

టారు. పొగడ్తలు పొందినపుడు పరాధీనులవుతారు. పూజలభించినపుడు తనను తాను మరచిపోవటంగద్దు.

ఆపత్తితో ఆదుకున్నది, నిరాశ్రయునికి ఆశ్రయమిచ్చింది. పథ విహీనునికి మార్గగామియైంది. నేడు ఆ వ్యక్తిముందు దేవతగా నిలిచి పూజలందుకుంటున్నది. ఒక సజ్జనునిద్వారా పూజింపబడుట సామాన్య విషయంగాదు.

బ్రీజ్‌బెల్లా హృదయమంతా కరుణగామారి కాపుర్ల రూపంలో ఆ భక్తునిమీదకు పోప్రయతిస్తున్నది. తనను ఆత్మీయంగా పూజింప సంసిద్ధ మయిన ఆ వ్యక్తిని తాను నిరాదరంచేసినట్లే మనస్సు వాపోతున్నది. అతనికి మంచి సౌకర్యాలు కల్పిస్తే బాగుండేదని, యేమేమి చేస్తే యెలా వుంటుందో ఆలోచనలలోదిగి, ఇన్నిరోజులకుగాను నేడు జీవితంలో తన ఆర్థిక దుస్థితికి దుఃఖిస్తున్నది. బాగా సంపదవుంటే, అతనిని ఒక మహలులో వుంచి యేమేమో చేయగలిగేదాన్నని చిత్రవిచిత్రంగా చిత్రించుకుంటున్నది.

ఆఖరిలో తన హృదయంమీద వ్రేలుతో చిలువగుర్తును వేసుకుని నేత్రాలుతెరిచి ప్రక్కననున్న బ్రీజ్‌బెల్లాను జూచి మ్రాన్పడిపోయాడు. వేళగానివేళ ఆమె యెందుకొచ్చిందో యెంతసేపటిబట్టి తన చర్యను గమనిస్తున్నదోనన్న భయంతో చివ్వునలేచి వెళ్ళబోతుండగా, ఆమె హస్తాన్నిబట్టిలాగి నిలుపుతూ తానూ నిలచి "విజయ్, నేనేమీ అనుకోను ఖంగారుపడవోకు" అన్నది.

విజయ్ బయటివైపు చూస్తూ పారిపో ప్రయత్నిస్తున్నవాని వలె గనిపించాడు. అతని వీపును నిమురుతూ "నా యెదుట ప్రతివిషయం లోను భయాన్ని ప్రదర్శిస్తావెందుకు? నీవుచేయరానిది యేమీ చేయలేదు. భయపడకుండా నాప్రశ్నకు సమాధానం చెప్పు." అన్నది.

అతనిలోని భయంపోయి, ప్రశ్న యేమిటోనన్న ఆదుర్దా చెలరే గిందిగాబోలు స్థిరదృక్కులతో ఆమె ముఖంలోకి చూశాడు.

"నీకు యేసుప్రభువుమీద విశ్వాసమున్నదా?" అని ప్రశ్నించింది. కొంచెం ఆలోచించి "నీకున్నదిగా" అన్నాడు.

"నన్నుగురించిగాదు..నీ.విశ్వాసాన్నిగురించి అడుగుతున్నాను." అన్నది.

"నేను మిమ్ము సంపూర్ణంగా.విశ్వసిస్తున్నాను గనుక, మీ విశ్వాసాలన్నీ నాకు విశ్వస్థమవుట.సహజము." అన్నాడు.

క్షణంపాటు ఆమె నివ్వెరపోయింది. మానవమనస్తత్వంలోని నిగూఢమర్మం అర్థమయినట్లు తోచింది. ఇప్పటివరకు 'అతన్ని సామాన్యునిగా గణించిన తన తెలివితక్కువతనానికి విచారిస్తూ దీన దృక్కులను బరపుతూ అలానే వుండిపోయింది.

అతనిమనస్సు కిపుడు ధైర్యం చేకూరింది. "మీరింత తొందరగా వచ్చారెందుకని?" అని ప్రశ్నించాడు.

ఆమె మనస్సు రావటానికిగల కారణంకంటె వచ్చి తెలుసుకున్న దానికి గొప్ప మహత్తునిస్తున్నది.

---

# 36. గాలిమేడలు

విజయ్ బ్రీజ్‌బెల్లా ఆశ్రయంలోజేరి రెండుసంవత్సరాలు గడిచిపోయినవి. ఒకర్ని మరొకరు అర్థంచేసుకున్నారు. సంశయాలు, సంధిగ్ధాలు సమసిపోయినవి. ఘనిష్టత పెరిగిపోయింది. రెండుహృదయాలు యేకమయినపుడు ఆలోచనలు, నిర్ణయాలు ఒకేవిధంగా వుంటవి. ఇపుడు బ్రీజ్‌బెల్లాముందు భయంలేదు, భక్తివుంది. ఆమెతో యెన్నెన్నోవిషయాలను చర్చించగలుగుతున్నాడు. తన అభిప్రాయమేదయినా, ఆమెమాటలతో నడుచుకొనుటలోనే అతనికి తృప్తివుంటుంది, బ్రీజ్‌బెల్లాప్రక్కగా తానూ నిత్యమూ మేరీమాతపటంముందు మోకరిల్లి ప్రార్థనలు సలుపుటలో అలవడిపోయాడు. ప్రార్థన ఆమె తొందరగా ముగించుకున్నందుకు బాధపడుతుంటాడు. ఆమె లేచినతరువాతకూడా తాను యెంతోసేపు ఏకాగ్రంలోనే వుంటాడు. ప్రార్థనలో యేకాగ్రతగా యెంతసేపున్నా తనముందు గొప్పవెలుగు, ఆ వెలుగులో పవిత్రదేవతారూపిణియైన బ్రీజ్‌బెల్లా కనిపిస్తుంటుంది.

బ్రీజ్‌బెల్లా మందహాసంచేస్తూ "విజయ్! ప్రార్థనలలో అంతసేపుంటావుగదా! నీ కోర్కెలనుకూడా యేమయినా విన్నవించుకుంటుంటావా?" అన్నది.

"ఒకే ఒకకోర్కెను నిత్యమూ విన్నవించుకుంటాను. అంతకు మించిన ఆలోచన లిపుడు లేవు" అన్నాడు.

"అంత యేకాగ్రమైనకోర్కె యేమిటో!" అని ప్రశ్నించింది.

కొంచెం తటపటాయిస్తూ "ఒకప్పుడు అనేకకోర్కెలుండేవి కాని నేడు ప్రబలమైనకోర్కె ఒక్కటే వుంది. మహావృక్షంక్రింద మరో మొక్క మనజాలనట్లు ఒక కోర్కెముందు మిగిలిన కోర్కెలన్నీ యెగిరిపోయినవి" అన్నాడు.

"అన్నీ జెప్పి అడిగినవిషయాన్ని విడచుటవలన ప్రయోజనం లేదు. ఆ కోర్కె యేమిటో చెప్పమని కోరాను" అన్నది.

"దొరికిన ఆశ్రయాన్ని శాశ్వతంచేయమని సంకల్పంచేసుకుం టున్నాను" అన్నాడు.

దరహాసంతో అతనిచెవుబట్టి మెలివేస్తూ "నా మెడలమీద శాశ్వ తంగా సవారీ చేయాలనుకుంటున్నావా? ఇందుకు నీవు ప్రార్థిస్తున్నది యేసుప్రభువునా, మేరీమాతనా?" అని ప్రశ్నించింది.

"నేను ధ్యాననిమగ్నుడనైనపుడు అఖండవెలుగు కనిపిస్తుంది, ఆ వెలుగులో సుందరదేవి కనిపిస్తుంది. ఆ దేవినే ప్రార్థిస్తుంటాను" అన్నాడు.

"ఇంతకాలానికికూడా నీ ప్రార్థనలో కనిపించే దేవి మారలేదన్న మాట" అన్నది.

"మర్చిపోవుట, మారిపోవుట యెన్నటికి జరుగనివిషయం. ఆ దేవి కన్నుమూస్తే కనుపించేశక్తిని పొందాను" అని అన్నాడు ధీమాగా.

పరిహాసాన్ని ప్రదర్శిస్తూ "కనులు తెరిచినపుడు ఆ దేవి యెన్నడూ కనిపించదా? నిజం చెప్పు?" అన్నది.

కోరగాచూస్తూ "మీముందు అబద్ధం చెప్పలేను" అన్నాడు.

"అబద్ధం యెవరిముందూ చెప్పగూడదు. నిజంచెప్పమనే కోరు తున్నాను" అన్నది.

చెప్పగలసాహసం లేక అలానే నిలిచిపోయాడు.

"సమాధానం చెప్పకపోతే నామనస్సు వేదనచెందుతుంది. దయ చేసి నిజం చెప్పు" అన్నది.

సంకోచాలతో, సందిగ్ధకంఠంతో "కళ్ళు తెరిచినపుడుకూడా కని పిస్తుంది" అన్నాడు.

"అయితే ఆ దేవి యెవరో చెప్పు?" అన్నది.

కంపిస్తున్నకంఠంతో "క్షమించు" అన్నాడు.

ఆమె మరింత వుత్సుకభరితకంఠంతో "పోనీ నాకుమల్లే వుం టుందా?" అన్నది.

"అవును" అని దీర్ఘశ్వాసను విడిచాడు.

"నీ మనస్సులోని దేవతను నే నెరుగుదును" అన్నది.

దీనదృక్కులతో ఆమెవైపు చూశాడు.

"భయపడేవాళ్ళు చేయరానివి చేసి కూర్చుంటారు. భయపడ గూడదు. నీతిని, ధర్మాన్ని యెన్నడూ దాటరాదు. పొరపాటుగా జరుగ రానిది జరిగినా దాయగూడదు. రహస్యంద్వారా అపరాధం పెరిగిపో తుంది" అన్నది.

ప్రాధేయతతో "ఈ ఒక్క విషయంలో నన్ను క్షమించు మిస్. ఈప్రార్ధన నేను తలంపుతో ప్రారంభించిందిగాదు. అనుకోనిరీతిగా అలవాటుపడిపోయాను. అదొక నిషాగా నా తత్వంలో జీర్ణించింది. మీ ప్రక్కనే ప్రార్ధనలోకూర్చున్నా నాముందు ఆ అలవాటయినదృశ్యమే కనిపిస్తుంటుంది" అన్నాడు.

అపరాధమని అనకముందే ఆదుర్దాపడట మెందుకు! నీవు చేస్తు న్నది నేరమో కాదో నేనూ చెప్పలేను. కాని నీవుపూజిస్తున్నది యెవ రినో నీ నోటిమీదగా వినాలని నా అభిలాష" అన్నది.

ధైర్యాన్ని కూడదీసుకుని దృష్టిని మేరీమాతమీద వుంచి "నేను ప్రార్ధన కుపక్రమించగనే నాముందు ప్రత్యక్షమయ్యేది మీరే. ఆ ప్రత్యక్ష దేవినే పూజిస్తున్నాను" అని బరువుకంఠంతో అన్నాడు.

అంతర్గతంగా పెల్లుబుకుతున్న ఆనందాన్ని అదుపుజేసుకుంటూ, అతనిమెడను బాహువులతో బంధించి ముఖాన్ని ముఖంవైపు చేసుకుని అటుయిటు వూపుతూ "అయితే ఆ దేవిని యేమికోరుతున్నావో చెప్పు" అని మృదువైన లోస్థాయిలో అన్నది.

"ఏమీలేదు" అన్నాడు.

"నిష్కామభక్తి సర్వశ్రేష్టమైందని నిర్వచిస్తారు కాని కోర్కెలు లేనిదే భక్తిమీద మోజు కలుగదు. కనుక భక్తికి హేతువు కోర్కెలు. నీ దేవదేవి తరపుగా నేను అడుగుతున్నాను, నీకోర్కె యేమిటో చెప్పు విజయ్" అన్నది.

"శాశ్వతంగా ఆమెఆశ్రయంలో వుంచుకోమని ప్రార్ధిస్తుంటాను" అన్నాడు.

దంతాలు బిగబట్టి ఆహ్లాదాన్ని అణచుకుంటూ, అతనిమొఖాన్ని

తనమొఖానికి తగిలేఅంత సన్నిహితం చేసుకుంటూ "నా ఆశ్రయంనుంచి పారిపోయి ఆ దేవిగారిఆశ్రయానికి చేరాలని దురాలోచనలు చేస్తున్నావా? నీముఖం విశ్వాసపాత్రమైంది. కాని విశ్వాసఘాతకానికి తలపెడు తున్నావు. ఇది యెంత ఘోరం!" అన్నది.

కంపిస్తున్నకంఠంతో "కాదుకాదు" అంటూ ఆమెచేతులను విడి పించుకోను ప్రయత్నిస్తున్నాడు. ఆమె అమాంతం తనమీదకులాక్కొని కవుగిటిలో బంధించి "పారిపోవాలని చూస్తున్నావా? నాలోని యే అనాద రాన్ని చూసి మరోదేవి ఆశ్రయంలోకి పోజూస్తున్నావు!" అంటూ బాహు వులను సడలించింది.

విజయ్‌శరీరమంతటా విద్యుల్లత ప్రవహించింది. నరాలలోని వుధృతం వుత్తేజితపరుస్తున్నది. మదభరితదృక్కులతో క్షణంపాటు అలానే వుండిపోయాడు. ముఖం జేవురించింది. నయనాలు రుధిరరంగు లలో మెరుస్తున్నవి.

"చనువుతో స్వతంత్రించి నేను అన్నమాటలతో బాధపడవద్దు. నీ స్వేచ్ఛను అరికట్టుట నా ధర్మమూగాదు. ఈనాడే గాదు, యేనాడూ నీ కిచట నిర్బంధం లేదు. నీ దేవిగారి ఆశ్రయంలోకి నిరభ్యంతరంగా యే సమయంలోనైనా వెళ్ళవచ్చు" అన్నది. ఆమెమాటలలో యెక్కడా బాధగాని, ద్వేషంగాని లేదు. మృదుత్వము, ప్రసన్నఛాయలు ప్రతి మాటలోను ప్రదర్శితమవుతున్నవి.

ఆమె ఆఖరిమాటలలో అతనిలోని వుధృతము, వుద్వేగము చప్ప బడిపోయింది. గాలిపోయిన బెలూన్‌చందమైంది. ఇక ఏమిజరిగినా మనస్సు లోని యదార్ధతను దాచినందువలన అనర్ధకమే వాటిల్లుతుందన్న భయం కలిగింది. ధైర్యాన్ని కూడదీసుకుని "క్షమించి అన్యధా భావించవద్దు. నేను మరొకరి ఆశ్రయంకొరకు అర్ధించుటలేదు. ఉన్నఆశ్రయాన్ని శాశ్వతంచేయమని దేవిని ప్రార్ధిస్తున్నాను. ఆ దేవికి నాకు యెన్నటికి యెడబాటులేకుండా చేయమని వేడుకుంటున్నాను. ఆదేవి.... మీరే.... అని చెప్పటానికి భయంగావుంది...." అంటూ సణిగాడు.

"మీపథకం గొప్ప చమత్కృతితోగూడిందే! మీ దేశసాంప్ర దాయమూ యిదే రూపంలో విన్నాను. దేవుడే ప్రత్యక్షమయినా అతన్ని

కాదని, ప్రతిష్టచేసుకున్న అతని ప్రతిమను పూజిస్తారుట. పొందినదాని కంటె పొందాలని వాంఛించేదానికి, వున్నవారికంటె లేనివారికి విలువ నిస్తారుట. ఎదుటనున్నవారిని దోచుకోవాలని వాంఛిస్తూ సాహసంచాలక వారిప్రతిమను సృష్టించుకుని, ఆ ప్రతిమముందు తన కోర్కెలన్నిటిని యేకరువుబెడుతూ మాంత్రికశక్తినిపొంది గొప్ప తిరుగుడుతోనైనా తన ఆశయాన్ని నెరవేర్చుకుంటారుః. ఇది నాగరికమార్గం కావచ్చు. కాని మోసంగాదని యెవరూ అనలేరు. చేరదీసి ఆదరించిన నన్ను పొందటానికి తాంత్రికంతోగూడిన యీ మాంత్రిక మార్గాన్ననుసరించావన్నమాట." అన్నది.

ఎండుకుపోయిన కంఠంతో "లేదు లేదు క్షమించండి. మిమ్మ్ము మోసగించేముందు మరణించుటమంచిది. తంత్రంతో మిమ్మ్ము పొందే కంటె మీ ఆరాధకుడనుగా జీవితాంతం సగర్వంతో వుండుట సర్వశ్రేష్ట మైందిగా భావిస్తాను. మీయెడలగల భక్తి శ్రద్ధ ప్రేమలు మరోవైపుగల భయము నన్నా మార్గాన నడిపినవి. నేను నిమిత్తమాత్రుడను దప్ప కోరి నీ ఆరాధకుడనుగా నియుక్తుడనైనవాడినిగాదు. నన్నుక్షమించు"అన్నాడు.

"అర్జీలుగాను, విన్నపాలుగాను, ప్రేమపత్రాలుగాను వుత్తరాలు వ్రాసివ్రాసి ఆశ్రయంపొందావు. ఇప్పుడు ప్రార్ధనలద్వారాను, ఆరాధనల ద్వారాను యదార్ధంగా నీవు పొందగోరుతున్నదేదో, భయపడకుండా స్పష్టంగా చెప్పు విజయ్" అన్నది.

దీనంగా ఆమెవంక చూశాడు. బుజ్జగింపుగా అతని కపోలంమీద నిమురుతూ "భయంతో ఆంతర్యంలోని మాటను అణచివేయవద్దు. నీవు యేమి కోరినా కోపగించుకోను. నీకోర్కెను మన్నించుట నా ధర్మంగా భావిస్తాను. కనుక నిరభ్యంతరంగా నిజంచెప్పు విజయ్" అన్నది.

"దేవతగా భావించి నిన్నే ఆరాధించుటలో తెలియని ఆనందం కలుగుతున్నది. నేను పూజిస్తున్నది నిన్నే" అని భీతితో చూస్తున్నాడు.

"నన్ను దేవతనుగాచేశావు గనుక ఆ స్థానాన్ని కాపాడుకోవలసిన బాధ్యత నాయందున్నది. దేవతకు ఆగ్రహాలు అంత శోభించదు. నిర్మలత ధాతృత్వము మొదటి లక్షణంగనుక కాపాడుటే లక్ష్యం. నీవు

నిర్మించిన ఆ దేవతా స్థానంలోవుండే అభయమిస్తున్నాను. నీకోర్కెను నెరవేర్చు బాధ్యత నాదే. నిర్భయంగా యిపుడయినా చెప్పు" అన్నది.

శిరస్సువంచి "జీవితాంతం యెడబాటుగాకుండా మీ రక్షణలో మీ సరసన వుండాలని హృదయపూర్వకంగా కోరుకుంటున్నాను." అన్నాడు.

"స్త్రీ గాలిమేడలు పురుషునితో పోటీగా కట్టలేదు. తన చిన్న హృదయానికి తగినవి నిర్మించుకున్నపుడు అవి కూలిపోతే తానూ శాశ్వతంగా కూలబడిపోతుంది. కాని పురుషుడు గాలిమేడల నిర్మాణంలో నిపుణుడు. ఓ ప్రక్కనుంచి కట్టినవి పడుతుంటే ప్రక్కనుంచి నూతన నిర్మాణాలు జరుపుతూ పాత అరవళ్ళనుకూడా తుడిచివేస్తాడు. నీవు నాకు వ్రాసిన వాటన్నిటిని గుర్తు చేసుకో! నాడీజాతకంలోని విషయాల నెన్నిటినో వ్రాశావు. ఇక్కడి డిగ్రీలతో యింటికివెళ్ళి పేరుప్రతిష్ఠలుపొందాలని యేమేమో నీ ఆశయంగా వ్రాశావు. నేడు వాటన్నిటిని విస్మరించి నా శరణ్యంలోనే జీవితాంతం గడుపగోరినట్లు చెబుతున్నావు. ఏది నమ్మమంటావు చెప్పు?" అన్నది.

"ఆటలలోవుండే పసివారికి ధ్యాసంతా ఆటలమీద. భ్రమ ఆట బొమ్మలమీద వుంటుంది. అప్పటివారి ఆలోచనలన్నీ వాటి సంబంధంలోనే వుంటవి. వారే పెరిగి బుద్ధివికాశం పొందాక వాటిని నిర్లక్ష్యం చేస్తూ పై అంతస్తు విషయాలమీద పరువులెడతారు. అది మోసమూగాదు మాయాగాదు ప్రకృతిసిద్ధప్రభావం. అదేరీతి నాలోని ఆనాటి ఆలోచనలు నాకే నేడు హాస్యాస్పదంగా తోస్తున్నవి. జీవితలోతులు తెలియనినాటి నిర్ణయాలవి. నేటి నా నిర్ణయం నేను కోరి చేసుకున్నదిగాదు. నాకు తెలియకుండానే మీ ఆరాధకుణ్ణిగా తయారయినాను. ఇది దైవనిర్ణయం. మీ జీవితంతో నా జీవితం ముడివడిపోయింది. విడదీసుకోవటం నాకు చేతగానిది" అన్నాడు.

ఆమె గంభీరతను నటిస్తూ "అభయమిచ్చానుగనుక అందుకు కట్టుబడివుంటున్నాను. "నీకోర్కె నెరవేరుగాక." అని ఆశీర్వదిస్తున్నాను. ఆరాధకుడవుగా వుండగోరుతున్నావుగనుక స్వయంగా నన్నే ఆరాధించుకొనుటకు అనుజ్ఞ యిస్తున్నాను" అన్నది.

ఆత్రతతో ఆలోచనారహితుడై ఆమె పాదాలమీద వాలిపోయాడు.

ఆమె వెంటనే లేవనెత్తి, బాలకునివలె దీసుకెళ్ళి శయ్యమీద కూర్చుండబెట్టి, నవ్వుముఖంతో "మతిపోయిందా యేమిటి విజయ్" అని ప్రశ్నించింది.

"అదే నేనూ అనుకుంటున్నాను. ఎవరికయినా జీవితంలో యిలాంటి ఘడియలు తప్పక వస్తవేమో అనుకుంటాను. ఇంత మధురమైన ఘడియలు అందరకు లభ్యమవుట దుస్తరమనుకుంటున్నాను" అన్నాడు.

"నీ మాటలు, చేతలు చాలా విచిత్రమైనవి. పొందిపోగొట్టుకున్నవాడితో, వరించి ప్రేమించి పొందలేని విఫలజీవితో వుండవలసిన లక్షణాలను అలవర్చుకుంటున్నావు. ప్రేమలోని ఫలం బొందినవారు తన పొందలేని ప్రేయసిని దేవతగా చిత్రించుకుని ఆమె పాదాలముందు ప్రేమస్తోత్రాలతో ఆరాధనలు సలుపుతూ ఆత్మతృప్తి నొందుతుంటారు. నీవలాంటి విఫలివికావు. అయినా ఆ నడకలో పోను ప్రయత్నించుట ఆశ్చర్యము. విఫలాన్ని సఫలరూపంలో చిత్రించుకుంటే ఆనందం కలుగుతుంది. కాని సఫలాన్ని విఫలరూపంగా చిత్రించుకుని చింతించుట వెర్రితనమవుతుంది. నీ సఫలతకు సాదృశ్యంగా నీ యెదుటే నేనుండగా విఫలుని మార్గాన్ననుసరింప జూస్తావెందుకు చెప్పు?" అంటూ అతని శిరస్సును నిమిరింది.

అతను దొంగవలె కోరగా చూస్తూ "మీముందు నా ధైర్యమంతా తునాతునకలై పోతున్నది. మీ ముఖంచూసినపుడు నా అసమర్థత్వం నన్ను కంపిపజేస్తున్నది" అన్నాడు.

శిష్యుడుగా రెండుసంవత్సరాలు గడిపిన విజయ్ ప్రియుడుగా మారి మూడునెలలు గడిచిపోయినవి. ఇపుడతని జీవితమే వేరైపోయింది. రెండుసంవత్సరాలలో పొందజాలని ధైర్యాన్ని చనువును ఆతరువాత అధికారాన్ని మూడు నెలలలో పొందాడు. నేడు కేవలం ఆమె మాటను పాటించు దీనస్థితిలోలేడు. వాదవివాదాలతో తనమాటనే నెగ్గించుకుని, ఆవిధంగానే జరుగాలంటాడు. బ్రీజ్‌బెల్లా నవ్వుమొఖంతో అతని ప్రతిమాటను ఆజ్ఞగా పాటిస్తున్నది.

సరసత్వంలో సన్నిహితత్వం పెరిగిపోయింది. పసివారివలె ఒకరి

మీద ఒకటపడి అటుయిటు కేరింతలు కొట్టుకుంటూ ఆడుకుంటున్నారు. ఇపుడు వారిజీవనయాత్ర తరంగాలను కోసుకుపోవు స్టీమ్‌నావనుబోలి సాగుతున్నది.

విజయ్ కిపుడు ఇంగ్లీషుకంటె ఫ్రెంచిమోజు యెక్కువయింది. ఫ్రెంచి మాట్లాడాలనే ప్రయత్నంలో మిశ్రమం మాట్లాడుతుంటాడు. "నీవు మాట్లాడే భాషలో తప్పున్నా మాటలు మధురంగా వుంటవి విజయ్" అంటుంది.

చదివి డిగ్రీలుపొంది పేరుప్రతిష్టలలో యేమేమో చేయాలన్న ఆలోచనలు అంతరించినవి. ఏదైనా కష్టానికి సంబంధించిన కార్యంలో చేరి బ్రీజ్‌బెల్లాకు తోడుగా తానూ కొంత సంపాదించాలని వుంది. తాను సంపాదించితే బ్రీజ్‌బెల్లాకు యేరూప సౌకర్యాలు కల్పించవచ్చునో ఆలోచనలుచేస్తున్నాడు. ఆమె లేనప్పుడు దేవతగా ఆలోచనలు సలుపుతుంటాడు. గదిలోప్రవేశించినపుడు ఆమెను అమాంతం భుజాలమీద కెత్తుకుని అటు యిటు గది అంతటా తిరుగుతాడు. "ఇస్, అబ్బ! నా బూటునైనా విడువనివ్వు విజయ్. ఏమిటీ అఘాయిత్యం!" అంటూ వినతిచేస్తుంది. ఆమెను బుజాలమీద వుంచే వ్రేలాడుతున్న పాదాలనుంచి బూట్లను వూడబెరుకుతాడు.

"ఇంత పిచ్చివాడివై పోతున్నావేమిటి విజయ్! నా చనువుతో నీవు మరింత చెడిపోతున్నావు. చదువు సంధ్యలిపుడు బొత్తిగా వదిలి చిలిపిగా తయారవుతున్నావు." అన్నపుడు ఆమెను చిన్నగా శయ్యమీద పరుండబెట్టి అధరాలమీద చుంబించి వైదొలగుతాడు.

కార్ఖానాలోని కాషియర్ కొంతమొత్తాన్ని బ్యాంకునుంచి తెస్తూ యెక్కడికో వుడాయించాడు. అద్వారా గొప్ప ఆర్థిక నష్టానికి గురియైన కామందు మామూలుస్థితికి వచ్చుటకు వారంరోజులు పట్టింది. ఆ కాషియర్ స్థానాన్ని బ్రీజ్‌బెల్లా పొందింది. ఆమెయందుగల విశ్వాసంవలన ఆస్థానం లభించింది. ఆమె జీతం బాగానే పెరిగింది. ఆమె ఆశించిన

దానికంటె అధికజీతాన్ని పొందుతూ, లోగడవలె శరీరకష్టంలేకుండా, అందరిలో అధికృతను కలిగిన తనస్థితిలో తాను సంతృప్తిచెందింది.

"విజయ్, నీవు నాతోచేరిన వేళావిశేషంమంచిది. నేను ఎన్నడూ వూహించని వున్నతపదవిని పొందాను. అనుకోనంతజీతము అధిఖ్యతలు కలిగినవి. ఇందుకు కారణం నీ రాక దప్ప మరేకారణంగాదు. ఇక మనకేలోటు వుండదు" అన్నది.

285

# 37. అల్లరి భక్తుడు

విజయ్ యింటిదగ్గరనుంచి డబ్బు తెప్పించాలనికోర్కె. కాని బ్రిజ్‌బెల్లా గట్టిగా నిరోధించింది. మతస్వీకారం చేయాలని అతనికోర్కె. తనద్వారా అలాంటి వాంఛలేదని, విజయ్ తన మతంలోనే వుంటూ తన దేవుళ్ళనే పూజిస్తే ఆమెకేమీ అభ్యంతరంలేదని పైపెచ్చు అదొక ఘనతగా ఆమె భావించగలిగినట్లు తెలియజేసింది. ప్రేమకు దేవతారాధనలకు సంబంధంలేదనికూడా తెలిపింది.

"ప్రేమికు లిరువురు వేర్వేరు అభిరుచులతో వేర్వేరు మతాలతో దేవుళ్ళతో ఆరాధనలతో సాగవచ్చంటారు మీరు. అది అసాధ్యమైంది. అసందర్భమైంది. మనసార ప్రేమించినచోట, ప్రేమలో పరస్పరం అంకితాలైపోయినచోట రెండు హృదయాలు యేకమై అన్నివైపుల ఒకే దృక్పథం, ఒకే దృష్టిగా రూపొందుట స్వాభావికం...." అంటూ యింకేమెమో చెప్పబోతుండగా మధ్యలో ఆపి నోటిమీద వ్రేలుబెట్టి చూపుతూ "సరిసరి, ఇక చాలించండి. మీరు యేమయినా చేయగలరని తేలిపోతున్నది. చపలచిత్తులని భయంకూడా కలుగుతున్నది. మీ మతవిశ్వాసాలను మీరు క్షణంలో తుడిచివేసుకోవటం అంత మంచిదిగాదు. అది వున్నతస్థాయినిగాని, విలువనుగాని తెలియజేయదు. మీ మనస్సు చంచలస్వభావాన్ని పొందింది గనుక నా సలహాలేకుండా యే విషయంలోనూ యే నిర్ణయము చేయవద్దని కోరుతున్నాను" అన్నది.

విజయ్ చిన్నగా నవ్వుతూ "నేను కోరుకుంటున్నదే మీరూ చెబుతున్నారు. నిమిత్తమాత్రుడనుగా మీ అడుగుజాడలలో నిశ్చింతుడనై నడుస్తున్నపుడు కలిగే ఆనందం అమోఘమైంది. ప్రేమలో పరస్పర ఆత్మార్పణ జరిగినపుడు వ్యక్తిత్వానికిబదులు తృప్తితోగూడిన ఆనందం మిగులుతుంది, ఆత్మీయప్రేమ మిగులుతుంది. అందువలన అన్నిటిలోను మిమ్ము అనుకరిస్తూ నన్ను నేను మీకు ఆత్మార్పణ చేసుకున్నపుడు నావిగా మిగిలి యేవీ వుండవుగదా। ఆ తరువాతకూడా వున్నదనుకునే

భ్రమవుంటే అది క్షోభకు దారిదీస్తుంది. ప్రేమతో రెండు ఆత్మలు యేకమయ్యాక వ్యక్తిత్వాలు వేరువేరుగా వుండుట అసందర్భమైనవి." అన్నాడు.

"వేరులు లోతులకు పాకకుండా వృక్షం పెరుగుట క్షేమంగాదు, తొందరపాటులోని నిర్ణయాలు అశాంతికి అంకురాలుగాకూడా కొన్ని కొన్ని వేళలందు రూపొందుతవి." అన్నది.

విజయ్, బ్రీజ్‌బెల్లాతో కలిసి ఆదివారాలు చర్చికి పోతున్నాడు. ఆమెకంటె నిష్టతో ప్రార్థనలు సలుపుతున్నాడు. బైబిలులోని అనేక పద్యాలను కంఠస్థం చేశాడు. ఫ్రెంచిలోని తెలియని మాటలకు ఇంగ్లీషులో అర్థాలు వ్రాసుకున్నాడు. బైబిలులోని పద్యాలను కంఠస్థం చేస్తున్నాడు. చర్చిలో ప్రార్థన సలుపు పోజులోనే శయ్యమీద మోకరిల్లి ముందు బైబిలుంచి వెనుక ముందుకు వూగుతూ గంటలతరబడి చదువుతుంటాడు. బ్రీజ్‌బెల్లా మంచిగాయకురాలు. ఆమె చర్చిలో రాగయుక్తంగా పాడుతున్నపుడు తానే పరవశుడైపోతుంటాడు. ఆమె కంఠంలోని శ్రావ్యత అతి మధురమైంది. ఆమె స్టౌ దగ్గరగా కుర్చీలో కూర్చుని పని చేసుకుంటున్నపుడు ఆమె ప్రక్కగాజేరి కూనిరాగాలతో బైబిలులోని తనకు నచ్చిన పాటలను ఒక్కటొక్కటిగా పాడుతుంటాడు. ఒకటి తెలుగు పద్యానికిబోలినట్లు మరొకటి పాటకుబోలినట్లు రాగయుక్తంగా పాడుతూ, అపుడపుడు చేస్తున్న దీర్ఘరాగాలాపనలకు ఆశ్చర్యపోతూ "అబ్బ! విజయ్, ఫ్రెంచిలోని ఆ బైబిలు పాటలు నీ వుచ్చారణలో మరేమోగా మారిపోయినవిగాని నీ రాగంలోని శ్రావ్యత అమోఘమైంది. భావాలు భంగిమలు లేకుండానే నీ కంఠంనుంచి వెడలు రాగానికి అమూల్యమైనదిగా విలువగట్టవచ్చు." అంటుంది.

ఆమె పొగడ్తకు వుబ్బిపోయి సుడులుసుడులుగా తిరిగే ఆ ఫ్రెంచి శబ్దాలకు కంఠంలోని వణుకు వదలక, ఒక్కమాటుగా గొంతెత్తి కురుక్షేత్రడ్రామాలోని "బావా, యెపుడు వచ్చితివీవు...."పాటను, తిరిగి కృష్ణతులాబారంలోని "మీరజాలగలడా నా యానతి!...." అంటూ యింటి కప్పు లేచిపోయేట్లు వుగ్గబట్టిన రాగంతో పాడుతుంటాడు.

ఆమె వింతగా కనులప్పగించిచూస్తూ అంతలో "అబ్బ! మీ కంఠం ఫిరంగివలె యెంత గొప్ప ధ్వనిని వుత్పన్నం చేయగలుగుతుంది. మీ పాటలోని భావమేమయినాగానీ ఆలాపన గొప్ప ఆకర్షణీయమైంది. విన్నకొలది వుత్సాహాన్ని వృద్ధిచేయునది. యూరప్ భాషలలో సంగీతానికి అందమైనది ఫ్రెంచిభాష. కాని మీ భాష యింకా బాగున్నట్లు తోస్తున్నది." అంటుంది.

బ్రీజ్‌బెల్లా ముందిపుడు విజయ్ వినయవిధేయతలుగల విద్యార్థివలె వుండుటలేదు. చిలిపివిద్యార్థిగాను, అల్లరిబాలకుడుగాను, ఇరుగు పొరుగు రౌడీవలెను, లౌకికంలేని భక్తునివలెను, అమాయకభర్తవలెను మెలగుతున్నాడు. ఆమె చిరునవ్వులతో అన్నిటిని స్వీకరిస్తూ అన్నిటిలోను ఆనందాన్ని గ్రోలుతున్నది.

వెనుకగావెళ్ళి నేత్రాలుమూసి తనమీదకు వాల్చుకుంటాడు. ఆమె యెంత కేకలుపెడుతున్నా వినకుండా చేతులలో వాల్చుకుని యింటి నలువైపులా తిరిగి తీసుకెళ్ళి కుర్చీమీద కూర్చుండబెడతాడు. ఆమె కుడి చుబుకంమీదున్న పుట్టుమచ్చనుచూపుతూ "ఇది యేమి సూచిస్తుందో తెలుసా? ఏనాటికయినా నీవు కోట్లధనాన్ని కలిగివుండక తప్పదు. నీ చేతిమీదుగా లక్షలు దానంచేస్తుంటే కోట్లడబ్బు నీకు చేరుతుంటుంది. నీ జాతకంలో ధనయోగం గొప్పగావుంది" అంటూ చిలిపిగా అక్కడే చుంబించాడు.

ఆమె మృదువుగా అతన్ని ఆవలకూర్చుండబెడుతూ "నీవు మంచి జ్యోతిష్కుడవే. నేను కార్ఖానా క్యాషియరును. నాదగ్గర డబ్బు విరివిగానే వుంటున్నది. వారవారము వేలకువేలు ఖర్చుబెడుతున్నాను. తిరిగి అంతకుమించి ఆ పెట్టెలో జేరుతున్నది. ఈవిధంగా జీవితాంతం లక్షలడబ్బు నా చేతిమీదుగా పయనించేమాట యదార్థమే. మంచి జ్యోతిష్కుడవే విజయ్" అన్నది.

విజయ్‌మనస్సు ఖిన్నత చెందింది. తనప్రియురాలు, దేవత ధర్మదేవత అయిన ఆమెకు అష్టఐశ్వర్యాలు కల్పించగలశక్తి తనకుంటే యెంత బావుండును! అనుకుంటున్నాడు. ఖిన్నతను మర్చిపోను ఆమెఅరచేతిని తీసుకుని పరిశీలనచేస్తూ "నీచేతిలోని అదృష్టరేఖ

చూస్తుంటే ఆశ్చర్యంగావుంది బ్రీజ్. అన్నిటిని వేళాకోళంగా నెట్టివేయ రాదు. నిజం చెబుతున్నాను. నీ చేతిలోని అదృష్టరేఖ సుస్పష్టమైంది. ఇది కష్టపడి సంపాదిస్తే వచ్చేదిగాదు. అదృష్టయోగంలో పూంజీవతిపై కూర్చునే యోగముంది. నీ జన్మలో ఇది సత్యంకాకపోతే సాముద్రిక శాస్త్రమే గల్లంతైపోవాలి" అన్నాడు.

"పోనీ అలాంటియోగం జరిగితే తకరారులేకుండా, పంపిణీలు లేకుండా అంతా నీపరమే చేస్తాను. నాసంపత్తి అంతటికి నిన్నే సర్వాధి కారిగా నియమిస్తాను" అన్నది.

"అలాంటిహక్కును క్రొత్తగా నీవు నాకివ్వవలసిన అవునరం అసలేలేదు. నీవే నా సొత్తువైయుండగా నీవు పొందేది నా అధీనం కాకుండా యెలా వుంటుంది?" అంటాడు.

"అలాంటి అసందర్భమైన గాలిమేడలను సృష్టించుకుని ఆతరు వాత నిస్పృహపొందేకంటే అందుబాటైన ఆలోచనలోనే వుండుట సర్వదా శ్రేయస్కరం. లక్షలగురించి కలలుగనేవానిముందు వేలు దొరికినపుడు అసంతృప్తిచెంది వాటినికూడా కోల్పోయి ఆతరువాత యెంతైనా పశ్చాత్తాపపడతాడు. కనుక మనస్సులో అలాంటి ఆలోచన లను రానివ్వబోకు" అన్నది.

"వాస్తవికజగత్తుకు సరితూగుమాటనే చెప్పారు. కాని గొప్ప వూహలులేకుండా, కాంక్షలు కలుగకుండా అభివృద్ధి వుండదు. తన హృదయం అంకితమైనచోట అన్నివైపుల అదృష్టాన్ని కాంక్షించుట స్వాభావికం" అన్నాడు.

"అదృష్టాన్ని అపహాస్యంచేయుట మంచిది గాదు" అన్నది.

"కృషిలేకుండా కోరి ఆలోచనలుచేయకుండా అజ్ఞాతరూపంగా సంభవించే అదృష్టాలు బహు తక్కువ. ఆశించుట అపరాధం కాజా లదు" అన్నాడు.

"నీవు మొండివాడివు. నీ మాటదప్ప మరోమాట వినవు. నీతో వాదించేకంటే నోరు మూసుకోవటం మంచిది" అన్నది.

ముద్దులొలికించు కోపంతో ఆమెను పైకియెత్తి అల్లిబిల్లి త్రిప్పా లని వేగంగావెళ్ళి పట్టుకోబోయాడు. తప్పించుకునే యత్నంలో కుర్చీ

మీదనుంచి బోర్లాపడిపోయింది. కుడిమోకాలు క్రిందకు మోదుకుంది. బ్రీజ్‌బెల్లాకు ప్రాణంపోయినంత బాధ కలిగింది. దీర్ఘశ్వాసను విడుస్తూ దంతాలు బిగబట్టి నేత్రాలమీద చేయివేసుకుని అయిదునిమిషాలవరకు అలానే వుండిపోయింది.

నివ్వెరపాటుతో తచ్చట్లాడుతూ మతిబోయినవానివలె అటుయిటు చూసి ఆమెను తీసుకెళ్ళి శయ్యమీద పరుండబెట్టి మోకాలుమీద దెబ్బ తగిలినచోట యేమీ చేయలేక నోటితో ఊదరబెడుతున్నాడు.

బ్రీజ్‌బెల్లా బాధను బిగబట్టుకుంటూ "ఫరవాలేదు విజయ్, కదల కుండా కూర్చో" అన్నది.

దెబ్బతగిలినచోట అయిన తనవుమ్మిని తుడిచివేసి చూశాడు. ఎర్రగా కంది నిగనిగలాడుతూ వుబ్బింది. తన పశ్చాత్తాపాన్ని యెన్నో విధాల ప్రకటించ ప్రయత్నించాడు. "తలవనితలంపులతో జరిగేవి అని వార్యమైనవి, యెవరూ ఆపజాలనివి. కనుక పశ్చాత్తాపం అనవసరం" అన్నది.

మరునాటికి ఆ దెబ్బ వాపుతో మరింతబాధ పెట్టింది. కాలు కదు పనుకూడా పీలులేకపోయింది, ఆమె పడుతున్న బాధకంటె విజయ్‌పడు తున్న మానసికబాధ విశేషమైంది. వెర్రితనంతో తా నొనర్చిన ఘోరా నికి క్షణక్షణము హృదయం బాధపడుతున్నది. అతనికి తెలియకుండానే కన్నీరు మరిగిమరిగి ఒక్కొక్కబిందువు రాలుతున్నవి.

"నాకేమీ బాధ లేదులే విజయ్, కన్నీరుపెడతా వెందుకు! తొంద రగా తగ్గటానికి ఒకపని చేయి. బజారుకెళ్ళి ఒక యూకలిప్టస్‌ఆయిల్ సీసాతీసుకొచ్చి, వేడినీళ్ళకాపు వేస్తే త్వరగా తగ్గిపోతుంది" అన్నది.

వెంటనే విజయ్ ఆ కార్యంలో నిమగ్నుడయినాడు. యూకలిప్టస్ ఆయిల్ తెచ్చి ఆమె మోకాలుమీద వేసి. మృదువుగా రుద్దుతున్నాడు. స్ఫటికఫలకంవలెనున్న ఆ కాలుమీద అతనిప్రతిబింబాలు అనేకం కని పిస్తున్నవి. ఆయిలుమరక అయిన అద్దములోవలె నూనె అయిన చోట అతనిప్రతిమ చిత్రవిచిత్రంగా కనిపిస్తున్నది. ఆ కాలులోని మెరు పులలోగూడినశోభను చూడాలని అతనివాంఛ కాని ఆ కాలులో యెక్కడ చూసినా తనప్రతిమే కనిపిస్తున్నది.

తననొప్పి తగ్గిపోయిందని, రెండురోజులలో నడువగలశక్తి వస్తుందని, వెళ్ళి విశ్రాంతి తీసుకోమని ఆమె యెంత విన్నవించినా క్షణంపాటుకూడా విడువలేకపోయాడు. ఆమెప్రక్కనే శిక్షితునివలె చూస్తూ, అందు కనిపిస్తున్న తన ప్రతిబింబాలను లెక్కించుకుంటూ అక్కడేవుండి ఆమెప్రక్కనే పసివానివలె పవళిస్తూ వుంటున్నాడు. తనప్రక్కన పవళించిన అతనిశిరస్సును నిమురుతూ తన వక్షస్సుమీదికి లాక్కొని "నీమనస్సు చాలా నొచ్చుకుంటున్నది. నాకు తెలుసు. పశ్చాత్తాపంలో పరితపిస్తున్నావు. నీవు యే అపరాధమూ లేకుండానే గొప్ప శిక్షను అనుభవిస్తున్నావు విజయ్, పొరపాటుకు శిక్ష వుండరాదు" అన్నది.

"రెండురోజులనుంచి మీరుపడుతున్న బాధ నా కారణంగానే కదా! ఇంతకంటె నా మనస్సునుబాధించే కారణం మరేమివుంటుంది చెప్పండి! అవును ఒక వంటవానిచేత దెబ్బలు తినినపుడుగాని, జైలులో పడి మీద్వారా విడుదలపొందినపుడుగాని, నేడు పడుతున్నంతబాధ పడలేదు. నన్ను సర్వవైపులా కాపాడుతూవస్తున్న మిమ్ము దుఃఖపెట్టుటకంటె ఆత్మహత్య శ్రేష్టమైంది" అంటుండగా నేత్రాలనుంచి జలం బొలబొల వలుకుతున్నవి. వెచ్చగా ఆమెవక్షస్సుమీద వలుకుతున్న భాష్పజలం ప్రక్కలగా కైవారాలు తిరిగి శయ్యను తడిపివేస్తున్నది.



# 38. హేతు ప్రతిహేతువులు

"అబ్బ! ఏమిటి విజయ్, అలా కన్నీరుకారుస్తా వెందుకు? నేను యెన్నెన్నో బాధలు అనుభవించాను. అందు యిదొకటి. కన్న తలి దండ్రుల ఆదరానికి, ప్రేమకు నోచుకోని దాన్ని. బాధలలోనే బాధ్యత లను పొందాను. కష్టాలలో మునిగి కర్తవ్యాలను తెలుసుకొన్నాను. బాల్యంలోనే అన్నిటికీ అతీతురాలనై అనాదరంతో అభాగ్యురాలనుగా పెరిగాను, మనస్సు మేరీమాతమీదనే నిలిపి రక్షకవచంగా యెంచి అన్నిటికీ కారణభూతురాలైనట్లు తలంచి మానసికతృప్తిని కల్పించు కుంటూ అందరూ వుండికూడా అనాధనుగా జీవిస్తూ అంధకారంలో వెతుక్కుంటున్న నాకు వెలుగు కిరణంగా మీరు లభ్యమైనారు. నీవు అదృష్టంలో పుట్టి పెరిగావు. గొప్ప పుణ్యమూర్తుల యింట జన్మించావు. అన్నివైపులా అదృష్టవంతుడవై వుండికూడా కావాలని కష్టాలను మాలగా వేసుకున్నావు. నీవు లభ్యమవుట నా జీవితమే ధన్యమైనట్లు, నాకూ యీ లోకంలో ఆత్మీయులొకరు దొరికినట్లు, నా అనాదరత్వం పోయినట్లు అంతరాత్మ ప్రబోధిస్తున్నది. ముళ్ళమీద నడిచినవారికి రాళ్ళ మీద నడచుట కష్టమైనపనిగాదు. ఈ దెబ్బవలన రెండురోజులు నడువలేక పోవచ్చు. అంతకుమించి నన్ను పెట్టే బాధలేదు. ఈ కాస్తంతకు నీవంత పశ్చాత్తాప పడవలసిన పనిలేదు. ఈరోజు నా మనస్సులోని మాట చెబు తున్నాను. "నా" అనేవారు లేని నేను నిన్ను నాపాలిట అమూల్య నిధిగా భావిస్తున్నాను. జీవితాంతం నీవు నాతోనే వుండగలవా విజయ్." అని ప్రశ్నించింది.

విజయ్‌లోని సంకోచాలు, భయాలు ఒక్కమాటు అదృశ్యమై ఆనందకుసుమం హృదయంలో వికసించింది. చిరుతరంగాలతో కోలా హలంగా తపతపలాడు నిండు తటాకంవలె అతని మనస్సు వుత్సాహ వుద్వేగాలతో వూగిపోతున్నది. వెంటనేలేచి ఆమె అధరాలమీద గాఢంగా చుంబించి "నేడు అలాంటి ఆలోచనలు చేయగల సమర్ధతకూడా నాలో

లేదు బ్రీజ్. నేను నీకు అంకితమైపోయాను. నీకు దూరంగా పోగలశక్తి నాలోలేదు. నీవు లేకుండా నేను వుండటమనే విషయం మనస్సులో దొర్లినపుడు, అంతా అంధకారమైపోతుంది. హృదయం ఖంగారుతో తారుమారై తబ్బిబ్బులవుతుంది. శ్వాస బంధించుకు పోతుందనిపిస్తుంది. నీకు దూరమైనరోజు శ్వాస ఆగిపోతుందనిమాత్రం అనేక ఆలోచనల ఫలితంగా అర్థంచేసుకున్నాను. నాదేశములో నాకు కలిగిన జాతక విశ్వాసాలు వూహాలు యీ దేశానికిచేసిన యత్నాలు అన్నీ నిన్ను పొందుటకే జరిగినవని నా విశ్వాసము. నేను యే ఆశలతో యిక్కడికి వచ్చానో అవి మృగ్యమైనవి. కాని వాటికంటె యెంతో విశేష సంపత్తియైన నిన్ను పొందాను. ఈ లోకంలోని పేరు ప్రతిష్టలకంటె, యోగ్య డిగ్రీలకంటె సర్వసంపత్తులకంటె శ్రేష్టసంపత్తియైన నిన్నుపొంది నాజీవితమే ధన్యమైందని నాకు తెలుసు. నిన్నుకోరి పొందలేదు, ప్రయత్నించి పొందలేదు. దైవీక సంఘటనలో నాకు రక్షకురాలవై నిలిచావు. ఆ తరువాత నా హృదయాంతరాలు నీకొరకు తపించి వెదికినవి. అనుకోని సన్నివేశాలద్వారా నీ సన్నిధికి చేరాను. నిష్కామంతో ఆదరించావు, ఆశయసిద్ధికొరకు నేను చేరాను. రత్నంముందుచేరి రాయిని పొందు మంత్రం కొరకు శోధనలు చేసేవాడి మయికం యెక్కువసేపు నిలువదు. నీలోని దేవతాస్వరూపం అర్థమయినకొంది నాలోని భ్రమలు తొలగిపోయినవి. నీవు అర్థమవుతున్నకొంది నాలోనిశక్తి ఒక్కొక్క కోణంనుంచి నీకర్పితమైపోతూ, నాలోని సర్వము నీ కంకితమైపోయింది. నేడు నాలో మిగిలింది నీ ప్రతిబింబం, నీ స్తోత్రందప్ప మరేమీలేదు. నీ మెప్పుకొరకు మేరిమాతముందు మోకరిల్లుతాను. నాముందు కనిపించేది నీవు. ప్రార్థనలో కూర్చున్నా చర్చికెళ్ళి నేత్రాలు మూసినా సుస్పష్టంగా కనిపించే నీవే సర్వదేవుళ్ళ కలియకలోని ప్రతిబింబంగా భావిస్తుంటాను. నీమీద కుదిరిన భక్తి ప్రేమ నాకు మరొకచోట యెక్కడా కుదరదని స్పష్టంగా చెప్పగలను. నా హృదయంలోని ప్రేమకుసుమాన్ని నీ పాద పద్మాలముందు శాశ్వతంగా సమర్పించుకున్నాను. కాని ఇది నా ఆలోచనలలో జరిగినదిగాదు. కనుకనే వెనక్కు పోగలశక్తిగాని దూరంకాగల శక్తిగాని నాలో లేదు." అంటుండగా అతని కంఠం బరువెక్కింది.

వెంటనే బ్రీజ్‌బెల్లా తనమీదకు లాక్కొని మొఖాన్ని ముఖంమీద వేసి ఆవేశంగా అటు యిటు రుద్దుకుని దీర్ఘ నిట్టూర్పును విడిచింది.

హృదయాలమీద ఆశలు గాఢముద్రలు వేయ ప్రయత్నించినపుడు యెండమావులలోకూడా రాజీపడే భ్రమలుత్పన్న మవుతవి.

విజయ్ శిరస్సును తనమీదనే వుంచుకుని కవుగిటిలో బంధించి "అయితే నా చేతిలో ధనరేఖ వున్నదని, జీవితంలో యేదో ఒకరోజు అనంత ధనం లభ్యమవుతుందన్నావు. అది నిజమేనా విజయ్." అని ప్రశ్నించింది.

"విశ్వసింపజాలని మాటలు తెలుసుకున్నందువలన ప్రయోజన మేమిటి?" అన్నాడు.

"అవసరం ఆశలను కల్పిస్తుంది. వాటికొరకు మనసు వెదుకుతూ తాపత్రయపడుతుంది. ఆశలతోగూడిన తాపత్రయంగలవారు జాతకాలను ఆశ్రయించి సంతృప్తిని పొందుతారు. తెలిసికూడా ఆమార్గాన్నే వెదుకుట మానవనైజము. నిన్ను సర్వసుఖాలలో ముంచటానికి ధనకాంక్ష కలుగుతుంది. కనుక జీవితంలో నీవు చెప్పినంత ధనం యెపుడైనా లభ్యమైతే బావుండునని ఆశ కలుగుతున్నది. మీ దేశవాసులకు భవిష్యవాణి చెప్పగల గొప్ప గొప్ప శాస్త్రిలున్నవని ప్రతీతి. అందువలన అడుగుతున్నాను." అన్నది.

"నీవు నాకొరకే ఆ ధనాన్ని కోరుతుంటే, జీవితంలో యెన్నడూ అలాంటి అవకాశాన్ని కలుగనివ్వవద్దని నేను ప్రభువును ప్రార్థిస్తున్నాను. నీ చేతిగీతలో వున్నంత ధనం నీకు కలిగిననాడు నీలోని నేటి దేవతా స్వభావాలు అదృశ్యమై అందరివలె సామాన్యమైన కఠిన స్వభావాన్నే పొందవచ్చు. నన్ను విస్మరించవచ్చు. అందువలన ఆ పాపిష్టి ధనానికి అతీతంగావుంటూ నాకు దేవతగా యిలానే వుండమని భగవంతుని ప్రార్థిస్తున్నాను." అన్నాడు విజయ్.

తన వక్షస్సుమీదున్న అతని శిరస్సునుబట్టి అటు యిటూ వూపి తన ముఖంమీదికి లాక్కొని చుంబించి "స్వార్థం, పిరికితనాన్ని నూరి పోస్తుంది వొక్రప్రక్క, లేని మహాశక్తిని కల్పిస్తుంది మరోప్రక్క, అంత

భయపడతావెందుకు? జీవితంలోని యీ అనుభవాన్నంతటిని ధనం యెగరగొడుతుం దంటావా?" అన్నది.

"అనేక స్థిరమైనవాటిని సమూలంగా తలక్రిందులు చేయను, నామరూపాలు లేకుండా చేయను క్షణిక పెనుతుఫాను చాలు. మానవ మనస్తత్వాలు సంపత్తికి ముడిపడి వుంటవి. కనుక సంపత్తి సంప్రాప్తమైనపుడు నీవు నాదానివిగా యీరూపంగానే వుండగలవని యెలా చెప్పగలం?" అన్నాడు.

"మనస్తత్వాలన్నీ ఒకేరూపంలో పోతపోసినట్లుండవు. ధనం ద్వారా వుదారత పెరుగవచ్చు. సుఖకాంక్ష కలుగవచ్చు. అధికారం ద్వారా కార్యభారం పెరుగవచ్చు, కాని హృదయంలోని ప్రేమ మారదు. వాటిద్వారా మారగలిగిన ప్రేమ పవిత్రమైందీగాదు, శాశ్వతమైందీగాదు. అంతటి విశ్వాసపాత్రంగాని ప్రేమద్వారాపొందేది సుఖంకంటె దుఃఖమే శాశ్వతమైంది కావచ్చు." అన్నది.

"మంచిని చెడుకంటె అంతకంటె మంచి అతితేలికగా జయించ గలుగుతుంది. ప్రతిదానికి హేతువులు ప్రధానమే, అంతకుమించిన హేతువులలో నిర్ణయాన్నిమించిన నిర్ణయంజరుగవచ్చు. ఈలోకంలోని విఫలాలన్నిటికి అలాంటి సహేతుకాలేవుంటవి. తూచితూచివేసిన అడుగే జారుట తేలికయినట్లు అభేద్యమైన ప్రమాణాలు చేసుకుని పరస్పరంగా అల్లుకుపోయి ఏకత్వంపొందినచోటే సామాన్యంగా విఫలమవుతుంటవి. తుత్తురు కుటీరాలకు యెన్నడూ హానివుండదు. కంచుకోటలే ఛేదించ బడుట తథ్యమైన విషయం." అన్నాడు.

అతని శిరస్సును నిమురుతూ "అబ్బ! యెంత భయము! పోనీ చేతిగీతద్వారా రాబోయే ఆ ధనాన్ని నేను కోరను. అనుకోని రీతిగా లభ్యమైతే నీచేతికే వదులుతాను. నేనుమాత్రం కష్టజీవిగా యెల్లపుడు యిలానే వుంటాను. నీప్రేమ వుండగా వేరేధనం నాకెందుకు? కలిసిన ప్రేమ కటికి దారిద్ర్యంలోనైనా సుఖాన్ని కల్పిస్తుంది. ఆ శక్తి ధనానికి లేదని నాకు తెలుసు." అన్నది.

బ్రీజ్‌బెల్లా మోకాలుకు దెబ్బతగిలి అయిదురోజులు గడిచిపోయినవి. నేడే కార్ఖానాకు పోగలిగింది. తిరిగి ఆమె యింటికి వచ్చేవరకు విజయ్‌మనస్సు ఆందోళనపడుతూనే వున్నది. ఆమె తిరిగి వచ్చాక నడిచినందువలన తిరిగి మోకాలుమీద వుబ్బరించిందేమో చూడాలని విజయ్‌కాంక్ష. కాని చలిబాధవలన ఆమె ఫ్రాకుకుబదులు ట్రవుజరు, షర్టు వేసుకెళ్ళింది. ట్రవుజరును తొలగించి చూడను కష్టమై ఆమెను శయ్యమీద కూర్చుండబెట్టి అరగంటవరకు పరిశీలనలు జరిపాడు. మోకాలుమీద వ్రేలుతో వత్తుతూ "నొప్పి లేదుగా" అంటూ అనేక మారులు అడిగాడు.

ఆమె నవ్వుకుంటూ "ఇంకా నొప్పి యెందుకుంటుంది?" అంటూ అతనిముఖాన్ని తనవైపు లాక్కుని చుంబించింది.

---

# 39. మలయమతి పశ్చాత్తాపం

విజయ్ విదేశయాత్రకు సంసిద్ధుడవుతున్నపుడు మలయమతికి యేమాత్రమూ యిష్టంలేదు. కాని వయసువచ్చి అన్నీ తెలుసుకోగలిగిన బిడ్డను నిరోధించి బాధపెట్టుట యిష్టంలేక మౌనముద్ర వహించింది. విజయ్ వెళ్ళాక అంతర్గతంగా ఆమెపడిన బాధ అనంతమైనది. బీబీజాన్ మాటలుగాని, సేవలుగాని ఆమెకు సాంత్వనను కల్పించలేకపోయినవి. పచ్చీసుఆట సంచి విప్పుట మానివేసింది. పవళించినా, కూర్చున్నా అదే ఆలోచనలతో కృశించుకుపోతున్నది.

ఆమెబాధముందు బీబీజాన్‌స్వబాధను మరిచి ఆమెను వోదార్చా లనే ప్రయత్నంలో యేమేమోచేసి విఫలమంది విసిగిపోతున్నది. "బాబు కేమీ ఫరవాలేదమ్మా! గొప్ప సన్మానాలతో తప్పక త్వరలోనే తిరిగి వస్తారమ్మా" అంటూ మలయమతిముఖంవంక చూస్తుంది. మలయమతి వీనులదాకా ఆ మాటలు పోలేదేమోనని అనుమానం కలుగుతుంటుంది.

ఉత్తరం వస్తుందని మలయమతి లోలోపల వుత్సాహంలో నిరీక్షణ చేస్తూ హృదయబాధను మరిపించుకోచూస్తున్నది. నిరీక్షణలో నెల రోజుల గడిచిపోయిన తరువాత ప్రథమఉత్తరం అందినది. అందులో విశేషాలేమీ లేవు. క్షేమంగా జేరినట్లు. అంతా సవ్యంగానే వున్నట్లు. వెంటనే డబ్బుమాత్రం పంపమని కోరుతూ పారిస్‌లో ఒక డిక్ అడ్రసు యిచ్చాడు.

ఆ ఉత్తరం చదివాక మలయమతి మరింత వ్యథచెందింది. ఒక అరితేరినవాడో, వ్యాపారస్థుడో, వృద్ధుడో వ్రాసినట్లున్నదిగాని క్రొత్తగా తల్లికి యెడబాసైన ఒక ముద్దుబిడ్డ వ్రాసినట్లు లేదు. తననుగురించి బెంగపడుతున్నట్లుగాని, తనమాట వినకుండా వెళ్ళినందుకు చింతిస్తున్నట్లుగాని యెక్కడా ఒక్కశబ్దంకూడా లేనందుకు కన్నీరు కార్చింది.

మలయమతిలో ఉదారతలు, ధాతృత్వము యెంత నిండివున్నవో

అంతగా మరోవైపు గంభీరతున్నది. హృదయంలో సంతాన అవ్యక్తత యెన్నికోణాలలో కోస్తున్నా గంభీరతలో దాగుతున్నది. బీబీజాన్ వుండ బట్టలేక మనసులోని ఆందోళనలను వినిపించినా, అన్నీ వినికూడా తనకు పట్టనట్లు, పెడచెవినిపెట్టినట్లు నటిస్తుంది. మలయమతిముందు తానుగా అధికప్రసంగము చేయగలశక్తి బీబీజాన్‌కు లేదు.

అంతదూరదేశం వెళ్ళి వ్రాసినఉత్తరంలో ఒక్కమారైనా తనను గురించి లేనందుకు బీబీజాన్‌మనస్సు ఆందోళన చెందుతున్నది. ఆ ఉత్తరాన్ని తీసుకెళ్ళి చాటుగా యెన్నోమారులు చదివింది. తననుగురించిన ధ్వనిగాని, భావంగాని యెక్కడా కనిపించక చీకాకుచెందింది. అన్యదేశం వెళ్ళినందువలన అక్కడ ఆరంభంలో కలిగే చిక్కులలో చిరాకు చెంది అన్యమనస్కుడై వ్రాసినందున తనవిషయం వ్రాయలేకపోయివుంటాడని సంతృప్తిని కల్పించుకున్నది. డబ్బు పంపునపుడు వాటితోపాటు చాలావిషయాలను వ్రాయాలనుకున్నది. తన మనస్సులోని అనేకవిషయాలను విపులం చేయాలనుకున్నది. కాని స్థిమితపడి విచారించినపుడు, అంత దూరదేశాన కార్యార్థియై అనేకకష్టాలకు గురియవుతూవుంటాడని, అలాంటిసమయంలో తాను వ్రాయుట క్షేమంగాదని నిర్ణయించుకున్నది.

"చేసినపనికి చింతించవద్దు. విఘ్నాలమీద సుజ్ఞానోదయం వుదయిస్తుంది. విఫలతలలో మొండిధైర్యం అవుసరం. విఫలంకంటె సిగ్గుబిడియాలు మనిషిని క్రుంగదీసి యెంతదూరమైనా తీసుకెళతవి. నీవు వాటికి అతీతంగావుండి, నీకు నీవే విసిగిన మరుక్షణం తప్పక వచ్చివేయి. నీవు యే రూపంలో తిరిగివచ్చినా ఆదరంతో ఆహ్వానించి హృదయానికి హత్తుకుని స్వీకరించేతల్లిని మర్చిపోవద్దు. తల్లిముందు అభిమానంతో అవస్థలుపడవలసిన అవుసరం యెన్నడూ వుండదు" అంటూ మలయమతి ఉత్తరం వ్రాసింది. కోరిన డబ్బుకూడా పంపింది.

ఈతథా గొప్పగా ఉత్తరంవస్తుందని యెంతగానోఆశించి యెదురు చూసింది. నెల గడిచిపోయినా జవాబు లేదు. డబ్బు కోరినంత పంపినందుకు సంతోషప్రకటనసైనా పంపలేదు. ఈతథా మలయమతి నిస్పృహ చెందింది. ఒక్కగా నొక్కబిడ్డ. ఏమి ఆశించిందో అందుకు ప్రతిగా నిలిచియైనా తనయెదుటవుంటే యెంతో ఆనందించేది. నిస్పృ

హాతో పాటు ఆమెలోని ఆకలికూడా నశించింది. తల దువ్వుకోవటం, స్నానంచేయటం ఆమెకు భారమైపోయినవి. పదిరోజులలోనే పిచ్చి వేషం వచ్చింది.

బీబీజాన్ కిదొక తీరనిసమస్యయై కూర్చున్నది. విజయ్‌యెడబాటు కంటె, అతను ఒక్కమాటైనా వ్రాయని నిరాదరంకంటె మలయమతిస్థితి ఆమెను ఆందోళనపరుస్తున్నది. మలయమతిస్వభావానికి విరుద్ధమైన కోపంకూడా తొంగిచూస్తున్నది. ఏమి అడిగినా, చెప్పినా చిరాకుతో ముఖమంతా వికృతం చేసుకుంటుంది. ఎల్లవేళలా ఆనందజ్యోతివలె ప్రభాసిల్లే ఆమెముఖం నేడు మలినముద్రలతో కుమారిల్లుతున్నది. స్తంభానికాని కూర్చునే కునుకులో వుంటుంది.

మరో నెలరోజులు గడిచిపోయాక రెండోఉత్తరం వచ్చినపుడు అంత పిచ్చిఅవతారంలోవున్న మలయమతి యెక్కడ దాగివున్న వుత్సాహాన్నో వురకలువేయిస్తూ అంగలువేసుకుంటూ పోస్టుమాన్ కెదురెళ్ళి తీసుకున్నది. బీబీజాన్ ఆ దృశ్యం చూసి ఆమెను నలిపివేస్తున్న పుత్రవాత్సల్యాన్నిన్ని అర్థంచేసుకోగలిగింది.

ఆ ఉత్తరం డబ్బుపంపమని వ్రాసిన తాకీదువలె తోచింది. అయినా కులాసాగావున్నట్లు, తను శ్రద్ధగా చదువుకుంటున్నట్లు, డబ్బు అవుసరం వున్నట్లు వ్రాసిన తనబిడ్డఅక్షరాలలో చూస్తున్నకొంది తన బిడ్డ కనిపిస్తున్నట్లు తోచింది. ఒకో్కఅక్షరంలోను ఒకో్కప్రతిమ కనిపిస్తున్నది, ఒకమాటు చదివాక ఆమెనేత్రాలు జలభరితమైనవి. ప్రతి శబ్దము ఆ ఉత్తరంలో కనిపిస్తున్న విజయ్‌ప్రతిమ నోటినుంచే వినిపిస్తున్నట్లు తోస్తున్నది. ఆ ఉత్తరంనుంచి దృష్టి మరలుటలేదు. కన్నీటిబిందువులు ఒకటిరెండు ఆ ఉత్తరంమీదపడి అక్షరాలను అలుకుకుంటూ క్రిందికి జారినవి. ప్రక్కగావుండి అంతా చూస్తున్న బీబీజాన్‌హృదయం కంపిస్తున్నది.

మలయమతి వణుకుతూ తప్పటడుగులువేస్తూ హాలులోకి నడుస్తున్నది. పడిపోతుందనే భయంతో వెనుకగా రక్షణకు హస్తాలు చాచుకుని నడుస్తున్నది బీబీజాన్. మలయమతి తూలు నాపుకుంటూ వెళ్ళి బల్లమీద కూర్చున్నది. ఇంకా ఆ ఉత్తరంలోని అక్షరాలను చూస్తూనే

వున్నది. కన్నీటితో అలుక్కుపోయిన ఆ అక్షరాలమీదతడి యింకా మెరుస్తూనే వున్నది. హృదయగంభీరత యెంతటిదయినా హద్దులు దాటినపుడు వూగిపోయి జ్వాలాముఖి ముఖం తెరుచుకున్నట్లు పెద్దపెట్టున ఏడుపు వస్తుంది. మలయమతిహృదయంలో కుమిలికుమిలి పొంగిన యేడుపు ఒక్కమాటుగా బయల్పడింది. బల్లమీదనుంచి క్రిందకు పడిపోతుందేమోనన్న భయంకలిగి వెంటనే బీబీజాన్ పట్టుకున్నది. కట్ట తెగి తటాకంలోని నీరు దూకుళ్ళతో పరువులెత్తునట్లు ఆమెహృదయంలోని బాధ వుక్కిరిబిక్కిరై పెద్దపెట్టున యేడ్చింపి. మలయమతి యింతగా పసిపాపవలె దుఃఖించుట యిదివర కెన్నడూ చూసి యెరుగదు. వూహించికూడా యెరుగదు. కఠోరమైన గంభీరతలోనుండు ఆమె నేడు యింతగా చలించిపోయినందుకు బీబీజాన్ నేత్రాలుకూడా వర్షిస్తున్నవి. దుఃఖంతో అయోమయస్థితిని పొంది ఆగలేక మలయమతి బీబీజాన్‌ను చుట్టవేసుకుని విలపిస్తున్నది.

హృదయంలో గూడుకట్టుకుని భారంగా బాధించే దుఃఖం బిగ్గరగా యేడ్చినపుడు తేలికపడుతుంది. అరగంట తరువాత మలయమతి సొమ్మసిలినదానివలె బల్లమీద పడుకున్నది. బీబీజాన్ ఆమె పాదాలను యెత్తి బల్లమీదపెట్టి పాటుకు చేర్చింది. తలగడా తెచ్చి నెమ్మదిగా శిరస్సు క్రిందకు చేర్చింది. బల్లప్రక్కగా నిలిచి క్రిందపడివున్న వుత్తరాన్నితీసి చూసింది. కాని ఆమె మనస్సు వుత్తరంమీద పనిచేయుటలేదు. తనకు తల్లి సమానురాలైన మలయమతినిగురించే ఆలోచిస్తున్నది. సామాన్యులు భరించరాని దుఃఖాన్ని ఆమె గమనించకుండానే పోగలు. అంత గంభీరత ధృడత గలిగిన ఆమె యింత దుఃఖించుటకు లోపల యెం బాధ వున్నదో అంచనాలువేసి తనలోని తపనతో పోల్చుకుంటున్న. సాధారణులకంటె ధృడత్వంతో గూడిన గంభీరుల హృదయం కూడుకునే దుఃఖం అనంతమైందిగా పెరుగుతుందని అర్థంచేసుకొని మలయమతి పాదాలవద్ద కూర్చుని ఆమె పాదాలమీద శిరస్సుంచి "నీ బాధను చూస్తూ నాలోని బాధను మర్చిపోతున్నాను దప్ప ... అమితంగానే వ్యధచెందుతున్నాను. నాకైనా శాంతిని గల్పించుతల్లీ' అని ప్రార్థించుకున్నది.

రెడోమాటుకూడా డబ్బు పంపారు. కాని తిగులునుగాని బాధను గాని అంత దూరానవున్న పుత్రునికి తెలియజేయుట యుక్తంగా ఏమీ తెలియజేయలేదు. చూడాలని మనస్సు వాపోతున్నట్లుమాత్రం వ్రాయించింది. వెంటవెంటనే వుత్తరాలయినా వ్రాయమని గట్టిగా కోరుతూ వ్రాసింది. పోవునపుడు మనస్పూర అనుమతి యివ్వని క్రోధాన్ని మనస్సులో వుంచుకోక వుత్తరం వ్రాయమని వినతిగా వ్రాయించింది.

మనియార్డరు పంపిన పదిరోజుల తరువాతనుంచి వుత్తరము కొరకు యెదురు చూస్తూ యేరోజుకారోజు మనస్సును కుదుటపర్చుకుంటూ నెలరోజులు గడిచిపోయినవి. ఒక్కజవాబైనా రాలేదు. విసిగిపోయిన మలయమతి నిరీక్షణకు బదులు శయ్యమీదనుంచి దిగకుండా అదే ఆలోచనలు చేస్తూ గడుపుతున్నది.

అనారోగ్యంనుంచి కోల్కొనుటకు మంచమెక్కే బదులు అనారోగ్యాన్నికోరి మంచమెక్కినట్లు మలయమతి శయ్యమీద గడిపి గడిపి రోగగ్రస్తురాలైంది. తాను జీవితంలో యెన్నో ధర్మకార్యాలు దాన కార్యాలు, పుణ్యకార్యాలు గొప్పగా జరిపిన ఫలితంగా నేడు తనకీ దశ సంభవించినందుకు మంచంమీద పడి వాపోతున్నది. "నేను చేసిన యే అపరాధానికీ శిక్ష విధించావు భగవంతుడా!" అనుకుంటున్నపుడు, ప్రక్కనున్న బీబీజాన్ విని కన్నీరు గుడ్డకద్దుకుంటూ "నీవు దేవతవు తల్లీ! ఈ లోకంలో పాపంచేసేవారికి శిక్షలుండవు. సాధుహృదయాలనే భగవంతుళ్ళందరూ శిక్షిస్తారు. భగవంతుడు తనకు ప్రియపాత్రులయిన వారినే పదే పదే పరీక్షిస్తుంటాడు. నీవు మహా తపస్వినిలాంటి దానివి. నిన్ను రక్షించమని నా అల్లానుకూడా ప్రార్థిస్తున్నాను," అని మనస్సులో అనుకున్నది బీబీజాన్.

రోజులు గడుస్తున్నకొంది మలయమతి మనోవ్యధతో క్షీణించి పోతున్నది. ఆమె తినే పిడికెడు మెతుకులు మంచంమీద వుండే తినవలసి వస్తున్నది. బీబీజాన్ యెడమరకుండా ఆమెను కనిపెట్టుకునే వుంటున్నది. మలయమతి విజయ్ బాల్యంనాటి విషయాలను వినిపిస్తూ మనస్సును రవంత శాంతపర్చుకుంటున్నపుడు, బీబీజాన్‌కుకూడా వుత్సాహం కలుగుతుంటుంది.

"బాబుది అచ్చుగా మీ స్వభావమే అమ్మా" అన్నది బీబీ.

"నా బిడ్డకు నా స్వభావంరాక యెవరిదొస్తుంది పిచ్చిదానా? నేను ఒకే ఒక పొరపాటు చేశాను బీబీ. వాడు విదేశం పయనమవ్వ నున్న పుడు నేను సంతోషంతో అనుమతించి, ఆశీర్వదించి పంపివుంటే నేడు యింతబాధ పడను. నా బిడ్డను అయిష్టంతో యెందుకు పంపితినా, ఆశీర్వ దించకుండా యెందుకు పంపితినా, అని నేడు పడరానిబాధ పడుతున్నాను. వాడు నా బిడ్డ, వాడి కోర్కెను తల్లినై మన్నించి ఆశీర్వదించలేక పోయాను." అంటూ మలయమతి కన్నీరు కారుస్తున్నది.

మలయమతి నిద్రిస్తున్నపుడు, మాటాడుతున్నపుడు బీబీజాన్ మనస్సు స్వయంగా దుఃఖసాగరంలో మునకలు వేస్తుంటుంది. మలయ మతి స్వయంగా కన్నీరు కారుస్తూ విలపిస్తున్నపుడు తన దుఃఖాన్ని విస్మరించి మలయమతికొరకు దుఃఖిస్తుంటుంది.

విజయ్‌నుంచి జవాబులేకుండా నాలుగు దీర్ఘమాసాలు గడిచి పోయినవి. సాఫీగా నడుచువారికి నాలుగుమాసాలు స్వల్పకాలమే. కాని మలయమతికి బీబీజాన్‌కు యీ నాలుగు మాసాలు నరకంతో నిండిన యెంత దీర్ఘకాలమో అంచనా వేయలేము.

వ్రాసిన అనేక వుత్తరాలకు జవాబులేనందున విసిగిపోయి రిజిష్టరు వుత్తరము వ్రాయించింది మలయమతి. ఆ వుత్తరం నెలరోజు లకు తిరిగి వచ్చింది. ఆ చిరునామాదారు అక్కడలేడని అంతు తెలియ దని అందు వ్రాసివుంది. ఆ విషయం తెలిసినపుడు మలయమతి హతాశు రాలైంది. గంటవరకు ఆమె మాటాడగల స్థితికి రాలేకపోయింది. ఈ పిడుగులాంటి వార్త ఆమెకు చిరాంధకారాన్ని కల్పించింది. ఇపుడా మెకు అన్నిటిమీద విరక్తి కలిగింది.

మలయమతి స్థితి పూర్తిగా మారిపోయింది. మతికూడ భ్రమిం చింది. తనలోతానే అస్పష్టంగా గొణుక్కుంటూ విలపిస్తుంటుంది. యెదుటబడి బీబీజాన్ యెన్ని ప్రశ్నించినా జవాబివ్వదు.

302

# 40. దైవమిచ్చినతోడు

కౌర్థానా కామందు స్వతఃగా అంత వుదారిగాదు. బ్రీజ్‌బెల్లా శ్రద్ధాభక్తులవలన వినయవిధేయతలవలన పనిమీదున్న విశిష్టధ్యాసవలన ఆమెయెడల వుదారిగా ప్రవర్తించాడు. ఆమెయెడలగల విశ్వాసంవలన క్యాషియర్‌గాకూడా చేశాడు. కాని యింత చక్కటి రూపవతి, గుణవతి యైన బ్రీజ్‌బెల్లా ఒక భారతీయుని ప్రేమజాలంలో పడిపోయిందని తెలిసినపుడు సహించలేకపోయాడు. తన శక్తి అంతటితోను ఆ విషయంలో యెదుర్కోవ ప్రయత్నించాడు. నచ్చిన దేశీయుని చేసుకోమని సలహాయిచ్చాడు. అవుసరమైన ధన సహాయం చేయనుకూడా తనసంసిద్ధతను తెలియపర్చాడు.

తానిది కోరి చేసుకున్న నిర్ణయంకాదని, దైవీకమైన కొన్ని దుస్స న్నివేశాలద్వారా తా నతనికి సహాయపడుట జరిగిందని, ఆతరువాతకూడా అనుకోనిరీతిలో అనాశ్రయుడుగా భాష తెలియక బాధపడుతూ తటస్థపడినపుడు ఆదరించుట జరిగిందని అతని అవస్థలను చూచినమీదట తనలోని ధాతృత్వంపెల్లుబికిన ఫలితంగా అతని విషయంలో శ్రద్ధతీసుకొనుట జరిగిందని, అది మేరీమాత ప్రేరణ అని తాను నిమిత్తమాత్రురాలని చెప్పింది.

కౌర్థానా కామందుకూడా చర్చి మతస్తుడు. దైవచింతన ఎక్కువ. తన తెలివితేటలవలన గాక ప్రభువు కృపవలన యింత వున్నతికి వచ్చాననుకుంటాడు. బ్రీజ్‌బెల్లా తనకూ ఆ అన్యదేశీయునికి జరిగిన యావత్తు మేరీమాత ప్రేరితమైందని వినిపించినపుడు ఆయన మనస్సులోని వుద్రేకం చల్లబడిపోయింది. ఆమెయడల అంకురించిన క్రోధం యెగిరిపోయింది. పునరాలోచనలో పడిపోయాడు.

"మిస్ బ్రీజ్‌బెల్లా, నీవు గొప్ప గుణవంతురాలవని, భక్తురాలవని నాకు దెలుసు. నీలోని నియమబద్ధత మరింత గొప్పది. కనుకనే నీ మాటలను విశ్వసిస్తున్నాను. అయినా ఒక అన్యదేశీయుడు నీతో

కలిసివుండుట యే రూపంగానూ క్షేమంగాదు. ముందు ముందు అనేక చిక్కులకు లోనుగావలసి వస్తుంది. దైవీకమైన సన్నివేశాలతో ఆశ్రయం యిచ్చావుగనుక అతని సదుపాయాలకు కావలసిన ధనాన్ని నేనిస్తాను గనుక అతన్ని వెళ్ళిపొమ్మని చెప్పు." అని కార్ఖానాకామందు వినయాన్ని ధృడత్వాన్ని ప్రదర్శించాడు.

"ధనలోపం ఆ వ్యక్తిబాధలకు కారణంకాదు. చదువుకోవాలనే కాంక్షతో యీదేశం వచ్చాడు. కాని అతనికి ఆంగ్లము అంతగా రాదు, ఫ్రెంచి అసలే తెలియదు. అందువలన అనేకచిక్కులకు లోనై నిరుత్సాహంలో నిస్పృహ చెందాడు. పిచ్చివాడై దీనత్వంలో కనిపించిన అతనిదృశ్యం చూచినపుడు, ఆత్మహత్యకు లోనవుతాడని భయపడ్డాను. ఆదరించమని అంతరాత్మప్రేరణ కలిగింది. ఆశ్రయ మిచ్చాను" అన్నది.

"ఏ భాషా తెలియనివాడు, ఆర్థికలోపం లేనివాడు అయితే యిక్కడ అనవసరబాధలు పడేకంటె అతనిదేశానికి త్రిప్పి పంపివేయ వచ్చుగదా!" అన్నాడు.

"ఇపు డాయనకు రెండుభాషలు వచ్చు. బాగా మాట్లాడగలడు! ఏ కాలేజీలోనైనా చదివి ఒకడిగ్రీ పొందాలని అతనిఆశయము" అన్నది.

"అలాంటి అతనికోర్కెల నన్నిటిని యెక్కడయినావుండి సాధించుకోమను. నీ యింట్లోనుంచిమాత్రం వెంటనే పంపివేయుట అవుసరం" అన్నాడు.

"క్షమించి మీరు అన్యధా భావించవద్దు. అతను చాలా సజ్జనుడు. దైవీకంగా నా ఆశ్రయంలోచేరి నాకు అండగా వుంటున్నాడు. పేయింగు గెస్టుగా అతను వుంటున్నందువలన నాకు చాలా సౌకర్యంగా వున్నది. దైవం తోడుజేసినవారిని మనం వేరుజేయుట అంత క్షేమంగాదు. కనుక యీ ఒక్కవిషయంలో నన్ను మన్నించండి" అన్నది.

ఆయన వస్తున్నచిరాకును అణచుకుంటూ "బాధ్యతలు, భారాలు తెలియనిమాట మాట్లాడవద్దు. మంచిదానివని అధికఆదరం యిచ్చినందుకు మంచితనంమీద, మర్యాదలమీద, విశ్వాసంమీద ఘాతుకం చేయవోకు. నీకు చాలీచాలని జీతమిచ్చుటలేదని నీకు తెలుసు. నీ యిల్లును

నీవు దిక్కుగా మార్చుకుని వుద్యోగం చేయవలసిన అవుసరమూ లేదు. అందు మరీ ఒక నల్లజాతివానిని యింటిలోవుంచి యిక్కడ వుద్యోగం చేయుట నాకూ తలవంపులుగా వుంటుంది" అన్నాడు.

బరువుకంఠంతో "నాపాలిట మీరు దైవసమానులు. ప్రత్యేకంగా నాకు మీరిచ్చిన ఆదరం జీవితాంతం మరువనిది, మీకు యెల్లపుడూ కృతజ్ఞురాలిగా వుంటాను. కాని యీ విషయంలో మీ మాటను పాటించ లేకపోతున్నందుకు నన్ను వుద్యోగంనుంచి విముక్తురాలను చేయండి. ఆదరంలేనివారిని ఆదరించి ప్రేమజూపుట, ప్రభువును ఆరాధించుటలాం టిది. మీరన్నవిధంగా నేనూ ప్రథమంలో అనేకమారులు ఆ వ్యక్తిని నిరాదరంతో విడిచివేశాను. ఎంతదూరం కాదలచానో ఎప్పటికప్పుడు సన్నివేశాలు అంతసన్నిహితం చేస్తూవచ్చినవి. ప్రభువే అతన్ని నా వద్దకు పంపినట్లు, స్వయంగా ప్రభువే ఆ రూపంలో నా పంచకుచేరి నట్లు నా అంతరాత్మలో అనేకమారులు ప్రేరణకలిగిన తదుపరి ఆశ్రయ మిచ్చాను. నేడతడు మేరీమాతను నిత్యమూ నిష్ఠతో ఆరాధించు పరమ భక్తుడు. ఈ స్థితిలో అతన్ని నిరాశ్రయునిచేయుటకంటె నేను నిరు ద్యోగినవుట మంచిది" అన్నది.

ఆయనలోని ఆవేశం వెలవెలబోయింది. "నిన్ను వుద్యోగం మానుకొమ్మని నేను చెప్పలేదు. ఒక పరదేశీయుణ్ణి, పరమతస్థుని నీ లాంటి గౌరవప్రతిష్టలుగలస్త్రీ యింటిలోవుంచుట అంత శ్రేయస్సు కాదేమోనని నా తలంపు. అయినా యీ విషయంలో నీవు ప్రశాంత హృదయంతో ఆలోచించి నాలుగురోజుల తరువాతనే చెప్పు" అన్నాడు.

"నేను ఆలోచించి ఆదరించిందీ లేదు, నేడు ఆలోచించి నిర్ణ యించగలిగిందీ లేదు. కొన్ని కేవలం మానవులను నిమిత్తమాత్రు లనుగా చేసి ప్రభువుప్రేరణలలో జరిగిపోతుంటవి. మనము వాంఛించి చేయజాలనివి వాటంతటవే జరుగుచున్నపుడు వాటిని నిరోధించుటకూడా మనకు క్షేమంగాదు. వాటి పర్యవసానఫలితాలు దైవనిర్ణయాలుగా భావించి స్వీకరించుట వుత్తమము" అని నిరాసక్తతో పలికింది.

నిర్లక్ష్యంచేసినట్లు, అవమానింపబడినట్లు కామందుమనస్సు క్షణం పాటు ఖంగారుపడింది. జీవితంలోని అనుభవం అదుపుజేసింది. "మిస్

బ్రీజ్‌బెల్లా! నేను అన్నందుకు బాధ చెందవద్దు. చూసేవారికంటె, సలహాలిచ్చేవారికంటె మోసేవారికే బాధ అనుభవమవుతుంది. నీకు యిష్టమైనట్లే నడుచుకోవచ్చు. నా తరపుగా యీ విషయం యిక పట్టించుకోను" అన్నాడు.

పట్టుదలతో ప్రారంభించిన విషయం అంత ఉదారతతో విడిచిపెట్టినందుకు బ్రీజ్‌బెల్లా ఆశ్చర్యపోయింది. అభినందించింది. అంతర్గతంగా ఆయన్ను గురించి అనేకవిధాల శ్లాఘించుకున్నది. ఇంటిముఖమై బయలుదేరాక ఆమెలో పునరాలోచనలు బయలుదేరినవి. ఒకక్షణంలో యెంతగా భయపడి ద్వేషంతో మునిగిందో మరుక్షణం ఆయన ప్రకటించిన విశాలసహృదయతకు అంతగా ఆయనయెడల అభిమానం ఆవేశించింది. తనయెడల ప్రారంభంనుంచి కనిపించిన కనికరం హృదయంలో భారంగా వరుసదిరుగుతున్నది. యదార్థానికి, తనక్షేమం కోరే కటువుగా ఆయనన్నట్లు,అందుకు తాను నిర్లక్ష్యంచేసి నిర్మోహమాటంగా మాటాడుట పొరపాటయినట్లు పశ్చాత్తాపంతో శరీరం ముంచెత్తుతున్నది. విజయ్‌యెడల పెల్లుబికివున్న ప్రేమాదరాలలో రవంత సడలి ఆ కామందు వైపు జారింది. కఠినయత్నాలద్వారా మారని యెదుటినిర్ణయాలు ఉదారతలలోని త్యాగంద్వారా మలుపులుతిరుగుట కద్దు.

విజయ్ కీ సంభాషణలవిషయం తెలియనివ్వలేదు. కాని తనను గురించి శ్రద్ధతీసుకునే అనేకులు తన యీ చర్యలకు బాధపడుతున్నట్లు కామందుద్వారా తెలిసిపోయింది. అందువలన ఆ విషయాలే మరీమరీ మనస్సులో మెదులుతున్నవి. కామందు సాధుస్వభావిగనుక తనలోని దృఢత్వం తెలుసుకుని మారుమాటలేకుండా వదిలివేశాడు. అందరూ అలా కాదు గనుక యేసమయం యేమివాటిల్లుతుందోనన్న భీతి కలిగినపుడు, జాలితో విజయ్‌వైపు చూస్తుంటుంది.

"విజయ్! ఒకవేళ యిక్కడివారంతా మనలను వేరుచేయాలని పట్టుబడితే యేమిచేస్తావ్?" అని ప్రశ్నించింది.

విజయ్ వెర్రివానివలెచూస్తూ నతనతలతో "హూఁ....అలా.... యెందుకు జరుగుతుంది?" అన్నాడు.

"మా మతస్థులు నామీదున్న అభిమానంతో నా క్షేమంగోరి అన్యదేశీయులు, అనాశ్రయులు అయిన మీనుంచి వేరుచేయదలంచి పట్టుబడితే!" అన్నది.

అదోముఖంచేసి ఆలోచనా నిమగ్నుడై "జలరాశినుంచి ముత్యాన్ని బయటవేస్తే యేమవుతుంది? నేను వేరుగా వుండలేనుగా!" అన్నాడు.

"అది వారు విచారించరు. వారి కనవసరం. మిమ్ముల నీ దేశంనుంచి బహిష్కరింపజేసి నెట్టివేసే యత్నాలు వారు చేయవచ్చుగదా!" అన్నది.

వెలవెలబోతూ పసివానివలె ఆమెవైపే చూస్తున్నాడు.

"అందరను యెదిర్చి పోరాడగలశక్తి అందరకు వుండదు. అందు స్త్రీకి అసలే అవాంతరా లెక్కువ. నేను యేమీ చేయజాలనపుడు...." అంటూ ఆగిపోయింది.

"అంతటి దుష్టసమయ మాసన్నమైనపుడు మేరీమాతముందు ప్రార్థించి ఆఖరివినతి చేసుకుంటాను. 'నీవుకల్పించిన నీడను వేరుచేయుట న్యాయమా తల్లీ!' అని ప్రార్థిస్తాను. అవుసరమైతే నా ప్రాణాన్ని ఒక పుష్పంగా మేరీమాతపాదాలముందుంచుతాను" అన్నాడు.

ఆ మాటలు ఆమెను చలింపజేసినవిగాబోలు, హఠాత్తుగావెళ్ళి కవుగిటిలో బంధించి అధరాలమీద చుంబించింది.

# 41. దురాలోచనలు

కౌర్థానాకామందు గోల్డ్సువర్త్ యెంత సజ్జనుడైనా ఆమె నిర్లక్ష్యంతో ఆత్మాభిమానం దెబ్బతిన్న కారణంతో అనేక ఆలోచనలకు గురియవుతున్నాడు. ఏమీ తెలియకుండానే ఆమెను సుగుణసంపన్నిగా విశ్వసించి, ఆదరించిన తాను నేడు ఆమెలోని యే రహస్యాలనో తెలుసుకో నుద్యుక్తుడై గత జీవితాన్నంతా తెలుసుకొను ఆరాలు తీస్తున్నాడు. ఆమెసర్టిఫికెట్, సర్వీస్‌బుక్‌ల పరిశోధనలుకూడా జరిగిపోయినవి. వివరాలు అధికంగానే పోగయినవి. కాని అన్నీ ఆమెశీలాన్నే పొగడినవి. బ్రిటనులో గొప్ప పేరుగల బ్రిగేడియర్ సుపుత్రి అయినట్లు, దురదృష్టవశాత్తు అనాశ్రయురాలైనట్లు, అనాధగాచదివి పెద్దదైనప్పటినుంచి కష్టజీవిగాను, నీతితోను, నిజాయితీతోను నిరాడంబరంగా వుంటూ వచ్చినట్లు, మేరీమాత అంధభక్తురాలైనట్లు, ఆయనసేకరణద్వారా తెలిసినపుడు తనలో వోవైపు పశ్చాత్తాపము, మరోవైపు బాధ కలుగసాగినవి. నిష్కళంకినియైన ఆమెనుశంకించుట, శోధించుట అపరాధమని పశ్చాత్తాపం కలిగింది. ఇంతటి పవిత్రయోగ్యురాలు ఒక అప్రయోజకుడయిన అన్యదేశ అధమునికి లొంగిపోయినందుకు బాధ కలుగుతున్నది.

మడుగులో చేయివేసి కెలికినపుడు దొరకనివి తిరిగి తేరుకున్నపుడు కంటిచూపుకే దొరుకుట కద్దు. గోల్డ్సువర్తు పరిశోధనలు విరమించుకున్న తదుపరి, తన విశ్వాసపాత్రుడైన ఆఫీసుబోయ్‌ద్వారా వెల్డన్‌తో బ్రీజ్‌బెల్లాకు ఘనిష్టసంబంధమున్నట్లు వార్త వచ్చింది. ఆ వార్తయందంత వుత్సాహం లేకపోయినా, వెల్డన్‌ను పిలుచుకురావటము, తనకు ఆమెకు సన్నిహితసంబంధము చాలాకాలమువరకు వున్నట్లు, వివాహనిర్ణయం కాబోవుముందే, యీ అన్యదేశీయుని మయిదులోపడి ఆ పేటనుంచి పరారీఅయి, నిర్జనగల్లీలో వసతిచూసుకుని చేరినట్లు స్వయంగా వెల్డన్ చెప్పినపుడు గోల్డ్సువర్తు నిర్ణయం తారుమారైనది.

వెల్డన్ తన ప్రేమకథలోని విషాదాన్ని చూసి, ఆ కారణంతోనే విరక్తుడై, నిరుద్యోగిగా తయారై ఆటోపిక్షాతో అప్రయోజకజీవితాన్ని దొర్లిస్తున్నట్లు వినిపించినపుడు గోల్డ్సువర్తు సానుభూతిని పొందాడు. ఆ సంపర్కంతోనే కార్ఖానాలో వుద్యోగాన్నికూడా పొందాడు.

ఆకస్మికంగా వెల్డన్ కార్ఖానావుద్యోగంలో ప్రవేశించి మొట్ట మొదటిసారిగా కనిపించినపుడు ఆశ్చర్యంతోను, భయంతోను విహ్వాలు రాలైంది. ఆ రోజల్లా ఆమె వేడినిట్టూర్పులతో గడిపింది. మరునాడు మర్యాదలాంఛనాలతో తనను పలుకరించినపుడు మనస్సు కుదుటపడింది. మనస్సులో కూడుకున్నమంగు విడిలిపోయింది.

అతనితో పరిచయమైన ప్రారంభంనుంచి జరిగిన వ్యవహార మంతా వరుసగా దొర్లినది. తననుపొందాలని ప్రథమంగా ప్రయత్నించి నపుడు వినతి, తరువాత కౄరరూపురేఖలు ప్రదర్శించిన విధము, తన లోని నిశ్చలతను గమనించినపుడు, తనకు రక్షకవచముగా నిలిచి అన్ని వైపులనుంచి నిర్భీతినిగల్పించిన విధము, విజయ్‌ను పోలీసుకప్పగించుట తనక్షేమవాంఛలోనున్న యదార్థము కళ్ళకు గట్టినట్లు కనిపించింది. తిరిగి నేడు ప్రీతితో మెలగుతున్నందుకు ఆమెమనస్సు అనురాగంతో ఆర్ద్రమైంది. కాంక్షించుట స్వభావికము, తిరస్కరింపబడినపుడు ద్వేషం ప్రజ్వరిల్లుటకూడా అనివార్యం. సమయం గడచినతరువాత ఆత్మసంయమంతో ద్వేషముస్థానే ఉదారతతోగూడిన అభిమాన ముద యించుట వుత్తమలక్షణము అని అలాంటి వున్నతకోవకు చెందిన వానిగా చిత్రించుకున్నది వెల్డన్‌ను.

బ్రీజ్‌బెల్లా కార్ఖానాలో అందరిమధ్య వెల్డన్‌తో అతిచనువుగా సంచరిస్తున్నది. వీరరువురిమధ్య సాగుతున్న యీ సన్నిహితసాఫీతనం గోల్డ్సువర్తులోని నూతన అనుమానాలకు మంచిస్థావరాన్ని సమ కూర్చింది. వెల్డన్‌చెప్పిన వ్యవహారమంతా పరమసత్యమైనట్లు, వారిరు వురిమధ్య ప్రేమ పునరంకురించినట్లు, యీ జంట నాశీర్వదించుట సర్వ శ్రేష్టమైనట్లు భావించాడు.

అమాయకంగా ఒక అన్యదేశీయునివలలో పడిపోయిన బ్రీజ్ బెల్లాను వెల్డన్‌వైపు మరలించుట రక్షించుటగా తలస్తున్నాడు గోల్డ్సు

వర్తు. వెల్డన్‌కూడా బాగా చదువుకున్నవాడుగనుక క్యాషియర్ దగ్గర లెక్క వగైరా వ్రాసే అసిస్టెంటుగా నియమించాడు. ఒకే కిటికీవున్న క్యాషగదిలో బ్రీజ్‌బెల్లాప్రక్కన వెల్డన్‌స్థాన మయింది.

వెల్డన్ లెక్క వ్రాసుకుంటూ "జీవితంలో వుద్యోగంచేయగూడదని ఆటోరిక్ష యెక్కినవాడికి, విధివ్రాతతో గాబోలు యిక్కడికిరాక తప్పలేదు, అనివార్యస్థితిలో యిక్కడ చేరాను. కాని యిది దుఃఖానికి బదులు నీద్వారా స్వర్గధామంగా అవతరించింది" అన్నాడు.

"ఉద్యోగం హీనమయిందిగాదు, కష్టజీవితంలోనే ఆనందముంటుంది. కాని అందరి ఆస్వాదనకు అది రాదు" అన్నది.

"శ్రీ గోల్డ్సువర్తుగారు మహా మంచివారు" అన్నాడు.

"అవును, ఆయన దైవసమానుడు. మహోవుదారుడు" అన్నది.

"ఆయనకృపవలన వుద్యోగం పొందాను. చాలాకాలానికి తిరిగి మిమ్ము కలుసుకోగలిగాను" అన్నాడు.

తనయెదుట కంపితశరీరంతో నిలిచే బ్రీజ్‌బెల్లా యింతగా మారిపోయి ఆత్మీయతతో, ఆదరంతో మాటాడుటకుగల కారణాలేమిటాయని యెంతో వెదికాడు. ఆఫీసుగదిలో ఆమెప్రక్కన గడుపుతున్నరోజులు గడుస్తున్నకొంది, ఆమెలోని ఆకర్షణలో లీనమైపోతున్నాడు. బ్రీజ్‌బెల్లా హృదయంలో తనకూ విలువవున్నట్లు అనుకున్నపుడు ఆత్మవిశ్వాసం పులకితమవుతున్నది. ఆమె పొరపాటుగా అయోగ్యుడైన ఆ భారతీయుని వలలో చిక్కుకున్నదని, యింతకాలానికి అను .వంతో కనువిప్పు జరిగి వుంటుందని, ఆ కారణాలతోనే తనను నేడు ఆదరంగా చూస్తున్నదని వూహించుకుంటున్నాడు.

తామిరువురు దంపతులైతే యెంతో ఆకర్షణీయమైన జంటగా వుంటుందని, తనకంటె అన్నివిషయాలలోను బ్రీజ్‌బెల్లాయే గొప్పదని, ఆమె తనకు లభించుట పూర్వజన్మసుకృతమని, ఆమెను హుందాతనాలతోను, టెక్కులతోను, బలప్రదర్శనలతోనుగాక సాత్వికమైన వినయాలతోను, త్యాగంతోను పొందుట సాధ్యమనికూడా నిర్ణయించుకున్నాడు.

గోల్డ్సువర్తును యేకాంతంగా కలుసుకుని, పాదాలంటుకుని యెన్ని

విధాలో స్తోత్రించాడు. పిలిచి వుద్యోగమిచ్చినందుకు అభినందించాడు. కాని యిది తనలక్ష్యమూ గాదు, గణనీయమూకాదని, అమూల్యమైన నిధిని తన జీవనసాధినిగా పొందు సదవకాశాన్ని కల్పించి తన జీవితానికి వినూత్నవెలుగును కల్పించాడని యెంతగానో పొగడుకున్నాడు.

తనను అంతగా పొగడిన వెల్డన్‌ను తానుకూడా ఒకస్థాయి పైకి యెత్తివేశాడు. తాను నిమిత్తమాత్రుడుగా నిలిచి కర్తవ్యాన్ని పాలించినట్లు వినిపించాడు. అంధత్వంతో తనజీవిత సర్వనాశనంవైపు పయనించ ఆయత్తమై జాతికే మచ్చతేనున్న ఆమెను ఆ బారినుంచి బయటకువేయుట తనధర్మంగా యెంచి చేయగలిగింది చేశానని, ఇప్పటికపుడే ఆ హాని తొలగినట్లు భావించుటలేదని, ఆ భారతీయుడు అచటినుంచి విడిపోయిననాడే సఫలంపొందినట్లని, ఆ విడదీయుట బలప్రయోగంతో అయితే అసాధ్యం కావచ్చుని, మొదలగు సలహాలతో యెంతో వినిపించాడు గోల్డ్సువర్తు.

వెల్డన్ కార్ఖానాలో ప్రవేశించి నెలరోజులు గడచిపోయినవి. ఆటోరిక్షామీద అటుయిటు గాలిపాటుగా తిరిగినవ్యక్తి నేడు కార్ఖానా ఆఫీసుగదిలో అతుక్కుపోయాడు. ఆఫీసుటయము కాకముందే వస్తుంటాడు. ఆఫీసులో బ్రీజ్‌బెల్లాప్రక్క కూర్చున్నాక గడియారాలు తిరక్కుండా ఆగిపోతే బావుండుననుకుంటాడు. చొరవచేసుకుని ఆమెపని కూడా తానే చేసివేయ ప్రయత్నిస్తుంటాడు. ఆమెకుకూడా అతనిమీద విశ్వాసము కలిగింది. ఆమె బయటకువెళ్ళునపుడు ఆ పదినిముషాలు తనపనిని అతని కప్పగించి తాళంచెవులు అతనికేయిచ్చి వెళుతుంటుంది. రెండుమూడుమారులు కొన్నిపౌన్లు పైకం పెచ్చుతేలింది. బ్రీజ్‌బెల్లా యెన్నిమారులు లెక్కించినా లెక్కలు యిరువురు తనిఖీచేసినా పెచ్చు కనిపించి ఆశ్చర్యపోయింది. ఎవరయినా పొరపాటుగా తక్కువ యివ్వబడ్డారేమోనని కార్మికులందరికి యెలాన్‌చేసి చెప్పటం జరిగింది. ఎవరికీ పొరపాటులెక్క రాలేదు. గోల్డ్సువర్తుకూడా ఆశ్చర్యపోయాడు. ఆ పెచ్చు పైకాన్ని బ్రీజ్‌బెల్లానే తీసుకోమని గోల్డ్సువర్తు బలవంతపెట్టాడు. కాని ఆమె అందు కంగీకరించక కామందుఖాతాలోనే జమకట్టి వేరే కవరులో పదిలపర్చి క్యాష్‌బాక్సులోనే పెట్టింది. తనవల్ల

యిచ్చుటలో పొరపాటు జరుగుచున్నదేమోనన్న సందేహంతో వెల్డన్ సహాయాన్ని యెక్కువ పొందుతున్నది. కాని వారానికి రెండుపర్యా లయినా మిగులు వుంటున్నది. ఆ విధంగా కవరులోని మొత్తం పెరిగి పోతున్నది.

"మీ డబ్బే పొరపాటుగా అందులో కలుస్తున్నదేమో!" అంటాడు వెల్డన్.

"నా సంచిలోనుంచి యెన్నడూ వేయటం తీయటం లేనపుడు యెందుకు పొరపాటు జరుగుతుంది?" అంటుంది.

"పెరిగినా తరిగినా బాధ్యులు మీరుగనుక కారణాలేమయినా గావచ్చు. కాని ఆ పెరిగినమొత్తం మీకే చెందుతుంది. కామందుకూడా ఆ మాటనే అన్నాడు" అని వినిపించాడు.

"పొరపాటులతో పెరిగిన మొత్తాలను పొందే హక్కు నాకూ లేదు. ఏనాటికయినా ఎవరికో తరుగువచ్చినట్లు తెలిసినపుడు ఆ తరుగు దారులే హక్కుదారులవుతారు" అన్నది.

"ఎప్పటికి వారు బయటికి రాకపోతే!" అన్నాడు.

"ఆనాడు కామందే హక్కుదారు" అన్నది.

"వారు మిమ్మే హక్కుదారుగా తేల్చి తాము స్వీకరించకపోతే!" అన్నాడు.

ఈ రూపంగా వారిలో సరసరూపసంభాషణలు తిరిగిపోయినవి. వెల్డన్ యెంత భయంకరవ్యక్తిగా చిత్రించుకున్నదో అంతభిన్నమైన సాధుస్వభావిగా నేడు తెలిసిపోయింది. అందుకామె యెంతో ఆశ్చర్య పోతుంటుంది. అతనిమీద అపుడపుడు ధమికలుకూడా చేయసాగింది. ఆ ధమికలు అతనికి గిలిగింతలు పెట్టినట్లుంటుంది. కాగితాలు,పుస్తకాలు మొదలగునవి యిచ్చి పుచ్చుకొనునపుడు, ఆమెచేతికి తనచేయి తగిలి నపుడల్లా సర్వశరీరంలోనూ విద్యుల్లత ప్రవహించినట్లుంటుంది. ఆమె స్పర్శల అనుభూతికొరకు హృదయం తపిస్తున్నది. కాని కార్యసాధన కొరకు వివేకం వెనక్కు నెడుతున్నది. ఆమె ప్రక్కనుంటూ స్వభా వాన్ని, గుణగణాలను, ఆమె తీయని పలుకులలోని మాధుర్యాన్ని గ్రోలుతూ ముగ్ధుడైపోతున్నాడు. దూరదూర చూపులలో మెరిసేవి కొన్ని

దగ్గర జేరినపుడు అసహ్యించుకోబడుతవి. మరికొన్ని దగర జేరినపుడు మరింత ఆకర్షణీయమై హత్తుకుపోతవి. అదేరీతి బ్రీజ్‌బెల్లా ప్రక్క వుంటూ సంభాషణలు చేస్తున్నకొలది పరవశుడై తనలోతానే ఆమెకు ఆత్మార్పణ చేసుకుంటున్నాడు. జీవితాన్ని జన్మజన్మలకు మనస్సా ఆమెకు అంకితంచేసుకుంటున్నాడు.

మనస్సులో పాడు పీనుగగా దోస్తున్న ఆ నల్లజాతివాడు తన కడ్డుగోడగా లేకపోతే నిస్సందేహంగా ఆమె తనదే అవుతుందన్న ఆశ మెరుపుతీగవలె పనిచేస్తున్నది. అతనితో ఆమెకు యింత దీర్ఘకాలమున్న సన్నిహితత్వంలో హేయత కలిగివుంటుందని ఆ కారణంతోనే తన నింత ఆదరంగా చూస్తుండవచ్చునని, అయినా విఘ్నశేషాన్ని నామ రూపాలు లేకుండా చేయుటే వుత్తమమని నిర్ణయించుకున్నాడు.

ఆరోజు శనివారం. గవర్నమెంటు ఆఫీసులలో ఒంటిపూట పని మాత్రమేవుంటుంది. ప్రయివేటుకార్యాలయాల్లో రెండోపూటవున్నా తొందరగావదలటంగద్దు. బ్రీజ్‌బెల్లానాలుగుగంటలకేయింటికి చేరింది. గది బయట తాళం బిగించివుంది. గంటవరకు వేచివుండి విసిగి బజారువైపు నడిచింది. విజయ్ తోచక పార్కువైపువెళ్ళి వుండవచ్చునని ఆమె వూహ. తమ్ము యేకంచేసిన ఆపార్కు చాలా దూరం. యేటియిసుక పొరమీద దొర్లుకొచ్చు నీటివలె అటునుంచి వస్తున్నవారిని యెదుర్కుంటూ ముందుకడుగులు వేస్తున్నది.

"మిస్‌బ్రీజ్, యింకా యింటికెళ్ళలేదా?" అని వెనుకగా వినిపించినపుడు వులికిపాటుతో వెనుదిరిగి చూసింది. అతను వెల్డన్. తనతో పాటే ఆఫీసునుంచి వెళ్ళిపోయాడు. "హాఁ—అవును—కాస్త పనిమీద యిటు వెళుతున్నాను." అని అంటూ ఆమె ముందుకు వెళుతున్నది.

"మీరు పనిమీద వెళుతున్నారు. నేను పనిలేక వెళుతున్నాను. ఎంత విచిత్రమో చూశారూ? ఇంటిదగ్గర తోచదు, ఏంచేయమంటారు!" అంటూ పెద్ద నవ్వును ప్రదర్శించాడు. ఒక్కమాటను విన్నట్లూలేదు, నవ్వును చూసినట్లూలేదు. చురుకుగా వెళ్ళిపోతున్నది. వెల్డన్ ముఖం వివర్ణమైంది. అయినా వెన్నంటి పోతూనే వున్నాడు.

పార్కు యెదుట నిలిచి అన్నివైపుల చూసింది. దీర్ఘనిట్టూర్పును విడుస్తూ తన పరిచిత స్థానానికెళ్ళి కూర్చున్నది. విజయ్ తప్పకుండా యిక్కడికే వచ్చివుంటాడని ఆమె నిర్ణయం. ఒకవేళ తాను ఆఫీసునుంచి వచ్చు మామూలు టయమయింది గనుక గదికిచేరి వుండవచ్చు. దారిలో ఎదురుపడలేదు. మరోవైపుగా వెళ్ళివుండవచ్చు. అనుకుంటుండగా వెల్డన్ నవ్వుముఖంలో దాపుకు చేరాడు.

"మీరేదో పనిమీద వెళుతున్నామన్నారు!" అని ప్రశ్నించాడు వెల్డన్.

"ఆలస్యమవుతుందనే ఆలోచనతో మానుకున్నాను." అన్నది.

ఆఫీసులో ఆదరంగా విన్న అతని మాటలు యిక్కడెందుకో వినబుద్ధిగావటంలేదు. మనస్సు యేకాంతాన్ని వాంఛిస్తున్నది.

వెల్డన్ ప్రసంగాలురుచించక అనుకున్నదానికంటెముందుగానేలేచి యింటికి ప్రయాణమైంది. ఆమె కిష్టంలేకపోయినా "మిమ్ము యింటి వరకు పంపి వెళతాను." అంటూ వెల్డన్ బయలుదేరాడు. యింటితాళం యథాతథంగానే వేసివుంది. తనకు తోడుండుట ఒక మేలుగానే భావించి వూసుబోని కబుర్లతో రాత్రి 7 గంటల వరకు అక్కడే గడిపింది. విజయ్ జాడలేదు.

ఎన్నడూ యిల్లువిడిచి వెళ్ళనివాడు నేడు అంతులేకుండా వెళ్ళి నందుకు చీకాకుపడిపోతున్నది. వెల్డన్ సహాయంతో గదితాళం తీసింది. ఆ వెంటనే అతన్ని వెళ్ళిపొమ్మన్నది. ఆ విజయ్ వచ్చేవరకు తోడుగా వుండగోరాడు. సమాధానాలు చెప్పగల స్థిమితంలేదు. బయటకు పంపి లోపల గడియవేసుకున్నది.

ఒక అన్యదేశీయునియడల విశ్వాసం తనయెడలలేదు. అతని కిచ్చిన ఆదరం తనకివ్వలేక పోతున్నది. ద్వేషంతో హృదయం రగులుకుపోతున్నది. అయినా గోల్డ్సువర్తు చెప్పిన విషయాలు స్మరించు కుని శాంతించాడు. కార్యసాధనలో మార్పు వెయ్యివిధాల బలమని తనకూ విశ్వాసముంది.

బ్రీజ్‌బెల్లాకు ఆరాత్రి ఆకలి అనిపించలేదు. మేరీమాతముందు ప్రార్థనలో రెండుగంటలవరకు కూర్చున్నది. కాని మనస్సు చంచల రూపం దాల్చి మెలికలు దిరుగుతున్నది. పవళించి నిద్రదేవతను యెంత ఆహ్వానించినా నిష్ఫలమవుతున్నది. ఆలోచనలతో మనస్సు వేడెక్కి నిద్రకు మరింత దూరమైపోతున్నది.

విజయ్ అదృశ్యమై రెండురోజులు గడిచిపోయినవి. అతని దుస్తులు వగైరాకూడా అలాగే వుండిపోయినవి. వెళ్ళగోరితే వీడ్కోలు తోనే వెళ్ళిపోవచ్చుగదా. ఆకస్మికంగా చెప్పకుండా దొంగగా వెళ్ళిపో వలసిన అవుసరమేముంది! అవును. అమాయకంగా వుండేవారు విశ్వ సించినచోటే ద్రోహంచేసి కూర్చుంటారు. సమర్థులు విరోధులను సాధిస్తారు, బాధలను యెదుర్కొంటారు. అసమర్థులే విశ్వాసఘాత కులుగా రుజువవుతారు అని స్ఫురించిన ఆలోచనలమీదనే నిలువలేక పోతున్నది. పాదరసంవలె అటుయిటు తొణుకుతున్నది.

ఒక అన్యదేశీయునిద్వారా మోసగింపబడినట్లు, వంచించబడి నట్లు వెల్డన్‌ద్వారా తెలుసుకున్న గోల్డ్సువర్తు స్వయంగా ఆమె గది కొచ్చి తన సానుభూతిని ప్రకటించాడు. ధైర్యంవహించమని, ఇదీ ఒక మేలుకే జరిగినట్లు తలంచమని, ఆ అనామకుని సాంపర్క్యం యింకా కొనసాగితే సర్వనాశనహేతువై యుండేదని సలహాలతో ధైర్యాన్ని పురిగొలిపి వెళ్ళిపోయాడు.

అవకాశాన్ని సద్వినియోగపర్చుకొనుటలో వెనుకబడిపోతాననే భయంతో వెల్డన్ మాటమాటకు ఆమె కందుబాటులో వేచివుంటున్నాడు. చిందులు త్రొక్కుతున్న చీకాకులో ఆమెనుంచి కఠోర వాక్యాలు వస్తున్నా చిరునవ్వులతో స్వీకరిస్తున్నాడు.

విజయ్‌అదృశ్యమై అది మూడోరోజు. ఇక అతనినిగురించి ఆలో చించుటగాని, ఆరాలుతీయుటగాని, అనవసరమని నిర్ణయించుకున్నది బ్రీజ్‌బెల్లా. అతను మోసగాడు గాకపోయినా మూర్ఖుడనిమాత్రం స్థిరీక రించుకున్నది. మర్చిపోవుటే మంచిదనుకున్నపుడు అమాయకంతో

గూడిన అతనిభక్తి, శ్రద్ధలు, అతని మాటలు గిరగిర ముందు తిరిగి అయోమయం చేస్తుంటవి. అలాంటిసమయాలలో వెల్డన్ మాట్లాడు తుంటే భరించలేని బాధకలుగుతుంటుంది. విసగటలో ఆమె మనో భావాలను అర్థంచేసుకున్నా, ఆశయసిద్ధికొరకు అంటిపెట్టుకోక తప్ప దతనికి.

అపరాహ్న సమయ మది. విశ్రాంతినుంచి పనిలో ప్రవేశించి పావుగంటయి వుంటుంది. మనస్సును పదేపదే ఆ పారిపోయినవాని వైపు పోనివ్వకుండా, కంపనలు కలిగించే వెల్డన్‌మాటలు వినే అవకాశం లేకుండా తీరుబడిలేని పనిని గల్పించుకునే నిమిత్తం పాతలెక్కలను తీసి కూడికలు చేస్తున్నది. "జరిగిపోయిన లెక్కలతో బుర్ర బ్రద్దలు గొట్టుకోవటమెందుకండీ!" అంటూ ప్రశ్నించాడు వెల్డన్.



# 42. ధర్మదేవతఖైదు

ఆమె ద్వారంవైపుచూసి నివ్వెరపోయింది. పోలీసుఅధికారి ప్రక్క నలుగురైదుగురు జవాన్లు. దూరంగా కార్ఖానా కామందు. ఆమె చేతిలోని కాగితాల నలానే వదిలి నిలిచింది. పోలీసుఅధికారి యింకా రెండడుగులు ముందుకువేసి"నీవు బ్రీజ్‌బెల్లా, ఆయన వెల్డన్ అంతేనా?" అని ప్రశ్నించాడు.

ఒకరి మొఖాలు ఒకరు చూసుకుంటూ, అవునన్నారు. ఇరువురను పోలీసువ్యాన్‌లో తీసుకెళ్లారు. ఎందునిమిత్తమో తెలుసుకోవాలని యెంత ప్రయత్నించినా సాధ్యపడలేదు గోల్డ్సువర్తుకు.

బ్రీజ్‌బెల్లా అర్జంటుపనిమీద తీసుకురమ్మన్నట్లు చెప్పి విజయ్‌ను యిరువురు వ్యక్తులు తీసుకెళ్ళి కారులో కూర్చుండబెట్టి పట్టణంలో నిర్జనంగావున్న స్మశానవాటికవైపు తీసుకెళ్ళినట్లు, ఎత్తైన ఆ ప్రహరీ ప్రక్కనే ఆ యిరువురు వ్యక్తులు డ్రైవరు కలిసి ప్రాణంతీయ ప్రయత్నించినట్లు, విజయ్ మూర్ఖంగా శిరస్సుతో ఢీకొన్నందున రొమ్ముల్లో తగిలి ఒకరుపడిపోయినట్లు, బాకుపోటుతో విజయ్ క్రింద పడిపోతూ కేకలుపెట్టినట్లు, ఆ అలజడికి పోలీసువారు చేరులోగా యిరువురు పారిపోయినట్లు, పడిపోయిన కారుడ్రైవరు, కారు, విజయ్ అక్కడే వున్నట్లు వారిరువురిని హాస్పిటల్‌లో చేర్చినట్లు పోలీసువారిద్వారా తెలిసింది.

"ఆ భారతీయుణ్ణి చంపి, స్మశానవాటికలో సమాధిచేసి రావటానికి వెల్డన్, బ్రీజ్‌బెల్లాలు తమకు గొప్ప మొత్తాన్ని ముట్టజెప్పారని, మారు పేరుతో సమాధిచేసి వచ్చిన పిదప యింకా పెద్దమొత్తాన్నిచ్చుటకు మాటయిచ్చి వున్నారని, హాస్పిటల్‌బెడ్‌మీదనున్న డ్రైవర్ స్టేట్‌మెంటు యిచ్చినపుడు, బ్రీజ్‌బెల్లా మ్రాన్పడిపోయింది.

ప్రక్కనున్న బెడ్‌మీద విజయ్ గన్పించాడు. అతని శరీరమంతా కట్టులతో నిండివుంది. నేత్రాలు జేగురించి కొట్టవచ్చినట్లున్నవి. కనుకా

లకులగుండా కన్నీటిబిందువులు దొర్లుతున్నవి. అతనిచూపు తనవైపే వుంది. అధరాలు కంపిస్తూ వంపులు తిరుగుతున్నవి. ఆమె రెండడుగులు చెంతకు వేసింది.

కుడిచేయి బ్యాండేజీలలో చుట్టుకుని వున్నందున కదలలేదు. యడమచేయిపైకియెత్తి నొసటిమీద వేసుకున్నాడు. అతనేదో చెబుతున్నట్లు అనిపించి ముందుకు వంగింది. "నిస్పృహలో స్పృహగల్పించి, నా మూగతనాన్ని బారద్రోలి మాటలనిచ్చిన దాతలు మీరు. ఎండమావులలో పయనిస్తున్ననాకు పరమసత్యాన్ని చవిజూపింది మీరు. పవిత్ర ప్రేమ జ్యోతిని నాలో వెలిగించి దీప్తివంతంచేసింది మీరు. సహనము, త్యాగము, ప్రేమ నేను మీనుంచి పొందిన వరాలు. సర్వదా మీరు నాకు పూజ్యులు. మీ పూజలలో పూజారినై తరించేట్లు నన్ను ఆఖరిసారిగా ఆశీర్వదించండి." అని వినిపించినవి.

ఆమె జీవితంలో ఎన్నడూ ఎరుగనంత అయోమయంలో పడిపోయింది. బాధకంటె ఆశ్చర్యంతో ఆందోళితురా లవుతున్నది. ఆ చెవిన విన్నది తాను హంతకురాలుగా, యీ చెవిన విన్నది తాను ధర్మదేవతగా నిర్ధారిస్తున్నవి. తాను ఎవరిని హత్యజేయమని పంపినట్లు చెబుతున్నారో, హత్యాకాండనుంచి పొరపాటుగా బ్రతికిపోయిన్న వ్యక్తి తనను దేవతగా పూజిస్తున్నాడు.

ఆ వాఙ్మాలమిస్తున్న అతని ముఖంలో ధూర్తత అనాగరికత పెనవేసుకున్నవి. ప్రక్కన నిలిచిన పోలీసు అధికారిలో వెఱ్ఱితనం ద్యోతితమవుతున్నది. వెనుక నిలిచిన వెల్దన్‌లో స్వార్థంతోగూడిన క్రూరత్వం చిందులాడుతున్నది. రెండోప్రక్క బెడ్‌మీదనున్న విజయ్‌ను జూస్తున్నపుడు సత్యము ప్రేమ అతని ముఖంలో మూర్తీభవించినట్లున్నవి. ఆమె అటే చూస్తునపుడు అక్కడున్నది విజయ్‌గాదు. అఖండ ప్రేమస్వరూపియైన యేసుప్రభువు. యదార్థరూపంలో యేసుప్రభువే యీ వేషధారణలో తన యింట ప్రవేశించి తన నిజాయితీని పసిగడుతున్నాడేమోననిపించినపుడు హృదయం కంపించింది. అతని పాదాలమీదబడి శరణువేడుకోవాలనిపించింది. అటువైపు అడుగువేయబోగా "సాక్ష్య

వాఙ్మూలాలు తీసుకోవటం అయిపోయింది. ఇక పదండి!" అంటూ పోలీసు ఆఫీసరు వారిని తిరిగి వ్యాన్‌లోకి తీసుకెళ్లాడు.

బ్రీజ్‌బెల్లా హతాశురాలై విజయ్‌వైపే చూస్తూ తన ఆత్మను అక్కడే విడిచి వెళ్ళిపోయింది. ఆమెనింతవరకు ఎవరూ ఏమీ అడుగనే లేదు. అడిగితే ఏమి చెప్పగలదో ఆమెకూ స్పష్టంగాతెలియదు. డ్రైవరు వాఙ్మూలంద్వారా మిగిలిన నేరస్థులిరువురుకూడా తెలుసుకోబడ్డారు. వారిరువురిని బంధించుటకే పోలీసువారు తమ పూర్తిశక్తి నుపయోగిస్తున్నారు. వారికొరకే కేసు విచారణ పెండింగులోవుంది.

బ్రీజ్‌బెల్లా, వెల్డన్‌లు వేరువేరు గదులలో బంధించబడ్డారు. అసంపూర్తిలో నగ్నంగా పట్టుబడిపోయిన భీతితో బ్రీజ్‌బెల్లావైపు చూడనైనా లేకపోతున్నాడు వెల్డన్. ఏది యేమయినా విజయ్ దివ్య వెలుగులాంటి వాడని, అతనికి కీడు తలపెట్టిన యీ వెల్డన్ కటిక చీకటినిబోలిన హీనుడని, తానుకూడా అతనితోపాటు దోషిగా నిలువవలసి వచ్చినందుకు చింతిస్తూ సిగ్గుతో కుమిలిపోతున్నది బ్రీజ్‌బెల్లా.

పారిపోయిన నేరస్థులిరువురికొరకు పోలీసువారు అనేకరీతుల గాలిస్తున్నారు. పేపరు ప్రకటనకూడా చేశారు. హత్యాప్రయత్నంలో వెల్డన్ పాత్రకంటె బ్రీజ్‌బెల్లాపాత్ర అనేకమంది నాకర్షించింది. వారిని గురించిన యింకాయింకా వివరాలుగూడా పత్రికలవారిద్వారా కోరబడినవి. అనేకమంది విలేఖరులు పోలీసువారిచుట్టూ గోల్డ్సువర్తుచుట్టూ తిరుగుతున్నారు.

బ్రీజ్‌బెల్లాకు, విజయ్‌కు రెండుసంవత్సరాలున్న ఘనిష్ట సంబంధము, ఆ తరువాత ప్రవేశించిన నూతన పాత్రధారియైన వెల్డన్ వలలో పడిన బ్రీజ్‌బెల్లా, తన మొదటి విటుని శాశ్వతంగా దూరంచేయగోరి హత్యకు పాల్పడిందని, వివరంగా ప్రకటించుటతోపాటు గోల్డ్సువర్తు ద్వారా పొందిన ఆమె జీవిత సంబంధ వివరాలుకూడా పేపర్లో వెల్లడయినవి. ఆమె తండ్రిపేరు, ఎక్కడెక్కడ చదివినది మొదలగు వివరాలన్నీ సవివరంగా ప్రకటింపబడినవి.

ఈ వార్తలు అనేకమందిని ఆకర్షించినవి. ఇలాంటివి అనేకం జరుగుతూనే వుంటవి. కాని యిందాక అన్యదేశీయు డున్నందున, అతని నెందుకు అంతం చేయలేకపోయారా, అని యువకులనేకుల ఆలోచనలు.

గోల్డ్సువర్తు జైలులో నున్న బ్రీజ్‌బెల్లాను గలిసినపుడు వూహించినదానికి ప్రతిగా జరిగింది. దుఃఖంతో పెడబొబ్బలుపెట్టలేదు. విలాపాలతో ప్రార్థించనూలేదు. నమస్కారాల అనంతరం కోరలుతేలిన గంభీరతతో నిలిచిపోయింది. "ఈ జరిగిన కాండకు నేను చాలా దుఃఖపడుతున్నాను" అని గోల్డ్సువర్తు వినిపించినపుడు ఆమె శుష్కనవ్వును ప్రదర్శిస్తూ "దుఃఖాలు రావటము పోవటము సహజము. ఇందు ఆశ్చర్యపడవలసిన అవుసరములేదు. కొలతకు కొలబద్దలు, తూనికకు రాళ్ళు హృదయ లోతుల అవగాహనకు దుఃఖాలు అనివార్యం" అని వూరుకున్నది.

"మీరు నిస్పృహ చెందకండి. మిమ్ము విడిపించను బాగా కృషి జేస్తున్నాను. పారిపోయిన యిరువురు దొరకగానే మిమ్ము జామీనుమీద విడుదల చేస్తారు." అన్నాడు.

"మీకు నిజంగా నామీద జాలి, దయ వున్నవంటారా?"

"ఈ విషయం నేను చెప్పకుండానే నీకు తెలుసు. నీయడల ప్రత్యేక శ్రద్ధాభిమానాలు యెల్లపుడు వుంటున్నవి." అన్నాడు.

"అయితే ఒక్కమాట వినండి. ఆ పరదేశీయుని రూపంలో సాక్షాత్ యేసుప్రభువే నా ఆదరంలో వున్నట్లు భావించి గర్వపడ్డాను. అతను లేని నేను జీవించుట దుస్సాధ్యము. నా జీవితాని కతను ముడివడిపోయాడు. అది దైవీకంగా జరిగిన నిర్ణయాలు. కాని యీ జరిగినవి, రాక్షసత్వంతోగూడిన విధ్వంసక చర్యలు. ఈ పాప కార్యానికి నేనే

వడిగట్టినట్లు యింకా ముందు వినేకంటె మరణించుట మహో త్తమమైన కార్యం. కనుక నేను యీ జైల్లోనే ప్రశాంత మరణం పొందగలిగేందుకు విషాన్ని ప్రసాదించి నాకు ముక్తిని కలిగించమని మిమ్ము ప్రార్థించుకుంటున్నాను." అంటూ శిరస్సును ఇనుప సువ్వలకు మోటించి విలపిస్తున్నది.

శరీరమంతటా సూదులతో పొడుస్తున్నట్లున్నది గోల్డ్సువర్తుకు. ఇందు తన దోషమెంత, అని తూచుకుంటున్నపుడు సర్వాంగాలు వణికిపోతున్నవి. వెల్డన్ మాటలు విశ్వసించి ప్రోత్సహించిన తనదే అసలు నేరమని అంతరాత్మ రెట్టిస్తున్నది. దొంగవలె ఆమె ముఖం చూడజాలక చల్లగా జారుకున్నాడు.



# 43. దుఃఖసమయాలు

సుఖదుఃఖాలు దాగుడుమూతలులాంటివి. అందరూ సుఖం వైపుకే పరుగులెడుతుంటారు. కాని దుఃఖమే యెక్కువగా లభ్యమవుతుంటుంది. బ్రీజ్‌బెల్లా తండ్రి బ్రిగిడియర్‌నూ తన దాంపత్యంలోజేరి బ్రీజ్‌బెల్లాను కూడా మర్చిపోయాక కొంతకాలం ఆనందంతో తుల తూగుతూ పయనించాడు. పదమూడు సంవత్సరాలు నూతన సుఖాల నిచ్చిన సతి అయిదవకాన్పు బాధతో భర్తను దుఃఖసాగరంలో ముంచి వెళ్ళిపోయింది. తల్లి మృతికి హేతువైన పసిబిడ్డకూడా అప్పటికప్పుడే క్షీణించుట జరిగింది.

ఈ దుస్సంఘటన బాధలో వోప్రక్క కుమిలిపోతుంటే అతనం తకుముందు ప్రారంభించిన వ్యాపారం కలిసివచ్చి ఒక్కమాటున రెండు లక్షల పౌనుల లాభం చేకూరినవార్త వినినపుడు, అదికూడా అతనికి దుఃఖవార్తగానే తోచింది. "ఆమె వుంటే యెంతో ఆనందించేవి. ఆమె లేనియీ లాభాలెందుకు, ధనమెందుకు?" అనే ఆలోచనలలో చింతే పెరిగింది.

భార్య మరణించి సంవత్సరం గడిచింది. పెద్దపిల్లలిరువురు హాస్టలులోవుండి చదువుకుంటున్నారు. మిగిలిన యిరువురిపిల్లలమధ్య వుంటూ బ్రిగేడియర్ అలవాటుపడిపోయాడు. ఉద్యోగం పూర్తిగా వదిలి వేశాడు. శ్రమలేకుండా, చిక్కులులేకుండా పదిమంది గుమాస్తాలద్వారా సాగించే వ్యాపారంలో అపరిమితలాభాలు చేకూరుతున్నవి. ఆ లాభాల గురించి ఆలోచించినపుడల్లా మరణించిన సతీమణి స్మృతులతో బాధ పడుతుంటాడు.

అపరాహ్నసమయం యేమరపాటుగా నౌఖరు కనుమోడ్చి నపుడు డాబా కటకటాలమీద యెక్కి కూర్చున్న హెన్రీని దించాలని కవుగలించబోయిన లిబో వెలుపలివైపుకు తూలిపోయింది. ఇరువురూ మూడో అంతస్థునుంచి క్రిందికి పడిపోయారు.

పొందిన నష్టంద్వారా కలిగిన కష్టంతో అలవాటు మెల్లి మెల్లిగా అవుతున్న బ్రిగేడియర్‌ను యీ దృశ్యం సమూలంగా వూపివేసింది. ఒక్కమాటు యిద్దరు కన్నబిడ్డలు ఘోరమృత్యువుకు గురియయ్యారు. పాపపుణ్యాలు తెలియని పసిపాపలు కేవుకేవుమని ఘోషిస్తూ మరణించారు. రాతిమీదపడి పప్పుపప్పుగా పగిలిన గాజువలె ఆవేళ శరీరాలు సిమెంటురోడ్డుమీదపడి చితికి చెల్లాచెదరై అవయవాల రూపురేఖలు లేకుండా పోయినవి. గూటిలోనుంచి పడిపోయిన గ్రుడ్డువలె అంతా చిమ్మించి తేగుడుగా రూపొందింది. పగిలిపోయిన మట్టిబొమ్మ ముక్కలను చేతబట్టినట్లు ఆ రుధిరకండరాలను చేతబట్టి బ్రిగేడియర్ హృదయానికి హత్తుకుంటూ విలపిస్తున్నాడు. ఆ రుధిరమడుగులోనే కూలబడి "నా హెన్రీ" అని శిరస్సు మోదుకుంటున్నాడు.

రోజులు దొర్లినవి. దుఃఖం సన్నగిలింది. గతించిన యిరువురి బిడ్డలవి, తల్లిది, మూడుఫొటోలు గొప్పగా పంచరంగులలో యెన్లార్జి చేయించి హాలులో కట్టబడినవి. హాస్టలునుంచి వచ్చిన బిడ్డలమధ్య కూర్చుని ఆ ఫొటోలనుచూస్తూ వూరటను పొందుతున్నాడు. ఆఫీసుమానేజరు నెమ్మదిగా విశదపర్చినమీదట పిల్లల చదువు చెడిపోతుందని తిరిగి పంపివేయటానికి యెంతో కష్టంతో యిష్టపడ్డాడు.

తగిలినచోటే యెదురుదెబ్బ తగలటము, కీడువెంటనే కీడు వచ్చి కంటతడి ఆరకుండా దుఃఖింపజేయటముకూడా పరిపాటి. తిరిగి హాస్టలుకు వెళ్ళిన బ్రిగేడియర్‌పుత్రు లిరువురిలో పెద్దవాడు రెండునెలలతరువాత వెళ్ళిన ఒక విద్యార్థుల వినోదయాత్రలో కనిపించకుండాపోయాడు. 15 సంవత్సరాల యువకుడు. తెలియక మారుపడను వీలులేదు. పారిపోవలసిన అవసరం లేదు. దుర్ఘటనారూపంగా కీడు సంభవించుటకా అవకాశం లేదు. హాస్టలువారు యెంతపరిశోధనలు జరిపినా ప్రయోజనం లేకపోయింది. పేపర్లలో యెన్నోవిధాల ప్రకటనలు చేశారు. ఫోటోలు వేయించారు. ఆచూకీ తెలిపినవారికి బహుమతులిస్తామని పెద్ద పెద్దగా ప్రకటించారుగాని నిష్ఫలమయింది.

బ్రిగేడియర్ కిదొక పిడుగువార్త. అన్నివైపులనుంచి హతాశు

డైనాడు. తనమీద తనకే ధైర్యంపోయింది. ఎవరిముఖం చూడాలన్నా భయమేస్తున్నది. శయ్యమీదనుంచి యెటూ కదలబుద్ధి పుట్టుటలేదు.

ఎప్పటికప్పుడు వుండివుండి లేనిభయాలు కలుగుతున్నవి. వెంటనే తనంతట తానే పయనమైవెళ్ళి హాస్టలునుంచి ద్వితీయపుత్రుని తనతో తీసుకొచ్చుకున్నాడు. తనకు యేకైక పుత్రుడుగా నిలిచిన ఆల్బర్టును క్షణంపాటుకూడా విడువకుండా తన దృష్టినంతా అతని మీదనే కేంద్రీకరించి మిగిలిన యావత్తునూ మర్చిపోను ప్రయత్నిస్తున్నాడు.

ఈ దుఃఖపురోజుల్లోనే ఆయనకు వ్యాపారంలో అనేకలాభాలు వచ్చిపడినవి. ఆ లాభాలే తనవంశానికి అనర్థాలు కలిగిస్తున్నవేమోనన్న భయంతో వ్యాపారాన్ని బందుజేశాడు. వున్నధనాన్ని నాలుగుబ్యాంకుల్లోను సర్ది దాచాడు. అది పదితరాలవరకు ఖర్చుపెట్టినా తరగని ధనం. క్రొత్తగా నిర్మించాలనుకున్న భవననిర్మాణ ఆలోచనకూడా యెల్లప్పటికీ ఆగిపోయింది. ఒకవిధంగా బ్రిగేడియర్‌కు వైరాగ్యపు ఆలోచనలు ప్రబలుతున్నవి.

ఆల్బర్టుమంచిచెబ్బరల జూచు విషయంలోనే అత్యధికశ్రద్ధ దీసుకుంటూ తనను, తనదుఃఖాలనుకూడా మర్చిపోతున్నాడు బ్రిగేడియర్.

తాటాకుకట్టలు తెగినపుడు అట్టఅడుగు నీరుకూడా పారిపోవుట సహజము. అదేరీతి నష్టాలు, కష్టాలు ప్రారంభించినపుడు ముప్పేరగా నలువైపులా ముట్టడించి హతమార్చుట ప్రకృతి వైచిత్ర్యం. సుఖాలను కల్పించినపుడు సర్వవైపులా కల్పించుట, కష్టాలను కల్పించినపుడు మోయరానంతగా కల్పించుట దేవదేవునికి యిష్టమైన కార్యము. ప్రక్క శయ్యమీద పవళిస్తున్న ఆల్బర్టు కెవ్వున కేకలుబెట్టాడు. తండ్రి, నౌకర్లు యెంతపట్టుకు సరిజేస్తున్నా మెలికలు తిరిగిపోతూ "నాన్నా, నాన్నా" అని అదిరిపోవురీతిలో కేకలుపెడుతూనే వున్నాడు. ఎందరో డాక్టర్లు అప్పటికప్పుడే పిలువబడ్డారు, కాని ఎవరివల్లా అదుపు కాలేదు. ఏ విధానంవల్లా శాంతించలేదు. "నాన్నా" అని పదేపదే పెద్దగా ఆరాటంలో అంటున్న ఆ పిలుపులతో యేడ్పుకూడా మిళితమైంది.

గొప్పగొప్ప డాక్టర్లకుకూడా అర్థంగాకుండా, ఆ రూపంగా హైరాన పడుతూ అందరనూ అల్లకల్లోలపరుస్తూ మూడురోజులు అందరను దుఃఖసాగరంలో ముంచి ఆ కేకలతోనే అంతమయ్యాడు. ఆ జబ్బేమిటో యెవరికీ తెలియలేదు.

తనహృదయ ప్రాంగణంలో యేకజ్యోతిగా నిలిచిన ఆ బిడ్డకూడా పోవుట బ్రిగేడియర్‌కు భరింపగలదుఃఖం గాదు. భరింపరాని దుఃఖం సంభవించినపుడు ప్రతిఒక్కరు ఆ క్షణంలో ఆత్మహత్యకని కేకలుపెడ తారు. ఈలోకంతో యిక పనిలేదని సన్యసిస్తామని వినిపిస్తారు. వైరాగ్యపుదుఃఖాన్ని మరీమరీ వినిపిస్తారు. దుఃఖపురోదనలలో పరలోక యాత్రకు వీడ్కోలులను ప్రార్థిస్తూ విలపిస్తారు. కాని అలాంటివా రెన్నడూ అలా వెళ్ళినట్లూ లేదు. సమయవడిలో సర్దుమణిగి అన్ని ఆశలతోను ముందడుగు యథాతథంగా వేస్తూనే వుంటారు.

బ్రిగేడియర్ జీవిస్తాడని తిరిగి జనంలో కలుస్తాడని అనుకోలేదు. నెలరోజులు శయ్య విడువలేదు. బలవంతంతో ప్రాణాన్ని నిలుపుకోను తిన్నా, తిన్నది జీర్ణంకాక వాంతులతో యాతనపడ్డాడు.

"పోయినవారు పోగా వారి కొరకని వగచి నీవు పొందగలిగేది మాత్రం యేమిటి? దుఃఖంతో వున్న ఆరోగ్యాన్ని కోల్పోతే ఆ తరువాత కలిగే కష్టం అనంతమైందనికూడా అర్థం చేసుకో!" అని కొందరు నిని పించారు.

"పుట్టుకవలెనే చావుకూడా పరమసత్యమైంది. జన్మించాక పొందేదానికంటె మరణంతరువాత పొందేదే మహోన్నతమైందేమో యెవరికి తెలుసు. ఈ లోకంనుంచి పోయినవారు అతీతులు, అదృష్టవం తులు. వారినిగురించి దుఃఖించుట అవివేకము" అని మరికొందరన్నారు.

కాని వినిపించేమాటలు అతనిచెవులకో దూరుటలేదు. "నాన్నా, నాన్నా" అని ఘోషించిన ఆ బిడ్డధ్వనులే వినిపిస్తున్నవి. పోనుపోను ఆ ధ్వనులు అలవాటయిపోయినవి. వినికిడి అనుభవంతోనే ఆనందం కలుగుతున్నది. ఆ ధ్వని మధురరూపమై మరీమరీ వినాలనిపిస్తున్నది.

# 44. అన్వేషణ

ఇది యెక్కడి తన అపరాధానికో దైవమిచ్చిన శాపమని, యే వైపునుంచో ధ్వనిస్తున్నది. ఆ ధ్వనితో వ్యాకులపడిపోతున్నాడు. నిరపరాధి. సత్యశీలియైన తన ప్రధమసతికి తానుచేసిన ద్రోహం శిరస్సు మీద భారంగా పెరుగుతున్నది. తనబిడ్డ బ్రీజ్‌బెల్లాను అనాధనుగాజేసి అధోగతికి దార్లించిన తన కిరాతకం భయంకరపిశాచకంగా తనముందే నిలిచి భయపెడుతున్నట్లు వణికిపోతున్నాడు. "నాన్నా, నాన్నా" అన్న ఆర్తనాదం బ్రీజ్‌బెల్లాదిగా తోచి హృదయం దడదడలాడిపోతున్నది. ఆనాటి ఆ బ్రీజ్‌బెల్లా లేతకంఠముధ్వనే "నాన్నా, నాన్నా" అని మరీమరీ వినిపించి స్తబ్దుడైపోతున్నాడు.

పశ్చాత్తాపంతో నలిగి నలిగిన మనస్సు, యిపుడు బ్రీజ్‌బెల్లా కొరకు పరితపిస్తున్నది. చిరునవ్వులు చిందిస్తూ పాలబుగ్గల మెరపులతో పసిడి పువ్వువలె వుండే ఆమెముఖం కనులముందు కనిపిస్తున్నట్లున్నది. ఆమె పసిపాదాలను ముద్దిడుకుని అశ్రువులతో అభిషేకం చేస్తూ "నన్ను క్షమించుతల్లీ! మూర్ఖుడనై తెలియక నీయెడల చేసిన అన్యాయానికి తగిన ప్రాయశ్చిత్తాన్ని పొందాను" అని వినిపించుకోవాలని ఆత్మ ఘోషిస్తున్నది.

అనంతదుఃఖంద్వారా మనస్సులో కుతంత్రాలు, కూటనీతులు, వక్రబుద్ధులే గాకుండా తెలివిలోని కొంతభాగంకూడా అదృశ్యమవుతుంది. పొందరానిదుఃఖాన్ని పొందినవాడు యెంతటివాడైనా అమాయకుడై పోతాడు. పాపం బ్రిగేడియర్‌కు గడిచిపోయిన దీర్ఘకాలం గమనార్హంలో లేక, యిపుడుకూడా బ్రీజ్‌బెల్లా పసిదే అయినట్లు, ఆ పసితనంలోని బ్రీజ్‌బెల్లా వూహాప్రతిమతోనే సంభాషించుకుంటున్నాడు.

ఆమెను దూరంచేసుకున్నాక జరిగిన దీర్ఘకాలాన్ని, ఆ కాలంలో పొందినవాటిని, పోగొట్టుకున్నవాటిని విస్మరించి, కలలోజరిగింది కల

గానే మర్చిపోయి నేడు ఆమెకొరకు పరితపిస్తున్నాడు. శరీరంలోని సర్వకణాలు అనాధనుగా విడచినబిడ్డ బ్రీజ్‌బెల్లాకొరకు ఘోషిస్తున్నవి.

ఈ విషయం తెలిసిన యింటిలోని పాతనౌకర్లు ఆనందపడుతున్నారు. న్యాయంవైపు, దీనంవైపు మానవమనస్సు మొగ్గుతుంది. ఆనాడు బ్రీజ్‌బెల్లాకు, ఆమెతల్లికి జరిగిన అన్యాయానికి జాలితో చింతించిన నౌకర్లకు నేడు తిరిగి బ్రిగేడియర్‌యడల సానుభూతి కలిగింది. ఆ విషయంలో ఉత్సాహపరుస్తున్నారు.

"కాలంతీరి యీ లోకంనుంచే వెళ్ళిపోయినవారినిగురించి బాధ చెందుట వ్యర్ధము. వున్నవారిని పొందే వుపాయాన్ని ఆలోచించుట మంచిది" అని సలహాలతో ఆయన్ను ఆ వైపుకే స్నిగ్ధునిచేశారు.

గర్భశోకితుడైన బ్రిగేడియర్ ధనాన్ని జలముగా ధారబోస్తూ బ్రీజ్‌బెల్లాకొరకు పరిశోధనలు ప్రారంభించాడు. ఒకనాడు అనాధనుగా హాస్టలులో విడిచిన బ్రీజ్‌బెల్లాకొరకు నేడు పరిశోధనలలో పారబోస్తున్న ధనాన్నిజూచి నౌకర్లే విస్తుపోతున్నారు. "నాకీ పాపిష్టిధనం వద్దు. నా ముద్దులబిడ్డ నాకు దొరికితే కష్టించియైనా సుఖపెట్టుకుంటాను" అంటూ కన్నీరు కారుస్తాడు.

బ్రిగేడియర్‌లోని వుత్తేజం, వుద్రిక్తత, పరవళ్ళు హరించినవి. శాంతిమూర్తియై బిడ్డ అన్వేషణలో అన్నియేర్పాట్లు చేసి, చర్చిలోనే ప్రార్ధనలలో సమయవిచక్షణలు లేకుండా వుండిపోతున్నాడు. చర్చితలుపులు మూయబడినపుడు ద్వారసోపానాలమీదనే కూలబడి వుంటున్నాడు. మూసివున్న ద్వారాలవైపు మోకరిల్లి రుద్ధకంఠంతో "ప్రభూ! నిన్ను కోరకుండానే కావలసినవన్నీ కల్పించావు. సుఖలోలత్వంలో పధవిహీనుణ్ణయి సర్వాన్ని కోల్పోయి రిక్తహస్తాలతో నీముందు మోకరిల్లి ప్రార్ధించుకుంటున్నాను. నా అనాధబిడ్డను నాకు ప్రసాదించి నన్ను కరుణించు ప్రభూ! నిన్ను కోరదగ్గవేవీ లేవు. నిలిచివున్న నిధి నా బ్రీజ్ బెల్లాయే. నా నిధిని నాకు దయచేయు ప్రభూ!" అంటూ అవే మంత్రాలయినట్లు జపిస్తుంటాడు.

దుఃఖానుభవంలోనే వివేకము, జ్ఞానము లుదయిస్తవి. వున్నవాటిని పోగొట్టుకున్నపుడే వాటివిలువలు తెలుస్తవి. పోగొట్టుకున్న

వాటి విలాపంలో హృదయం దహించుకుపోతుంది. వయస్సు వంగిపో తుంది, దీనత్వం ఆవేశిస్తుంది. బ్రీజ్‌బెల్లాఅన్వేషణలో గడిచిన సంవత్స రంలోనే పదిసంవత్సరాలు గడిచిపోయినట్లు అన్నివైపులనుంచి జీవితం సన్నగిలింది.

ఫ్రాన్సులోని ఒక హాస్టలులోవుంటూ బ్రీజ్‌బెల్లా పది సంవత్స రాలు చదివినట్లు, అక్కడే కొంతకాలం వుద్యోగంకూడా చేసినట్లు వివ రాలు తెలిసినపుడు బ్రిగేడియర్ ఉత్సాహంతో వూగిపోయాడు. ఆగ మేఘాలలో అక్కడికే పయనించాడు.

హాస్టలులోనివారు ఆమె గుణగణాలను, నిరాడంబరతను సాధు త్వాన్ని గణనీయంగా ప్రశంసించినపుడు ఆయన కన్నీరు కారుస్తూనే వున్నాడు. ప్రేమమూర్తియని, శాంతిదేవతయని, సుగుణసంపన్నియని యేకకంఠంతో అందరూ వినిపించినపుడు పొర్లుతున్నదుఃఖంతో "కను కనే దూరంచేసుకుని దుఃఖజీవితంలో మునిగిపోయాను" అని మనస్సా అనుకున్నాడు.

"అన్నివైపుల మమ్మ ఆకర్షించిన అద్భుతమైన అమ్మాయి బ్రీజ్‌బెల్లా. అంత అందాలను చిందించే సుందర సుకుమార శరీరి, యింత బీద అనాధగా యెందుకయిందా అని, అందరము బాధపడు తుండేవారము. తనలేమిని కప్పిపుచ్చుకోనుగాబోలు నిరాడంబరత్వంతో ఆదర్శాన్ని సృష్టించుకుని అందరను ఆకర్షించింది. ఒకరోజు అకస్మా త్తుగా యెక్కడికో స్వయంగా వెళ్ళిపోయింది. ఈనాటికీ మా కనుల ముందు కనిపిస్తూనేవుంటుంది" అని ఉపాధ్యాయినులు చెప్పినపుడు బ్రిగే డియర్ దుఃఖభారాన్ని ఆపలేక ముఖానికి చేతు లడ్డగించి కుములుతూ కూలబడిపోయాడు.

అందరూ గుమిగూడి ముఖంమీద నీళ్ళు చల్లారు. ఆయన బ్రీజ్ బెల్లాతండ్రి యని, కోటీశ్వరుడని, నౌకరుద్వారా విన్నారు. ఒకరికిమించి ఒకరు ఆశ్చర్యపోతూ పరస్పరప్రశ్నలు వేసుకుంటున్నారు.

బ్రిగేడియర్ పావుగంటతరువాత నేత్రాలు తెరిచి ఖిన్నుడవుతూ సరిదిద్దుకున్నాడు. బరువుకంఠంతో "నా చేతులార నా తల్లిని నేను దీను

రాలను చేసిన నెపంతో నేడు నేనూ దీనుణ్ణయిపోయాను. దిక్కులేని వాడినై పోయాను" అంటూ వాపోయాడు.

అక్కడ తనబిడ్డవున్న అనేక గ్రూపుఫొటోలను కోరి తీసుకున్నాడు. ఆ ఫొటోలోని తనబిడ్డనుచూసి అంత దుఃఖంలోకూడా ఆశ్చర్యపోయాడు, ఆనందపడ్డాడు. అంతగా యెదిగి రూపమే మారిపోయిందని నూతనవూహలను, నూతనోత్సాహాన్ని పొందుతున్నాడు. ఆ ఫొటోలోనిప్రతిమను చూస్తుంటే విద్యుత్ మెరుపులవలె అనేక ఆలోచనలు పరువులెడుతున్నవి. దైవకృపతో ఆమె దొరికితే, అల్లారు ముద్దుగా ఆదరించి, కోరినవరుని తెచ్చి, వివాహం జరిపి, వారి శృంగార జీవితప్రవంతిలో చిలువరించే చిన్నారిపాపాయిలతో ఆడుకుంటూ హాయిగా జీవితాన్ని గడిపివేయవచ్చు, అని వూహలు వూరుతున్నవి.

మరొకరిని వివాహమాడి సంతానంమధ్య వుంటున్న బ్రీజ్‌బెల్లా తల్లి వివరాలుకూడా తెలుసుకున్నాడు. కాని స్వయంగా వెళ్ళలేక ఫోను ద్వారా అనేకమారులు సంభాషణలు జరిపాడు. ఒకరికిమించి ఒకరు అనేకవిధాల దుఃఖించుకున్నారు. వారిరువురి ప్రతిబింబమైన బ్రీజ్‌బెల్లాను గురించి మరింత వాపోయారు. ఆమె తన అసమర్థతనుకూడా వివరించి యిద్దరిమధ్య యెందుకూ గాకుండా బిడ్డకు అన్యాయమయినందుకు వగచింది.

బ్రిగెడియర్ పారిస్‌లోని విద్యాసంస్థ లన్నిటిని అనేకవిధాల విచారించి విఫలుడయ్యాడు. అంతా నిరాశగా గనిపించింది. అయినా ఆ విషయ పరిశోధనలలో మునిగినపుడే ఆనందము, ఆదుర్దాలు కలుగుతున్నవి గనుక రెండుకారులు తిరుగుతూనే వున్నవి. తానూ ప్రత్యేక కారులో తిరుగుతున్నాడు, కాలం గడుస్తున్నకొంది నిస్పృహ వెంటాడుతున్నా, నిరాశతో తిరిగి వెళ్ళుటకంటె వెదుకుతూనే జీవితాన్ని అంతం చేసుకోవటం మంచిదని నిర్ణయించుకున్నాడు.

అయిదంతస్తులుగల గొప్ప మహల్‌ను ఆకస్మికంగా కొనివేశాడు. బేరమాడకుండా వారు చెప్పినంత ధనం బోసి కొన్నపుడు, అమ్మినవారు కూడా ఆశ్చర్యపోయారు. తన శ్రద్ధను ఆ మహల్‌మీద కేంద్రీకరించి అనేక మెరుగులు దిద్దించి "బ్రీజ్‌పాలెస్" అని సువర్ణాక్షరాలతో చెక్కిం

చాడు, గార్డెన్‌కుకూడా నూతన రూపమిచ్చాడు. ఉన్నతస్థాయిలో పంచ రంగులలో యెన్లార్జిచేసిన బ్రీజ్‌బెల్లా ఫొటోను ప్రతిహాలులోను అమర్పించాడు. మెయిన్‌హాలులో గోల్డుఫ్రేముతో బిగించిన రెండు నిలువుల ఫొటోను అమర్చారు. నీడలు దేలుతున్న ఆ యింటిగోడలనున్న ఫొటోలను చూస్తూ కొన్ని సమయాలందు గంటలు నిమిషాలుగా గడిపేస్తుంటాడు బ్రిగేడియర్.

"ఒక అభాగ్యుడైన పరదేశీయుని ఖూనీచేయుటకు స్త్రీ సాహసించిన విఫలయత్నం" అన్న శీర్షికక్రింద అనేక వివరాలతో అన్ని పేపర్లలోను ప్రచురితమైంది. రెండోరోజుకూడా ఆ శీర్షికక్రిందనే మరికొన్ని వివరాలు ఒకటి రెండు పేపర్లలో పడినవి. చదివిన రసికులనేకులు ఆ విషయంమీద దీర్ఘచర్చలుకూడా జరుపుకుంటున్నారు. అనుకోని రీతిగా, విశ్రాంతిలో పూసుబోనివాని వలె ఆ ఖూనీ శీర్షికనే చదువ ప్రారంభించిన బ్రిగేడియర్ పఠన మధ్యలో బ్రీజ్‌బెల్లా పేరుగని తబ్బిబ్బైపోయాడు. ఆ పేరునే, నేత్రాలు పెద్దవిచేసి చూసి చూసి క్షణంపాటు ఆగిపోయాడు. పెల్లుబుకుతున్న ఆనందంతో తిరిగి చదువ ప్రారంభించాడు, ముందుకు పోతున్నకొంది మరింత ధృఢమైపోతున్నది. వుత్సాహంలో ఆగలేక నిలిచి ఆత్రతతో చదివివేశాడు. అందు ఆమె జీవిత వివరాలుకూడా వున్నవి. తండ్రిగా తనపేరూ వున్నది. ఆమె యే హాస్టలులో చదివింది, యెక్కడెక్కడ వుద్యోగం చేసింది, ప్రస్తుతం బొమ్మల కార్ఖానాలో క్యాషియర్‌గా వున్నది, జన్మ తేది వగైరాలన్నీ వివరంగా వ్రాసివున్నవి. ఆకార్ఖానా కామందు యెంతో ఆదరంతో చూస్తున్నట్లు, ఆ అవకాశాలను కామాంధకారము దుర్వినియోగం చేసుకున్నట్లు, ఒక పరదేశీయుడైన అనామక అనాగరికుని వలలోపడి, గుప్తస్థానంలో నివాస యేర్పాటుతో, కొంతకాలం అతనితో కాపురం నడిపి, ఆతరువాత వెల్డన్ అనేవానితో నేస్తం కుదిరి అతని సహకారంతో ఆ పరదేశీయుని వదిలించుకొను ఖూనీచేయ ప్రయత్నించినట్లు, కాని అతను క్షతగాత్రుడై బ్రతికి బయటపడినట్లు నేరస్తు లందరు పోలీసువారి హస్తగతమైనట్లు ప్రకటింపబడివుంది.

బిడ్డ సజీవురాలుగా వున్నట్లు జాడదెలిసినందుకు మహానంద భరి

తుడైపోతున్నాడు. కాని ఒక జారిణిగాను, హంతకురాలుగాను పోలీసు వారి ఖైదులో వున్నట్లు తెలుసుకోవలసి వస్తున్నందుకు కించపడు తున్నాడు.

దీర్ఘ వేడినిట్టూర్పును విడుస్తూ గోడమీద వంగగట్టిన ఆమె నిలువు ఫొటోవైపు వోమాటు చూశాడు. ఆ ప్రతిమలోని కోమలత్వం, నిరాడంబరంతో గూడిన ఆదర్శత, సౌజన్యత ద్యోతిత మవుతున్నవి. స్థూలదృష్టికి ఆమె కర్మిష్టిగా, నిష్కామిగా కనిపిస్తున్నది. హాస్టలులోని ప్రశంసలు వీనుల కినిపిస్తున్నవి. పరువులమీదవెళ్ళి ఆమెను పసిపాపను వలె యెత్తుకు ముద్దాడాలనిపిస్తున్నది. ఆ ముందుకు ఆలోచిస్తున్నపుడు పేపరులోని హీనమైన విషయాలు వృశ్చికమాలగా గనిపిస్తున్నది. మోహ బంధాలలో పురుషుని బంధించి హరింపజేసి ఆవలకు నెడుతూ మరోవైపుపరువెట్టు నీచమైన వేశ్యాప్రవృత్తులుగా మనస్సులో మెదిలి శరీరం గగుర్పాటు చెందుతున్నది. ఆర్థిక దుర్బలత్వం యెంతటిదయినా కష్టించి జీవించవచ్చు. బాధలు యెంతటివైనా ధైర్యంతో విధిపై పోరాటం సలుపుతూ నీతిని నిలుపుకోవచ్చు. కాని తన బిడ్డ ఒక అనామక పరదేశీయుని పాలిట యెందుకు పడింది! మరొకనివెంట అంటుపెందుకు, హీనమైన ఖూనీకి పూనటమెందుకు! ఎంత నీచం! అంటూ వేడెక్కి పోతున్నాడు.

"ఇచ్చేవాడివి యిస్తూ ముళ్ళతోనో, మురుగుతోనో, ముప్పుతోనో యిచ్చి పరీక్షించజూచుటెందులకు ప్రభూ! పతితగా, హంతకురాలుగా లోకంముందు రోతగా జూపి నా కర్పింప దలచావా తండ్రీ!" అంటూ వాపోతూ పేపరును నిర్లక్ష్యంగా మడతవేసి పట్టుకుంటూ యీజీఛైర్‌లో వాలిపోయడు. అతను మనస్సుకు మళ్ళీ కోర్టులు, శిక్షలు, పురిశిక్షలు జ్ఞప్తికివచ్చి హృదయం కంపించింది. పొందికూడా శాశ్వతంగా పోగొట్టు కోవటం సంభవిస్తుందేమోనని అంతరా వేదన తీవ్రమవుతున్నది.

బ్రీజ్‌బెల్లా యీ దుర్దశలో చేరి దుస్సాంగత్యాలతో చేసి కూర్చున్న యీ దుస్సంఘటనలకు తానే నిందించుకుంటూ తిరిగి పేపరులోని ఆ శీర్షికను పదేపదే చదువుకున్నాడు. ఏమి స్ఫురించిందో సరసర వెళ్ళి

ఫోను టేబులుమీదున్న టెలిఫోను గైడ్‌ను తీసి ఆ బొమ్మల కార్ఖానా నెంబరుకొరకుగాబోలు వెదికాడు.

నెంబరు దొరికింది. చాలా ఆనందమయింది, వెంటనే ఫోనుచేశాడు. ఆ కార్ఖానా కామందు గోల్డ్సువర్తు అని, ఆ కార్ఖానా ఎక్కడున్నదీ మొదలగు వివరాలన్నీ తెలుసుకున్నాడు. బ్రిగేడియర్ అరగంటలో అక్కడికి చేరిపోయాడు. బ్రీజ్‌బెల్లానుగురించి అనేకవిధాల అడుగుతూ అన్నివైపుల చూస్తూ చేస్తున్న పరిశోధనలను గమనించిన గోల్డ్సువర్తు హడలిపోతున్నాడు. వచ్చిన అతను పోలీసు సి. ఐ. డి. ఆఫీసరయి వుండవచ్చునని, తనకేదో మూడనున్నదని, తననుకూడా ముద్దాయిగా చేరుస్తారేమోనని భయకంపితుడైపోయాడు. కంఠం శుష్కత పొందుతున్నది. బ్రీజ్‌బెల్లాను గురించి యేమి అడిగినా అన్నిటికీ ఒకే సమాధానం చెబుతున్నాడు. ఆమె స్వభావ మెలాంటిది అన్న ప్రశ్నకుకూడా "నాకేమితెలుస్తుంది! కార్ఖానాలోమాత్రం సక్రమంగా. సవ్యంగా, వినయంగా, చురుకుగా వుంటుండేది" అని సమాధానమిచ్చాడు.

బ్రిగేడియర్ కంఠంలోని మిలిటరీ కమాండింగ్ ధ్వనులు యింకా సన్నగిలలేదు. అతని సాధారణ సంభాషణలలోని ధ్వనికూడా కొట్టవచ్చినట్లు గంభీరంగా వుంటుంది. "మీరు నాతో మా యింటిదాకా రావాలి." అని అడిగినపుడు గోల్డ్సువర్తు ఆవజీవాలు క్రుంగిపోతున్నవి. తననుకూడా జైలులో త్రోయటానికేనని అతని భయం. వణికిపోతున్న కంఠంతో "క్షమించండి. ప్రస్తుతం నేను కదిలితే కార్ఖానా పనులన్నీ విఘ్నమయిపోతవి." అన్నాడు.

"ఇది అంతకుమించి అవుసరమైన కార్యం గనుక రాకతప్పదు. దయచేసి పదండి, తిరిగి నేనే దిగడుస్తాను." అంటూ అతని భుజంమీద చేయివేసి తీసుకెళ్లాడు. గోల్డ్సువర్తు కారులో కూర్చున్నాడు, మానసిక కల్లోలంతో శరీరం చెమటలు గ్రమ్ముతున్నది. జైలుకు తీసుకెళుతున్నాడని, తనకు కారాగారవాసం తప్పదని ఖంగారుపడుతున్నాడు.

కారు ఒక గొప్ప మహల్‌ముందు ఆగింది. జైలేమోనని తొంగి చూశాడు. శృంగార రాజభవనమువలె నున్నది. "బ్రీజ్‌పాలెస్" అన్న సువర్ణాక్షరాలను చదివి చకితుడైనాడు. ఆ పేపలోని ఒకశబ్దం యీ

పేరులో వుండవచ్చు, అంతమాత్రాన ఆమెకేమి సంబంధం, అనుకుంటూ దిగి వింత వింతగా చూస్తున్నాడు. బ్రిగెడియర్ నవ్వుతో సన్నిహితాన్ని చేసుకుంటూ "ఇది మా యిల్లు. మా అతిధిగా మిమ్మ్ము తీసుకొచ్చాను. పదండి." అంటూ అతనిచేయిబట్టి లోపలకు తీసుకెళ్ళాడు.

లోపల హాలులో ప్రవేశించిన గోల్డ్సువర్తు, బ్రీజ్‌బెల్లా విశాల ఫొటోను చూసి విస్తుపోయాడు. బ్రిగెడియర్‌ను అనుసరిస్తూ మూడు గదులు దాటి లిఫ్టుమీద పై అంతస్తుకు వెళ్ళిపోయాడు. ప్రతి గదిలోను తీర్చిదిద్దిన ఆమె ఫొటోను ఎంతో శ్రద్ధగా అలంకరించిన విధానంచూసి స్వప్నలోకంలో తిరుగుతున్నట్లు కలవరపాటు చెందుతున్నాడు.

విశ్రాంతిగదిలో కూర్చుండబెట్టి బ్రిగెడియర్ తన యావత్తు గాథను వినిపించాడు. వినిపిస్తున్న మధ్యలో పొర్లుతున్న దుఃఖంతో కంఠం బరువెక్కి అక్కడక్కడా సరిదిద్దుతూ ఆపుకోవలసి వచ్చింది. అద్దుకుంటున్న కన్నీటితో జేబుగుడ్డ ముద్ద అయిపోయింది.

గోల్డ్సువర్తు ఆశ్చర్యానికి అంతులేదు. ఆమె యింతటి శ్రీమంతుల బిడ్డ అని కలలోకూడా అనుకోలేదు. తానామెను ఎంతో ఆదరంగాచూస్తూ వచ్చివచ్చి వెల్డన్‌ను ప్రవేశపెట్టి యీ అనర్థం కల్పించినందుకు వ్యధ చెందుతున్నాడు.

ఒక కథలోని అంతిమఅధ్యాయాన్ని ప్రారంభిస్తున్నట్లు "ఈ బిడ్డకొరకు యింత వాపోతున్న నాకు వున్నజాడ తెలిసి ధన్యుణ్ణ య్యాను. కాని చరిత్రహీనురాలుగా, హంతకురాలుగా...." అని చెప్ప బోతుండగా గోల్డ్సువర్తు యెక్కడలేని ధైర్యంతో ముందుకొచ్చి అతని నోటిమీద చేయివేసి అడ్డగిస్తూ "క్షమించు ఆ మాటలను వుపసంహరించు కోండి. ఆమె దేవతామూర్తి" అంటూ జరిగిన యదార్థాన్నంతటిని విశదపర్చాడు. పరదేశీయుని అనాథత్వానికి దయదలచి, ఆదరించి అత నికి విద్యాభ్యాసాన్ని ప్రసాదించిన దయామయి బ్రీజ్‌బెల్లాయని, వికృ తంగా ఆమెపై రాబడిన అభియోగంతో చింతిస్తూ ఆత్మహత్యకు ఆయత్తమై జైలులోనే తనను విషాన్ని తెచ్చిపెట్టమని ప్రార్థించిందని మొదలగు వివరాలు చెప్పినపుడు బ్రిగేడియర్ భయవిహ్వాలుడై పోయాడు.

వెంటనే యిరువురు బ్రీజ్‌బెల్లాను జైలులో కలుసుకున్నారు. తండ్రిని ఆమె గుర్తించలేదు. వారూ చెప్పలేదు. గోల్డ్సువర్తు తానుగా చేసిన పొరపాటును, గోల్డ్సువర్తు వెర్రితనాన్ని యదార్థరూపంలో చెబుతున్నపుడు బ్రీజ్‌బెల్లా అత్యుత్సాహంతో వింటున్నది. మధ్య మధ్య ఆముదోవ్యక్తి కన్నీరు కారుస్తున్నందుకు ఆమె ఆశ్చర్యపోతూన్నది. తన యడల అంత సానుభూతిని ఆకన్నీటిద్వారా చూపుతున్న లోతులను అర్థంచేసుకుంటూ సాంత్వన పొందుతున్నది.

ఏవిధమైన యేర్పాట్లు జరిగినవో మరునాటికి అందరూ విడుదల గాబడ్డారు, గోల్డ్సువర్తు బయటికొచ్చిన వెంటనే చెవులోయేదోగుసగుసలు చేశాడు. అతను బ్రీజ్‌బెల్లా ముఖం చూడటానికైనా సిగ్గిలిగాబోలు ముఖం చూపకుండా పక్కవైపుగా వెళ్ళిపోయాడు. బ్రీజ్‌బెల్లాధైర్యంజేసి పర దేశీయుని చూడాలన్న కోర్కెను గోల్డ్సువర్తుకు తెలియజేసింది.

"ఆయన హాస్పిటల్‌లో బాగానేవున్నాడు, చింతించవలసిన పని లేదు. నాపొరపాటుతో యివన్నీ జరిగినట్లు భావించి విచారపడుతున్నాను. నీవు నాబిడ్డలాంటిదానివి. చీకటి తరువాత వెన్నెల తధ్యమయినట్లు నీ కష్టాలు శాశ్వతంగా విడిపోయినవమ్మా! ఈపూట నామిత్రులయిన వీరి యింట ఆతిథ్యానికి మనయిరువురం వెళ్లవలసివుంది పద అమ్మా!" అన్నాడు గోల్డ్సువర్తు.

ఆయన మాటలకంటె ఆ అపరిచితవ్యక్తి దీనత్వము, కన్నీటినద్దుకుంటున్న దృశ్యము ఆకర్షిస్తున్నవి. ఒక్కమాటైనా అనకుండా సాక్షి భూతునివలె గోల్డ్సువర్తు ప్రక్కనుంటూ ఆయన బాధపడుతున్నవిధం చూసి ఆశ్చర్యపోతున్నది, ఆకర్షించబడుతున్నది. అంతటి సానుభూతిని తానిదివరకెన్నడూ అనుభవించలేదు. ఆ హాస్పిటల్‌కు వెళ్ళి ముందు విజయ్‌ను చూడాలనివుంది.కాని ఆ అపరిచితునిద్వారాపొందుతున్న సానుభూతిలో తనను తాను మర్చి వారిననుసరించిది.

గోల్డ్సువర్తు తనను యెల్లపుడూ ఆదరంతోను అభిమానంతోను గౌరవిస్తూనేవచ్చాడు. కాని నేటి ఆదరంలో అభిమానంలో విశిష్ట ఆత్మీయత గనిపిస్తున్నది. గంటముందు చీకటికొట్లో దిక్కుమాలిన దీనా

వస్తలోనున్న తాను యిపుడు పొందుతున్న ఆధిక్యతకు తనలోతానే తబ్బిబ్బవుతున్నది.

మహాలుముందు కారాగింది. గోల్డ్సువర్తుముందు ధిగి "రా అమ్మా రా." అన్నాడు. ఇంటి యజమాని గేటులోకెళ్ళి ఆహ్వానిస్తున్నాడు. "బ్రీజ్‌బెల్లా ప్యాలెస్" అన్న మహల్ పేరును చూస్తూ తనపేరులోని శబ్దాన్నే మహల్‌పేరు పెట్టుకుని వుండవచ్చుని, తను పుట్టకముందే యీ మహల్, యీ పేరు నిర్మాణయేర్పాట్లు జరిగివుండవచ్చునని అనుకుంటూ గోల్డ్సువర్తువెంట వెళ్ళింది.

మెయిన్‌హాల్లో గొప్ప విలువైన సోఫాలున్నవి. "కూర్చోండి." అంటూ సోఫాలుచూపి యింటియజమాని వెళ్ళిపోయాడు. ఎదురుగా వున్న గోడమీద సగంగోడ నాక్రమించినట్లున్న ఆ ఫొటోవైపే చూస్తున్నది బ్రీజ్‌బెల్లా. ఆమె నామే విశ్వసించలేక పోతున్నది. ఏమీ యెరుగనివానివలె గోల్డ్సువర్తు "పదండి ఇల్లంతాచూచురుగాని." అంటూ ఆహ్వానించాడు. ఒక్కొక్క గదిలోనుంచి దారితీస్తూ పోతున్నాడు. అన్నిగదులలోను గనిపిస్తున్న ఆ ఫొటోనుచూస్తూ విభ్రాంతి చెందుతూ స్వప్నావస్తలో నున్నట్లు భ్రమపడి పోతున్నది. మాయా మాంత్రిక మహాలులో ప్రవేశించినట్లు భీతిజెందుతున్నది. ఆమెగుండె దడ దడ లాడుతున్నది. ఇకముందు ఒక్క అడుగువేయలేక అక్కడే ఆగిపోయింది.

భవనంపేరు తన పేరే! లోపల అంతటా తన ఫొటోలే! ఎంత ఆశ్చర్యం! వూహకు అందని విచిత్రమిది. "ఎవరిదీ యిల్లు?" అని ప్రశ్నించింది.

"ఈ యిల్లు మనలను ఆహ్వానించినవారిదే నమ్మా." అన్నాడు. వెతుక్కుంటూ యింటియజమాని వచ్చి "రా అమ్మా, రా. భోంచేశాక మాటాడుకుందాము" అని పిలిచాడు.

గోల్డ్సువర్తువైపు తిరిగి "ఒక్కమాట విందురుగాని రండి." అంటూ తిరిగి మొదట హాలువైపు వెళ్ళి "వారెవరైనాగానీండి మంచి వారే, కాని నాకు భయంగావుంది. ఇక్కడ నాకు భయంగా వుంది వెంటనే వెళ్ళిపోదాం పదండి." అన్నది.

"భయమెందుకమ్మా, వారిని అగౌరవపర్చినట్లుగాదూ" అంటుండగా బ్రిగెడియర్ వచ్చి విన్నాడు. నిబ్బరించుకోలేక "నీ పాపిష్టి తండ్రిని యింకా గుర్తించలేదా అమ్మా" అంటూ అమాంతం ఆమెను కవుగిట బంధించి పైకి యెత్తి నుదుటమీద చుంబించి కన్నీరు కారుస్తున్నాడు.

"నామీద యిప్పటికి దయ వచ్చిందా నాన్నా" అంటూ అతుక్కుపోయింది.

తండ్రిగాధ విన్నపుడు అతని వక్షస్సుమీద శిరస్సువాల్చి విలపించింది. తను పడిన అవస్థలను మర్చిపోయింది.

నెలరోజులు గడిచిపోయినవి. ఇంటిపెత్తన మంతటిని బ్రీజ్ బెల్లాయే పొందింది. నేడు గొప్పధనవంతురాలు. కాని ఆమెలో దర్పము వికటపోకడలు చేరలేదు. నమ్రత విధేయత. శ్రమించుటలు అలవాటుగా యిష్టమైపోయినవి. నౌకర్లందరికి ఆమె దేవతగా గనిపిస్తున్నది. గోర్డ్సు వర్తుయెడల విశ్వాసాన్ని అభిమానాన్ని అధికంగా చూపుతున్నది. నిత్యము కారులో వెళ్ళి కార్ఖానాలోని అందరను పరామర్శించి వస్తున్నది. విజయ్‌దగ్గరకు కూడా రోజూ వెళ్ళివస్తున్నది. పదిరోజుల తరువాత హాస్పిటల్‌నుంచి తమ పాత మకాంలోకి చేర్చింది. నిత్యము అక్కడ యెక్కువకాలం గడిపివస్తుంది. తండ్రిని సమ్మతపర్చి విజయ్‌నుకూడా తన యింటిలోనే చేర్చాలని ఆమె సంకల్పం.



336

# 45. వ్యూహం

ఎంతో ప్రయాసతో పొందిన, తన యేకయిక నిధిగా నిలిచిన బిడ్డ హఠాన్ని కాదనలేక పరదేశీయుని ప్రవేశానికి సమ్మతించాడు. విజయ్‌కూడా యింటిలోచేరి కలిసిపోయాడు. కాని బ్రిగేడియర్ అంటే చచ్చేభయంతో దూరంగా వుంటున్నాడు. మేరీలో యేవిధమైన మార్పు లేదు. బీదరికంలోకంటె నేడు మరింత సన్నిహితురాలై అతనికి అధిక ఆధిక్యతనే యిస్తున్నది.

విజయ్‌ని చూడనపుడు విన్న మాటలలో సామాన్య అయిష్టతే వుండేది. కాని నేడు చూస్తున్నకొంది యేవగింపు ఎక్కువవుతున్నది. అతనే బ్రీజ్‌బెల్లా భర్తగా అయితే, అనుకున్నపుడు శరీరం ద్వేషంతో హేయంతో గగుర్పాటు చెందుతున్నది. అన్ని హంగులు అవకాశాలు సర్వసంపత్తులు వుండికూడా అనామకుడు, అయోగ్యుడు అయిన ఒక పరదేశీయునిపాలిట విడచి వూరుకొనుట అప్రయోజకత్వ మవుతుందని అంతర ఆందోళన కలుగుతున్నది.

ఈ విషయంలో గోల్డ్సువర్తు పరమ ఆప్తుడుగా తయారయ్యాడు బ్రిగేడియర్‌కు. ఏ రూపంగానైనా అతనిని తొలగించి పంపివేయాలని చేసిన ప్రయత్నాల ఫలితంగా ఒక్కమాటు తండ్రితోపాటు లండన్ వెళ్ళి పదిరోజులు గడిపి రావటానికి బ్రీజ్‌బెల్లా సమ్మతించుట, ఇక్కడే యీ మహల్‌లోనే విజయ్ వుండిపోవుటకు మొదలగు యేర్పాట్లు జరిగినవి. వారు లండన్ వెళ్ళిన మూడోనాడే గోల్డ్సువర్తు తన చతురతలోని చనువు నంతటిని వుపయోగిస్తూ విజయ్‌చేతిలో ఒక కవరును పెట్టుట, అందులో ఒక లక్ష పౌనుల చెక్కూ వో వుత్తరము వుండుట జరిగినవి.

"విజయ్! నీవు చాలా మంచివాడివి, యోగ్యుడవు గనుక నీ మీదున్న పూర్ణ విశ్వాసంతో వ్రాస్తున్నాను. నా, అన్నవారందరిని కోల్పోయిన దీనుణ్ణి. బ్రీజ్ ఒకతే నా యేకయిక సంపత్తి. దేవుని దయ

వలన ఆర్థిక సంపత్తి అధికంగానే వుంది. కనుకనే యీ బిడ్డద్వారా నా ఆశలన్నిటిని నింపుకోవలసి వున్నది. నీ సమక్షంలో నా కోరికమేరకు ఆమె వున్నతస్థాయికి పోజాలదు. కనుక ఆమె సుఖాన్ని నా సుఖాన్ని కోరితే నీవు మాయందు దయయుంచి వెంటనే యీ దేశంనుంచి వెళ్ళి పోవలసినదిగా వినమ్రతతో వేడుకుంటున్నాను. ఇందులోని లక్ష పౌనుల చెక్కును మార్చుకుని, వెనుకముందులు లేకుండా మా తండ్రి బిడ్డల రక్షణకు వెళ్ళిపోవలసినదిగా కోరుతున్నాను. భ్రమలను తెంచుకో లేకగాని, అందని ఆశలతోగాని నీవు అలాచేయకపోతే నా మృత్యువును వాంఛిస్తునట్లు భావించవలసి వస్తుంది. బ్రిజ్ తండ్రిగా నేను బ్రతికివుండి ఆమెకు వున్నత జీవితాన్ని కల్పించుకొనే అవకాశాన్ని యివ్వాలనే వుదారము, త్యాగము నీ ప్రేమకు తూగితే వెంటనే మేము వచ్చేలోగా వెళ్ళిపోవలసిందిగా కోరుతున్నాను. ఆర్థికంగా నీకు యింకా యెంత కావాలని వాంఛ వున్నా గోల్డ్సువర్తును అడిగి తీసుకెళ్ళగోరుతాను." అని బ్రిగెడియర్ వుత్తరంలో వుంది.

విజయ్‌కంతా అంధకారంగా తోచింది. ఆ చెక్కును ముందు రెండుగా చించివేశాడు. దూరంగా కూర్చుని అంతా ఎరుగనివానివలె గమనిస్తున్నగోల్డ్సువర్తు దగ్గరగావచ్చి పరామర్శించి, వివరాలు చెప్పించుకుని, తానింకా ఎన్నోవిధాల సానుభూతితో సాంత్వనలను పలుకుతూ ఆమె క్షేమంకొరకు ఆమె తండ్రి క్షేమంకొరకు త్యాగంతో యీ దేశం నుంచి వెళ్ళిపోవటం వుత్తమోత్తమ కార్యమని వినిపించాడు. పవిత్ర ప్రేమలో స్వార్థసుఖంకంటె త్యాగమే స్వాభావికమని ఎన్నోవిధాల వినిపించి, అవుసరమైనంత ధనం తీసుకోమని కోరాడు.

విజయ్ స్థిరనిర్ణయం చేసుకున్నాడు. ఆమె ఆదరించి ప్రేమించిన ధర్మదేవత, ఆమె సుఖంకొరకు, ఔన్నత్యంకొరకు, ఆనందంకొరకు తన సర్వస్వము ఆహూతియైనా జీవితమే అంతమయినా అందులోనే విశ్వాసంతోగూడిన సుఖమయశాంతి లభిస్తుంది. అందుకు ముందడుగు వేయుటే తనపవిత్రధర్మం. నరాలను నమిలివేసే పవిత్రప్రేమ పేరులోని స్వసుఖంకొరకు ఆమెను పొందాలని పోరాడుట, ఆరాటపడుట స్వార్థ కాంక్ష నగ్నస్వరూపమని అతని ఆలోచన. తన కందుబాటైన కష్టజీవిగా

నున్న బ్రీజ్‌బెల్లా తనకు రక్షకురాలుగా నిలిచి ఆదరించింది. ఆప్యాయత లాలికించింది. నేడు అగర్భశ్రీమంతురాలై అందనిఅంతస్తులో నిలిచింది. ఆమెకు సంపత్తితోపాటు కన్నతండ్రి లభ్యమైనాడు. నేడు తాను ప్రక్కన నిలుచుట ఆమె ఆనందాలకు అశాంతిగోడగా నిలిచినట్లవు తుంది. తన త్యాగమే ఆమె క్షేమంగా యెంచి పో నుద్యుక్తుడైనాడు.

"ఆమెపాలిట దేవత. ఆమె సర్వతోముఖ సుఖమే నా ధ్యేయం. ఆమెకొరకు నేను చేయలేనిదంటూ లేదు. అందుకు మూల్యంగా ధనాన్ని స్వీకరించే హీనుణ్ణిగాదు. మీరు కోరినట్లే వెళ్ళిపోతాను. ప్లెయిన్ టిక్కెట్టు యిప్పించండి చాలు." అన్నాడు. అతని నోటినుంచి వెలు వడిన ప్రతిశబ్దంలోను భరించలేని బాధ వ్యక్తమైంది. అతన్ని వేరు చేయుటే ధ్యేయంగా పెట్టుకున్న గోల్డ్సువర్తు కూడా క్షణంపాటు చలించాడు.

లండన్ చేరిందిమొదలు బ్రిగెడియర్ క్షణపాటుకూడా బ్రీజ్ బెల్లాను యామరకుండా ఆనందపెట్టి తిరుగుప్రయాణం లేకుండా చేయా లని అనేకవిధాల ప్రయత్నిస్తున్నాడు. చిన్ననాటి విషయాలను స్మృతికి తెచ్చి వుత్సాహాన్ని కల్పిస్తున్నాడు. పసితనంలో ఆడించిన ఆయలను స్థానాలనుచూపి పారిస్‌ను మరిపించే మఖ్యంలో వుంచజూస్తున్నాడు.

ఎన్ని జెపుతున్నా ఏమిజేస్తున్నా కళ్ళప్పగించి చూస్తున్న బ్రీజ్ బెల్లా మనస్సులో పిచ్చివానివలె మెలగే ఆ విజయ్ దృశ్యాలే మెదులు తున్నవి. తను చూస్తున్న యావత్తును, పొందుతున్న సేవలను మన్న నలను ఆయనకూడా తన సరసనుండి పొందే అవకాశాలు లేనందుకు ఎప్పటికప్పుడు విచారపడుతున్నది. అందుకే తండ్రి యెంతో వువ్విళ్ళూ రుతూ వివరిస్తున్నపుడుగూడా ఆమె పరధ్యానినిగా వుండుటను గ్రహించి నపుడు చీకాకు చెందుతున్నాడు.

"ఎందుకమ్మా ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుంటావు!" అంటాడు.

"ఏమీ తోచటంలేదు నాన్నా." అంటుంది.

"ఇంతకాలానికి మా మధ్యకొచ్చావు, అందరూ ఆనందపడు తుంటే నీకు తోచకపోవటమేమిటమ్మా!" అంటాడు.

పారిస్ పోవటానికని బ్రీజ్‌బెల్లా మనస్సు ఆరాటపడుతున్నది.

అయినా అనుకున్న పదిరోజులు జరక్కముందే తిరిగిపోదామనే ప్రతిపాదన చేయలేక మనస్తాపన చెందుతున్నది.

పదిరోజులయిన తదుపరి బ్రిగేడియర్ ఎంత ప్రయత్నించినా బ్రీజ్‌బెల్లా తహతహలను తగ్గించలేకపోయాడు. వివశుడై తిరిగి పారిస్ ప్రయాణంగట్టాడు.

పారిస్‌జేరి రెండురోజులు గడిచిపోయినా విజయ్ కనిపించనందుకు అంతర్గతంగా ఆరాటపడి పోతున్నది బ్రీజ్‌బెల్లా. ఎవరిని అడక్కుండా ఎక్కడున్నా కలుసుకోవాలని ఆమెయత్నం. గోల్డ్సువర్తుతో ఎన్నోమాపులు కలిసింది. తన పాత నివాసం చూసింది. కాని ప్రయోజనం లేకపోయింది. ఆవేదనను అణచుకోలేక నౌకర్లందరిని అడిగింది. అన్నివిధాల విఫలమయినపుడు, ఆమెకు మొదటి ఖూనీ యత్నం గుర్తుకొచ్చి వణికిపోయింది. వెల్డన్‌గాని అతని తరపుగా గాని చిత్రవధచేసివుంటారని వూహకలిగినపుడు కంపితురాలై పడిపోయింది.

గోల్డ్సువర్తుకూడా తనకతను కనిపించనట్లే చెప్పాడు. విలాపంలో మునిగి మూడురోజులు నిరాహారంలో గడిపినపుడు, యీ సమస్యనుంచి కడతేర్చి ఆమెను బ్రతికించుకొనుట అసంభవమనిపించింది తండ్రికి. ఈ ఆపత్తినుంచి బయటపడే వుపాయాన్ని చూపమని గోల్డ్సువర్తును ప్రార్థించాడు బ్రిగేడియర్. తెలిసిచేసిన తమనేరం సామాన్యమైందికాదని యిరువురు పశ్చాత్తాప పడుతున్నారు.

ఇపుడు బ్రీజ్‌బెల్లా ఎవరితోను పలుకుటలేదు. ఆమెవద్దకు భోజనం తీసుకెళ్ళనుకూడా ఎవరూ సాహసించలేక పోతున్నారు.

"ఆ అమాయకుడు నిరపరాధి. అతని దీనతకు తరచి నేనే ఆదరించాను. నిస్వార్థనీతిమంతుడు. నాలోని మానవత్వాన్ని పరీక్షించుటకొచ్చిన యేసుప్రభువే అతను. ఎవరయినాగానీ నా కాంక్షతో ఆ సాధుస్వభావుని వధించివుంటారు. నేనే అతని మరణానికి కారకురాలనైనాను. అలాంటి నేను జీవించుట ధర్మంగాదు."అని ఆఖరిమాటలు వినిపించింది. నిరాహారంతోపాటు మౌనవ్రత మాచరించింది. మృత్యుకుహరంలో మునుగుచే ఆమె ఆశయంగా తెలిసినపుడు బ్రిగేడియర్, గోల్డ్సువర్తులకు

తమ పరాజయం విపులమయింది. ఇరువురు మూఢులవలె ఒకరిమొఖాలు ఒకరు చూసుకుంటూ నూతనాలోచనను సృష్టించారు.

విజయ్ తనదేశానికి వెళ్ళిపోయినట్లు విమానం టిక్కెట్టు కొన్నట్లు, ఫలానా పేరుగల విమానంలో ఎక్కినట్లు మొదలగు వివరాలు విచారించినమీదట తెలిసినవని చెప్పారు. వెళ్ళినట్లు ప్రభుత్వ రికార్డు ద్వారాకూడా రుజువుచేసినపుడు ఆమె కొంతవరకు విశ్వసించింది.

"తనంతట తానెందుకు వెళ్ళివుంటాడు? నాకు రవంతైనా చెప్పకుండా ఎందుకు వెళ్ళాడు? అనుబంధాల విలువలు యింతేనా। ప్రేమ విశ్వాసాలలో నీతేలేదా। ప్రేమించినవారు దుఃఖించమని శాపమా।" అని తనలోతానే కలవరిస్తున్నది.

గాద్గదికంతో "17 సంవత్సరాలనాడు దూరంచేసుకున్న నిన్ను యీనాడు గాలించి పొందగలిగాను. నిస్పృహ నిర్మూలిస్తుంది. ఆశా, దీక్ష సాధనవైపు నడిపిస్తాయి. నీ నిశ్చయమంత కఠోరమైందే అయితే, ముందు కాస్త యెంగిలిపడు తల్లీ, నీవు బ్రతికివుంటే నీ కోర్కె మేరకు ప్రపంచంలో గాలించి నీ ముందుంచగలుగుతాము." అన్నాడు బ్రిగేడియర్.

"గాలిలేకుండా దీపం వెలుగుతుందా, నీటిబయట చేప బ్రతుకుతుందా। అతను లేకుండా నేను బ్రతకటమెట్లా నాన్నా!" అంటూ బొల బొల విలపించింది. తండ్రిమాటను పాటించి నిరాహారదీక్షను విరమించింది.

# 46 తారుమారులు

సకలానంద్ ఏ సరళ భ్రమలో మహిళామండలికి రాకపోకలు సాగించాడో ఆ సరళ విషయం అడుగున బడిపోయింది. పారిజాతం అనుయాయుడయి పోయాడు. వారిరువురుమధ్య అన్యోన్యత అతుక్కుపోయింది. సరళను చూసినపుడు యిరువురి మనస్సులు తవుడుకుంటున్నట్లు భీతిలుతున్నారు.

సరళ వంటరిగా పారిజాతాన్ని గలిసినపుడు "ఈ సైతాను పీడ నాకు వదిలింది. కాని నీవెంట మహా పడుతున్నా దేమిటి అక్కా" అన్నది.

"కొందరిని అర్థంజేసుకోగల నైపుణ్యం కొందరికే వుంటుంది. అతన్ని నీవు అర్థంచేసుకోలేదు. అంతే!" అన్నది పారిజాతం.

"అర్థంచేసుకోజాలనంత యేమున్నది! అతని తండ్రి లారీల బ్రోకరునుంచి రాజకీయ నాయకుడుగా రూపొందాడు. కూటికిలేనివాడు నేడు లక్షాధిపతి అయ్యాడు. ఆ మహానాయకుని పుత్రరత్నమే యీ కొక్కిరాయి కోతి. వాడి చూపులే రౌడీ తనాన్ని చాటుతుంటవి. ఇంతకంటె బుర్ర బ్రద్దలుగొట్టుకునేందు కేమున్నది!" అన్నది సరళ.

మందహాసంచేస్తూ "అక్కడే పొరపడుతున్నావు. వూబిలోని కమలాన్ని కళ్ళుమూసి కాదనుట వివేకం కాజాలదు." అన్నది.

"నీవు పొరబడుతున్నావు గనుక గట్టిగా చెప్పవలసి వస్తున్నది. వాడొక పెద్ద రౌడీ." అన్నది సరళ.

"కటకురాయిని సానబట్టినపు డుండు నునుపు అందము అద్వితీయ మవుతుంది." అన్నది పారిజాతం.

"అది తెలివిగలవారు కొందరు ఆ భ్రమలలోనే మోసపోయి ఆతరువాత పశ్చాత్తాప పడుతుంటారు." అన్నది సరళ.

"రౌడీ అనబడేవారిలో యెప్పుడూ విశ్వాసముంటుంది. సాధు స్వభావులుగా గనిపించేవారి చేతిలోనే స్త్రీ మోసపోతుంది." అన్నది.

"అందుకే యిపుడా రౌడీ మిమ్మ వెంటాడుతున్నాడు. ఇందు కొకనాడు నీవు పశ్చాత్తాప పడక తప్పదక్కా" అన్నది సరళ.

"నీవతన్ని యేవగించుకుంటూ కోల్పోతున్న నష్టాన్ని నేను గుర్తించగలుగుతున్నాను గనుక అందుకే పశ్చాత్తాప పడుతున్నాను. అతను నిన్ను ప్రేమించాడు గనుక నీ వెంట పడ్డాడు, నిన్ను పదే పదే చూశాడు. అది రౌడీతనమూగాదు, నేరమూకాదు" అన్నది పారిజాతం.

"ప్రేమ దేవతావరంలాంటిది. వారి విషయంలో ఆ మాటను వుచ్చరిస్తే అపవిత్రమైపోతుంది." అన్నది సరళ.

"ఉదృతంతో పరువులెత్తే ప్రవాహానికి ఎదురు నిలిచినంత మాత్రాన అది మురుగులెత్తదు. మరోవైపు మళ్లి దారి చేసుకుంటుంది. ఆగిపోతే, అక్కడే అంతమైతే ఆదర్శమని, మలుపుతిరిగి మధుర మయం చేసుకుంటే అపవిత్రమని అనేదాంట్లోనే అజ్ఞానమున్నదని నేనంటాను." అన్నది పారిజాతం.

"కావ్యాలలోను, కథలలోను చదివే పవిత్రప్రేమంతా వెర్రిదం టావా అక్కా" అన్నది.

"వూహలకు వాస్తవిక జీవితానికి అన్ని సందర్భాలలో పొంతన వుంటుందంటానికి వీలులేదు పిచ్చిచెల్లీ! అందుకే నీవు సకలానంద్‌ను అర్థంచేసుకో లేకపోయావు." అన్నది.

సకలానంద్, పారిజాతం అన్యోన్యతలు మరింత సన్నిహిత మైనవి. ఎడబాయని జంటగా గనిపిస్తున్నారు. ఇపుడు సరళ యెడలగాని విశ్వనాథం యెడలగాని బెరుకులు లేకుండా నిర్భీతితో సకలానంద్ ప్రక్క తిరుగ గలుగుతున్నది, మాటాడ గలుగుతున్నది పారిజాతం. తన విజయ్‌తో పోల్చుకున్నపుడు యీ సకలానంద్, దివిటీముందు దీపమువలె గనిపించి "ఇకనైనా యీ పీడ వదిలింది అంతే చాలు" అనుకుంటున్నది. ఏనాటికయినా గొప్ప ఖ్యాతితో వస్తాడనే ఆశతో ఆనందాన్ని నింపుకుని సంతృప్తి చెందుతున్నది. విశ్వనాథం పారిజాతం

లోని యీ హీనతను సహించలేక పోతున్నాడు. వనజముందు ఒక్కొక్క విషయాన్ని జెప్పి విలపిస్తుంటాడు.

వనజలేకపోతే తాను యేమైపోయేవాడో యెటు వెళ్ళిపోయే వాడో చెప్పలేము విశ్వనాధం. తండ్రి చెంతకేజేరి స్థిమితపడిపోయే వాడేమో. వనజ తన సానుభూతిలో ముంచి యెప్పటికప్పుడు అన్నిటిని మరిపిస్తున్నది.

"నేను ఎవరి ప్రేరణతో యీ మండలి ఆశ్రయంలో చేరానో వారి చర్యలనుచూస్తూ క్షణక్షణ మరణాన్ని బొందుటకంటె పారిపోవుట మంచిది వనజా" అన్నాడు విశ్వనాధం.

"నేనుండగా ఎలా పారిపోతారు? పోనివ్వను" అన్నది వనజ.

"ఎవరికొరకని యీ నరకబాధ ననుభవిస్తూ వుండను చెల్లీ! ఆశలు నిరాశ లయినపుడు మిగిలేదేముంది!" అన్నాడు.

ప్రేమభరిత దృక్కుల బరపుతూ చుబుకాన్నిబట్టి తనవైపు లాక్కుంటూ "జీవితం ఒక్క విఫలంలో అంతమొందే అంతటి అల్ప మయిందిగాదు. ఒక్క విఫలంతోనే నిస్పృహ చెందుట విజ్ఞతకాదు. రాతికొరకు చేసే యత్నంతో రత్నమే దొరకవచ్చు. దొరికిన దాన్ని కాలదన్ని దొరకనిదానికొరకు విలపించుట వివేకంకాదు. మీరు వెళ్ళ టానికి వీలులేదు. నాకొరకుండాలి, మీరు లేకపోతే నేనూ వుండలేను. నేడు నన్నిక్కడ లాగి వుంచగలుగుతున్నది మీరే, మీకొరకే వున్నా నంటే విశ్వసిస్తారా?" అంటూ అతని అధరాలమీద చుంబించింది. తత్తరపోతూ ఆమెను అవతలకు నెట్టివేసి క్రుద్ధుడై చూస్తూ "నువ్వు చేస్తున్నదేమిటి?" అని గద్దించాడు.

ఆమె ఖిన్నతచెందలేదు. "నేను చేస్తున్నది పొరపాటుగాదు. నిష్కల్మషమైన హృదయంతో ప్రేమిస్తున్నాను. మీరుదప్ప నాకీ లోకంలో ఎవ్వరూ లేరని, మిమ్మే విశ్వసిస్తున్నాను. ఇది అపరాధ మంటారా?" అని ధీమాతో స్పష్టమైన మాటలతో అన్నది.

"ఇది ప్రేమగాదు అజ్ఞానం, పశువిధానం. లోకం ఘృణీకరిస్తుం దన్న భయమైనా లేదా నీకు." అన్నాడు.

"అది పిరికితనం. మోసంలేకుండా ఆత్మార్పణ చేసుకునే

ప్రేమలో దోషంలేదు. లోకభయంతో ఆత్మలోని పవిత్రకాంక్షను చంపు కోవటమే అజ్ఞానమవుతుంది." అన్నది.

"ఇంతకాలంనుంచి నిన్ను చెల్లిగా భావిస్తూ వస్తున్నాను వనజా. ఆ భావనను నేడు తారుమారు చేయుట సభ్యతంటావా?" అని ప్రశ్నించాడు.

"మానవ స్వభావం యెక్కడికక్కడ అర్థంగాని రూపాలు ధరి స్తుంది. ఒకపుడు నన్నుగురించి తెలుసుకోవాలని తాపత్రయ పడ్డారు. ఆనాడు నాకిష్టంలేదు. నేడు మీకు తెలుసుకోవాలని లేకపోయినా చెబుతు న్నాను వినండి. విజయపురిలోని ప్రఖ్యాత కంట్రాక్టరు బద్రీనారాయణ ద్వితీయ పుత్రికనైన రోహిణిని నేను. మా అక్క కృష్ణకుమారి ప్రేమిం చిన మంగళనాధ్‌ను పొందలేక, అతని పిరికితనానికి ఆహుతిగా శాశ్వ తాంతర్ధానమైంది. ఆమె కోరినపుడు నీతులనడ్డుచేసి వెంట చనలేక, తనకొరకని బయటపడిన త్యాగంలో ఆమె పడిన నష్టాన్ని స్మరిస్తూ స్వాములవారైపోయాడు. ఎక్కడెక్కడో పూజారాధనలు సలిపి ఆకస్మి కంగా తిరిగి విజయపురి జేరిన ఆ స్వాములవారిని జూచినపుడు నాలో సానుభూతి గలిగింది. అతని పశ్చాత్తాపాన్ని, ప్రాయశ్చిత్తాన్నిజూసి పరవశినైన నా మనస్సు లొంగిపోయింది. అతని తపస్సుకు మెచ్చి మోక్షాన్ని గల్పించాలని నన్ను నేను సమర్పించుకున్నాను. నన్ను స్వీక రించమని ప్రార్థించుకున్నపుడు "నీవు పిచ్చిదానివి. నాలోని ఆనంద దీప్తిని గుర్తించగలశక్తి నీకు రాలేదు. నా హృదయ పీఠాన్ని శాశ్వ తంగా ఆమెకంకితం చేశాను. ఆమెను నా రక్తంలో రంగరించుకున్నాను. నాలో నాకు యెక్కడ చూసినా ఆమెయే కనిపిస్తున్నది. ఆమెద్వారా నిర్ది ష్టమైన ఆశయాలను పొందాను. ఆమె ధ్యానంలో నాకు పరమానందం కలుగుతుంటుంది. ఆమె స్తోత్రం చేయుటకు నాకు కవనంరాదు. గానం చేయుటకు కంఠంలో కమనీయతలేదు. అందుకే కూర్చుని, అంతరాత్మలో ఆమెను ధ్యానిస్తూ మనోనేత్రంద్వారా ఆమెనుచూస్తూ అవిచ్ఛిన్నమైన ఆనందా న్ననుభవిస్తున్నాను." అని వినిపించినపుడు నా హృదయం ద్రవించింది. ఒక సామాన్య స్త్రీ అతనికి దేవతై కూర్చున్నందుకు ఆనందపడుతూ "స్త్రీ స్వాతంత్ర్యం, స్త్రీ హక్కులు, స్త్రీ సమానత్వం అని

గొంతు చించుకునే వెర్రివారికి స్త్రీ యేమిటో పురుషుడేమిటో తెలియదు మంగళనాద్‌గారు. మీద్వారా యే పరమ రహస్యాన్ని తెలుసుకున్నానో దాన్ని తెలియజేసే పోరాటంలోనే స్త్రీ హక్కులు. స్త్రీ సమస్యలు అని వేరుచేసే వెర్రి వుద్యమాలను. భావాలను అణచి నిజస్వరూపాన్ని ప్రకటించుటకు నేను అవివాహితనై మీ శిష్యురాలిగా జీవితాంతం పోరాటం సలుప నిశ్చయించుకున్నాను."అని వారిముందు ప్రకటించాను. ఆ ఆశయ సిద్ధికై కంకణబద్ధురాలనై యిల్లు విడచి అనేకప్రాంతాలు తిరిగి పడరాని బాధలు పడ్డాను. ఏ పురుషులనుంచి స్త్రీలు స్వాతంత్ర్యంకోరి సమానత్వాన్ని చాటజూస్తున్నారో అది వెర్రితనమని, అవ్యక్తమని ప్రచారోన్ముఖురాలనైన నన్ను ఆ పురుషులే హీనంగా జూశారు. పరిహసించారు. పురుషుని ఆధిఖ్యతను అంగీకరించినపుడే. అభిమానించినపుడే స్త్రీ రాణింపబడుతుందని. గౌరవింపబడుతుందని. అది భారత ఆదర్శ సాంప్రదాయమని ప్రకటించినపుడు నలువైపులా ముట్టడించి గేలిచేశారు. అన్నివైపులనుంచి అపజయం బొందాను. పురుషపెత్తనాన్ని వికృతంగా సృష్టించి. పురుషులను వివిధవిధాల నిందిస్తూ స్త్రీస్వాతంత్ర్యంకొరకు కత్తిగట్టినట్లు యుద్ధప్రచారగర్జనలు సలుపుతున్నస్త్రీ స్వాతంత్ర్య పోరాటకులను కరతాళధ్వనులతో వుత్సాహపరుస్తూ,అభినందిస్తూ, ఆదరిస్తూ సహకరిస్తున్న పురుషులను. స్త్రీలను జూస్తూ విస్తుపోయాను. నాకు నేనే సిగ్గిలిపోయాను. నాకు తెలయకుండానే అజ్ఞానినిగా గత్యంతరంలేక మహిళామండలివెంట పడ్డాను. పథవిహీనురాలనై యిక్కడికి చేరాను. కాని అనుక్షణము ఆరాటపడుతున్నాను. మహిళామండలివారి కార్యరంగంలోను, వ్యక్తిగత జీవితాలలోను ఒక్కకోణంలోకూడా యిమడలేకపోతున్నాను. ఇక్కడినుంచి పారిపొమ్మని మనఃప్రవృత్తులన్నీ ప్రేరణనిచ్చినవి. ఏనాడో పారిపోయి వుండేదాన్ని. కాని అకస్మికంగా మీకు దెబ్బతగిలినపుడు కల్గిన మీ పరిచయం నన్ను కట్టివేసింది. నేడు నన్ను యిక్కడలాగి వుంచగలుగుతున్నది రాజ్యలక్ష్మిగాదు మీ సాంగత్యం. మంగళనాద్‌కు నేను ఆనాడిచ్చిన అభయం మీద్వారా పూర్తిజేయగలనన్న విశ్వాసం నాలో కలుగుతున్నది. అయితే ఆనాడు అవివాహితనుగా వుండి చేయుటకభయమిచ్చి విఫలంబొందాను. నేడు వివాహిత.

నయ్యి ఆ కార్యసాధన చేయదలచాను. అందుకు నా భర్తగాను, గురువుగాను, ఆరాధదేవతలుగాను మిమ్మే నా మనస్సు స్వీకరించింది. నేను రిక్తస్త్రీనిగాదు, ఒక ఆశయ ఆరాటంలో తపిస్తున్నస్త్రీని. లోకంలోని గొప్పగొప్ప కార్యాలు ఒకరిరువురుద్వారానే వెలుగులోకి వస్తుంటవి. మీరు లేకుండా నా ఆశయం ఆచరణీయంగాదు. మీరు తృణీకరిస్తే కలిగే నిస్పృహలో నేనేమయిపోతానో నాకే తెలియదు." అని యేకధాటి వుపన్యాసంలో వినిపించింది.

"వనజా, నీ చిన్ని లేతహృదయంలో యిన్ని ఆలోచనలు మరుగుతున్నట్లు ఒక్కమాటైనా తెలియనిచ్చావుకాదు. మహిళాసేవ పేరుతో స్త్రీస్వాతంత్ర్య పోరాటమనే వుద్యమాన్ని ముందుంచుకుని స్త్రీ పురుషులను విరుద్ధజాతులుగా సృష్టిస్తూ పురుషులను చులకనచేస్తూ శృంగార రంగాల మత్తులలో మునకలువేస్తూ అందరనూ ఆకర్షిస్తూ నడుస్తున్న నావలోనేవుంటూ అందు కతీతురాలవై వారిచర్యలను ఖండిస్తూ పురుషుని ఆధిక్యత యెల్లపుడు పూజనీయమైందేనని, స్త్రీ పురుష అన్యోన్యతలలోని కలియకే పూర్ణత్వమని, పురుషుని పూజించుటలోనే స్త్రీ ఆధిక్యత స్థిరపడుతుందని విశ్వసిస్తున్నావు. ప్రచారం చేయగోరుతున్నావు. ఈ రెండు భిన్నఅభిప్రాయాలను అర్థంచేసుకోజాలని అమాయకుణ్ణి నేను. నాద్వారా యేమి పొందగలవు చెప్పు!" అన్నాడు.

"మిమ్ము వివాహమాడి పతిదేవునిగా పూజిస్తాను. మీ అడుగుజాడల్లో నడుస్తూ ప్రతిబింబంగా మెలగుతాను. మీ నీడగా వెంటనిలిచి వుంటాను." అన్నది.

"అయితే నీ ఆశయాలకు తిలోదకాలిస్తావన్నమాట," అన్నాడు.

"కాదుకాదు, నా ఆశయాలను అనుభవంలో చూపుతాను. నా భావాలను నా జీవిత నడవడిలో ప్రదర్శిస్తాను. నా అనుభవాన్నే యితరులకు ప్రకటిస్తాను." అన్నది.

"అయితే నీ కార్యరంగ ప్రయోగానికి నన్ను భర్తగా స్వీకరించదలచావన్నమాట." అన్నాడు.

"నా కోర్కెను అంత చులకనచేయకండి. ఆశయ ప్రచారంలో అపజయమొందినపుడు, స్వరచనాత్మక కార్యంవైపు ఆలోచనలుచేశాను.

మీరు కలిశారు. మీమీదనే మనస్సు లగ్నమయింది. నేడు నా మనస్సు వ్యక్తిత్వాన్ని కోల్పోయింది. అన్నివైపులనుంచి మిమ్మే కోరుతున్నది. మీకు నన్ను నేను ఆత్మార్పణ చేసుకున్నాను. ఆ తరువాత జరిగేది నాకూ తెలియదు." అన్నది.

"వనజా, నిన్నుపొంది నేను ధన్యుణ్ణయినాను." అంటూ ఆమెను కవుగిటిలోకి తీసుకున్నాడు.

కులాసా కబుర్లలోనున్న రాజ్యలక్ష్మి ముందుకొచ్చి ఒక్కమాటుగా వనజ, విశ్వనాధంలు పాదాభివందన మాచరించినపుడు అందరూ ఆశ్చర్యపోయారు. ఈ సాహసం యెక్కువమందిని ఆకర్షించింది. "అదృష్టవంతులు" అంటూ గొప్పగొప్ప అభినందనలతో ఆశీర్వదించింది.

పారిజాతానికీ దృశ్యం గొప్ప ఆనందాన్నే యిచ్చింది. తన మనస్సులోని యేకోణమందో మిగిలివున్న రవంత భీతికూడా యిపుడు పోయింది. సరళ సందర్భాలన్నీ అంతకుముందే తెలిసినవి గనుక సకలానంద్ విషయంలో వుత్సాహితురాలైంది.

"సకలానంద్, నీవు సున్నితమైన హృదయం గలవాడివి. కాని లోకం నిన్ను యెలా చిత్రించుకుంటుందో తెలుసా?" అన్నది.

"లోకవిషయ మడిగేకంటె సరళ విషయమని అడిగితే సంతోషిస్తాను." అన్నాడు.

"అమాయకు లనుకున్నాను. మీబుర్ర మహా చురుకైందిసుమా." అన్నది.

"చెప్పదలచుకున్న విషయం చెప్పు!" అన్నాడు.

"పోనీ సరళ నిన్నుగురించి ఎలాంటి అభిప్రాయంలో వుంటుందో చెప్పు!" అన్నది.

"నేను మహా చెడ్డవాడినని, క్లాసులో ఎప్పుడూ చూస్తూ వుండేవాడినని, నీతిలేనివాడినని అభిప్రాయపడివుంటుంది." అన్నాడు.

అతని చుబుకాన్నిబట్టి ముద్దుగా వూపుతూ "అవును సరిగ్గా చెప్పావు. అది ఆమె పొరపాటు. స్వభావాన్ని అర్థంచేసుకోజాలనితనం." అన్నది.

సిగ్గు దొంతరల మధ్య ముడుచుకుపోతూ "ఆమెద్వారా మీ పరిచయమయింది. మీ పరిచయంలో నేను ఎంతగానో మారిపోయాను. లోకమంటే యేమిటో అర్ధమయింది. రాజ్యలక్ష్మిగారి వుపన్యాసాలు నన్ను ఎంతో ఆకర్షిస్తవి. మీ వుపన్యాసాలు అంతకంటె మధురంగా వినిపిస్తవి. మీ మాటలుగాని వుపన్యాసాలుగాని వింటుంటే యెంతసేపయినా విసుగెత్తదు. ఎల్లప్పుడూ వినగలననిపిస్తుంది. అన్నివిషయాలు నీకు ఎక్కడినుంచి వూరి వస్తుంటవి! చెప్పినమాట చెప్పకుండా వినిపిస్తుంటావు. నీద్వారా నేను పొందుతున్న వుత్సాహము విజ్ఞానము సభ్యత సామాన్యమైందిగాదు. ఇలాటి నాకు నచ్చిన మిమ్ము పరిచయం జేసిన సరళకు సర్వదా కృతజ్ఞుణ్ణి." అన్నాడు.

"నీకు నిజంగా అంత అభిమానము, విశ్వాసము వున్నదా సకలానంద్! సరళ అమాయకురాలు. నవనీతంలాంటి నీ హృదయాన్ని అర్థం చేసుకోలేక పోయింది." అన్నది.

"అందువలన నాకు వుపకారమే జరిగింది. కొన్నికొన్ని సమయాలందు కోర్కెలోని పొరపాటును సమయం సరిదిద్దుతుంటుంది. నేనిపుడు జేరవలసినచోటకే జేరాను." అంటూ ఆమె చేతిని తీసుకుని స్పృశిస్తున్నాడు.

ఆమె శిరస్సు అతని వక్షస్సుమీద వాల్చి "ఈ మండలి కార్యక్రమ భారాన్ని ఇక నేనే మోయవలసి వుంటుంది. రాజ్యలక్ష్మి బాధ్యతల నుంచి విముక్తి పొందను ఒక్కటొక్కటిగా నావైపు జారవిడుస్తున్నది. ఈ బృహత్తర కార్యాన్ని అన్ని హంగులలోను నడుపుట అంత తేలికయిన పనిగాదు. ఆ దీక్షలో కావలసిన ధైర్యానికి వూతాన్ని వేయి కళ్ళతో వెదుకుతున్నాను. నీవు లభ్యమైనావు. నా కొరత తీరిపోయింది." అంటూ అతని నడుమును బాహువులతో బంధించింది.

"పారిజాతం! నీకొరకు యేమయినా చేయగలను. నిశ్చింతుడనై నీఅడుగుజాడలలో నడువగలను. ఒక్కవియషంమాత్రం నీముందు స్పష్టం చేస్తున్నాను. మీ మహిళామండలిని ఆదరించేవాడు విశ్వాసంతోను, ప్రేమతోను మాత్రంకాదు. హేళనరూపంగా చూస్తున్నారనుట నిస్సం

శయం. కనుక యీ విశ్వాసము, విధానములో యెక్కడో పొరపాటున్న దేమో!" అన్నాడు.

"ఈ కాస్తంత అనుభవంలోనే కొన్ని నూతనాభిప్రాయాలను నేనూ పొందాను. మిమ్ము పొంది మీ అండతో మహిళామండలి కార్య రంగాన్ని యధాతధంగా నడపాలని అనుకోవటంలేదు. స్త్రీని ముగ్ధుని చేయగలపురుషుడు దొరకనినాడు, ఆ దొరికిన పురుషునితోనే స్త్రీ సంతృప్తిచెంది జీవితాన్ని దొర్లింపజాలనినాడు ఆ స్త్రీలో విరుద్ధభావాలు విప్లవభావాలు వుత్పన్నమవుతవి. శక్తిగలవారికి బాధ సంభవించినపుడు ఆ బాధకు గొప్ప సామూహిక రూపాన్నిచ్చి మహత్వును గల్పించి అందరిని ఆకర్షింపచేస్తారు. అలాంటి రెచ్చిపోయినవారి ఆందోళనలో పరువులెట్టుట వెర్రితనమవుతుంది. ఇది నా స్వానుభవము. ఒకనాడు చిన్ని పొరపాటుతో పురుషునికి దూరంగావలసివచ్చింది. ఆమధ్య రేగిన ద్వేషం దావానలరూపం దాల్చింది. పురుషద్వేషం అంకురమై ప్రబలింది. రాజ్యలక్ష్మిగారికంటె నేను పురుషజాతి స్వార్ధాన్ని హీనాతి హీనంగా చిత్రిస్తూ ఖండిస్తూ వచ్చాను. నా దృష్టికి ఆనాడు అంతటా అలానే కనిపించింది. కాని నేడు మీ కలియకతో భావాలు, జీవితం, అంతా మారి పోయింది. పురుషులు వుదారమూర్తులని, గంభీరదేవతలని, ఆరాధన లందుకోదగ్గ అర్హులని, వుచ్ఛశ్రేణికిజెందిన విశాలహృదయులని నాలో విశ్వాసం కలిగింది. మీ అనుభవంతో నా భావాలు తల్లక్రిందులైనవి, పురుషుని విమర్శించేశక్తి నేడు నాలో లేదు, పురుషుని పూజించగలను, గౌరవించగలను, నాకు మీరిచ్చిన వరమిది, స్త్రీ పురుషులు విడదీయ రానివారని, ఒకరి కర్తవ్యాన్ని మరొకరు నిర్వర్తించలేకుండా కూడా యేకత్వంలోని ద్విరూపమని, రెండు అంచులుగలసిన యేకఖండికవలె రెండుస్వరూపాలు రెండుస్వభావాలు కలిగికూడా యేకబాటలో ఒకే ధ్వనిలో ఒకే ధ్యేయంతో ఒకే రూపసాధనలో లక్ష్యంలో యేకమై నడచువారని నేడనుభూతిని పొందుతున్నాను. మీముందు లొంగిపోవుట లోనే, మీవెంట నడచుటలోనే, మీ ఛాయారూపంగా నిలచుటలోనే, మీకు ఆత్మార్పణ చేసుకోవటంలోనే ఆత్మానందం లభించునట్లు సర్వావయాలు ఆరాటంతో ప్రేరణ చేస్తున్నవి. ఇదే యదార్ధ స్త్రీ స్వభావమనికూడా

నా అంతరాత్మ ప్రభోదిస్తున్నది. ఈ రూప ఆచరణలోనే స్త్రీ సౌభాగ్యము సంఘ సౌభాగ్యము లోకకళ్యాణము వుందని తెలుసుకున్నాను" అన్నది పారిజాతం.

"రాజ్యలక్ష్మి కార్యరంగాన్ని నెత్తినవేసుకుని, నీవే ముందుకు నడపాలని వోప్రక్క అంటూ మరోప్రక్క పూర్తి విరుద్ధంగా మాటాడు తున్నావు" అంటూ ఆమె బుగ్గమీద వ్రేళ్ళతో పొడిచాడు.

ఆమె ఆ చేతిని అక్కడే వుంచి అదుముకుంటూ చిన్న నవ్వును చిందిస్తూ "మీసేవలో వుంటూ మీ అండతో ఈ మండలి కార్యక్రమాన్ని నడిపించాలని నా వాంఛ. కాని మార్గమిదిగాదు. పురుషులను ద్వేషిస్తూగాదు, పురుషుని న్యూనతపర్చే స్త్రీ సమానత్వముగాదు, స్వేచ్ఛగాదు కోరేది, అన్యోన్యతలలో ఐక్యమైపోవుట. నేను మీద్వారా కార్యాచరణలో వ్యక్తంచేస్తూ నా నూతన భావప్రభావాన్ని ప్రచలితంచేస్తాను." అన్నది.

ఆమె శిరస్సును వక్షస్సుమీదవేసి, నిమురుతూ "అంటే నన్ను నీ ప్రయోగాత్మక కార్యరంగానికి యేరూపంగా వుపయోగిస్తావు పారిజాతం." అన్నాడు.

"నిన్ను దేవతగా కూర్చుండబెట్టి సేవలుచేస్తాను. పూజలు సలుపుతాను, నీ భక్తురాలనుగా, ఆదర్శపత్నిగా మెలగుతూ ఆత్మానందాన్ని పొందుతూ పూర్ణత్వానికి మార్గ మదేనని రుజువుచేసి చూపుతాను" అన్నది.

"పారిజాతం" అని పిలుస్తూ ఆకస్మికంగా రాజ్యలక్ష్మి ప్రవేశించింది. సకలానంద్ మరింత సిగ్గుతో ఆమెను చూడజాలక ముఖాన్ని మరోవైపుకు త్రిప్పుకున్నాడు. "తలవనితలంపుగా యిటు వచ్చావేమిటి అక్కా!" అని ప్రశ్నించింది పారిజాతం.

ఆమె ప్రసన్నతను ప్రకటిస్తూ "ఇరువురూచేరి యేదో గొప్ప గొప్ప రహస్యాలు సలువుతున్నట్లున్నారు!" అన్నది.

పారిజాతం వెంటనే సకలానంద్‌ను లాగి యిటువైపు త్రిప్పి తన ననుసరించమని సౌంజ్ఞచేస్తూ "ఏమీ లేదక్కా, ఎంతమందినో ఆశీర్వదించావు. మమ్మికూడా ఆశీర్వదించక్కా!" అంటూ ఆమె పాదా

లంటింది. ప్రక్కనున్న సకలానంద్‌కూడా ఆమె పాదాలంటుకున్నాడు.

రాజ్యలక్ష్మి నివ్వెరపోతూ "పారిజాతం నీవుకూడా యీపనిచేసి కూర్చున్నావా? నీమీద యెన్నెన్నో ఆశలతో వున్నాను. నా తరువాత యీ యావత్తుకు వుత్తరాధికారివి నీవేనని భావించాను...." అంటూ మాటరాక నిలిచిపోయింది.

"అందుకు భయపడక ఆశీర్వదించక్కా. మహిళామండలిని వుద్ధరించే వుద్దేశంతోనే యీ కార్యానికి పూనుకున్నాను" అన్నది.

"వివాహంచేసుకుని నీకుటుంబ గొడవల్లో నీవు పడి స్త్రీలోకానికి నీవు చేయగలిగేదేమీ వుండదని తెలుసుకో." అన్నది.

"పురుషుని కతీతంగా వుంటూ పురుషజాతిని ద్వేషిస్తూ చేసే ప్రచారాలద్వారా స్త్రీ లోకానికి చేయగలిగేది శూన్యమని యేనాటికయినా తెలుసుకోకతప్పదు. పురుషునిలో ఐక్యమైపోయిన స్త్రీద్వారా మాత్రమే స్త్రీ లోకవుద్ధరణ కాగలదని నేడు నేను విశ్వసిస్తున్నాను. పురుషునిలో ఐక్యంకాగల అవకాశం లభించుట స్త్రీపాలిట మహాయోగం లాంటిది. పూర్ణత్వంలాంటిది, దాన్ని తెలివిగల స్త్రీ విడువజాలదని మీకు విశ్వసనీయంగా చెబుతున్నాను." అన్నది పారిజాతం.

కర్తవ్య దీక్షలో కాలుజారినపుడు అనే మాటలివి. స్త్రీజాతి, సమస్త స్త్రీలోక సమానత్వంకొరకు, కళ్యాణంకొరకు దీక్ష దీసుకున్న మహిళామండలి. స్వసుఖాలకు, వ్యక్తిగత లాభాలకు యిక్కడ స్థానం లేదు. ఇది కేవలం యోగస్థానం, ఇప్పటికయినా తెలివితెచ్చుకుని మెలిగితే మంచిది. కంచే చేనుమేసినట్లు నీద్వారా సర్వమూ సమాఘాతమైపోయింది." అన్నది రాజ్యలక్ష్మి.

"ఏ సమానత్వాన్ని ఏ కళ్యాణాన్ని కోరుతున్నామో అందు కతీతులమై వాటికి నోచుకోకుండా, అందలి అనుభవాన్ని, తెలుసుకోకుండా, వాటికొరకు పోరాటంసలుపుటకంటె వాటినిపొంది అనుభవంతో చూస్తూ ఆ రూపంగా అందరికీ అందునట్లు, చేకూరునట్లుచేయు పోరాటం బలమైందిగా వుంటుంది. అందు పేలవం వుండదు. జీవితంలోని వాస్తవిక మాధుర్యాన్ని అందజాలక యిక్కడజేరికొందరైనా యిక్కడ కళ్యా

ణకర పథాన్ని అందుకోగలుగుతున్నవారి ద్వారా యీ మండలి వుద్ధరింపబడుతుంది." అన్నది.

"భ్రమలోనో, స్వార్థంలోనో మునిగినవారు, స్వార్థానికికూడా ఆదర్శమనే రంగులు పులిమి యెదుటివారికికూడా ఆ రంగులనే పులమాలని చూస్తారు. ఇది భరించరాని ఘోరము. నీలాంటి ప్రాముఖ్యంగల స్త్రీ యిలాంటి హీనకార్యంచేసి కూర్చుని పైపెచ్చు మహిళామండలి ఆశయానికే ముప్పుదే ప్రయత్నించుట భరించరాని విషయం. కనుక మర్యాదగా యెవరికంటా పడకుండానైనా మీ యిరువురను పారిపొమ్మని ఆదేశిస్తున్నాను." అన్నది.

"అక్కా, నీవు స్త్రీవై వుండికూడా స్త్రీహృదయాన్ని యదార్థరూపంలో తెలుసుకోలేకపోతున్నావు. స్త్రీకినచ్చిన పురుషుడు దొరకటం దేవతావరంలాంటిది. నచ్చినభర్త సన్నిధిలో హక్కులు, అవకాశాలు, మర్యాదలు మొదలగు వేరువేరు ప్రశ్న లుత్పన్నంగావు. తన ప్రియభర్త ముందు సమానత్వాన్ని చాటుకోవటంకంటె ఆత్మార్పణ చేసుకోవటంలోనే ఆత్మతృప్తిని పొందుతుంది. అక్కడే వోప్రక్క శృంగారము, సుఖము, శాంతి, ఆనందము లభ్యమవుతవి. అలాంటి అనుకూల దాంపత్యం లభించనిచోటే అనేక సమస్యలుత్పన్నమవుతవి. కనుకనే స్త్రీకి పోరాటశక్తిని, పురుష యేవగింపును, ద్వేషాన్ని, భిన్నభావ సంపత్తిని నూరిపోయుటకంటె, సౌజన్యతను, సహనతను హృదయ విశాలతను, సౌశీల్యతను, సౌభావాన్ని నింపు సంస్కారాన్ని ప్రభోదించుట అవుసరము. అదొకటే మహిళాలోక కళ్యాణానికి యేకైక మార్గం. కనుక యికమీదట నేను ఆ మార్గంలోనే పయనిస్తాను. మమ్ము ఆశీర్వదించి పంపు అక్కా!" అంటూ తిరిగి ఆమె పాదాలముందు వాలింది. సకలానంద్ ఆమె ననుసరించను ఆలోచనలో వుండిపోయాడు.

రాజ్యలక్ష్మి క్రోధాన్ని యిముడ్చుకోలేక లోనికి సరసర వెళ్ళిపోయింది. భూమిమీదనుంచి లేచిన పారిజాతం వెళుతున్న ఆమెవైపే చూస్తూ వుండిపోయింది.

"మీ అక్క మన వివాహానికి సమ్మతించదు." అని, అధైర్యంలోని ధ్వనితో అన్నాడు సకలానంద్.

పారిజాతం ముఖాన్ని నవ్వుతో కప్పివేసుకోను ప్రయత్నిస్తూ "అనుభవం అందరికీ వక్కమాటురాదు ఆనంద్! అవకాశం ఒక్కొక్క రికి ఒకోమాటు యిస్తుంది. అది సంభవించినపుడే ఆవ్యక్తికి తెలుస్తుంది. జీవితంలో లభ్యమైన అమూల్య అవకాశాన్ని కూలదోసుకున్నవారు ఆ తరువాత జీవితాంతం అంధకారంలో తపిస్తుంటారు. మన ఆనంద మయ జీవితాల కిది స్థానంగాదు పద ఆనంద్." అంటూ అతని హస్తాన్ని బట్టుకుని బయటకు నడిచింది.

వనజ విశ్వనాధంతో కలిసి అందరి అనుమతినిపొంది మహిళా మండలినుంచి వెళ్ళిపోయింది. వారు వెళ్ళిన కొద్దికాలానికే పారిజాతం సకలానంద్‌తో కలిసి అంతర్ధాన మయినపుడు మండలిలో కొంత సంచలనం కలిగింది. రాజ్యలక్ష్మి క్రోధావేశాలతోను దుఃఖంతోను నిరా శలతోను క్రిందమీదై వూగిపోతూ యీజీఛైర్‌లో వాలబడి బుసలుగొడు తున్నది. చెంతకుచేరి పలుకరించగల సాహసం యెవరికీ లేకపోతున్నది. గొప్ప అండను ఆదరాన్ని అనుకోనిరీతిగా అకస్మాత్తుగా కోల్పోయినట్లు అందరిలోను ఆందోళన జరుగుతున్నది.

తన బంధువు, మిత్రురాలు అయిన యే పారిజాతం ప్రోత్సాహంతో తానిచటకు తాత్కాలిక కాలక్షేపాని కొచ్చిందో, ఆ పారిజాతం ఆకస్మిక అంతర్ధానం సరళను అందరికంటె అయోమయంలో ముంచివేసింది. తనకొరకు యెన్నో సంవత్సరాలనుంచి కలలుగంటూ యెన్నెన్నో రకాల ప్రయత్నాలు చేస్తూ తన వెంటపడే యీ మహిళామండలికి రాక పోకలు సాగించి పారిజాతం పరిచయాన్ని పొందిన సకలానంద్ ఆమె తోనే ముడివడి వెళ్ళిపోవుట మహాశ్చర్యంగా వుంది. తనకు యెన్ని వుత్తరాలు వ్రాశాడు! ఆ వుత్తరాలలో తనను యెంత పొగడాడు! తనను ప్రేమించానన్నాడు. తనకొరకు యెంత త్యాగమైనా చేస్తానన్నాడు. సర్వ స్వాన్ని పాదాలముం దర్పిస్తానన్నాడు. తల్లిదండ్రులనుకూడా లక్ష్యం చేయకుండా తను కోరినట్లు చేస్తానన్నాడు. వెంటవస్తానన్నాడు. తన ప్రేమ ఆదర్శమైందని పవిత్రమైందని వ్రాశాడు. సైతానువలె యెల్లపుడు తనవెంటపడుతుండేవాడు. నేడు పారిజాతంవెంట పారిపోయాడు. లోకం యెంతవిచిత్రమైంది! అంతకాలం వెంటపడి వలికించిన ప్రేమలు, వూహలు

అంతా అతని భ్రమలేనా? అవును అతను అన్ని ఆశలతో తనవెంట పడి నపుడు నిర్లక్ష్యంతో నిందిస్తూ పారదోలిన ఫలితం యిది. మార్గంలేనపుడు, మలుపులు దొరుకుట స్వాభావికం. ఆమె కళ్ళముందంతా పొగమంచు కప్పినట్లయింది. సకలానంద్ యెడల వున్న ద్వేషము దురభిప్రా యాలు నిర్లక్ష్యము అదృశ్యమైనవి. సానుభూతి కలిగింది. మంచివాడని మరీమరీ అనిపించింది. తనయెడల ప్రవర్తించిందంతా యువకత్వంలోని ప్రేమయొక్క స్వాభావికమని అతనియెడల ఆదరాభిమానాలు కూడా కలుగుతున్నవి. లోగడ హేయపడినందుకు పశ్చాత్తాపపడుతున్నది. పారిజాతం అదృష్టవంతురా లనిపించింది. అతని ముందున్న మసకలో విజయ్‌కుమార్ ప్రతిమకూడా అటుయిటు వెడలుతున్నది. మబ్బులలో దాగుడుమూతలాడుతున్న చంద్రునివలె జిలిబిలిగా గనిపిస్తున్నాడు. "వుత్తరాలు వరుసగా వ్రాస్తానని అభయమిచ్చావు. నేడు అవికూడా కరువైనవి. యెప్పటికొస్తావో యెవరికీ తెలియదు, ఎంతకాలమీ విధంగా వ్యధాభరిత జీవితంలో వుండమంటావు విజయ్!" అని మనస్సులో అనుకుంటుం టుంది.

పారిజాతం అంతర్ధానంతో మహిళామండలిలో స్తబ్దతయేర్పడింది. తేజోమయమైన వెలుగు ఒక్కమాటుగా విహీనమైనట్లు మహిళామండలి లోని వుత్సాహం చప్పబడిపోయింది. మండలిలోని అందరి ముఖాలు మలినత చెందినవి, ఆ వుదాసీనతలో సరళకు వూపిరిసలుపక యింటికి చేరింది.

మహిళామండలివారి ప్రభావంలోపడిన సరళను మలపను చేసిన ప్రయత్నాలు విఫలమైనపుడు రవిప్రసాద్ నిరాశలో మునిగి ఆమెను మర్చిపోవాలని తపస్సుచేశాడు. ఎవరిని మర్చిపోవాలని, ఎవరి విముఖత పొందాలని యెవరిని హృదయంనుంచి తుడిచివేసుకోవాలని అనుకుంటు న్నాడో ఆమెనుగురించిన ఆలోచనలతోనే హృదయం నిండిపో యింది. ఆమెద్వారా సానుభూతయినా దొరుకుటలేదు. కాని తన హృదయం వశందప్పి ఆమెకు బానిసై కూర్చున్నది, తనకు చేతనైతే ఆ మహిళా మండలిని ఒక్కమాటుగా తుడిచివేసేవాడు. ఆ మండలియెడ అనేకవిధాల దురభిప్రాయముంది. అక్కడచేరిన స్త్రీ పతితురాలు కాకుండా వుండ

జాలదని అతని విశ్వాసం. అందుకే సరళను అక్కడకు పోకుండా చేయాలని యెంతో ప్రయత్నంచేసి విఫలుడయ్యాడు. ఆ దుఃఖంతోనే అసమర్థుడై రోగగ్రస్తునివలె జీరాడుతూ అంధకారంలో తవుళ్లాడుతూ కాలాన్ని దొర్లిస్తున్నాడు.

అకస్మాత్తుగా సరళ మహిళామండలి విడిచి యింటికి చేరింది, యిక వెళ్ళదు, అన్నవార్త విన్నపుడు తన శుభగడియలు సమీపించినట్లు ఆనందపడిపోయాడు. ఉత్సాహంలో తడబడలాడుతూ, తన తపస్సు నేటికి ఫలించినట్లు ఆమె యింటికి చేరాడు.

నిరాశలో మునిగి దుఃఖమరుగులతో దొర్లుతూన్న రెండుహృదయాలు యెదుటపడినపుడు రెండువైపులనుంచి కన్నీరు కారుతవి. ఆప్యాయత లుబికి అధరాలు అదురుతవి. అవి పెల్లుబికే సానుభూతి చిహ్నాలుకావచ్చు. ఆత్మీయతలో ఆత్మక్షోభను వ్యక్తపర్చుకోవటం గావచ్చు.

ఆమె ఎంతప్రయత్నించుకున్నా కంఠము సాఫీగాలేదు. బరువుతో వణుకు బయల్పడుతున్న కంఠంతో "అంతగా చిక్కిపోయావేమిటి రవి?" అని ప్రశ్నించింది.

క్షణపాటు శిరస్సు వంచుకుని తిరిగి ఆమెవైపు చూశాడు. నయనాలు అశ్రుభరితమైనవి. ఏమి సమాధానం చెప్పాలనుకున్నాడోగాని గొంతు పెగలలేదు. అధోముఖం చేశాడు.

"రా, కూర్చో రవి." అంటూ భుజంమీద చేయివేసి గదిలో కుర్చీమీద ఆసీనుని చేయించింది. తాను టేబులుకు దూరంగానున్న కుర్చీలో కూర్చున్నది.

"మాట్లాడవేమిటి రవి?" అన్నది.

"మళ్ళీ ఆ మండలివారివద్దకు వెళతావా?" అన్నాడు.

"నీకు వాళ్ళంటే మహా కోపంగదూ!" అన్నది.

మౌనం వహించాడు.

"మాట్లాడవేమిటి రవి?" అన్నది.

"మహిళామండలి మహా హీనమైంది. అక్కడికి పోబోకు సరళా" అన్నాడు.

ఆమె నవ్వటానికి ప్రయత్నిస్తూ "ఇక అటుపోవలసిన అవుసరం లేదు రవి" అని నిరాసక్తతతో అన్నది.

వుత్సుకభరిత కంఠంతో "ఏమిజరిగింది, యెందుకని?" అని ప్రశ్నించాడు.

జరిగిన విషయాలు గోప్యంగానే వుంచాలని వాంఛ. కాని చెప్పకుండా వుండలేకపోతున్నది. "నేను యెవరి పరిచయంతో, ప్రోత్సాహంతో వెళ్లానో ఆ పారిజాతం అక్కడనుంచి వెళ్ళిపోయింది, రవి" అన్నది.

ఆదుర్దాతో "యెక్కడికెళ్ళింది, యేమయింది?"అని ప్రశ్నించాడు.

"మండలి వదిలి యింటికివెళ్ళిపోయింది"అన్నది.

అతను చూస్తూ వుండిపోయాడు. ఆ మాటద్వారా వుత్సాహమూ కలుగలేదు, వుదాసీనతా కలుగలేదు.

అంతటితో ఆమె ఆగలేక "పారిజాతం సకలానంద్‌ను తీసుకుని యెక్కడికో లేచిపోయింది, ఈ విషయం మరెవరితో చెప్పబోకు" అన్నది.



357

# 47. నిజస్వరూపం

అతని ముఖంమీద ఒక మెరుపు మెరసినట్లయింది. వుత్సాహంతో "పారిజాతంకొరకే విశ్వనాధం వారిలో చేరిపోయాడని వదంతిగా చెప్పుకున్నారు గదా?" అని ప్రశ్నించాడు.

సంకోచిస్తూ తడబడుతున్నది. కాని ఆ విషయాలను చెప్పాలనే వుత్సాహం పెల్లుబుకుతున్నది. మనస్సులోనే మథ్యంగా వుంచుకోవాలంటే వూపిరి సలుపుటలేదు: "రవి: నీముందు దాయలేక చెబుతున్నాను. కాని విని మర్చిపోవాలి. పారిజాతం మాటలమోజులో వెళ్ళిన విశ్వనాధం మహిళామండలిలోని వనజతో అంతకుముందే లేచిపోయాడు" అన్నది. ఇపుడామెలోని వుదాసీనత లేదు.

"మహిళామండలి యెలాంటి నిలయమో యిప్పటికయినా తెలిసిందా? అక్కడికి పోవటము, వారి సాంపర్క్యాన్ని పెంచుకోవటం అంత క్షేమంగాదని ఆరోజు అంటే నీకు బాధ గలిగింది. ఈ రోజయినా యధార్ధస్వరూపం అర్ధంచేసుకోగలిగినందుకు ఆనందం" అన్నాడు.

"అలా వెళ్ళేవారు యెక్కడున్నా వెళ్ళటం జరుగవచ్చు రవి. వారు వెళ్ళిపోవుటలో మండలివారి దోషం యేమాత్రం లేదు" అన్నది.

"తిరిగి పొరపాటుగా యింకా వారినే సమర్ధిస్తున్నావు. అలాంటి అభిప్రాయాలు కలుగటానికి, పరస్పర సాంపర్క్యం ఘనిష్టత చెందటానికి, వెళ్ళిపోవటానికి మండలి అనేది సదవకాశాలు కల్పించు కేంద్రం కాదని యెలా అనగలవు?" అన్నాడు.

"అది నీ గొప్ప పొరపాటు, సకలానంద్ అక్కడికి రాకపోకలు సాగించించెందుకో నీకు తెలియదేమో, నాకొరకే. నన్ను వలలో వేసు

కోవాలనే, నేను సన్నిహితంగా మాట్లాడేదాన్నికూడా! అయినా నన్నేమి చేయగలిగాడు చెప్పు?" అన్నపుడు విస్తుపోయాడు.

"సకలానంద్ నీతో యేమి మాట్లాడాడు? ఏమడిగాడు?" అని ఆదుర్దాతో ప్రశ్నించాడు.

"ఒకప్పుడు అతనిని ద్వేషించాను, కోపంతో నిందించాను. కాని నేడు అతనినిగురించి నాకు ఫిర్యాదులేదు. సానుభూతి మిగిలింది" అన్నది.

"నేడు అతను జేసిన ఘనకార్యమేముంది, సానుభూతిచూపను! సజ్జనుడు సాధుస్వభావి అయితే నిన్ను వెంటాడుతూ మహిళామండలిలో చేరతాడా చెప్పు?" అన్నాడు.

"ప్రేమాగ్నిలో పడినవారు యేమయినా చేయగలుగుతారు. ప్రేమించిన స్త్రీకొరకు ప్రాణత్యాగమైనా చేయగలుగుతారు రవి" అన్నది.

"అయితే యిదేనా ప్రేమ! నిన్ను ప్రేమించినవాడు పారిజాతంతో పారిపోవటమెందుకు?" అన్నాడు.

"ప్రేమ అంతస్తు అన్నిచోట్ల ఒకేరీతిలో వుండదు. నదిలోతు అంతటా ఒకేవిధంగా వుండదు, ఒకే వడి వుండదు. ఒకవైపునుంచి పెరిగే ప్రేమ, రెండోవైపు ప్రేరణ యేమాత్రమూ లేకుండా పెరిగే ప్రేమ యే సమయంలోనైనా పేలవత్వం పొందవచ్చు. అక్కడ వారి దోషమని యెలా అనగలం!" అన్నది.

"అది పవిత్రప్రేమ రూపంగాదు. పరిస్థితులకు లొంగనిది, చెదరనిది, మార్పురానిది, యెదుటివారు యేమిచేసినా లక్ష్యంచేయని దీక్షలో ముందుకు పోవునది పవిత్రప్రేమ. ప్రేమకు ఆహూతి కావచ్చుగాని ప్రేమను మరొకరికొరకు ఆహూతిచేయుట అధమలక్షణం. అతనికి నిజంగా నీయడల పవిత్రప్రేమ వుంటే పారిజాతంతో వెళ్ళివుండడు" అన్నాడు.

ఆమె చిన్నగా నవ్వుతూ "నీవు గ్రంథాలలోని ప్రేమను వల్లిస్తున్నావు. అతను తన అనుభవాన్ని యదార్థరూపంలో చూపించాడు. కనుక యేది విలువైంది చెప్పు?" అన్నది.

"గ్రంథాలలో చదివినవే మనస్సులో పాతుకుపోతే పొరపాటా. అన్నిటిని ప్రతిఒక్కరు అనుభవంద్వారా నిర్ధారించుకుని నడువలేరు. లోకానుభవంలోని యదార్థస్వరూపాలు మనస్సులో నాటుకుపోతవి. అది దోషంగాదు" అన్నాడు.

"నీవు ప్రకటించే పవిత్రప్రేమ యెంత యదార్థమైందో, దోష రహితమో, అతను తన స్వవ్యవహారం చూపింది చేసిందికూడా అంత యదార్థమైంది, దోషరహితమైందే"అన్నది.

"పవిత్రప్రేమలో అయ్యే ఆహుతికి, త్యాగానికి విలువేలేదం టావా?" అన్నాడు.

"ఆహుతి చేయటానికని, త్యాగం చేయించటానికని ప్రేమ వుద్భ వించదు. నదులు సముద్రంకొరకనిగాదు పరువులెత్తేది పల్లానికి గనుక పరువులెడుతవి" అన్నది.

లలాటంమీద చేయివేసుకుని దీర్ఘనిట్టూర్పు విడుస్తూ "నీ మాటలు నాకర్థంగావు. ఒకరిని ప్రేమించి మరొకరితో వివాహమాడుట దోషం గాకపోతే, యిక యీ లోకంలో దోషమనేదేలేదు" అన్నాడు.

"పెరిగేచెట్టు వేరులను పెంచుకుంటుంది. ఓ ప్రక్కకు పెరుగు తున్న దృఢమైన వేరుకు పెద్దరాతిచెట్టు తగిలినపుడు ఆ వేరు మరో మలుపుకు తిరిగి తన నైజాన్ని వృద్ధి చేసుకుంటుంది. ప్రేమలోకంలో అడుగుబెట్టినపుడు, కంటికి కనిపించిన యే ఒకరిమీదో నిలువవచ్చు కాని తీరా సన్నిధికి చేరినపుడు అనుకూలించకపోవుట, ప్రక్కన మరో అవకాశం లభించుటలో అటు లగ్నంకావచ్చు. అందు అపరాధ మేముంది!" అన్నది.

"స్నేహంగా కలిసిమెలిసి వుంటున్నా ఒక స్త్రీ పురుషులలో, పురుషుని హృదయంలో ప్రేమంకురించి, అల్లుకుపోయి స్థిరపడిపోయాక అందికూడా అందనట్లు ఆ స్త్రీ దూరమవుతూ కనిపించినపుడు ఆ పురుషుడు విముఖుడై మరోమార్గం త్రొక్కవచ్చా చెప్పు?" అన్నాడు.

"ప్రేమ యీ నీతులకు నియమాలకు అతీతమైంది రవి! ప్రేమలో జరిగే త్యాగాలు, ఆత్మార్పణలు, ఆహుతులు వివశతతో జరిగేవి. అవి వాంఛించి చేసేవిగావు. అనివార్య ప్రేరణలతో జరిగేవి. ఆ స్థాయికి

పోయిన ప్రేమ వారి అధీనం తప్పి వుంటుంది. ఆ స్థాయికి చేరేటందుకు కూడా హేతువులు ముఖ్యమే!" అన్నది.

వంటశాలనుంచి బయటకు వచ్చిన సరళతల్లి "అబ్బాయి రవీ! వచ్చావా నాయనా, నిన్నటినుంచి యెన్నోమారు లనుకున్నాను. నీవు లేనపుడు రవే మాకు సందడి సరళా! నాలుగురోజులు రవి రాకపోతే బెంగగా వుండేది. చదువు వదిలినా రవి మన యింటికి రావటం మానలేదు." అన్నది.

సరళ ప్రేమలొలుకు జాలిదృక్కులను వోమాటు రవివైపు బరపింది. "రవి చిక్కిపోయాడెందుకమ్మా" అన్నది.

"గారాబాలతోను చదువులతోను నిన్ను నేను యెందుకూ గాకుండా జేశానని మీనాన్న అన్నట్లే, వాళ్ల నాన్నా నిత్యమూ తగాదా...."అన్నది.

"మీనాన్న యేమి చేయమంటున్నాడు రవి?"అని ప్రశ్నించింది సరళ.

"ఏమంటాడు, చదవమంటుండేవాడు. యిపుడు అదిమాని వ్యాపారంలో దిగమంటున్నాడు .పెళ్లి చేసుకోమంటున్నాడు." అని సరళ తల్లి అన్నది.

"మీనాన్న చెబుతున్నది బాగున్నది. అలా చేయరాదా రవి" అన్నది సరళ.

"మీనాన్న చెబుతున్నది నీవు చేస్తుంటేగా, వాళ్ల నాన్న చెప్పింది వాడుచేయను? మీయిద్దరు చదివింది మొండిచదువేగా!" అంటూ ఆమె లోపలకు వెళ్లిపోయింది.

రవి వెర్రివానివలె సరళవైపే చూస్తున్నాడు.

"క్రొత్తగా చూస్తున్నావేమిటి?" అని ప్రశ్నించింది సరళ.

దీనవదనుడై బరువు కంఠంతో"మానాన్న చెప్పింది యేమి చేయమంటావో చెప్పు?" అన్నాడు.

"ఈవిషయాని కంత బేలపోతావెందుకు? చదువుకు స్వస్తి జెప్పినపుడు వ్యాపారంలో జేరుట చాలామంచిది. వివాహం చేసుకోవటం అంతకంటె మంచిది." అన్నది.

"వివాహం చేసుకోవాలని నాకున్నది. కాని రెండో ప్రక్కనుంచి సుముఖత కావాలిగదా!" అన్నాడు.

"సుముఖతకు తెచ్చుకోవాలి." అని మామూలు ధోరణిలో అన్నది.

రవి ధైర్యాన్నికూడాదీసుకుని, తన కుర్చీని ఆమెకు దగ్గరగా జరుపుకుంటూ "నీకావిషయం చెప్పలేక లోలోపలే కుమిలిపోతున్నాను. నీవు వివాహానికి సరేనంటే నాజీవితం ధన్యమవుతుంది సరళా" అన్నాడు.

ఆమె గుండెలు ఝల్లుమన్నవి. శరీరమంతా తేళ్లు పాకినట్లయింది. తాను క్లాసులో ఇచ్చిన చనువు,సన్నిహితము స్మృతిపధంలో దొర్లినవి. విచక్షణారహితంగా తాను మితిమించినడచినవన్నీ ఒక్కటొక్కటిగా దొర్లినపుడు ప్రక్క మసక మసకగా ఆ తరువాత ప్రవేశించిన విజయ్ కూడా గనిపించినట్లయింది. ఆలోచిస్తున్నకొంది తన అపరాధమే అధికంగా వున్నట్లు సుస్పష్టంగా గనిపించి కంపిస్తున్నది. ఆనాడు తాను అంత సన్నిహిత మెందుకుకావాలి! చనువెందుకివ్వాలి! ఇలాంటి ఆలోచనలకు అవకాశ మెందుకివ్వాలి! అపుడు తన మనస్సులోను తెలియని అనురాగాంకురాలున్న వేమో! విజయ్ ప్రవేశంతో అవి అణగారిపోయిన వేమో! ఏమిచేస్తే యేమిజరుగుతుందో కొన్ని కొన్ని పర్యవసానాలు బొత్తిగా తెలుసుకోలేదు. ఇందు తన అపరాధ మెంతవరకు, అని ఆలోచిస్తుంటే ఆమె బుర్ర వేడెక్కిపోతున్నది. మరో ప్రక్క విజయ్ తనకు ప్రప్రధమంగా ఆ పరీక్షలలో రక్షించుటనుంచి జరిగినవన్నీకూడా వరుసగా మనస్సులో మెదులుతున్నవి. మిణుకుమిణుకుమనే వోనక్షత్రంవలె రవి గనిపిస్తుంటే సర్వాన్ని మెరమెరలాడించే మెరుపువలె గనిపిస్తున్నాడు విజయ్. ఇక్కడినుంచి పారిపోయి అమాంతం విజయ్‌వడిలో దూకి తనను తాను రక్షించుకోవాలనిపిస్తున్నది. సమర్ధుడు, యోగ్యుడు, వీరుడుగాను, రక్షకుడుగాను, ధర్మమూర్తిగాను విజయ్ గనిపిస్తున్నాడు. రవి అమాయకుడు, వెర్రివాడు, అప్రయోజకుడుగాను గనిపిస్తున్నాడు.

ఆలోచనలతో శిరస్సు దిమ్మెత్తిపోతున్నది. కన్నీరు క్రమ్ముతున్నది. బరువు కంఠంతో "రవీ! చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను, నన్ను క్షమించు." అన్నది.

అంతరార్థం అర్థంకాక వెలవెలబోతూ "క్షమించట మెందుకు, ఏముంది?" అన్నాడు.

ఇంతకుముందే సకలానంద్‌ను గురించిన చర్చలో రవి వాదించిన ప్రతిమాట ప్రతిధ్వనించి కొరడా దెబ్బలవలె నొప్పిని గలిగిస్తున్నవి. పవిత్రమైన ప్రేమనుగురించిన అతని వుద్దేశ్యాలు అతి దృఢమైనవి. అందుకు ఆహుతిఅయ్యే ధ్వనులుకూడా వున్నవి. సకలానంద్ తన నుంచి తేలికగా తప్పుకుపోగలిగాడు. ఇపుడీ వెర్రివాని పట్టుదల దృఢత్వము యే రూపం ధరిస్తవో! సర్వశరీరము కంపిస్తున్నది. కన్నీటి బొట్లు బయల్పడుతున్నవి.

వినమ్రరూపంలో "నీ మాటలు విన్నాక నా మనస్సంతా కళవళ పడిపోతున్నది రవి. నన్ను గురించి నీ ఆలోచనలు చాలాపొరపాటు. క్షమించి మనస్సును మార్చుకో." అంటూ మొఖానికి చేతు లడ్డంపెట్టుకున్నది.

"ఇది నా పొరపాటుగావచ్చు, మహానేరంగానే వప్పుకుంటాను. ఇపుడు మనస్సును మరల్చుకోవటంచేతగాని విషయం. అందుకు నీవే క్షమించాలి." అన్నాడు సాఫీకంఠంతో.

"ఇందుకు నీవుగాదు నేనే కారకురాలను, నేనే యిలాంటి అవకాశాలను కల్పించాను. నీ ప్రశాంత హృదయంలో చిచ్చురేగుటకు నేను పూర్తికారకురాలను, కాని యిది సర్వనాశన హేతువవుతుంది రవి." అన్నది,

"ఈ దాగుడుమూతలాట చాలావరకు అయిపోయింది. దగ్గరగా వున్నపుడు దూరంగాను, దూరంగా వున్నప్పుడు దగ్గరగాను గనిపిస్తూ, ఆశించినపుడు నిరాశ, నిస్పృహలతో ఆశ గనిపిస్తూ నేటి యీ స్థితికి చేసుకున్నాను. ఇది అనుభవంలో అర్థంకాగలుగుతుందిదప్ప మాటలతో అర్థంగాదు. ఈ స్థితితో విసిగిపోయాను. ఇంకా నామీద యీ పరీక్షా ప్రయోగాలెందుకు సరళా." అన్నాడు.

అది అతనిలోని దృఢత్వమా? వెర్రితనమా? ఆమె చీకాకుచెంది పోతున్నది, అతని మాటలు విరిచినట్లు, అతకనట్లు, పొందికలేనట్లు, వికృతంగాను, విరుద్ధంగానూ, హేళనరూపంగాను ఆమె మనస్సును

కదిపివేస్తున్నవి. ఆవేశము ఆందోళనలు గిరగిర తిరుగుతున్నవి. కళ్ల ముందు కటికి చీకటివలె గనిపించింది. టేబులుమీదనుంచి తీసుకున్న, పెన్సిల్‌ను చేతితో అటూ ఇటూ త్రిప్పుతూ "ఫళ్"మని రెండుగా విరిచి పైచి దూరంగా వేసింది. ఆ విరిచిందీ తెలియదు, పారవైసిందీ తెలియదు, అది యేమిటోకూడా ఆ క్షణంలో తెలియదు. అది ఆ ఆవేశంలో అజ్ఞాతంగా జరిగిపోయింది. అతనిమాటలలోని యే లోపంవలనో ఆ క్షణంలో రవంత సానుభూతికూడా లేకపోయింది. సకలానంద్ చాలా మంచివాడుగా వోప్రక్క గనిపించాడు. అతను తన కొరకు చేయగలనని వ్రాసిన వివరాలు వరుసగాను, తన విముఖతను తెలుసుకున్నపుడు, వేధించకుండా పాసరలాగా పడకుండా తప్పుకుని పారిపోవటంతో హాయిగా పోయిన విధము మనస్సులో మెదిలినపుడు అతను వుత్తముడుగాను, యోగ్యుడుగాను, సమర్థుడుగాను గనిపించాడు. రవియెడల విసగడ రోత కలిగింది. వెంటనే కొరకొరలాడుతూ నిర్లక్ష్యంగా బయటికి వెళ్ళిపోయింది.

రెండుగంటలవరకు కూర్చున్నచోటనే వుండిపోయాడు. జరిగినవి అంతకుముందు జరిగినవి, విద్యార్థి దశలో జరిగినవి వల్లెవేసుకుంటూ, నిట్టూర్పులు విడుచుకుంటూ, తిరిగి సరళవస్తుందని యెదురు చూస్తూ సమయం గడిపాడు. కాని సరళ వంటయింటిలోనే వుండిపోయింది. రగిల్చి హృదయాన్ని కాల్చివేస్తున్న యీ విషయాలను మర్చిపోవాలని తల్లి ప్రక్కజేరి ఆమెను సంతోషపర్చే విషయాలు చెబుతూ సహాయపడుతున్నది. ఆకలి అసలే లేకపోయినా ఆకలవుతున్నదని అక్కడే కూర్చుని అడిగి అడిగి భోంచేసింది.

కాని మనస్సులోని వోభాగం రవితో నిండిపోయింది. అది విరక్తి రూపంగా, తన విషయం విజయ్‌కు సంబంధించి ఆలోచిస్తున్నపుడు, రవిస్థితే తన స్థితిగాతోచి గాభరాచెందింది. తా నలా అంధకారంలో అవ్యక్తంగా చేస్తున్నదిలేదని, తనను విజయ్ ప్రేమిస్తూ సుస్పష్టరీతిలో అభయమిచ్చాడని సంతృప్తి చెందింది. తాను రవితో అంత సన్నిహితంగా సంయమంతో ప్రవర్తించిన రోజులు గుర్తుకు వచ్చినపుడు తనలో తానే నిట్టూర్పులిడుస్తూ రవియెడల సానుభూతి పొందింది. ఆనాటి

తన భావాలను గుర్తుదెచ్చుకో ప్రయత్నిస్తున్నది. స్పష్టరూపంలో గుర్తుకు రావటంలేదు. ఒక విధంగా తానూ అతనిని ఆదరించి అభిమానించి ప్రేమించినట్లే తోచినపుడు, అపరాధంలో తనభాగమే యెక్కువైనట్లు వూహించినపుడు హృదయం కల్లోలపడింది. తాను రవితో ఆ రోజుల్లో యింకా యింకా సన్నిహితంగా ప్రవర్తించిన దృశ్యాలు గమనానికొచ్చినపుడు ఖంగారుపడిపోయింది. తన మనస్సుకు తానే అపరాధిగా తోచి
నపుడు ఖంగారుపడిపోయింది. తన మనస్సుకుతానే అపరాధిగా తోచి
నపుడు రవి యెడల కరుణ గలిగింది.

కాని విజయ్ మెరుపువలె దృష్టిముందు నిలిచాడు. విజయ్‌తో కలిసిన సమయాలు కొద్దిఅయినా అవి అత్యధిక ఆకర్షణీయమైనవి. మత్తుతో ముంచుతున్నవి. గర్వంతో నింపుతున్నవి. ఖైదీగా కట్టివేస్తున్నవి. ఇంత యెడబాటయినా అతని దృశ్యాలు మృదుమధుర స్మృతులుగా ముందు నిలిచి వుత్సాహాన్నిస్తున్నవి. అన్నివైపులా ఆలోచనలు చేసింది. విజయ్‌ను తాను మరువలేదు. విడనాడలేదు. ఆయనకు శాశ్వతంగా తాను బలిఅయిపోతుంది. ఆయన ముందు తాను వోడిపోయింది. ఆత్మార్పణ చేసుకున్నది. వేరుగాగలశక్తి తనకులేదు. ఈ విషయంలో తా నసమర్థురాలు. తన స్థితిలాంటిదే రవిదైవుంటే! ఆమె హృదయం కంపించింది. రవి యెడల జాలిగలిగింది. తాను అలాంటి బాధితుని నిర్దాక్షిణ్యంగా నిర్లక్ష్యంతో శిక్షించుటెంత అమానుషత్వం! పోయి సానుభూతితో వోదార్చాలనిపించింది. ఆ ద్వారా అతనిలోని వెర్రిభ్రమ మరింత పెరిగి అనర్థకానికే దారిదీస్తే! అనిపించింది. తనకొరకు ఒకరు చెడిపోతుంటే చూస్తూ హేళనకు విడువటం క్షేమంగాదనిపించింది. వెంటనే తన రీడింగు రూముకు వెళ్ళింది. అక్కడ రవిలేదు. తచ్చట్లాడుతూ అటూ ఇటూ తిరిగిచూసి యీజీచైర్‌లో కూలబడి అంతంలేని ఆలోచనలలో మునిగిపోయింది.ఆ యాలోచనలతో తనమీద తనకే రోత కలిగింది. రవిమీద జాలిగలిగింది. తిరిగి బాధగా తోచింది. విజయ్ జాబిలినిబోలి కనిపించాడు. మృదుమధురమైన తన శీతలదృశ్యాలతోను స్పర్శలతోను జాబిలి కొందరిని తపింపజేస్తూ మరికొందరిని మహదానందాబ్ధిలో మునకలు వేయించునట్లు, యీ విజయ్ యెప్పుడూ యిలానే

అందీ అందకుండా ఆవేదనలతో ముంచుతాదేమోనన్న భీతిగలిగింది. అయినా అతనివైపు మనస్సు పరువులెడుతున్నది. ఆలోచనలలో కను మోడ్చింది.

ఒక పెద్ద కల. ఆ కలలో, తాను యీ బాధలతో భయంవేసి విజయ్‌ను వెంటబెట్టుకుని మరో లోకానికి చేరింది. ఒక మహానగర వీధిలో విజయ్ చేయిపట్టుకుని ముందుకు పోతుంటే, దేవత లందరు ముందుకొచ్చి ఆనందంతో ఆహ్వానించి తీసుకెళుతున్నారు. సుగంధాలను విరజిమ్ముతున్న నవరంగిత పుష్పాలను చిమ్ముతూ ముందుకు బోతు న్నారు. అకస్మాత్తుగా రవి యెదుట నిలిచి అడ్డగిస్తూ ద్వితీయ హస్తాన్ని బట్టి"సరళా, యీఅన్యాయాన్ని నేను సహించను. నీవు నాదానివి. ఆవిషయం నీఅంతరాత్మకు తెలుసు. నేడు వ్యామోహంతో నాయదార్థ ప్రేమను తృణీకరిస్తున్నావు. ఇది పవిత్రప్రేమ యెడల ద్రోహమవుతుంది. నిన్ను నేను ఆనాడు యీనాడు ఒకేరూపంలో ప్రేమిస్తున్నాను, ఆనాటి కంటె యీనాడు నాలోనిప్రేమ పవిత్రమైంది, వ్యక్తిత్వం కలిగింది, వికాసం పొందింది. నాప్రేమకు విలువలేక పోవచ్చు, నా ప్రేమతపస్సుకు ఫలితం లేకపోవచ్చు, నీమీద నాకాధిఖ్యత లేకపోవచ్చు, కాని ఒకనాడు నీమనస్సూ నావైపు మొగ్గింది, ఆవిషయం కాదనలేవు. నేడు మెరపులలో మోజులలో నన్ను విస్మరించవచ్చు. కాని నేను విస్మరించలేను. నీపొరపాటును నీవు గుర్తించు సరళా! నీవు నాదానివి సరళా. నేను నిన్ను విడువను. నీకొరకు నేను సర్వస్వాన్ని అర్పిస్తాను. అంతమువరకు పోరాడతాను." అంటూ సరళను నిలిపివేశాడు. సరళ వణికిపోతూ ప్రక్కనున్న విజయ్‌ను చూస్తున్నది. విజయ్ అపరాధివలె బెదురుతూ ఆహ్వానిస్తున్నవారివైపు చూశాడు.

ఆహ్వానిస్తున్న దేవకన్యలు రవివైపు ఉదారదృక్కులను ప్రసరిస్తూ"ప్రేమికురాలిని ప్రేమతో, త్యాగంతో, ఆత్మార్పణతో జయించాలి గాని పోరాటంతో జయించలేవు మహాశయా! సహనంతో గూడిన త్యాగం గావాలి. మీప్రేమలో పవిత్రత వుంటే తప్పక మీదే విజయం. ప్రేమికురాలి మనస్సును యేసందర్భంలోను నొప్పించకుండా ఆత్మార్పణ చేసుకుని నిష్కామ ఆరాధకుడవుగా నిలిచిననాడు నీ ప్రేమదేవతను

నీవు యదార్ధరూపంలో పొందగలవు. వారికి అడ్డు తొలగి కొలువుకి వెంటగండి. మీఫిర్యాదును దేవదేవులు విచారిస్తారు." అన్నారు.

రవిప్రసాద్ మారుమాట లేకుండా ఆమెచేయి విడచి, వారి వెనుక నడిచాడు.

ధర్మాసనాధీశుడైన దేవదేవుని ముందు సరళ, ఆమె కిరువైపుల విజయ్‌కుమార్, రవిప్రసాద్‌లు నిలిచివున్నారు. ప్రేక్షకులుగా దేవ కన్యలు మాత్రమే వుండిపోయారు.

"సరళ తనదని, రవిప్రసాద్ ఫిర్యాదు. కనుక తిరిగి అతనిని ప్రశ్నించవలసిన పనిలేదు. నీతరఫుగా చెప్పగలిగేదేమిటో వివరంగా చెప్పు విజయ్‌కుమార్" అని ప్రశ్నించాడు దేవదేవుడు.

"అందాలు చిందించే చిన్నారినిచూసిన ప్రతిపురుషుడు కోరుట, ప్రేమించుట, పొందుటకు పోరాడుట సర్వసామాన్యము. అది హక్కు కాదు. ఆమె పూర్ణస్వతంత్రురాలు. ఆమె యెవరినికోరి స్వీకరించగోరితే వారిదేహక్కు. కనుక ఆమె కోర్కెను తీర్పుగా భావిస్తాను" అన్నాడు విజయ్.

దేవదేవుడు ఆమెవైపు చూస్తున్నాడు. ఆమె శక్తి క్షీణించింది. అదురుతున్న అధరాలతో అధోముఖంచేసింది. కంపిస్తున్న పాదాలను చూస్తూ ఆమె ముఖాన్ని చూడాలని ప్రయత్నించాడు. కాని సందర్భ పడలేదు.

"నా ఫిర్యాదును వుపసంహరించుకున్నాను. నా పొరపాటును గ్రహించుకున్నాను. నేను ప్రేమించిన సరళ యీామె కాదు. రూపురేఖ లనుబట్టి ఆమెగా భ్రమపడ్డాను. ఈమె యెవరో నాకు తెలియని మరొక సరళ. ఈమెతో నాకు సంబంధంలేదు. నా సరళ దేవత. ఆమె ఆరాధ నలో నా జీవితాన్ని తరింపజేసుకుంటాను. ఆమె పవిత్రురాలు. ఆమెను కళంకపర్చే యీ ఫిర్యాదుచేసిన నన్ను శిక్షించండి ప్రభూ" అని గాద్గదికంగా అన్నాడు రవి.

సరళ చిన్నగా శిరస్సుయెత్తి అటూ ఇటూ చూస్తున్నది. రవి చెప్పింది పరమసత్యంగా అనిపించింది. తను నిజంగా ఆ సరళ కాదు.

తనలో యెక్కడో గొప్ప పొరపాటున్నది. అందుకే మనస్సు కంపిస్తున్నది. భయపడిపోతున్నది.

"త్యాగం ప్రేమకు జీవంలాంటిది. ఎవరి ప్రేమలో త్యాగముందో వారే పొందాలని తీర్పుగా ఆశీర్వదిస్తున్నాను." అంటూ హస్తంపైకెత్తి ఆశీర్వదించాడు దేవదేవుడు.

సరళ మంత్రించబడినట్లు రవి హస్తాన్ని పట్టుకుని పయనమైపోతున్నది. విజయ్ అక్కడే నిలిచి నివ్వెరపోతూ "సరళా! ఒక్కమాటు యిటు చూడకుండానే వెళ్లిపోతున్నావు. ఆగు" అంటూ వారి ముందుకొచ్చి, వారిశిరస్సులమీద చేతులుంచి "అన్యోన్యంగా సుఖంగా వుండాలని ఆశీర్వదిస్తున్నాను." అన్నాడు.

సరళ శరీరంలోని శక్తి లాగివేయబడినట్లు క్షీణించినట్లు క్రింద కూలబడిపోయింది. వెనుకనున్న దిమ్మకు 'ఫట్'మని శిరస్సు తగిలింది.

"అబ్బ!" అంటూ నిద్రమేల్కొని శిరస్సు తవుడుకుంటున్నది సరళ. కలను గురించి తిరిగి ఆలోచనలు చేస్తుంటే యెంతో విచిత్రంగా వుంది. ఎదుట యెవ్వరూలేరు. అది యేలోకమూ గాదు. తన గదిలోనే యీజీ ఛెర్‌లో వున్నది.

రవి, విజయ్‌లను పోల్చుకుంటున్నది. ఇద్దరు యెదుట నిలిచినట్లే వుంది. ఇరువురూ విశ్వాసపాత్రులు, ఇరువురూ ప్రాణాలను తృణప్రాయంగా ధారవోయగలవారు. ఒకడు అడుగుజాడల్లో వినమ్రులైనడిచేవారైతే మరొకరు ఆకర్షించి మత్తులోముంచి అడుగుజాడల్లో నడిపించేవారు, ఒకరు ప్రశాంత స్వరూప నిర్మల యమున అయితే మరొకరు ధర ధరలాడుతూ పరువులెత్తు తేజోవంతమైన గంగ.

నవయవ్వన పొంగులలోని హృదయం గంగనే ఆకర్షిస్తుంది. గొప్ప విజేతవలె విజయ్ గనిపిస్తున్నాడు. విజయ్‌వైపే మనస్సు మొగ్గుతున్నది. విజయ్‌ను స్పష్టరూపంలో ప్రేమించింది. ఇరువురి మధ్య పూర్ణరూపురేఖలు పొందినవి. పరస్పరంగా కట్టుబడిపోయాడు. అవుసరమైన బాసలు చేసుకున్నారు. అభయాలు జరిగిపోయినవి. తాను స్పష్టంగా విజయ్‌ను వరించింది, ఆలోచనలు యెన్నిచేసినా ఆ నిర్ణయా

నికి మార్పులేదు మార్పులేదు. అయినా రవి యెడల సానుభూతి కలుగు తున్నది.

ఇదేవిషయాలతో వుక్కిరి బిక్కిరై గదిలో పచార్లుచేస్తు న్నది. రవిని చూడాలని ఆదుర్దా కలిగింది. వెంటనే రవి యింటికి బయలుదేరింది.

రవి హతాశుడై గదితలుపులు బిగించుకొని, ఏకాంతంలో ఆత్మ పరిశీలన చేసుకో ప్రయత్నిస్తున్నాడు. సరళ మనస్తత్వాన్ని వెతుక్కుంటు న్నాడు. ఒక కోణంలో చూస్తుంటే మరోకోణం మీదకొస్తున్నది. ఒక కోణం ఆశను కలిపిస్తే మరోకోణం నిరాశను నింపుతున్నది. పరిశోధన ఫలితం అంతా అయోమయం. నిట్టూర్పులిడుస్తూ అన్యమార్గాన్వేషణకు కూడా ఆలోచనలు జరుగుతున్నవి, కాని అందు తానశక్తుడని తేలి పోయింది. ఆమెను మర్చిపోలేడు. దూరంకాలేడు. హృదయ కుహరంలో శాశ్వత పీఠమేసుకు కూర్చున్నది. తన జీవితానికిది తీరని సమస్య.

తలుపు రెక్కలమీద యెవరో "టక్, టక్"మని మ్రోగిస్తున్నారు. మూతలు బడుతున్న నేత్రాలను తెరచిచూశాడు రవి. తన తల్లి కేకలు వేస్తుందిగాని యిలా మ్రోగించదు. తలుపుదీసి ఆశ్చర్యపోయాడు. తాను యెవరినిగురించి యెన్నెన్ని విధాల ఆలోచనలుచేస్తూ విసిగిపోయాడో ఆ సరళే ప్రత్యక్షమైంది. పూజామందిరంలో మామూలుగా పూజాదికాలు జరుపుతున్న పూజారిముందు, ప్రత్యక్ష దైవమే సాక్షాత్కరించినట్లయింది.

"చెప్పకుండానే వచ్చేశావేమిటి రవి! కోపమొచ్చిందికదు!" అన్నది.

రవి మాట పలుకూలేకుండా దీనంగా చూస్తున్నాడు.

"క్షమించమని అడగటానికి వచ్చాను రవి!" అన్నది.

ఆనందపడుతూ "నాకు తెలుసు, ఒకనాడు నన్ను అర్థంచేసు కున్నపుడు పశ్చాత్తాప పడతావనుకున్నాను. నేడే జరుగుతుందనుకో లేదు. ఈవిధంగా యింత తొందరలో అదృష్టవంతుడినవుతాననుకో లేదు." అన్నాడు.

ఆమె వెలవెలబోతూ "నీకు యెప్పుడూ పొరపాటు అభిప్రాయమే కలుగుతుంటుంది. అలాంటి విషయాలను యింకా పెంచుకుని అవ్యక్త

మైన వ్యధలకు గురిగావటం మంచిదిగాదు. ఆ అభిప్రాయాన్ని విస్మరిస్తే నీవు యెంతో సన్నిహితంగా గనిపిస్తావు రవి. నీ స్నేహం చెరగనిది." అన్నది.

ముఖాన్ని వికృతం చేసుకుంటూ "ఓహో, యీ గొప్ప వినూత్న సందేశాన్ని వినిపించనా తమరు వచ్చింది. రగిల్చినంత తేలికగాదు ఆర్పుట. సన్నిహితము సాంగత్యము, విషయాలెత్తవోకు సరళ. స్త్రీ పురుష సాంగత్యం యేదో ఒకనాడు ఆ వైపుకే తీసుకెళుతుందని అనుభవంతో తెలుసుకున్నాను." అన్నాడు.

ఆమె జవాబులేక అధోముఖంచేసి యెంతోసేపు కూర్చున్నది. రవి ఆమెవైపే చూస్తున్నాడు. మౌనం గంభీరత వహించింది. ఎవరి హృదయాలలో యే రూప జ్వాలలు చెలరేగుతున్నవో యెవరికి తెలుసు! రెండువైపులనుంచి వస్తున్న నిట్టూర్పులు ఢీకొంటున్నవి. రెండుగంటలు ఆ స్తబ్దత అలానే వుండిపోయింది.

ఆకస్మికంగా సరళలేచి "వెళ్ళివస్తాను రవి" అంటూ వెళ్ళిపోయింది.

# 48. అప్పగింతలు

మలయమతి, బిడ్డ బెంగతో మంచానబడి దీర్ఘరోగిగా తయారైంది. రూపురేఖలు పూర్తిగా మారిపోయినవి. మతికూడా సరిగా వున్నదో లేదో అనిపిస్తుంటుంది. "విజయ్, నా దగ్గరవుండు నాయనా, నామాటవిను యెక్కడికీ పోవద్దు." అని తనలో తానే బిగ్గరగా అనుకుంటుంది. సేవజేస్తున్న బీబీజాన్ చేయిబట్టుకుని కుదిస్తూ "ఛీ పాపిష్టిదానా, నాబిడ్డను పరాయిదేశం పోనిచ్చిందెందుకు! నాబిడ్డను పరదేశంపాలు చేశావా దరిద్రులారా!" అంటుంది.

బీబీజాన్ ఆ చర్యలనుచూస్తూ ఆమెధాతృత్వాన్నిమధురత్వంతోను ఆత్మీయతతోను నిండిన సంభాషణలను, చల్లని వెన్నెలను చిలికినట్లుండే ఆమె నవ్వును గుర్తుకు తెచ్చుకుని కనిపించకుండా కన్నీరు కారుస్తుంటుంది. "విజయ్, యీనాడువచ్చి అమ్మస్థితిచూస్తే, నీ విదేశయాత్ర యెంత సఫలమో నీకే తెలుస్తుంది. ఇంతటి మానవతి, ఉదారనిధి, ధర్మమూర్తి అయిన యీ మాతృదేవతను యీ స్థితికితెచ్చి నీవు దేవేంద్ర పదవినిపొందినా హర్షించతగిందిగాదు."అంటూ విలపిస్తుంటుంది.

మలయమతి సేవలో మునిగిపోయింది. బీబీజాన్‌కు ఆ కార్యంలో విసగడలేమ. మనస్సు లగ్నమవుతున్నది. ఆ సేవలో జీవితాన్ని ఆనందమయంగా గడిపివేయగలదు. కాని అది రోగంకాదు. శోకంతో దహించుకుపోతూన్న నరకబాధ. అందుకే సేవచేస్తూ ఆమె బాధను సహించలేకపోతున్నది. విజయ్ వెళ్ళిపోయి అందరిని మర్చిపోతాడు, అమ్మస్థితి యిలా అవుతుందని కాస్తంత వూహించగలిగినా ఆనాడు తన శక్తి కొలది అడ్డగించేది. ఈ స్థితిలో యింకా యెక్కువకాలం మలయమతి జీవించదని తెలుసు. అందుకే లోలోన దుఃఖిస్తున్నది బీబీజాన్.

నేటి బీబీజాన్‌కూడా మలయమతివలె చిక్కి క్షీణించి శల్యమై

పోయింది. శరీరంలోని మృదుత్వంకూడా నశించింది. ఒక్కమాటుగా వయస్సు ముప్పెరగా పైబడినట్లయింది.

కాఫీగ్లాసు చేతిలో తీసుకుని మలయమతి శయ్యమీద కూర్చుని వినయరూప ప్రార్థన సలుపుతూ "కాఫీనీళ్లయినా త్రాగకపోతే ప్రాణం నిలిచేదెల్లా, అమ్మా!" అన్నది బీబీజాన్.

మలయమతి చేతిలో గ్లాసును ఆవలకునెడుతూ "ఇంకా ప్రాణం వుండి చేసేదేమిటి పిచ్చిదానా, నా ఆశలు తీరిపోయినవి. ఇక జీవించా లనిలేదు." అన్నది.

"క్షణక్షణము అధైర్యపడుటేమిటమ్మా, బాబును గురించి అధైర్యపడకండమ్మా! తప్పక వస్తాడు." అన్నది.

"నన్ను మైదుపుచ్చను పిచ్చిమాటలు మాట్లాడవోకు. వాడు వుంటే నన్ను చూడకుండా యింతకాలం వుండలేడు. వాడు నాబిడ్డగనుక నాలో వున్న అభిమానము గంభీరతలు వాడిలోనూ వున్నవి. కాని వాడి మనస్సు నవనీతంలాంటిది. నన్ను చూడకుండా యెవరూ ఆపలేరు. వాడు లేడు గనుకనే యికరాడు. పోయేటపుడయినా వాడిని ప్రీతితో నవ్వుతూ ఆనందంతో పంపనందుకు నేడు వాపోతున్నాను. బిడ్డను పోగొట్టుకున్న దురదృష్టవంతురాలిని." అంటూ భోరున విలపిస్తున్నది మలయమతి.

బీబీజాన్ వ్యాకులపడిపోతూ "అలాంటి మాటలు నీనోటిమీదుగా రానివ్వకమ్మా, బాబుకు యే కీడయినా సంభవిస్తే తప్పక మనకు తెలిసేది. మొండిపట్టుదలతో చదువుతుంటాడమ్మా. అందువలన మనకు వుత్తరాలు వ్రాయుటలేదు" అన్నది.

మలయమతి కన్నీరుకారుస్తూ "అన్నీ పోయినా నాకింకా మతి పోలేదు. వాడుంటే మనం వ్రాసిన వుత్తరాలు తిరిగి యెందుకొస్తవి? అక్కడి రాయబార కార్యాలయంవారు, అంతుతెలియలేదని యెందుకు వ్రాస్తారు?" అని ప్రశ్నించింది.

"ఉన్నచోటినుంచి మరోటనకు బదిలీకావచ్చు, అది పోస్టువారికి తెలియక మన వుత్తరం తిరిగిరావచ్చు. రాయబార కార్యాలయంవారు అక్కడి పోస్టుడిపార్టుమెంటుకంటె తెలివిగలదని శ్రద్ధగలదని యెవరన గలరు! ఆ కారణాలతో భయపడవద్దమ్మా!" అన్నది బీబీ.

"నా విజయ్ స్వభావం నాకు తెలుసు. నా బిడ్డ నన్ను మర్చిపోడు. నేను చేతులారా వాడిని కోల్పోయాను." అని దుఃఖిస్తుండగా బయట బండి ఆగిన చప్పుడయింది. ఈ మధ్య తరచుగా బంధువులు వస్తూ పోతున్నారు.

"ఎవరో బంధువులొచ్చినట్లున్నదమ్మా!" అని లేవబోయింది బీబీ.

లేవనీయకుండా చేయిబట్టిలాగి వుంచుతూ "నీవిక్కడే వుండు బీబీ, వచ్చిన బంధువులురాకుండా యెక్కడికిపోతారు. నాబిడ్డవస్తే నేలేచి ఆహ్వానిద్దును. వాడిని పోగొట్టుకుని యింకా యేమి పొందటానికి నేను జీవించటం!" అన్నది మలయమతి.

"గొప్ప డిగ్రీలుపొంది కీర్తితో రావాలని వెళ్ళిన బాబు రాకుండా వుండడు. పట్టుదలతో చదువుతూ మనలనుకూడా గుర్తు చేసుకోగూడదని ఏకాగ్రంతో వుండివుంటారమ్మా" అన్నది.

"వాడు నన్నుచూడకుండా యింతకాలం యెన్నడూ...." అని మలయమతి అంటుండగా అసంపూర్తితోనే "అమ్మా, అమ్మా" అన్న పిలుపుతోపాటు బూటుశబ్దం వినిపించింది.

అదే పిలుపు, అదే ధ్వని. బీబీజాన్ తనచేతులలోని మలయమతి చేతిని మృదువుగావుంచి సరసర బయటికి నడిచింది.

వస్తున్న విజయ్‌నుజూచి "బాబూ." అంటూ కౌగలించుకున్నది.

"అమ్మయేది బీబీ," అన్నాడు. ఎంతకాలంనుంచో కూడుకున్న వియోగవ్యధ ఒక్కమాటుగా బయల్పడలేక కంఠంలో అడ్డంపడి బొంగురుగా వినిపించింది.

దప్పికతో గొంతుయెండి అలమటిస్తున్న వారి అధరాలమీద అమృతం చిలికినట్లయింది. ఉత్సాహ ప్రేరితురాలై "బాబూ విజయ్!" అంటూ చివ్వునలేచి క్రిందకు దిగబోయి పాదాలకు దుప్పటి అడ్డంపడి క్రిందకు బోర్లాపడిపోయింది.

శిరస్సు గచ్చునేలకు బలంగా తగిరి చిట్లింది. పెద్దదెబ్బే తగిలింది. చిక్కిశల్యమైన ఆమెలో రక్తం తాలూకు మిగిలినది బొలబొల వలుకుతున్నది.

ఆ గదిముందుకు ప్రవేశించిన విజయ్, బీబీజాన్‌లు కలవరపడి

పోయారు. "అమ్మా" అంటూ గాద్గదిక రోదనలతో ప్రక్కన కూలబడి, ఆమె శిరస్సును వడిలోకి దీసుకుని హృదయానికి అదుముకుంటూ "నా మూర్ఖానికి నీ వెందుకు శిక్షపొందావమ్మా" అంటూ విలపిస్తు న్నాడు.

మలయమతికి స్పృహలేదు, బీబీజాన్ తడిగుడ్డ గాయందగ్గర బెట్టి అదిని రెండోచేతితో ఆమె ముఖంమీద నీటిని చిలుకుతున్నది. మలయ మతి యింతకంటె పడిన దీర్ఘ బాధలను యీ మూడు సంవత్సరాలలో యెన్నోచూసి అలవడింది. అందుకే నేడు ఆమె సామాన్య కార్యంవలె సేవచేస్తున్నది.

విజయ్ తల్లి శిరస్సును హృదయానికి హత్తుకుని కుమిలి కుమిలి విలపిస్తున్నాడు. మండోదరివలె నిండు విగ్రహంగా వుండు తన తల్లి నేడు గోగుపుల్లగా క్షీణించిది. ఆమె యెంత దుఃఖాన్ననుభవిం చిందో, ఆదర్శమూర్తియైన తల్లిని యింతగా దుఃఖపెట్టి తాను పొందిం దేమిటి!

పొర్లుతున్న దుఃఖంతో "నన్ను క్షమించమ్మా. యిక యెన్నటికీ నిన్ను విడచిపోను. నీమాట వినకుండా వెళ్లి నేను పొందిందియేమీ లేదమ్మా, ఈ ఒక్కమాటుకు క్షమించమ్మా" అని విలపిస్తున్నాడు. ఆయన గుడ్డలు రుధిరంతో తడిసిపోతున్నవి.

ముఖంమీద తడిచేత్తో స్పృజిస్తూ, వీవనతో విసురుతున్నది బీబీజాన్. పదినిమిషాల తరువాత మలయమతి నేత్రాలు తెరిచింది. కాని మంచుతెరలో చూసినట్లున్నది. విజయ్ ముఖంకూడా స్పష్టంగా కని పించుటలేదు.

లోతు కంఠంతో వూపిరి లేనిధ్వనితో "బాబూ, నిన్ను యీ జన్మలో చూడలేననుకున్నాను. తల్లిని మర్చిపోయావా తండ్రీ!" అంటూండగా ఆమె కంఠం పూడిపోయింది.

"అమ్మా, నీనోటితో అలాంటి మాటలనవోకమ్మా! ఇక నీమాట యెన్నడూ జవదాటవమ్మా." అంటూ ఆమె ముఖంమీద ముఖంబెట్టి రుద్దుకుంటున్నాడు.

మలయమతి నరాలు లాక్కుపోతున్నవి. వున్నరక్తం కాస్తా కారి

పోయినందున నేత్రదృష్టికూడా క్షీణిస్తున్నది. గొంతు పిడసగడుతున్నది. మాట పెగలక బాధతో "బాబూ, నిన్ను చూశాను. నా అంతిమ ఘడియలు సమీపించినవి. నీ వడిలో వున్నాను. నాకిక యే చింతాలేదు. నేను ధన్యురాలిని. బీబీ నాచేతిలో పెరిగింది. నాకు నచ్చిన స్వభావాలను పొందింది. దాన్ని వుద్ధరించే బాధ్యత నీదిగా వదిలి వెళుతున్నాను నాయనా!" అంటూ ఆయన నొసటి మీద చుంబిచాలని శిరస్సు పైకెత్తి ప్రయత్నిస్తున్నది.

"ఏమిటమ్మా, ఏమికావాలి?" అని రుద్ధకంఠంతో అంటూండగా ఆమె శిరస్సు వ్రేలాడబడి పోయింది. నేత్రాలు తేలిపోయినవి.

విజయ్ "అమ్మా, యిదేమిటమ్మా!" అంటూ పిలువ ప్రయత్నిస్తున్నాడు. బీబీజాన్ "అమ్మా!" అంటూ పెద్దపెట్టున కేకబెడుతూ మలయమతి మీదపడి దొల్లిగింతలు పెడుతున్నది.

విజయ్ శిలాప్రతిమవలె అలానే వుండిపోయాడు. మలయమతి శిరస్సు ఆయన బాహువులలోనే బంధించివుంది.

బీబీజాన్ గుండెలుచెదిరే రోదనలతో యిరుగు పొరుగు అంతా చేరారు. విజయ్ యెవరికీ తెలియకుండా ఆకస్మికంగా రావటము యీ దురంతం జరగటము అందరిని ఆశ్చర్యంలో ముంచివేసింది. కాని అంతకు మించిన దుఃఖము ఆశ్చర్యము కలుగుతున్నది విజయ్ దృశ్యం చూస్తున్నపుడు.

నిప్పుచెండులవలె నేత్రాలు మెరుస్తున్నవి. ఆయనలో దుఃఖము ఆలోచనలు వున్నవో లేదో, ఆయన్ను చూస్తున్నకొంది భయం కలుగుతున్నది. ఆయన వడిలోవున్న శవాన్ని వేరుచేయగల సాహసం ఎవరికీలేదు. మనస్సు పాలుబోక భీతితో ఆలోచనలు అంతరిస్తున్నవి.

కంఠము తెగిపోయిన మొండెము పృధ్వీమీద బడి గిల గిల కొట్టుకొనునట్లు బీబీజాన్ మెలికలు తిరిగిపోతూ రోదనలు చేస్తున్నది. ప్రక్కవారంతా పట్టి ఆమెను వోదార్చారు.

375

# 49. శూన్యం

నాలుగు గంటలు గడిచిపోయినవి. బీబీజాన్ ప్రక్కవారి మాటలను వినిపించుకోగలుగుతున్నది. విజయ్‌ను కదిలించగల ధైర్యమెవరికీ లేకపోయింది. బీబీజాన్‌ను ప్రోత్సహించారు. ఆదుఃఖంలోనే బీబీజాన్ ధైర్యంజేసి, మలయమతి శిరస్సును తనచేతులలోకి తీసుకో ప్రయత్నిస్తూ "అమ్మ నిన్ను దక్కించుకున్నది కాని మనం యిక అమ్మను దక్కించుకోలేము బాబూ!" అన్నది.

ఆయన హస్తాలు బిగించి వున్నవి. వుక్కుగొలుసుముందు ప్రేళ్లు విఫలమవునట్లు, ఆమె చేతులు దూపటలేదు. ఆయన దీర్ఘ వేడిని నిట్టూర్పును మాత్రం విడిచాడు. బీబీలోని మరొక దుఃఖపుమడత పొర్లింది గాబోలు "ధర్మదేవతను పోగొట్టుకున్న దరిద్రులం బాబూ!" అంటూ అతని వడిలోని మలయమతి మీద పడి విలపించసాగింది.

విజయ్ నేత్రాలనుంచి బొటబొట నీరు కారుతున్నది. అధరాలు మెలికలు తిరుగుతున్నవి. నాసికా రంధ్రాలు వుబ్బి బుసలు గొడుతున్నవి. ప్రేక్షకులకు వుత్సాహం కలిగింది. "బాబూ!" అంటూ అతని కంఠానికి హస్తాలు చుట్టింది.

రుద్దకంఠంతో అస్పష్ట శబ్దాలలో బయల్పడుతున్న దుఃఖాన్ని మ్రింగివేస్తూ "దేవతామూర్తియైన అమ్మ సేవలుజేసిన నీవు ధన్యురాలవు. ఆమె ఆత్మీయత పొందిన నీవు పుణ్యమూర్తిని బీబీజాన్!" అంటూ ఆమెను గూడా తన వాటులో యిముడ్చుకున్నాడు. ఇపుడు ఆగలేక కట్టలు త్రెంచుకున్న యేడ్పు బయల్పడుతున్నది.

అందరూ వ్యాకులతలో మునిగికూడా ఆశ్చర్యపోతున్నారు. అతని ఆత్మీయులిరువురను కవుగిటిలో దాచుకుంటున్నాడు, ఒకరు మృతులు మరొకరు సజీవులు. ఆ కవుగిటి బిగింపులో వూపిరి సలుపక సజీవికూడా ప్రాణాలను కోల్పోతుందేమో!

"బిడ్డను చూడటానికే యిన్నాళ్లూ వటిస్తూ జీవించింది. బిడ్డను చూసింది. ప్రాణం విడిచింది! ధన్యాత్మురాలు!" అన్నారు కొందరు.

"రెండుచేతులా దానంచేసింది. ధర్మపథంమీద నడిచింది. కోపం యెలాంటిదో యెరుగదు. అయిష్టకార్యం మీదపడినపుడు మౌనం వహించేది. బిడ్డవడిలో ప్రాణాన్ని విడిచిన పుణ్యాత్మురాలు" అని మరి కొందన్నారు.

"ఆమెలాంటి మానవతిని, పుణ్యవతిని మళ్ళీచూడము. ఆ కుటుంబ కీర్తి ఆమెతో అంతనుయినట్లే." అన్నారు కొందరు.

దహనసంస్కారం సామాన్యరీతిలోనే జరిగిపోయింది. కర్మ కాండ యెప్పుడూయెక్కడా యెన్నడూ జరుగనిరీతిలోజరిగింది.వేలమంది బీదలకు వస్త్రదానాలు జరిగినవి. నాలుగు లారీలమీద బియ్యంచేర్చినపుడు విజయ్‌కు వ్యవహారపరిజ్ఞానంలేక తోలించాడనుకున్నారు. లారీలమీదే పప్పులు కూరగాయలు తోలించినపుడు మతిపోయిం దనుకున్నారు. సామానులన్నీ బియ్యంతోసహా అయిపోయేవరకు వంట సాగించమని వంటవారికి, వచ్చినవారికల్లా వడ్డించమని నౌఖర్లకు చెప్పిన తరువాత నిత్యము వేలసంఖ్యలో దూర దూరాలనుంచి వచ్చి భుజించిపోతున్న పుడు వున్న ఆస్తినంతటిని యీదెబ్బతోనే తుడిచివేయ దలచాడన్నారు. సమయ వివక్షత లేకుండా వది రోజులవరకు అన్నదానం జరిగింది.

"అమ్మ ఆత్మను యీవిధంగా తృప్తిపరచదలచావా బాబూ!" అని బీబీజాన్ అన్నపుడు, ముఖాన్ని చేతులతో కప్పుకుని దుఃఖిస్తూ "నా డీ జాతక వలలోపడి అమ్మమాటను నిర్లక్ష్యం.చేసినందుకు యింత భరించ లేని శిక్షను విధించుట భగవంతునికి న్యాయమా బీబీ" అన్నాడు.

"శిక్ష యెప్పుడూ అపరాధాన్ని అంటిపెట్టుకుని వుంటుంది విజయ్!" అన్నది బీబీ.

"శిక్ష అనుభవించాక అపరాధం హరించి సానుభూతి మిగులు తుందంటారు. సానుభూతి పొందినవానికి సాంత్వన కలుగుతుందంటారు. సాంత్వనలో ఆత్మోన్నతి ఆనందము వుంటుందంటారు. కాని నాకు శిక్ష తరువాత శూన్యందప్ప మిగిలిందేముంది బీబీ!" అన్నాడు.

"అన్నిటిని హరించే, ఆ శూన్యంలోకూడా కాంక్ష వుంటుంది. ఆ కాంక్షకు కావలసినవాటిని సృజించగలశక్తి వుంటుంది" అన్నది.

"అన్నిపోయి శూన్యం మిగిలినపుడు ఆ శూన్యంలో కాంక్ష ఎలా వుంటుంది? అది అసంభవం. ఏమీవుండనిదే శూన్యం" అన్నాడు.

"నిస్పృహలోని శూన్యం నూతన ప్రేరణకు నాంది అవుతుంది. శిధిలాలలోని నిర్మాణం మహత్వపూర్ణమైందికాదని ఎవరనగలరు?" అన్నది.

"ప్రేరణల ఫలితంగా నేను పొందింది సర్వనాశనం. మిగిలింది భ్రమలు" అన్నాడు.

"అంధకారంలాంటి నిస్పృహను ఆశ్రయంచేసుకుని జీవితాన్ని అంతం చేసుకోగూడదు బాబూ! ఆశ వెలుగులాంటిది. ఆశలో విసిగి వేసారినా అదే పయనించదగిన వెలుగుబాట" అన్నది.

"ఆశ, రాక్షసస్వరూపం. ప్రశాంతహృదయాన్ని మాడ్చివేసేది ఆశలు" అన్నాడు.

"ప్రాణాన్ని తీయగల పాషాణమే ప్రాణాన్ని యివ్వగలుగుతుంది. ఆశలు లేకపోతే జీవితవికాసమే వుండదుగదా బాబూ!" అన్నది.

"ఆ వికాస ఆఖరిపరిణామం వికాసరూపం కాదనగలవా?" అన్నాడు.

"ఆశద్వారా కృషి, కృషిద్వారా ఫలితము కలిగేది ఖాయము. సఫలతద్వారా ఆనందము, విఫలతద్వారా అనుభవము కలిగేదికూడా యదార్ధము. విఫలతలోను, వినాశంలోనుపొందే అనుభవం అన్నిటికంటె మూల్యమైందిగదా!" అన్నది.

"అనుభవం ఎంతటిదయినా నిరాశలో అంతమొందే జీవి పొందే దేమిటి?" అన్నాడు.

"విఫలతలలోను దుఃఖాలలోను పొందే దీర్ఘ అనుభవంద్వారా స్వసుఖం లభ్యంగాకపోవచ్చు కాని అది విజ్ఞానభాండారంలో మెరుపుగా నిలుస్తుంది. గీటురాయిగా పనిచేస్తుంది" అన్నది.

"అనుభవంకొరకు విజ్ఞానంకొరకు హృదయంలో చిచ్చుబెట్టు కోవటం యోగ్యమైన పనిగాదు. సాధ్యమయ్యేదీగాదు" అన్నాడు.

"పరిస్థితులకు తలవగ్గక చేయగలిగేదిలేదు. విషమత ఎలాంటి దైనా ఎదుర్కోవటం అనివార్యం. ఆశ అంతమైననాడు జీవితమే అంత మవుతుంది. నిస్పృహ నిరాశను స్వీకరించుట ఆత్మహత్యను ఆహ్వానించుటలాంటిది" అన్నది.

"మృతజీవితంకంటె మృత్యువే ఉత్తమమైంది" అన్నాడు.

"ఆత్మహత్య మహాపాపమని అన్నిమతాలు ఘోషిస్తున్నవిగదా!" అన్నది.

"మతాలకంటె మానవత్వం గొప్పది" అన్నాడు.

"మానవత్వాన్ని సర్వశ్రేష్టము చేయుటే అన్నిమతాల ఆశయము గదా!" అన్నది.

"ఆశయము ఒకటే అయినా అవలంబనలు వేరయినపుడుపొందే ఫలితం వేరుగావచ్చు. ఒకమతం రాళ్ళకు గోపురాలుగట్టి పూజిస్తుంటే మరోమతం బొమ్మకు పూజ సలుపుతున్నది. మరోమతం మతప్రవక్త నిర్వచనలకు పూజ సలుపుతుంటే మరోమతం గోడలముందుజేరి చేతులు చాచి ప్రార్ధనలు సలుపుతున్నది. ఈ విభిన్నవిధానాలు ఒకేచోటికి చేరుస్తవని ఎలా చెప్పగలం!" అన్నాడు.

"పట్టణానికిచేరే మార్గాలు ఏవైపునుంచి వున్నా, అవన్నీ పట్టణంలోకి చేర్చునవేగదా!" అన్నది.

"అన్నీ ఒక మహానగరానికే చేర్చవచ్చు. కాని ఒకటి-ఆ నగరంలోని వైభవోపేతమైన రాజమహల్‌కు చేరిస్తే మరొటి మురికిపేటకు చేరుస్తుంది. చేరినవారి అందరి అనుభూతులు ఒకటి కాజాలవుగదా" అన్నాడు.

"ఒకేవిధమైన అవలంబనలోకూడా ఒకే రూపసిద్ది అందరకు లభ్యమవుతుందనను వీలులేదు. పొందినదానికంటె పొందగోరేది ఒకే రూపమయిందిగా వుంటుంది గనుక ప్రేరణ యేకోన్ముఖంగా వుంటుంది.

ప్రేరణ ప్రధానం, ముందుకు నడిపేది ప్రేరణ. ప్రేరణకుమూలం ఆశ. కనుక ఆశను విడనాడి అంతం గావటానికి .యే ఆశయమూ, మతమూ సమ్మతించదు" అన్నది.

"నీలో మాటలు, తర్కము పెరిగినవి. అవి స్త్రీకి అంత రాణించవు" అన్నాడు.

ఆమె వెంటనే దుఃఖిత వదనంతో అతని పాదాలమీద వాలిపోయి "క్షమించి, అపార్థం చేసుకోబోకు విజయ్! నాలోని విజ్ఞత ప్రకటించుకోను మాట్లాడలేదు. నీ నిస్పృహను పోగొట్టి వుత్సాహపర్చాలనే ఆదుర్దాతో మాట్లాడాను దప్ప మరేంలేదుబాబూ!" అంటూ కన్నీరు కార్చింది.

తర్కంలోని యే కోణమూ లొంగదీయజాలని అతని మనస్సును ఆ వెచ్చటి అశ్రు బిందువుల పాదాభిషేకం వూపివేసింది.

ఆమె శిరస్సునుబట్టి లేవనెత్తి కపోలాలమీదమెరుస్తున్న కన్నీటిని అంగుళీయంతో తుడిచివేస్తూ "ఆదరంలోని మందలింపుకు బేలపోగూడదు! తర్కం తప్పుగాదు. కాని స్త్రీకి అన్నివేళలా అది రాణించదు. అంతే!" అంటూ ముఖంలో ముఖంబెట్టి చూస్తున్నాడు.

ఆమెలోని భయము బెరుకు బోయి సిగ్గు వుదయించింది. శిరస్సు క్రిందకు దించివేసుకుంటూ నిట్టూర్పు విడిచింది.

ఆమె కురులను సరిదిద్దుతూ "అమ్మకు నీవు చేసిన సేవ ఆ లోకంలో వుండికూడా మరువలేదు. ఆమె మనస్సును పూర్తిగా ఆక్రమించి వేశావు. అందుకే ఆమె తన ఆఖరికోర్కెగా నీ జీవితాన్ని వుద్ధరించవమని కోరింది. ఆమె కోర్కెను యే రూపంగా సఫలంచేయగలనో తోచుటలేదు. ఏమి చేస్తే అమ్మఆత్మ సంతోషిస్తుందో, ఎన్నోవిధాల ఆలోచించి విఫలుణ్ణవుతున్నాను" అన్నాడు.

"నన్నుగురించి నీవు బాధపడవద్దు లే విజయ్" అన్నది ఆమె.

"అమ్మ మాటను నిర్లక్ష్యం చేసేంత ద్రోహినిగాదు" అన్నాడు.

ఆమె మౌనం వహించి వూరుకున్నది.

మలయమతి కర్మకాండఐపోయిన రెండువారాల వరకు యింటి నిండా బంధువులున్నారు. దగ్గర బంధువులు విజయ్‌కు తమ తరపు సంబంధాలను ఒక్కొక్కటిగా అనేకం వినిపించారు. ఆ విషయాలు విన్నపుడల్లా చెవులమీద చేతులువేసి అదుముకుంటూ "ఆమాట నాకు వినిపించకండి" అంటూ పూర్తి విముఖతను కనపర్చాడు.

"ఎల్లకాలం యిలానే వుంటావా బాబూ! అమ్మ పోయింది గనుక ఒక యింటివాడివైతే, యికనైనా చక్కబడతావు" అంటూ ఎన్నెన్నో రీతుల వినిపించి అతని చిరాకులగు గురియయ్యారు. "ఇంట్లో వున్న ఆ పని బూబును చదివించారుగా, ఆవిడనే చేసుకుంటాడేమో!" అని వ్యంగ్యంగా తమలో తామనుకున్నారు.

# 50 యోగధారణ

బంధువుల ప్రశ్నలతో విసిగి గదిలోపల తలుపులు బిగించుకుని ఎక్కువ వంటరితనంతో గడుపుతున్నాడు. ఏకాంతంగా చదువుకుంటున్నాడనుకుంటున్నారు వారు. బీబీజాన్‌దప్ప ఆ గదిలోకి మరెవరు ప్రవేశించు సాహసంలేదు. అతను మోకరిల్లి ధ్యాన నిమగ్నంలో వుండుటను అనేకమారులు ఆశ్చర్యపోయింది. అతను చేస్తున్నాడు గనుక అది చెడుగాదని యేదో యోగాభ్యాసమని అనుకున్నది.

బంధువులు వెళ్ళిపోయినా విజయ్ గదిలోనే కాలక్షేపం చేస్తున్నాడు. "మీ ప్రశాంతతను భగ్నంజేసే వారెవరూలేరు, ఇంకా గది బయటకు రావెందుకుబాబూ?" అంటూ ప్రయత్నించినమీదట, ఒకనాడు యెక్కడికో పయనమై వెళ్ళిపోయాడు. మూడు రోజులవరకు రానపుడు బీబీజాన్ తిరిగి యేదేశ మెళ్ళిపోయాడోనని యెంతో విలపించింది.

మూడోనాడు సంధ్యాసమయం చాలా సంతోషంతో ఒక మిత్రునితో కలిసివచ్చాడు. ఆయన సంతోషాన్నిచూసి పరమానంద భరితురాలైంది బీబీ.

అతిధిని కూర్చుండబెట్టి తానూ ప్రక్కన కూర్చుంటూ జేబులోని పెద్దకాగితాలనుతీసి "బీబీజాన్ యివిగో యీ కాగితాలను తీసిచూడు" అంటూ ఆమె చేతిలోవుంచాడు. అది దస్తావేజు. చదివింది. పది లక్షల విలువగల యావదాస్తిని దఖలుగా ఆమెపేర వ్రాసివున్నది. అది చదువుతూ మధ్యలోనే వెలవెలబోతూ "ఇదేమిటిబాబూ!" అన్నది.

ఆయన గలగల నవ్వుతూ "నేడు చేస్తున్న కార్యమే నా జీవితంలో ఆనందకరమైంది!...." అంటుండగా మధ్యలోనే ఆగలేని ఆవేశంలో "ఉన్న ఆస్తినంతటిని ఒక అపాత్రురాలైన స్త్రీకి వ్రాసియివ్వటమా?" అని గద్దించి అన్నది.

నవ్వును మధుర రూపంలో చిందిస్తూ "చూశావా ప్రభాకర్! బీబీ జాన్ కోపంలో యెంత అందంగా వుంటుందో! ఆమెకు ఆమెయే సాటి" అని తిరిగి ప్రక్క వ్యక్తిని చూపుతూ "ఒకప్పుడు మన యిద్దరికీ క్లాస్‌మేట్ అయిన ప్రభాకర్‌ను మర్చిపోయావా బీబీ! నమస్కరించ వెందుకు?" అన్నాడు.

ఆమె సిగ్గుతో శిరస్సు వంచుకుని ప్రభాకర్‌ను గుర్తించను వోరగా ప్రయత్నిస్తున్నది.

"ఇలాంటి యోగ్యుడికి నిన్నిచ్చి వివాహం చేయాలంటే యీ మాత్రం ఆస్థిని యివ్వకపోతే యెలాచెప్పు?" అన్నాడు.

ఆ మాట విన్నక్షణమే ఆమె వణికిపోయింది. తన కంఠంమీద కత్తిబెట్టి నరుకుతున్నట్లు తోచింది. భూమాత బ్రద్దలయితే అఘాతంలో దూకి అంతం కావాలనిపించింది. బొటబొట కన్నీరు కారుతున్నవి. ఏమీ చేయలేక చేతిలోని కాగితాలను పరపరచించి చీలికలుచేసి పారవైచి సర సర వెళ్ళిపోయింది. ఆమె నిట్టూర్పులు దూసుకుంటూ విజయ్‌మీదకొట్టు కున్నవి.

ఆమె చాలా ఆనందపడుతుందని ఆశించాడు. అన్నివైపుల ఆలోచనలుచేసి రూపురేఖలలోను గుణగణాలలోను యోగ్యుడు సంపన్నుడు అయిన వాడిని యేరి నిర్ణయించి తీసుకొచ్చాడు. తన ఆస్థినంతటిని ఆమె పేర రిజిష్టరుచేసి వచ్చాడు. ఆమె మహదానంద పడుతుందనుకున్నాడు. కాని కథ యెదురు తిరిగింది.

ఆమె వెళ్ళిన గదిలోకి వెళ్ళాడు. ఓదార్చలేకపోయాడు. యెంత చెప్పినా ప్రయోజనం లేకపోయింది. ప్రభాకర్‌ను వెంటనే పంపివేయక పోతే ఆత్మహత్య చేసుకుంటానన్నది. వివశుడై క్షమాపణగోరి పంపి వేశాడు.

"మీకు నచ్చినవారిని వివాహం చేసుకోండి ముందు" అని ఆమె తనవైపునుంచి బలవంత పెట్టసాగింది. గత్యంతరంలేక తన ఆత్మ వ్యధను ముఖావంగా వినిపించాడు.

"ఆరినదీపంలాంటివాడిని, అన్నివైపులా నిరాశపొందినవాడిని, నిస్పృహలో మునిగిన జీవశ్చవంలాంటివాడిని. నన్ను గురించి నేనే

ఆలోచించగలిగింది లేదు." అని వినిపించినపుడు ఆమె దీర్ఘఆలోచనలలో మునిగిపోయింది. అతని వ్యధకు నిస్పృహకు హేతువులను తెలుసుకోవాలని తపించిపోతున్నది. లోతుగా వివరాలు తెలిస్తే తేడకునే వుపాయాలున్నవో లేవో అర్థంచేసుకోవాలని ఆమె కాంక్ష. అతనికొరకు తాను యే త్యాగమైన చేయగలదు. అతను తన వ్యధను స్మరిస్తున్నంత సేపు మరింత వికలతచెందుతుంటాడు. ఆ దృశ్యం ఆమె హృదయాన్ని మరింత కదిపివేస్తున్నది. అందుకే ఆ విషయాన్ని కప్పిపుచ్చి దారిలో పెట్టాలని ప్రయత్నిస్తున్నది.

తనతల్లి వాంఛితాన్ని పూర్తిచేయు అవకాశాన్ని పొందే అందుకు వివాహానికి సమ్మతింపచేయాలని ఆమెను అనేకవిధాల వత్తిడి పెట్టాడు. కాని ప్రయోజనం లేకపోయింది. మరింత ప్రయత్నించినపుడు పాదాల మీదబడి దొర్లిగింతలుపెట్టి విలపించింది. హద్దులనధిగమించిన ఆమె దుఃఖాన్ని చూడజాలక, ఆ ప్రస్తావనను విరమించుకున్నాడు.

ఎవరి అభిప్రాయాలలో వారు స్థిరపడిపోయారు. ఒకరి స్థిరనిర్ణయాన్ని మరొకరు అర్థంచేసుకున్నారు. ఎవరిబాటకు వారు కట్టుబడిపోయారు. ఇరువురిమధ్య గంభీరరూప అగాధ మేర్పడింది. ఒకరివెంట ఒకరు సానుభూతితో సహనంతో నడిచి తన వైపుత్రిప్పి తాను చెప్పినట్లు చేయు విధానానికి తేవాలని యెవరికి వారే వూహించారు.

విజయ్ ఒక్కమాటుగావెళ్ళి అరవయ్యోపడిలో పడినట్లు వృద్ధరూపం దాల్చాడు. సాధు స్వభావిగా మారిపోయాడు. అలంకారాలమీద అయిష్టత కలిగింది గాబోలు, గడ్డం పెరుగుతున్నా దుస్తులు యెలావున్నా లక్ష్యంలేదు.

బీబీజాన్‌కుకూడా తాను చేయగలిగింది లేదనుకున్నాడు గాబోలు. యిపుడు సంభాషించుటే మానివేశాడు. తనకు కావలసినవి సమయానికామె ముందుంచుతుంటుంది. స్వీకరిస్తుంటాడు. అలాంటి అవుసరమున్నపుడుదప్ప ఆ గది సమీపానికి రాగలసాహస ముండుటలేదు ఆమెకు.

అంతర్గత వుత్సాహాందోళనలకొంది గదిలో యెంతగానో పరిశీలించింది. గోడన వ్రేలాడుతున్న ఒక ఫొటోనుకూడా చూసింది. ఆ

ఫొటో దేవీ దేవతలదిగాదు. ఒక పాశ్చాత్య నవనాగరిక యువతిదనికూడా తెలుసుకున్నది. అతను నిరంతరము మోకరిల్లి పూజిస్తున్న దా ప్రతిమ కని తెలిసిపోయింది. ఆమె ప్రేమ విఫలంతో యీ రూపం దాల్చాడని కూడా వూహించింది. ఆ వనిత క్రైస్తుమతస్తురాలని గ్రహించింది. కాని ప్రేమించినంత మాత్రాన విజయ్ ఆ మతావలంబి యెలా అయ్యాడా, అని అనేకమూరులు దీర్ఘ ఆలోచనలు చేసింది.

రెండునెలలు గడిచిపోయినవి. గడ్డం బాగా పెరిగింది. వస్త్రాలు కాషాయ రంగును ధరించినవి. ముఖంలో గంభీరతతోపాటు విషాదరేఖలు పెనవేసి ప్రదర్శిత మవుతున్నవి. యోగిరూపాన్ని ధరించాడు.

"బాబూ భరించలేని బాధతో ఆగలేక అడుగుతున్నందుకు అన్యథా భావించకండి. మీహృదయాన్ని అంతగా చూరగొన్న యువతి యెవరయినాగానీ, అదృష్టవంతురాలు. ఆమె చిత్రపటానికి పూజసలిపినందువలన ఆమెకుగాని మీకుగాని కలిగేప్రయోజన మేమీలేదు. భ్రమలో ఆమెను న్యూనతపరుస్తూ మీ జీవితాన్ని వ్యర్ధంచేసుకుంటే ఎవరికేమి ప్రయోజనంకలుగుతుంది చెప్పండి!" అని ధైర్యంతో ఒకనాడు ప్రశ్నించింది బీబీజాన్.

"కొన్నివేళలందు ప్రయోజనంమాలిన పనులకుకూడా ప్రాధాన్యతివ్వవలసివస్తుంది, జీవితాన్ని ధారవోయవలసికూడా వస్తుంది." అన్నాడు.

"మీరు స్వచ్ఛమైన హిందువులై వుండికూడా, అవలంబిస్తున్న క్రైస్తవ విధానం యెంత హాస్యాస్పదమైందో రవంత యోచించండి!" అన్నది.

"నీవు ముస్లిమ్వై యుండికూడా అమ్మ అడుగుజాడలలో నడిచావు. నేడు నా ముందు మా సంప్రదాయాలనే పాటిస్తున్నావు, ఎందుకో చెప్పు?" అన్నాడు.

"పసితనంనుంచి యే అలవాట్లలో పెరిగానో యెవరి నీడన తిరిగానో, యెవరి ప్రేమలలో ఫలించానో వారి అడుగుజాడలలో అలవడిపోయాను గనుక, నాకు తెలిసినరీతిలో హాటినే అనుకరిస్తాను" అన్నది.

"ఏ విధానంలో ఆత్మ తృప్తి కలుగుతుందో, సాంత్వన పొంద గలమో అదే ఆచరణీయము. మతమంటే విశ్వాసము. విశ్వాసమున్న చోట ధైర్యము, ధైర్యమున్నచోట దీక్ష, దీక్షలో సాధన. సాధనలో తృప్తి వుంటుంది" అన్నాడు.

"అర్థం చేసుకోగల అంతస్థు నాకులేదు. దేవుని పూజించి తరిద్దా మన్న తృప్తి వుండవచ్చు. కాని ఒక స్త్రీని నిత్యము పూజించి పొంద గలిగేదేమిటంటారు!" అన్నది.

"ఈ దేవుళ్ళను దేవతలను దెయ్యాలను భయంగల, తెలివిగల మానవులే సృష్టించారు. ఎవరిని పూజించినా ఆరాధించినా నిష్కామ దీక్ష వున్నపుడు ఆత్మశాంతి తప్పక లభిస్తుంది. పూజల ద్వారా పొందేది ఆత్మతృప్తి. నేను చేస్తున్న ఆరాధనలో నాకుందే సాంత్వన అనంతమైంది. శాశ్వతమైంది." అన్నాడు.

"భగవంతు డనబడే వానిమీద మనస్సులగ్నం కాగలిగినట్లు ఒక సామాన్యస్త్రీమీద యెలా దీక్ష నిలుస్తుంది!" అన్నది.

"అది అనుభవంలో తెలుసుకోగల విషయం. ఎవరిస్మృతుల ప్రేరణలో ఆరాధనకుపక్రమిస్తానో వారు నాముందు నిలిచి నట్లుంటుంది. శరీరంలోని ప్రతి అణువు ఆ క్షణం ఆనందంతో హాయినిస్తుంది. ఆమె కర్మిష్టి, దయానిధి, ధర్మదేవత, ఆదర్శఅవతారిణి. నిరాడంబరంలో నిర్మలత్వంతో ఆకర్షించు తపస్విని ఆమె. పున్నమ చంద్రుని బోలి తీయని వెలుగు ఆమె. ఆమె ఆరాధనలోని ఆనంద అనుభవం నాకు తెలుసు." అన్నాడు.

"భ్రమలోపొందే ఆనందం యెంత విశిష్టమైంది అయినా జీవిత భవిష్యత్తును నష్టపరచేదికాదంటారా?" అన్నది.

"అది భ్రమలోని సుఖంగావచ్చు. యదార్థం సుఖంకంటె మించి, యిస్తున్న పొందుతున్న అనుభూతిని కాదనుటకూడా వివేకం కాజాలదు" అన్నాడు.

తర్కంతోగూడిన అధికసంభాషణ స్త్రీకి రాణించదని, విశ్వాసం వున్నతస్థాయినిస్తుందని, విజయ్ ఒకనాడన్న మాటలు గుర్తుకొచ్చి, సంభాషణను అంతటితోనే ఆపివేసింది. తర్కంద్వారా అతని మన

స్సును మార్చలేమని అంతకుముందే తెలుసుకున్నది. సేవలతోను సహనంతోను ఆకర్షించి మార్చుటకూడా అంత తేలికయిన పనిగాదని అనుభవం చేసుకున్నది. ఎదుటివారి పట్టుదల యెంతటిదయినా, విశ్వాసం కఠోరమైనదయినా, అది తన కెంతటి అయిష్టమైనదయినా, వారివెంట ప్రీతితో పయనం సాగించినపుడు వారు తన అధీనమవుట తథ్యమన్న ఆలోచన అపుడపుడు మెరుస్తున్నది. అయినా అతన్నిమార్చి తనవైపు మరల్చాలని చేసేదానికంటె అతన్ననుకరించి ఆహుతి అవుటలోనే శాంతి నెందుకు పొందలేను, అనికూడా అనుకుంటూ అతని సేవలో మునిగి వుంటున్నది.

బీబీజాన్‌లోని విరుద్ధ ఆలోచనలు అంతరించినవి. భవిష్య ఆలోచనలు యెగిరిపోయినవి. అనుక్షణము అతని సేవలో మునిగివుంటున్నది. అతనికి యేమీ అవుసరంలేకపోయినా యేమీ స్వీకరించకపోయినా, యేదయినా ఫలహారమిస్తే బావుండునని, పళ్ళరసమిస్తే బావుండునని, వేడివేడి పాలు యిస్తే బావుండునని, రేగివున్న ఆ జుట్టుకు నూనెవ్రాసి దువ్వితే బావుండునా అని, దుస్తులను మార్పిస్తే బావుండునా అని ఎన్నెన్నో ఆలోచనలు సలుపుతుంటుంది. ఎదుటకూర్చుని అతన్ని తదేకంగా చూస్తూ అలాంటి ఆలోచనలు ఎంతసేపు సలిపితే అంత ఆనందం కలుగుతూ సమయం తెలియకుండా గడిచిపోతుంది. కాని తానుగా పలుకరించగల ధైర్యం యే సమయంలోనూ వుండదు. వెనుకగాజేరి వీవనతో విసురుతుంటుంది. సమయాన్ని సద్వినియోగం చేసుకుంటూ తృప్తిని పొందుటలో అలవడింది. అతని దుస్తులను చాకలికి వేయదు. తాను స్వయంగా శుభ్రపరుస్తుంటుంది.

అతను బ్రీజ్‌బెల్లా ధ్యానలో నిమగ్నమై వుంటుంటే, బీబీజాన్ అతని ధ్యానలో నిమగ్నమై వుంటున్నది.

సంపత్తిని పొందాలనే దురాశతో అమాయకుడైన విజయ్‌కు వెర్రినిగల్పించి, ఎందుకూకొరగాని వానిజేసి మూల కూర్చుండబెట్టిందని వాడుకలు బయలుదేరినవి. అంత వుత్తేజితుడు విలాసుడు అయిన విజయ్ గడ్డాలు పెంచి, గదిలోనే సమాధిగ్రస్తసాధువువలె అయిపోవుటకు కారణం యీ బీబీజానే అని అందరిలోను ప్రచారమయిపోయింది.

నీతి జాతిలేని హీనురాలు యింటిలో జేరినపుడు, యిల్లెలా బాగుపడు తుంది? వాడిని వలలో వేసుకుని బైరాగిని చేసి ఆస్తిని హస్తగతంచేయ జూస్తున్నది. అని అంతటా ప్రచలితమైపోయిన వదంతులు ఆమెకు స్వయంగా వినిపించినపుడు విహ్వాలురాలైంది. వ్యాకులపాటుతో లోకం మీద హేయతకలిగింది. విరక్తిలో ఆత్మహత్యవైపు మొగ్గింది. కాని, ఆత్మహత్య మహాపాపమని, తానన్న మాటలు తననే అవహేళన పరుస్తున్నవి. తనలోని వ్యధను యెవరికి వినిపించగలదు! ఇందు విజయ్ దోషమేముంది? అతను పవిత్రుడు. పరమ ఆప్తుడు, సాటిలేనివాడు. అతని ఆస్తినంతటిని తనకు దానంచేయు సంకల్పంలో రిజిష్టరు చేశాడు. ఆ కరుణ విశ్వాసాలలోని వుదారతను కొల్లగొట్టదు. ఏనాటికయినా తన హృదయ రుధిరంలో అతని పాదాభిషేకంచేస్తూ ప్రాణాలను విడుస్తుంది. ఈ లోకంలో అతని క్షేమమే తన ఆఖరి లక్ష్యం. తన సుఖాన్ని తాను కోరుకోవటంలేదు. ఉదాత్త నిలయమైన యీ పవిత్రగృహంలో తనకు ఆశ్రయం లభించుట పుణ్యఫలితమని ఒకనాడు గర్వపడింది. కాని నేడు యీ ఆదరణీయాలు ఉదారతలే, ఉన్నత సాంప్రదాయ అలవాట్లే జీవిత సర్వనాశన హేతువు లయినట్లు అర్థంచేసుకుని వ్యాకులపడుతున్నది. దుఃఖంలో పూర్తిగా మునిగిపోయినవారు యేడ్వలేక నవ్వటానికే ప్రయత్నిస్తారు.

తెలియని మూర్ఖులు యేమనుకుంటే యేమి! ఇది పుణ్యగృహము. ఈ ఇంటిలో జన్మించిన వారంతా పవిత్రులు. ఇక్కడవుంటూ పొందిన ఆదరము అమూల్యమైంది. గతించిన ఆ విలువను విస్మరించుట వివేకవంతంకాదు. విజయ్‌కు దూరమై జీవించుట అసంభవం. ఆత్మహత్య మహాపాపము. మరి మధ్యేమార్గమేమిటి! పరిస్థితులు రాజీని కుమపస్తవి.

విజయ్ సమక్షంలో జీవితాన్ని గడుపుతూ తరించుటదప్ప అన్య మార్గంలేదు. అతని ననుసరించుటలోనే సాంత్వన వుంటుంది. అతన్ను కనుమలుపుచేసి జీవించుట అసంభవము. తన త్యాగబలంతో ఆత్మ బలంలో లోకపరిహాసాలను యెదర్చగల శక్తిని పొందాలి, దేవుడనే వాడున్నాడో లేదో! అజ్ఞాతమైన అనంత శక్తే దైవమయితే ఆ మహా శక్తిలోని పవిత్ర అంశమే విజయ్. అంతటి విజయ్ తన ఆత్మను శక్తిని

ఒకచోట కేంద్రీకరించి తదితర సర్వాన్ని మరిచి నిశ్చింతుడు కాగలిగినపుడు తానెందుకుకాలేదు! అతని ప్రేమికులనే యిష్టదైవంగా చేసుకుని ఆరాధిస్తూ తృప్తిని పొందగలుగుతున్నపుడు తానువిజయ్‌నే యిష్టదైవంగా చేసుకుని ఎందుకారాధించలేదు. చెరగని హృదయ ప్రతిష్ట మూర్తినే దేవతగా ఆరాధించుటలోనే ఆత్మతృప్తి వుంటుంది.

ఆమె మనస్సులోని సంశయాలు సమూలంగా సర్దుమణిగినవి. ఇపుడు ఎవరేమనుకుంటున్నా వినిపించవు. నేత్రాలు మూసినా తెరిచినా గడ్డంపెరిగి నలిగిన దుస్తులలోని తేజోమూర్తియైన నవనాగరిక సాధువు గనిపిస్తాడు. అతని ముఖంలో లోతైన యోగముద్రలు గనిపిస్తవి. అక్కడ విశిష్టవెలుగు గనిపిస్తుంది. "సాధువుగాదు భగ్నజీవి, యోగిగాదు ప్రేమవిరాగి, తపశ్శాలిగాదు విఫలజీవి, ఆ తేజస్సు ప్రశాంత నిర్మలతలోదిగాదు వియోగ వ్యధలోని ప్రచండ తుఫానుల మెరపు" అని వినిపించింది.

"వ్యధిత హృదయంలో సృజించే ఆరాధన పవిత్రమైంది. నిష్కామపూరితమైంది. అక్కడుండే భక్తి విశ్వాసాలు నిష్కలంకమైనవి. అది వున్నతస్థాయినుంచి మహోన్నత స్థాయికి చేర్చునది. నిష్కామ దైవభక్తుని స్తోత్రానికి నిష్కామంతోగూడిన పవిత్రప్రేమారాధకుని స్తోత్రానికి ఏకరూపం, ఏకతానం, ఏకరాగం కలుగుతవి. అక్కడ రెండూ ఏకమై ఒకేరూపురేఖలు పొందుతవి. అక్కడ అనంత వెలుగులో లీనమయ్యేముందే వ్యక్తిత్వాన్ని ప్రత్యేకతను కోల్పోతవి. వ్యధితుడు నిందితుడుగాదు, పరిహాసపాత్రుడుగాదు. పవిత్రుడు, అనంత వెలుగుకు అతి సన్నిహితుడు, దైవభక్తునికంటె ప్రేమారాధకునిమార్గం సమీపమైంది. ప్రేమారాధకునికి కుదిరే యేకాగ్రత దైవభక్తునికి కష్టసాధ్యం" అని ఆత్మ ధ్వనించింది.

ఆమె హృదయం విజయ్‌తో ముడివడిపోయింది. అతనికి దూరం కాజాలదు. అంకితమైపోయినహృదయాన్ని వేరుచేయుటెవరికి సాధ్యం! అతని అనుకరణలో లీనమైనపుడే ఆత్మతృప్తి నొందగలుగుతుంది. అందుకే స్థిరనిర్ణయం చేసుకున్నది.

అతనికి కావలసిన సౌకర్యాలను కల్పిస్తూ అతని సమక్షంలో

వుంటుంటే పున్నమివెన్నెలలో వున్నట్లుంటున్నది. కాని మనస్సులోని యే కోణమందోవున్న వెలితి కెలుకుతున్నట్లున్నది. ఆ వెలితే కవ్వించి నట్లు వ్యధను కల్పిస్తున్నది.

అనేకమారులు ఆమె చాటుకువెళ్ళి కన్నీరుకార్చుకుంటూ శాంతిని పొందింది. కాని బాటలను కోల్పోయి మిట్టలమీద నడుస్తున్నట్లున్నది. హృదయంలో తుఫానులు రేగుతున్నవి. ఆ తుఫానులకు తాను ఎక్కడికో కొట్టుకుపోయి ఏ లోయలోనో పడిపోతానని భయకంపితురాలై స్థిరంగా ఏకాగ్రంగావున్న అతన్నిచూసి స్థిమితాన్ని పొందజూస్తున్నది. ఆగలేక ఆందోళితురాలై కూలబడి అతని పాదాలను చుట్టివేచింది.

"ఏమిటి బీబీజాన్! ఏమయింది?" అని ప్రశ్నించాడు.

ఆమె తత్తరపాటుతోలేచి వెలవెలబోతూ మనస్సును కూడదీసుకుంటూ "ఏమీలేదు. కళ్ళుతిరిగి పడిపోయాను" అన్నది.

"అయితే కాళ్ళకు పెనవేసుకుంటావెందుకు?" అన్నాడు.

ఆమె నతనతలాడుతూ సర్దుబాటు చేసుకున్నది. ఆమె హృదయంలోని యే కోణమందో వున్న వెలితి వెంటాడుతూనేవున్నది. ఆధ్వనితో ద్వంద్వాత్మ యుద్ధం ప్రబలుతున్నది. వివశురాలై పట్టుదలతో విజయ్ ప్రక్కన కూర్చున్నది. అతినిదృష్టి వుంచినచోటే దృష్టివుంచింది. ఆ ప్రతిమయెడల యీర్ష్య కలిగింది. తరువాత అభిమానం కలిగింది. ప్రేమ కలిగింది. "ఆమె నేనే అయితే ఎంతబావుండును!"అనిపించింది.

బీబీజాన్ విజయ్ అనుసరణలో స్థిరపడిపోయింది. మనస్సుకు స్థిమితం యేర్పడింది. ఇపుడు అనేక విషయాలలో అనుకరించను ప్రయత్నిస్తున్నది. ఆ అనుకరణలో ఆదుర్దావడి మిగతావి మర్చిపోతున్నది.

3920

# 51 పథవిహీనులు

సరళ ఎక్కువగా యింటిలోనే కాలంగడుపుతున్నది. రవిప్రసాద్ రావటం మానివేశాడు. రవి రాకపోవటమే మంచిదనిపిస్తున్నది. ఎప్పటి కయినా యేనాటికయినా విజయ్ వచ్చువరకు స్థిరపడి యింటిలోనే వుండుట మంచిదనుకున్నది. పుస్తకాలలో మనస్సు లగ్నం చేసుకోవాలని ప్రయత్నించింది. కాని మనస్సు యెక్కడికక్కడ చెదిరిపోతూ విఫలతతో విసిగిపోతున్నది.

విజయ్ పారిస్‌నుంచి వచ్చినట్లు, కాని విఫలజీవిగాచేరినట్లు, చేరిన వెంటనే తల్లి మృత్యువాతపడినట్లు విని ఆశ్చర్యపోయింది సరళ. ఎందుకు విఫలజీవిగా వచ్చాడు? ఏమి విఫలం జరిగింది? అన్న ప్రశ్నలు క్షణంలో వేయిమారులు ఎదుర్కొన్నవి. ఆదుర్దాకొంది అనేక విధాల ప్రశ్నించినది. పారిస్‌లో ఒక స్త్రీ ఆదరంలోనే వున్నాడని ఆ స్త్రీ అనేక విధాల తోడ్పడిందని, ఆమెతో పరస్పర ప్రేమ జరిగిందని, కాని ఆమె ఆగర్భ శ్రీమంతురాలైనందున తండ్రి యెదుర్కొవటంతో విజయ్ పారిపోయిరావటం జరిగిందని, ప్రస్తుతం సాధురూపాన్ని ధరించి, ఆమె ఆరాధకుడుగా జీవితాంతం గడుప నిశ్చయించుకున్నాడని విన్నపుడు, సరళ మ్రాన్పడిపోయింది. ఆమె వూహలమీద బూడిదచల్లినట్లయింది. ఈ మూడు సంవత్సరాలు ఆమె చేసిన తపస్సు ఒక్కమాటుగా యిరిగిపోయిన పాలవలె భగ్నమైనట్లు తోచింది.

ఆనాడు అతను చేసిన బాసలన్నీ వరుసగా గుర్తుకొస్తున్నవి. తనపాదాలను సయితం అంత ప్రీతిగా ముద్దిడుకున్న విజయ్ నేడంతగా మారిపోయాడంటే తనలో తను కళవళ పడిపోతున్నది. తను యెదుట పడినపుడు వెనుకటి యథాస్థితికి వస్తాడని, తనను క్షమాపణ వేడుకుంటాడని, ధరించిన సాధువేషం క్షణంలో యెగిరిపోతుందని, నూతన కలలు గంటూ పయనమయింది.

సరళ నేరుగా విజయ్ యింటిముందుకు చేరింది. తలుపులన్నీ తీసేవున్నవి. వాతావరణం ప్రశాంతంగా వున్నది. మౌనముద్రలో, యోగనిష్ఠలో నున్నట్లు, యెల్లపుడు ఆ ప్రేమికురాలి పటంముందే వుంటుంటాడని, అక్కడే, ఆ స్థానంలోనే చదువుకోవటం, వ్రాసుకోవటం, నిద్రించటంకూడా జరుగుతున్నదని, వినివున్నది. యధావిధిగా వుంటున్న వాస్తవికస్థితిని చూడాలని ఆమె వాంఛ. అందుకే అదికొత్త స్థానమయినా కేకపెట్టకుండా లోపల ప్రవేశించి పరిశీలన చేస్తున్నది. నౌఖరు చాకర్లు ఒక్కరూలేరు. ఒకొక్క గదిని వెదుకుతున్నది.

ఒక గదికి వోరగా నిలిచిచూస్తూ నిర్ఘాంతపోతున్నది. ఒక నవ యౌవ్వనయోగి పృధ్వీమీద వాలిపోయినట్లున్నాడు. అతని చేతిలోని పుస్తకం యింకా అలానే వున్నది. అతని శిరస్సు రాతినేలమీదలేదు. ఒక యువతి తొడమీద వున్నది. అతని నల్లనిగడ్డము ఆమె మోకాటి మీదకు సూటిగా తీర్చినట్లున్నది. ఆమె వీవనతో విసురుతున్నది. దుర్యోగవశాత్తు రాజ్యాచ్యుతులై పర్ణశాలలో తలదాచుకుంటున్న రాజ దంపతులవలె, ద్యోతికమవుచున్నారు. అతని మెడలదగ్గర వుబుకుతున్న శ్వేదబిందువులను వ్రేలిమొనతో తుడిచివేస్తున్నది.

సరళ కది పౌరాణిక గాధలోని చిన్ని దృశ్యమువలె గన్పిస్తున్నది. చూస్తున్నకొలంది హృదయ స్పందనలగతి పెరిగిపోతున్నది. దీర్ఘ శ్వాసలిడుస్తూ అలానే వుండిపోయింది. ఆమె యెవరో అతని కేమి సంబంధమో తెలుసుకోవాలనిపించింది. కాని ముందు కడుగువేయగల ధైర్యంలేక అలానే వుండిపోయింది.

నిద్రలోనున్న అతని ముఖంలోని వ్యధితరేఖలు ఆమెకు సుస్పష్టంగా గనిపిస్తున్నవి.

విసురుతున్న పసనకర్ర విజయ్ భుజస్కంధానికి తగిలింది. వులిపాటుతో నేత్రాలు తెరచి చూచాడు. తన శిరస్సు బీబీజాన్ వడిలో వున్నది, సేవలనందుకొంటున్నది. చిన్నబుచ్చుకుంటూలేచి "తెలియకుండా నిద్రపోయానేమిటి?" అంటూ నేత్రాలు నులుముకుని చేతిలోని పుస్తకంలో చదివి విడిచిన ఆఖరిపేజీ కొరకు వెదకుతూ బయటికిపు

చూశాడు. గడప ప్రక్కగా శిరస్సుభాగము పాదభాగము కనిపిస్తున్నవి. దృష్టిని తీక్షణంచేసి "యెవరది" అన్నాడు.

చాటునుండి తచ్చట్లాడుతున్న ఆ స్త్రీ ముందుకొచ్చి నిలిచింది. "సరళా, నీవా!" అంటూలేచి నిలిచాడు.

నిరాసక్తత నిర్లక్ష్యాలతో "వచ్చి మీ మనస్సును నొప్పించి నందుకు నేనే యెక్కువ బాధపడుతున్నాను." అన్నది.

దుఃఖాన్ని దిగమింగుకుంటున్న బరువుకఠంతో "నేను మహా ద్రోహిని సరళా! "అన్నాడు.

నిట్టూర్పుల ఆవేశంలో" ద్రోహంలేనిచోట నష్టం యెంతటిదైనా దుఃఖం భరించవచ్చు "అన్నది.

"అజ్ఞాతంగా సంభవించిన ద్రోహం క్షమార్హమైంది." అన్నాడు.

"ఏద్రోహం ఒక అమాయకజీవితాన్ని సర్వనాశనం చేస్తుందో ఆ ద్రోహంక్షమార్హంగాదు" అన్నది.

లేచిదగ్గరగావచ్చి "నీపాలిట నేను ద్రోహిని కాదనను, మహా ద్రోహిని. నా అపరాధం అనంతమైంది. కాని నేను కోరి చేసిందిగాదు. అజ్ఞాతంగా జరిగిపోయింది. ఇందు నా జీవితాన్ని నేను నాశనం చేసు కున్నాను. నన్ను క్షమించి మర్చిపో సరళా" అన్నాడు.

ఆ నాటి అతని అభయాలన్నీ ఒక్కమాటుగా గుర్తుకొచ్చి వికలంచెంది కూలబడిపోయింది.

సరళను యెన్నోరకాల వోదార్చి సాంత్వన కలిపించ ప్రయత్నిం చాడు. తనను మర్చిపోయి మరోచోట వివాహం చేసుకుని సుఖజీవితాన్ని పొందమని ప్రబోధించాడు. సంకల్పం చెదిరిపోయి, సర్వము విఫలం చెందినవారికి సలహాలు సానుభూతిని గల్పంచవు. సలహా సానుభూతి శాంతిని కల్పించవు అన్నది.

తన జీవితమే సర్వనాశనమైపోయిందని, అది విధికృతమై జరి గిందని, తాను కోరిచేసిందిలేదని వివరించినపుడు ఆమె వ్యాకులపాటుతో అతన్ని చేయిబట్టి చాటుకు తీసుకెళ్ళి "ఆమె యెవరు, విజయ్?" అని ప్రశ్నించింది.

"ఆమెనుగురించి నీవు దురూహపడవద్దు. మానాన్నగారిసౌఖ్యకరైన

ఖాసింకూతురు. చిన్నప్పటినుంచి నాతోనే కలిసి మెలిసి పెరిగిన బీబీ జాన్" అన్నాడు.

అతని పాదాలమీద వాలిపోతూ, ఆశాజనిత కంఠంతో "నన్ను నిరాశచేయవోకు విజయ్, మనస్పూర నిన్ను ప్రేమించాను. నీ మాటలతో నిర్మించుకున్న వూహాలోకాన్ని నిర్మూలం చేయవోకు. నిన్ను హృదయ పీఠంలో ప్రతిష్ఠించుకుని యీ మూడు సంవత్సరాలు తపస్సు చేశాను. నీకు దూరంగాగల శక్తిగాని విస్మరించగల శక్తిగాని నాలోలేదు. నీవు లేని నేను జీవించలేను విజయ్," అని ప్రాధేయపడింది.

"నీమీద ప్రీతుంది, సానుభూతున్నది. నేను నిన్ను నమ్మించి యిచ్చిన అభయాలు నాకు గుర్తున్నవి. కాని నేను వివశుణ్ణి సరళ! వేరొకచోట కట్టుబడిపోయాను. ఆ స్మృతులు మిగిలిన అన్నిటిని అణచి వేసినవి. వాటికి దాసుణ్ణయిపోయాను. అవి నా సర్వశక్తిని హరించినవి. అసమర్థుణి అయోగ్యుణ్ణి అయిన నన్ను విస్మరించి నీ భవిష్యత్తును ఆనందమయం చేసుకోమని నా ప్రార్థన" అన్నాడు.

"ఇది ప్రార్థనగాదు కసాయికోత. కుంచతో రంగుపులిమి తుడుచు కోమనుట యెంత హాస్యాస్పదం! నిర్మలహృదయంలో తుఫానురేపి సానుభూతిని ప్రకటించుట రెచ్చగొట్టుటలాంటిది. ఇది పరమ హీనమైన మోసము. విశ్వాసాన్ని కొల్లగొట్టుట మానవత్వాన్ని మంటగలుపుట లాంటిది. పవిత్రమైనప్రేమ పదే పదే వుదయించదు. వికాసం బొందిన హృదయంలోనే ప్రేమాంకురానికి అవకాశ ముంటుంది. నీ వానాడు నాతో ఆడిన అభయాలన్ని అబద్ధాలేనా విజయ్!". అని ప్రశ్నించింది.

"ఆనాడు అబద్ధాలుగాదు, నేడు వాటిని గురించి నిర్వచించగల శక్తి నా కింకాలేదు. సర్వనాశనమై దహించుకుపోతున్న నేను మోస గించుటెలా అవుతుంది సరళా! నిన్ను మోసగించి మరొకరితో నేను సుఖసౌఖ్యాలు గ్రోలుతుంటే విశ్వాస ఘాతకం కావచ్చు. నాహృద యంలో, నేనే తుఫాను రేపుకున్నాను. నా జీవితాన్ని నేనే హత్యజేసు కుంటున్నాను. ఇది మోసమా చెప్పు?" అని వినయంతో అర్థించాడు.

"నీ హృదయంలో తుఫాను రేగినంతమాత్రాన, నీవు నరకబాధ ననుభవిస్తున్నంతమాత్రాన, నీజీవితాన్ని నీవే అంతం చేసుకోబోతున్నంత

మాత్రాన, నాకు జరిగిన ద్రోహం లుప్తమైపోదు. నాకు చేసిన ద్రోహానికే యిది ప్రకృతీయమైన శిక్షగా యెందుకు భావించకూడదు!" అన్నది.

గాద్గదిక కంఠంతో "శిక్షగా స్వీకరిస్తాను. యీ శిక్షతోనే అంత మవుతాను. అపుడయినా నన్ను క్షమించు సరళా !" అన్నాడు.

"శిక్ష అనుభవించుటతో నీలోని నేరం పోవచ్చుకాని నాకు ఆ ద్వారా కలిగిన నష్టం యేరూపంలో పూడుతుంది చెప్పండి. మీరు ఒకరి ప్రేమను నిర్లక్ష్యంచేసి మృత్యుముఖానికి నెడుతుంటే, మరొకరు మీ ప్రేమను తృణీకరిస్తూ మిమ్మ మృత్యుముఖానికి నెడుతున్నారు. దీన్ని లోకంతీరు అంటారా లేక విధి అంటారా చెప్పండి! ప్రేరణచేసి మన స్సును స్వీకరించి నేడు విముఖతతో నలిపివేయుట హత్యకంటె హీనం గాదా విజయ్! ఒక్కమాటు ఆనాటి దృశ్యాలను స్మరణకు దెచ్చుకుని నన్ను వుద్ధరించు విజయ్" అన్నది.

"నా మనస్సును యధాతధంగా అర్థంచేసుకుంటే నన్నుదోషిగా ఎంచవని నా విశ్వాసం. నావైపునుంచి ప్రేమ ప్రేరణ ఆమెయెడల యెక్కడా జరుగలేదు. జరిగినదంతా విధికృతంగా జరిగింది. నాద్వారా నీకు జరిగిన అన్యాయం అనంతమైందని నాకు తెలుసు. నీకొరకు నా హృదయాన్ని కోసి నీపాదాలముం దుంచగలను. కాని అది మరొకరి తపనతో అలమటిస్తున్నది. నా రుధిరంతో పాదాభిషేక మొనర్తునుగాని అందుకూడా ఆ అనుభూతులే మిళితమై యున్నవి. అన్నివైపుల నేను అసమర్థుణి. మనస్సు అధీనం తప్పినవాణ్ణి. కనుక నన్ను క్షమించు సరళా!" అన్నాడు,

రుద్దకంఠంతో "విజయ్ నా అసమర్థత్వాన్ని నీవు అర్థంచేసుకున్నా నా హృదయాన్ని కెలికివేస్తున్న వ్యధను తెలుసుకున్నా యీ రూపంగా వల్లించవు. ఒక్కమాట అడుగుతాను చెప్పు. ఆ ప్రారంభంలో, ఆ రైలు పెట్టెలో, ఆ స్టేషనులో, ఆ పార్కులో నీవాడిన మాటలన్నీ యదార్థం గాదా? అపుడు నిజంగా నన్ను ప్రేమించలేదా, మనస్ఫూరా ప్రేమించావా లేదా చెప్పు విజయ్" అంటూ భోరున విలపించింది.

విజయ్‌కుకూడా దుఃఖం పొర్లింది. "నీముందు నేను అబద్ధమాడను, ప్రమాణంచేసి చెబుతున్నాను. నిన్ను ప్రేమించింది సంపూర్ణ

హృదయంతోనే. నిన్ను ప్రేమించానని వందమారులు చెప్పగలను,నిన్ను గురించి కిన్న కలలలో తీయదనం తక్కువలేదు. అనంతమైన వూహా భవనాలను నిర్మించుకున్నాను. నేడవి నన్నుజూచి పరిహసిస్తున్నవి. ఆ భవనాలముందు నాకు తెలియకుండా మాంత్రికశక్తిలాంటి బలప్రయోగంలో నేను సర్వనాశనమై భస్మంగా మిగిలాను. ఇపుడా చితాభస్మందప్ప మరేమి మిగలలేదు. దుఃఖంనుంచి దూరంకావాలని, శిధిలాలమీద నూతన నిర్మాణం చేయాలని, నూతన జీవితాన్ని నూతనోత్సాహాన్ని పొందాలని ప్రతి ఒక్కరికి వుంటుంది. కాని అది అన్ని వేళలా అందరికీ లభ్యమయ్యేదిగాదు. అన్నివైపుల అడ్డుపడిపోయిన వాడిని. ఏమిచేయగల సమర్ధతా లేని నన్ను యేమిచేయ మంటాను సరళా! నేను మృతజీవిని" అన్నాడు.

"నీ నిస్పృహతో నిరాశతో సద్దితతో మరొక అమాయక జీవితాన్ని నాశనంచేయుట ధర్మమా విజయ్. మధ్యలోని దుమారాన్ని మర్చిపోయి ఆనాటి మాటలను స్ఫురణకు తెచ్చుకుని నాముఖంలో చూడు విజయ్" అన్నది.

"నీ వన్నవైపు చేరుటకు చేయవలసిన యత్నాలన్నీ చేసి విఫలుణ్ణయినాను. అంధకారంలో తవుళ్లాడనుకూడా శక్తిలేని హీనుడను. అంధునిముందు దృశ్యాల విలువేమి వుంటుంది? చెవిటివానికి సంగీత మాధుర్య మెలా లభ్యమవుతుంది? మనస్సును హృదయాన్ని పూర్తిగా కోల్పోయినవానికి, పునఃశక్తి ఎక్కడినుంచి లభ్యమవుతుంది? చితాభస్మంనుంచి ఆశించగలిగిం దేముంటుంది! నన్ను ద్రోహనిగా యెంచవద్దు. అప్రయోజకునిగాను, అసమర్ధునిగాను, అయోగ్యునిగాను యెంచితే నేను కాదనను. నన్ను క్షమించి నీ నూతన జీవితాన్ని సృష్టించుకో సరళా" అన్నాడు.

ఆమె ఆవేశితురాలై "ఇంతకంటె ద్రోహ మింకేముంటుంది? నమ్మించి ప్రేమించి నట్టేట ముంచుట మహా ద్రోహంగాదా!...." అని యింకేమేమో అంటుండగా, విజయ్ దుఃఖిత కంఠంలో "నీవు ఎంత ఆవేశితురాలవైనా ఫిర్యాదులేదు., నాఅపరాధం అనంతమైంది.శిక్ష ఎంతటిదయినా కొంచెమే అవుతుంది. కాని నీవు క్రోధితురాల వవుట నాకిష్టం

లేదు సరళా. క్రోధంలో వివశత నశిస్తుంది. అన్నీపోయినకూడా. వివశతా అంతస్తు వుండవచ్చు. ఆవేశంలో, ఆ అంతస్తునికూడా కోల్పోయినపుడు మానవత్వంలోని ఆఖరి అరవళ్ళు తుడుచుకుపోతవి. నీలోని ఆ సౌజన్యతతో నిండిన మానవత్వం చెదరకుండా వుండాలని నా ఆఖరి అభిమతం" అంటూ గది లోపలివైపుకు వెళ్ళిపోయాడు.

నిర్లక్ష్యంగానో హేయంగానో తననుంచి విజయ్ దూరంగా వెళ్ళిపోయినందుకు ఆమె మనస్సు దెబ్బతిన్నది. ఆవేశితురాలైంది.

"ఒకరి అభిమతంకొరకు మరొకరు బలిగావటం ఆదర్శంగాదు" అంటూ ఆమె సరసర బయటకు వెళ్ళిపోయింది.

ఇప్పటివరకు సాక్షీభూతురాలివలె నిలిచివున్న బీబీజాన్ బొంగురుపోయిన కంఠధ్వనితో వుట్టిపడుతున్న జాలితో "బాబూ, ఆమె కోపంతో వెళ్ళిపోతున్నది పిలవండి. ఈరీతిగా ఆమెను పోనివ్వటం మంచిదిగాదు బాబూ!" ప్రాధేయపడుతూ అన్నది.

"అవును, ఆమెబాధ నాకు తెలుసు, అసమర్థుణ్ణి" అన్నాడు.

ఆమెకిదంతా ఒక విషాదనాటికలోని దృశ్యంవలె గోచరిస్తున్నది.

"ఇదంతా ఏమిటి బాబు! మీ వంశంలోని యే ఒకరిద్వారా కూడా అన్యులకు రవంత అపకారం జరిగి వుండలేదు. నేడు మీద్వారా ఒక నిరపరాధియైన స్త్రీ జీవితం సర్వనాశనమై పోతున్నట్లు గనిపించిన యీ దృశ్యం నన్ను కదిపివేస్తున్నది. ఇది మన వంశానికి క్షేమంగాదు. స్త్రీ హృదయాన్ని స్త్రీ అర్థంచేసుకో గలిగినట్లు పురుషుడర్థం చేసుకోలేడు. ఆ సరళాదేవి యేదైనా అఘాయిత్యం చేసుకుంటుందని భయంగావుంది. వెంటనే వెళ్ళి వోదార్చి తీసుకురా బాబూ!" అన్నది.

"జరుగనున్న అనర్థం ఎంతటిదయినా పరిష్కరింపజాలనపుడు, శక్తిలేనపుడు, ఎదుర్కొ జాలనపుడు అనర్థాన్ని ఆహ్వానించుటే మంచిది, దుఃఖం భరించరానిదైనపుడు యేడ్వలేక నవ్వుటదప్ప చేయగలిగిందేముంది!" అన్నాడు.

నేత్రాలు పెద్దవిచేసి హెచ్చరిక కంఠంతో "బాబూ, పిరికితనాన్ని ప్రదర్శించుట గొప్పతనంగాదు. గోతిలోకిత్రోసిన నేరానికి బయటకు తీసే యత్నమయినా చేయాలి" అన్నది.

"ప్రయత్నంవలన అనర్థస్వరూపం పెరుగు సూచన లున్నపుడు విరమించుకోవటంమంచిది. నాద్వారా ఆమెకేగాదు, నీకు జరిగిన అనర్థం కూడా నాకు తెలుసు. నాద్వారా నీవు భవిష్యత్తుని విస్మరించి అంధ కారంలో జీవితాన్ని అంతంచేసుకుంటున్న సంగతి నాకు తెలుసు. పొందిన నష్టం ఆమెకంటె నీవు తక్కువగాదు, కాని నీవు అందు కను గుణ మార్గాన్ని సృష్టించుకున్నావు. ఆ మార్గంలో లీనమై సాంత్వన పొంద గలుగుతున్నావు. కాని అలా చేయగల స్థిమితం ఆమెలోలేదు. నీమార్గం అవలంబనీయమని ఆదర్శమని అనను. కాని యేదో ఒక నిర్ణ యాత్మక మార్గం వుపశాంతిని కల్పిస్తుంది. పథవిహీనుడు మార్గగామి కాజాలడు బీబీ" అన్నాడు.

ఆమె వెలవెలబోయింది. తనవిషయమే, అతనినోట విన్నపుడు ఆమెమీద ఆమెకే జాలి దొర్లిందిగాబోలు కన్నీరు క్రమ్మింది. అతని ముఖాన్ని పరిశీలనగా చూస్తున్నది. ఏదో అడగాలనుకుంటున్నది. కాని కంఠం పెగలుటలేదు. \

దుఃఖము పశ్చాత్తాపము కలిసిన హృదయంతో "నీ హృదయ కుహరంలో కుములుతున్న తప్తజ్వాలలు నాకుతెలుసు. మన యిరువురది ఒకేబాధ, ఒకే విధానం, ఒకే తపన. నీవూ నన్ను అనుకరించుటలో అలవడిపోయావని కూడా తెలుసు. పొందేదీలేదు, పొందకోరేదీలేదు. హఠయోగంలో జీవితాన్ని నశింపజేసుకోవటమే యీ విధానం. సరళ జీవితంకూడా యీ వినాశంవైపుకు మరలుట క్షేమంగాదు" అన్నాడు.

ఎంత ప్రయత్నించినా అశ్రువులు బొటబొట వలుకుతున్నవి.

గాద్గదిక కంఠంతో "బాబూ, జీవితాంతం నీ సేవలో వుండే వరమివ్వు నాకు. అంతకుమించిన కోర్కెలు లేవు" అంటూ పాదాలమీద వాలింది.

నిట్టూర్పు విడుస్తూ "నీవు కోరేది వరంగాదు శాపము. అవును. వరమీయగలశక్తి నాలోలేదు. శపించగలశక్తి నాకున్నది. నాలోని వినాశ స్వభావానికికూడా నీద్వారా ప్రభావం కలుగుతున్నది. ఈ వ్యధాతపస్సులో కూడా ఆనందానుభూతి నొందగలమని రుజువుచేదాము బీబీ! అంతకంటె అన్యమార్గం లేనపుడు చేయగలిగిందేముంది!" అన్నాడు.

# 52. భూతాలు

ఆవేశంలో బయలుదేరిన సరళ కళవళపడుతూ, తూలును ఆపుకుంటూ వేడినిట్టూర్పుల విడుస్తూ నడుస్తున్నది. గాఢాంధకారంలో పయనిస్తున్నట్లున్నది. అగాధ జలరాశిలోకి మునిగిపోతున్నట్లున్నది. అగ్నిగుండంలోబడి ఆహూతి అవుతున్నట్లున్నది, లోకమంతా గిర గిర తిరుగుతూ పరిహసిస్తున్నట్లున్నది. తన ఆశలు, వూహలు, కలలు పొగలహోరుగాజేరి తనను చుట్టుముట్టుతున్నవి. వూపిరిసలుపుటలేదు.

రంకులరాట్నంవలె గిరగిర తిరుగుతున్న ఆమె మనస్సులో అస్పష్ట ఆకారంకూడా ఒకటి తిరుగుతున్నది. ఆ, ఆకారం పోను పోను రవిప్రసాద్‌గా గోచరించింది. తనకొరకున్న అతనిలోని తపోదీక్ష కూడా గుర్తుకొచ్చింది. అతని ప్రేమలోని ఏకోన్ముఖ దీక్షను నిర్లక్ష్యం చేసినందుకు, ఒక కోణంనుంచి పశ్చాత్తాపం ప్రారంభమైంది. అధిఖ్యాతలు ఆడంబరాలకంటె ఆత్మీయప్రేమ పవిత్రమైందని, నివురుగప్పిన నిప్పులాంటి దనిపించింది. అతని అమాయకముఖమండలంలోని స్నిగ్ధ తేజస్సు ప్రభవిస్తున్నట్లు తోచింది. ప్రక్క వుత్తేజిత పరవళ్ళతో కర్మిష్టిగా కార్యరంగంలోని మరో ప్రతిమ గనిపించింది. ఆ ప్రతిమలోని గంభీరతకూడా మెరమెరలాడుతూ అజేయమైన శక్తిని ద్యోతితపరుస్తూ అత్యధిక ఆకర్షణనిస్తున్నది. బాగా చూసినపుడు ఆ ప్రతిమే నీడగామారి సర్వము త్యజించి తన అసమర్థతనుచాటు సాధుపుంగవ రూపంలో గనిపించి శరీరం కంపించింది. ఉద్రేకాలలో వుత్తేజితపరులు, కార్యరంగంలో కర్మిష్టిగా ముందుకు తోసుకుపోవువారు, అధిఖ్యాతల వ్యామోహంలో అర్రులు చాచేవారు, అభయాలు అవలీలగా చేసేవారు విఫలం బొందుట తధ్యమని, విరాగులవుట విదితమని, వారివెంట పయనం సాగించువారు కూడా విఫలం బొందక తప్పదని స్ఫురించింది. అమాయకుడు ఆత్మీయుడు అణకువలోనివాడు అయిన ఆ మొదటి దీనునిదృశ్యం

గనిపించి జాలితో బాధచెందింది. ఆ దీనుని ముందు ప్రణమిల్లి తన వెర్రితనానికి క్షమాపణవేడితే యెంత ఆనంద పడిపోతాడు! నిష్కల్మషుడైన ఆ పవిత్ర ప్రేమికునికే తను ఆత్మార్పణ చేసుకుంటే అల్పసంతోషంతో పొంగిపోయి తనను శిరస్సున ధరించి చిందులు త్రొక్కతాడు! రాతిపలుకులోని మెరుపులో భ్రమించవచ్చుకాని మెరుపులేకపోయినా రత్నంవిలువే నిగ్గుతేలుట తథ్యమనుకుంటూ వూహలుచేస్తూ రవిప్రసాద్ ఇంటివైపే నడుస్తున్నది.

రోడ్డు మలుపు ప్రక్కనున్న పెద్దభావివద్ద జనం గుంపులుజేరి, యేదో గొప్పదుఃఖ సన్నివేశాన్ని చూస్తున్నారు. అనేకమంది కళ్ళల్లో కన్నీటి బిందువులు గనిపిస్తున్నవి. "పాపం! సాధుస్వభావి. ఇంత దీనపుచావు వ్రాసిపెట్టివుంది గాబోలు!" అని కొందరంటున్నారు. "ఎందుకు చచ్చాడో, చచ్చిసాధించేదేమిటి? వెర్రివాడు!" అంటున్నారు. మరికొందరు. "స్వయంగా ఆత్మహత్య చేసుకోవలసిన పరిస్థితులేమున్నవి? యెవరో చంపి భావిలోవేసివుంటారు" అని వ్యవహర్తలంటున్నారు. "వాడినిచంపి భావిలో వేసేంత విరోధం యెవరికుంది? ఇంతహీనంగా చనిపోవలసిన ఖర్మ వాడికున్నది గనుక మిత్తవ యీడ్చుకొచ్చి వుంటుంది. అలాగాకపోతే రెండురోజులు భావిలో కుళ్ళిపోవలసిన ఖర్మ యెందుకు బడుతుంది?" అని వృద్ధులు కొందరంటున్నారు.

దూరానికే దుర్వాసన గొడుతున్నది. శవాన్ని తాకలేక గాబోలు యెదుటజేరి విలపిస్తున్నారు తలిదండ్రులు. అనుకుంటున్న మాటలన్నీ విన్న సరళ ప్రక్కగావచ్చి శవాన్నిచూడ ప్రయత్నించింది. శిలా ప్రతిమవలె నిలిచిపోయింది. ఆ విలపిస్తున్నవారు రవిప్రసాద్ తలిదండ్రులు. ఆ శవం మరెవరిదోగాదు. రవిప్రసాద్‌దే. శవం మూడురోజులు భావిలో వున్నందువలన గాబోలు వూలివుబ్బి రబ్బరు పీపావలెవుంది. చెవులను, ముక్కును, అధరాలను నేత్రాలను కప్పలు తినివేసినందున శవరూపం వికృతమైపోయింది.

సరళశరీరం కంపించింది. గగుర్పాటు చెందింది. ఆ శవాన్ని చూడలేకపోతున్నది. కపోలాలు నిగనిగలాడుతున్నవి. ఆ తొర్రి నోటిగుండా దంతాలమధ్యగా అతని ఆత్మఘోష బయల్పడుతున్నట్లున్నది.

"ఈ మృత్యువుకు నీవే కారకురాలవు. నిన్ను ప్రేమించి పొందిన ఫలిత మిది ! నా ప్రేమను యెంత విన్నవించుకున్నా నిర్లక్ష్యంతో నిరాదరం చేసి నన్నీ స్థితికి తెచ్చింది నీవే ! ఈ పాపానికి ప్రాయశ్చిత్తం అనుభవించక తప్పదు. నీవు ప్రేమపాలిట రాక్షసివి" అని అంటున్నట్లు వినిపించి గాబరాపడిపోయింది. అక్కడే కూలబడిపోయింది. కవి ఆనాడు తన నర్థించిన విషయాలు గుర్తుకొచ్చినవి. ఆ శవంవైపు చూసింది. దుర్గంధం పగలగొడుతున్నది. ఆమె హృదయం తుఫానులతో దడదడలాడుతున్నది.

ఆమె చూపులు తీక్షణమైనవి. తెరపిలేకుండా విట్టూర్పులువిడుస్తూ లేచి ప్రక్కగా అడుగులు మహాజోరుగా వేస్తున్నది. కఠోరమైన నిర్ణయమేదో జరిగినట్లున్నది. రోడ్డుప్రక్క దీక్షతో వెళుతున్నది. ఏమిటో ఆ దీక్ష ! దారిచూసి నడుస్తున్నదనను పీలులేదు. చూసినా కనిపించు స్థితి అసలేకాదు. కూనరాగాలుతీస్తూ వెనక్కు నడుస్తున్న ఒక పసిపాపను ఢీకొన్నది. ఆ పసిపాప క్రిందకుపడిపోయింది. ఆ పాప చేతిలోని ఆటబొమ్మ జారిపడి తునాతునకలైంది. పసిపాప గుక్కబట్టి ఏడ్పు సాగించింది. గాయంమీద ముల్లు గుచ్చుకున్నట్లయి సరళగుండె మీద చేయివేసి అదుముకుంటూ భయకంపనలో ఆ పాప యేడ్పును చూస్తూ దొంగవలె పారిపోతూ వెనక్కు వెనక్కు తిరిగి చూస్తున్నది. ఆమె మనస్సు ఖంగారుపడిపోయింది. తానే ఖూనీ చేసినట్లు, హంతకురాలిని పట్టుకోండి, అంటూ ఆ గుంపు వెంటాడుతున్నట్లు, పసివారు వెంటబడి రాళ్ళు రువ్వబోతున్నట్లు, పోలీసువారు తుపాకి బారులతో చుట్టుముట్టుతున్నట్లు ఖంగారుతో పరువులెత్తు తున్నది. కుక్క కాళ్ళ కడ్డంపడి బోర్లపడిపోయింది. సిమెంటురోడ్డుకు మోదుకున్న లలాటం "పట్"మన్నది. ఆ శునకమహారాజు "కయ్‌కయ్"మని ఘోషపెడుతున్నది. ఆ అరుపులలో "నీ పాపం పండింది" అన్న ప్రతిధ్వని వినిపిస్తున్నది. ఆమెముఖమంతా రుధిరధారలతోపులుముకున్నది. బాలభాస్కరునిబోలి అరుణకాంతి పుంజాలను వెదజల్లుతున్నది. నేత్రాలు రుధిరంతో మంటలెత్తు తున్నవి. అధరాలమీదగా స్రవిస్తున్న రక్తపుబిడ్డులు యేదో గబ్బును వుప్పదనాన్ని కల్పిస్తున్నవి. పడినచోటినుంచిలేచి

ముందు కడుగులువేస్తూ ముఖాన్ని హస్తద్వయంతో తుడుచుకున్నది. ముఖమంతా జిడ్డులతో పులుముకున్నది. లోకమంతా ఆమె మీదకు దండెత్తుతున్నట్లు గుండెలు గుబగుబలాడుతున్నవి. మతి పూర్తిగా చెదిరిపోయింది. ఆ కుక్క అరుపులు యింకా వెంటవస్తున్నవి. ఎందు నిమిత్తమో నేత్రాలు తుడుచుకుంటూ ప్రక్క వెదుక్కుంటున్నది. సరసర దెయ్యాల భావివద్దకుజేరి "నన్ను క్షమించు రవి!" అంటూ దుమికింది.

ఫ్రెంచివారు ప్రప్రధమంగా ఆ పట్టణంచేరినపుడు, భారతీయులతో కలతలు సంభవించినపుడు ఆ బావి ప్రక్కన ముట్టడించి పట్టుకున్న పదిమంది భారతీయులను అమాంతం ఆ బావిలోకి నెట్టివేశారట. ఆ పదిమంది ప్రాణాలు పది భూతాలుగామారి ఆ పేట అంతటిలోను తమ ఆర్తనాదాలను ఘోషగా వినిపిస్తుండేవి. ఆ సంఘటనతోనే ఆ బావి దెయ్యాల బావిగా ప్రచలితమైపోయింది. ఆ బావిలోనే, నేడు సరళ దూకింది. ఆమె ఆత్మ ఆ పది దెయ్యాలలో చేరిందో లేక రవిప్రసాద్ వున్నచోటికి చేరిందో చెప్పలేము.



(సమాప్తం)



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B141 |
| పుస్తకం పేరు | భ్రమలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 405 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | neema |
| పేజీలు విడదీసినది | neema |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | [illegible] |